చెయ్యడమునకు వుద్దేశించలేదనిగాని అందువల్ల ఒకవేళ దగా జరిగించబడునని తెలుసుకొనివుండలేదనిగాని రుజువుచెయ్యబడేవరకు, అతడు అట్లా దగా చేయవలెనని వుద్దేశించినట్టు, లేక దగా జరిగించబడునని తెలుసుకొనివున్నట్టు యెంచబడవలసినది.

29. ‚‚దస్తావేజు'' అనేమాట, యేదయినా సంగతినిగురించి సాక్ష్యముగా వుపయోగపరచడముకు వుద్దేశించబడ్డ, లేక వుపయోగపరచబడగూడిన అక్షరములు, అంకెలు, లేక గుర్తులు, వీటిలో ఒకదానివల్లగాని ఒకటికంటే యెక్కువవాటివల్లగాని యే వస్తువమీదనయినా వ్రాయబడ్డ, లేక వివరించబడ్డ సంగతిని తెలియచేస్తున్నది.

‚‚దస్తావేజు.''

వివరణము.—(1) ఏ సాధనములవల్ల, లేక యే వస్తువమీద అక్షరములు, అంకెలు, లేక గుర్తులు యేర్పాటుచెయ్యబడ్డానరే ఆ సాక్ష్యము ఒక కోర్టు ఆఫ్ జస్టిస్‌లో వుపయోగముకొరకు వుద్దేశించబడ్డాసరే వుద్దేశించబడకపోయినాసరే వుపయోగపరచబడగూడినాసరే వుపయోగపరచబడగూడకపోయినాసరే అందువల్ల బాధకము లేదు.

దృష్టాంతములు.

ఒడంబడికనుగురించిన సాక్ష్యముగా వుపయోగించబడే ఆ ఒడంబడికయొక్క షరతులను తెలియచేసే ఒక లిఖితము, దస్తావేజుగా వుంటున్నది.

ఒక బాంకీమీద యివ్వబడే చెక్కు, దస్తావేజుగా వుంటున్నది.

ఒక వకాలతునామా, దస్తావేజుగా వుంటున్నది.

సాక్ష్యముగా వాడవలెనని వుద్దేశించబడ్డ, లేక వాడబడగూడిన ఒక నక్షా, లేక ప్లాను, దస్తావేజుగా వుంటున్నది.

నిశ్చయములు, లేక షరతులు, వమూదుచెయ్యబడివుండే లిఖితము దస్తావేజుగా వుంటున్నది.

వివరణము.—(2) వర్తకుల వాడుకనుపట్టి, లేక యితర వాడుకనుపట్టి అక్షరములు, అంకెలు, లేక గుర్తులు, వీటివల్ల యేది అర్థమవుతున్నదో అది ప్రత్యేకముగా వివరించబడకపోయినప్పటికిన్ని యీ సెక్షనుయొక్క అర్థమునుపట్టి అట్టి అక్షరములు, అంకెలు, లేక గుర్తులు, వీటివల్ల వివరించబడ్డట్టు యెంచబడవలసినది.

దృష్టాంతము.

A అనేమనిషి తన హుకుముమీద పయికము చెల్లించబడవలసిన హుండీయొక్క పీఠని తనపేరు వ్రాస్తున్నాడు. వర్తకుల వాడుకనుపట్టి పీఠనివుండే ఆ లిఖితముయొక్క అర్థము హుండీ వుంచుకొనివుండే మనిషికి ఆ హుండీకిగాను పయికము చెల్లించవలసినది అని అవుతున్నది. పీఠనివుండే ఆ లిఖితము ఆ సేది ఒక దస్తావేజుగా వుండడమేకాకుండా "వుంచుకొనివుండేమనిషికి చెల్లించవలసినది" అనేమాటలుగాని అట్టి అర్థమయ్యేమాటలుగాని దస్కతుకుపయిన వ్రాయబడివుంటే యేలాగో ఆలాగే యెంచబడవలసినది.

30. "విలువగల సాధనము" అనేమాటలు, దేనివల్లనయితే న్యాయమయిన హక్కు కలగచెయ్యబడుతున్నదో, న్యాపింపచెయ్యబడుతున్నదో, ట్రాన్సుఫరు చెయ్యబడుతున్నదో, మట్టుపరచబడుతున్నదో, కొట్టివెయ్యబడుతున్నదో, లేక విడుదలచెయ్యబడుతున్నదో, లేక దేనివల్లనయితే యే మనిషి అయినా న్యాయశాస్త్రమునుపట్టి తనకు యేదైనా జవాబుదారీ కలిగివున్నట్టుగాని ఒకానొక న్యాయమైన హక్కు తనకు లేనట్టుగాని ఒప్పుకొంటున్నాడో, అటువంటి ఒక సాధనముగావుండే, లేక సాధనముగా వుండేలాగున అర్థమయ్యే ఒక దస్తావేజును తెలియచేస్తున్నవి.

"విలువగల సాధనము."

దృష్టాంతము.

A అనేమనిషి, హుండీయొక్క పీఠని తనపేరు వ్రాస్తున్నాడు. పీఠనివుండే ఆ లిఖితము ఆ హుండీ న్యాయముగావుంచుకొనివుండే యే మనిషికయినా దాన్నిగురిం

ఒన హక్కును ట్రాన్సుఫర్ చేస్తున్నది గనుక పీకినివుండే ఆ లిఖితము ''విలువగల సాధనము''గా వుంటున్నది.

31. ''ఒక మరణశాసనము'' అనేమాటలు, ఏదయినా మరణశాసనపు స్వభావముగల దస్తావేజును తెలియచేస్తున్నవి.

''ఒక మరణశాసనము.''

32. అర్థమువల్ల విరోధమయిన వుద్దేశము కనపడే స్థలమందు తప్ప, యీ స్మృతిలో అంతటానున్ను జరిగించబడ్డ కార్యములతో సంబంధించే మాటలు అక్రమముగా చెయ్యబడ్డ లోపములకు కూడా వ్యాపిస్తున్నవి.

జరిగించబడ్డ కార్యాలతో సంబంధించే మాటలు, అక్రమమైన లోపములనుకూడా కలుపుకొంటున్నవి.

33. ''కార్యము'' అనేమాట, ఒక్క కార్యమున్ను అనేక కార్యములనున్ను తెలియచేస్తున్నది: ''లోపము'' అనేమాట, ఒక్క లోపమున్ను అనేకలోపములనున్ను తెలియచేస్తున్నది.

''కార్యము.''
''లోపము.''

34. అనేకమంది ఒకటిగాచేరి వారి అందరి అభిప్రాయాను గుణముగా నేరముగల ఒక కార్యము జరిగించబడినయెడల వారిలో ప్రతిమనిషిన్ని ఆ కార్యమును తాను మాత్రము జరిగించివుంటే యేలాగో ఆలాగే అందుకు జవాబుదారుడు అవుతున్నాడు.

అనేకమంది ఒకటిగా చేరి వారి అందరి అభిప్రాయాను గుణముగా జరిగించబడిన కార్యములు.

35. నేరములుకలది అని యెరిగివుండి, లేక నేరముచెయ్యవలెననే యత్నముతో జరిగించబడ్డదనే కారణమువల్ల మాత్రము నేరముగావుండే ఒక కార్యము, అనేకమందివల్ల జరిగించబడ్డప్పుడు ఆప్రకారము యెరిగివుండి, లేక అట్టి ప్రయత్నముతో ఆ కార్యములో

నేరము చేస్తున్నానని యెరిగివుండి, లేక నేరము చెయ్యవలెననే యత్నముతో జరిగించబడ్డదనే కారణ

Z అనే మనిషిని చంపవలెననే తాత్పర్యముతో తమ నిర్ణయప్రకారము విషము పెట్టు తున్నారు. Z అనే మనిషి, తనకు ఆ ప్రకారము అనేకమార్లు పెట్టబడ్డ విషముయొక్క గుణమువల్ల చనిపోతున్నాడు, గనుక A అనే మనిషిన్ని B అనే మనిషిన్ని ప్రయత్న పూర్వకముగా ఖూనీచెయ్యడమందు వుమ్మడిగా ప్రవర్తించినవారవుతున్నారు. మరణము సంభవింపచేసిన ఒక కార్యము వారు యిద్దరు ప్రత్యేక ప్రత్యేకముగా జరిగించినందున వారి కార్యములు వేరువేరుగావున్నా ఆ నేరమునుగురించి యిద్దరున్ను నేరస్థులుగా వుంటున్నారు.

(b) A అనేమనిషి యేమి B అనేమనిషి యేమి తోడు జెయిలర్లుగానున్ను ప్రతిమాటూ ఆరుఘంటలనే పటికి ఒకరు మారి ఒకరు Z అనే ఖయిదీని తమపరముగా వుంచుకోనేవారుగానున్ను వున్నారు. A అనేమనిషిన్ని B అనేమనిషిన్ని Z అనేమనిషికి మరణము కలగచెయ్యవలెననే యత్నముతోటి వారువారు పహరా కాలములయందు Z అనే మనిషికి యిచ్చేనిమిత్తము తమవద్ద అప్పగించబడ్డ ఆహారము యివ్వకుండా అక్రమముగా మానివేసినందువల్ల అట్టి మరణము కలగచెయ్యడములో యెరిగివుండి వుమ్మడిగా జరిగించినారు. Z అనేమనిషి, ఆకటివల్ల చనిపోతున్నాడు. A అనే మనిషిన్ని B అను మనిషిన్ని యీ వుభయులూ Z అనే మనిషియొక్క ఖూనీనిగురించి నేరస్థులుగా వుంటున్నారు.

(c) జెయిలర్ అయిన A అనేమనిషి, ఖయిది అయిన Z అనే మనిషిని తన పరముగా వుంచుకోనివున్నాడు. A అనేమనిషి, Z అను మనిషికి మరణము కలగ చెయ్యవలెననే యిత్నముతో అక్రమముగా ఆ Z అను మనిషికి ఆహారము యివ్వక మానివేసినాడు; అందువల్ల Z అనేమనిషి నీరసించినాడుగాని యీ వుపవాసమనేది అతనికి మరణము కలగచెయ్యడముకు చాలివుండలేదు. A అనేమనిషి వుద్యోగములో నుంచి తీసివెయ్యబడి అతనికి ప్రత్యామ్నాయము B అనేమనిషి వచ్చినాడు. B అనే మనిషి A అను మనిషితోటి షరీఖు కాకుండానున్ను పొత్తులేకుండానున్ను Z అను మనిషికి తాను మరణము కలగచేస్తానని యెరిగివుండి Z అనే మనిషికి అహారము యివ్వక అక్రమముగా మానివేసినాడు. Z అను మనిషి ఆకటివల్ల చనిపోయినాడు. B అనే మనిషి ఖూనీనిగురించి నేరస్థుడుగా వుంటున్నాడు; అయితే A అనే మనిషి B అనే మనిషితో కలిసివుండనందున A అనే మనిషి ఖూనీచెయ్యవలెననే ప్రయత్నమునుగురించి మాత్రము నేరస్థుడుగా వుంటున్నాడు.

నేరముగావుండే ఒక కార్యములో ప్ర

38. నేరముగావుండే ఒక కార్యము జరిగించడమందు అనేకమంది ప్రవర్తించినపక్షముకు, లేక

వర్తించిన మనుష్యులు వేరే వేరే నేరములను గురించి నేరస్థులు కావచ్చును.

యీలాగాకాకర్త పక్షముకు, ఆ కార్యము జరిగించడమువల్ల వేరే వేరే నేరములనుగురించి వారు నేరస్థులు కావచ్చును.

దృష్టాంతము.

**A** అనే మనిషి, **Z** అనే మనిషిని చంపినపక్షముకు ఖూనీకాకుండా నేరముగల నరహత్యమాత్రమే యయ్యే విశేష ఆగ్రహకారణపు సంగతులనుబట్టి **Z** యనే మనిషిమీద దొమ్మి చేస్తున్నాడు. **B** అనే మనిషి, **Z** అనే మనిషిమీద ద్వేషము కలిగివుండి యతణ్ని చంపవలెననే తాత్పర్యముతో ఆగ్రహకారణములేకుండానే Z అనే మనిషిని చంపడములో **A** అనే మనిషికి సహాయముచేస్తున్నాడు. ఇందులో **A** అనే మనిషిన్ని **B** అనే మనిషిన్ని యీ వుభయులు Z అనే మనిషికి మరణము కలగచెయ్యడములో ప్రవర్తించినా **B** యను మనిషి ఖూనీనిగురించి నేరస్థుడుగా వుంటున్నాడు. **A** యనుమనిషి నేరముగల నరహత్యనుగురించి మాత్రము నేరస్థుడుగా వుంటున్నాడు.

39. ఒక మనిషి, నేటివల్లనయితే ఒక కార్యము చెయ్యవలెనని తాను యత్నించినాడో అట్టి సాధనములవల్లగాని,

"స్వేచ్ఛగా."

ఆ సాధనములు వినియోగపరచబడే కాలమందు వేటివల్లనయితే ఆ కార్యము సంభవింపచెయ్య కలిగివున్నట్టు తాను యెరిగి వుంటున్నాడో, లేక అవి అట్టివని నమ్మడముకు కారణము కలిగివుంటున్నాడో అట్టి సాధనములవల్లగాని ఆ కార్యము ఆతను జరిగించినప్పుడు "స్వేచ్ఛగా" అట్టి కార్యము జరిగించినట్టు చెప్పబడుతున్నాడు.

దృష్టాంతము.

A అనే మనిషి, ఒక చోరీకి అనుకూల్యము కలగచెయ్యగలందులకై ఒక గొప్ప పట్నములో మనుష్యులు వాసము చేసే ఒక యింటికి రాత్రివేళ నిప్పుపెట్టి యందువల్ల ఒక మనిషికి మరణము కలగచేస్తున్నాడు. A అనే మనిషి, మరణము కలగచెయ్యవలెనని వుద్దేశింపకపోవడమేకాకుండా తాను జరిగించిన కార్యమువల్ల మరణము సంభవించినదిగ దాయనిహూడా విచారపడవచ్చును. అయినప్పటికిన్ని తాను మరణము కలిగేలాగున చేస్తానని యెరిగివున్నపక్షముకు స్వేచ్ఛగా మరణము కలగజేసినవాడుగా వుంటున్నాడు.

"నేరము." 40. ఈ సెక్షను తాలూకు 2-వ క్లాజులోనేమి 3-వ క్లాజులోనేమి వమూదు చేయబడివుండే చాప్టరులోనున్న సెక్షన్లలోనున్న తప్ప, "నేరము" అనేమాట, యీ స్మృతివల్ల శిక్షార్హముగా చేయబడిన ఒక కార్యమును తెలియచేస్తున్నది.

4-వ చాప్టరులోనున్న, 5-A చాప్టరులోనున్న యీ కింవచ్చే సెక్షన్లు అనగా 64,65,66,67,71,109,110,112,114,115,116,117,187, 194, 195, 203,211,213,214,221, 222, 223, 224, 225, 327, 328, 329, 330, 331. 347; 348, 388, 389, 445 సెక్షన్లలోనున్న "నేరము" అనే మాట, యీ స్మృతినిపట్టిగాని యిందులో యికముందు వివరించబడివుండే ప్రకారము విశేషమయిన లేక ప్రదేశ సంబంధమయిన యేదయినా న్యాయశాస్త్రమునుపట్టిగాని శిక్షించబడతగ్గ ఒక కార్యమును తెలియచేస్తున్నది:

పయిగా 141, 176, 177, 201, 202, 212, 216, 441 సెక్షన్లలో "నేరము" అనేమాటకు, విశేషమయిన లేక ప్రదేశ సంబంధమయిన న్యాయశాస్త్రమునుపట్టి శిక్షించబడతగిన కార్యము అట్టి న్యాయశాస్త్రమునుపట్టి జుల్మానాతోటిగాని జుల్మానా లేకుండాగాని ఆరు మాసములవరకు లేక అంతకంటె యెక్కువకాలమువరకు ఖయిదువల్ల శిక్షించబడతగినదిగా వున్నపక్షముకు ఆ అర్థమే అవుతున్నది.

"విశేషమయిన న్యాయశాస్త్రము." 41. ఒక "విశేషమయిన న్యాయశాస్త్రము," ఒక ముఖ్యమయిన సంగతికి వుపయోగించే న్యాయశాస్త్రముగా వున్నది.

"ప్రదేశ సంబంధమయిన న్యాయ" 42. ఒక "ప్రదేశ సంబంధమయిన న్యాయశాస్త్రము," బ్రిటిష్ ఇండియా తాలూకు ఒక

శాస్త్రము." విశేషమయిన భాగముకు మాత్రము వుపయోగించే న్యాయశాస్త్రముగా వున్నది.

"అక్రమమయిన."

43. "అక్రమమయిన" అనేమాట, యేదయినా నేరముగా వుంటున్నదో యేదయితే న్యాయశాస్త్రమువల్ల నిషేధించబడి వుంటున్నదో యేదయితే ఒక సివిల్ వ్యాజ్యముకు కారణము కలుగచేస్తున్నదో ఆ ప్రతి సంగతికిన్ని వుపయోగించబడుతూ వుంటున్నది:

"క్రమముగా చెయ్యడముకు బద్ధుడయిన."

మరిన్ని ఒక మనిషి, యేదయితే తాను చెయ్యకపోవడము అనేది తనయందు అక్రమముగా వుంటున్నదో దాన్ని "క్రమముగా చెయ్యడముకు బద్ధుడయి వున్నట్టు" చెప్పబడుతున్నాడు.

"హాని."

44. "హాని" అనేమాట, దేహముకుగాని మనస్సుకుగాని ప్రతిష్ఠకుగాని ఆస్తికిగాని యే మనిషికయినా అక్రమముగా జరిగించబడ్డ యేదయినా చెరుపును తెలియచేస్తున్నది.

"ప్రాణము."

45. "ప్రాణము" అనేమాట, సందర్భమువల్ల విరోధము కనబడితేనేతప్ప, ఒక మనిషియొక్క ప్రాణమును తెలియచేస్తున్నది.

"మరణము."

46. "మరణము" అనేమాట, సందర్భమువల్ల విరోధము కనబడితేనేతప్ప, ఒకమనిషియొక్క మరణమును తెలియచేస్తున్నది.

"జంతువ."

47. "జంతువ" అనేమాట, మనిషికంటె యితరమయిన జీవముగల యేజంతువయినా తెలియచేస్తున్నది.

48. "వాడ" అనేమాట, మనుష్యులనుగాని ఆస్తినిగాని నీళ్ల

"వాడ." మూడు తీసుకొనిపోవడమునకు చెయ్యబడ్డ దేన్ని అయినా తెలియచేస్తున్నది.

19. "సంవత్సరము" అనేమాటగాని "మాసము" అనే మాట "సంవత్సరము." "మాసము." గాని యెక్కడ ప్రయోగించబడ్డప్పటికిన్ని ఆ సంవత్సరము, లేక ఆ మాసము, బ్రిటిష్ పంచాంగప్రకారము లెక్కపెట్టబడవలసినదని తెలుసుకోవలసినది.

50. "సెక్షన్" అనేమాట, ముందు వుంచబడ్డ సంఖ్యావాచకములయిన అంకెలవల్ల భేదపరచబడ్డ యీస్మృతి "సెక్షన్." తాలూకు ఒక చాప్టరుయొక్క భాగములలో ఒకదాన్ని తెలియచేస్తున్నది.

51. "ప్రమాణము" అనేమాట, న్యాయశాస్త్రమునుపట్టి ప్రమాణమునకు బదులుగా నిర్ణయించబడ్డ సాలెమ్ "ప్రమాణము." అఫర్ మేషన్ అనగా భయభక్తులతో సాక్షిగా చెప్పడమున్ను ఒక పబ్లిక్ వుద్యోగస్థునియెదట చెయ్యబడేలాగున, లేక ఒక కోర్టు అఫ్ జస్టిస్‌లోనయినాసరే కాకపోయినాసరే రుజువు కొరకు వుపయోగించేలాగున, న్యాయశాస్త్రమువల్ల కోరబడ్డ లేక అధికారము కలగచెయ్యబడ్డ యేదయినా డిక్లరేషనున్ను కలుపుకొంటున్నది.

"కృత్రిమము లేకుండా." 52. తగిన జాగ్రతయున్ను శ్రద్ధయున్ను లేకుండా జరిగించబడ్డ లేక నమ్మబడ్డ యేదిన్ని కృత్రిమములేకుండా జరిగించబడ్డట్టు లేక నమ్మబడ్డట్టు చెప్పబడనేరదు.

---

3-వ అధ్యాయము.

శిక్షలనుగురించి.

53. ఈస్మృతియొక్క నిబంధనలనుపట్టి నేరము "శిక్షలు." చేసినవారు పాత్రులయ్యే శిక్షలు యేవంటే:—

మొదటిది.—మరణము;

రెండవది.—ద్వీపాంతరవాసము;

మూడవది.—ఖయిదీలుగా శిక్షాసంబంధమయిన పనిచెయ్యడము;

నాలుగవది.—ఖయిదు, ఇది రెండుతరహాలుగా వుంటున్నది, అవి యేవంటే:—

(1) కఠినమయినది అనగా, పరకము కలిగివుండేది.

(2) సాధారణమయినది అనగా, పరకములేనిది.

అయిదవది.—ఆస్తి దండుగకింద పుచ్చుకోవడము;

ఆరవది.—జుల్మానా.

మరణ దండనగా విధించబడ్డ తీర్పు మరి ఒక శిక్షగా మార్చడము.

54. మరణదండన విధించబడే ప్రతి సంగతిలోనున్ను ఇండియా గవరన్మెంటువారుగాని యే స్థలమునకులోపుగా నేరస్థునికి శిక్ష విధించబడుతున్నదో అట్టి స్థలపు గవరన్మెంటువారుగాని నేరస్థుని సమ్మతిలేకుండానే ఆ మరణదండన గాని స్మృతివల్ల నిబంధన యేర్పాటు చెయ్యబడ్డ యేదయినా మరి ఒక శిక్షగా మార్చవచ్చును.

యావజ్జీవము ద్వీపాంతరవాసము చేసే లాగున విధించబడ్డ తీర్పు మార్చడము.

55. యావజ్జీవము ద్వీపాంతరవాసపు శిక్ష విధించబడే ప్రతి సంగతిలోనున్ను ఇండియా గవరన్మెంటువారుగాని యే స్థలమునకు లోపుగా నేరస్థునికి శిక్ష విధించబడుతున్నదో ఆ స్థలపు లోకల్ గవర్నమెంటువారుగాని నేరస్థుని సమ్మతిలేకుండానే ఆ శిక్ష పద్నాలుగు సంవత్సరములకు మించని ఒక కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదుగా మార్చవచ్చును.

యూరోపియనులున్ను అమెరికనులున్ను శిక్షాసంబంధమయిన పనిచేసేలాగున శిక్ష విధించుట.

56. యూరోపియనుగాగాని అమెరికనుగాగాని వుండే యే మనిషి అయినా గాని స్మృతినిపట్టి ద్వీపాంతరవాసము విధించు చట్టములలో శిక్షించబడదగ్గ ఒక నేరము గురించి నేరస్థాపన చెయ్యబడ్డప్పుడు కోర్టువారు, 1855వ సంవత్సరపు 24వ శాసనము తాలూకు నిబంధనల ప్రకారము ద్వీపాంతరవాసమునకు ప్రత్యామ్నాయముగా ఖయిదీగా ఆ నేరస్థుడు శిక్షాసంబంధమైన పనిచేసేలాగున శిక్ష విధించవలసినది.

యావజ్జీవమువరకు కాకుండా పదిసంవత్సరములకు మించిన కాలమువరకు విధించబడిన శిక్షాసంబంధమయిన తీర్పును గురించిన సబబున.

అయితే అట్టి శాసనము లేకుంటే ఒక యూరోపియను లేక అమెరికను నేరస్థుడు యావజ్జీవమువరకు కాకుండా పది సంవత్సరములకు మించిన కాలమువరకు ద్వీపాంతరవాసమునకు తీర్పు చేయబడడమునకు లేక హుకుము చేయబడడమునకు పాత్రుడుగా వుండేటప్పుడు, యావజ్జీవమువరకు కాకుండా ఆ పదిసంవత్సరములకు మించిన కోర్టువారికి తగునని తోచేకాలమువరకు శిక్షాసంబంధమయిన పాటుపడేలాగున తీర్పు చేయబడడమునకు లేక హుకుము చేయబడడమునకు వాడు పాత్రుడుగా వుండవలసినది.

శిక్షయొక్క చిల్లరకాలములు.

57. శిక్షయొక్క చిల్లరకాలములు లెక్కచేసేటప్పుడు యావజ్జీవపర్యంతము ద్వీపాంతరవాసము, యిరువై సంవత్సరములవరకు ద్వీపాంతరవాసముతో సమానముగా యెంచబడవలసినది.

ద్వీపాంతరవాసము చేసేలాగున శిక్ష

58. ద్వీపాంతరమునకు పంపించేలాగున శిక్ష విధించబడ్డ ప్రతి సంగతియందున్ను నేరస్థుడు ద్వీపాంతరమునకు పంపించబడేవరకు కఠినమయిన ఖయిదుకు శిక్ష విధించ

విధించబడ్డ నేరస్థుల యెడల వాండ్లు ద్వీపాంతరమునకు పంపబడేవరకు యేప్రకారము జరిగించవలసినది.

బడివుంటే యేలాగో ఆలాగే అతనియెడల జరిపించబడవలసినదే కాకుండా, అతను ఖయిదులోవుండే కాలమందు ద్వీపాంతరవాసమునుగురించి విధించబడ్డ శిక్ష చెల్లాయించబడుతూవున్నట్టు యెంచబడవలసినది.

ఖయిదుకు ప్రత్యామ్నాయముగా ద్వీపాంతరవాసము.

59. ఒక నేరస్థుడు యేడు సంవత్సరముల కాలమువరకుగాని అంతకంటె యెక్కువ కాలమువరకుగాని ఖయిదు చెయ్యడమువల్ల శిక్షించబడతగ్గ ప్రతి సంగతిలోనున్ను అట్టి నేరస్థునికి శిక్ష విధించే కోర్టువారు ఖయిదుచేసేలాగున శిక్ష విధించడమునకు ప్రత్యామ్నాయము యేడు సంవత్సరములకు తక్కువ కానటువంటిన్ని అట్టి నేరస్థుడు యీ స్మృతివల్ల ఖయిదులోవుంచబడడమునకు పాత్రుడుగా వుండే కాలమునకు యెక్కువ కానటువంటిన్ని కాలమువరకు ఆ నేరస్థుడు ద్వీపాంతరవాసము చేసేలాగున శిక్ష విధించడము కోర్టువారి అధికారానుగుణ[illegible]న్నది.

కొన్ని సంగతులలో ఖయిదునుగురించి విధించబడ్డ శిక్ష వూరా[illegible]

60. ఒక నేరస్థుడు రెండుతరహా[illegible] వుండే ఖయిదువల్ల [illegible] తిలోనున్ను అట్టి [illegible]

61. ఒక మనిషి తన తాలూకు దరోబస్తు ఆస్తి దండుగకింద పుచ్చుకోబడడమునకు తాను పాత్రుడయ్యే ఒక నేరమునుగురించి నేరస్థాపనచెయ్యబడే ప్రతి సంగతి లోనూ ఆ నేరస్థుడు, తీర్పు చెయ్యబడ్డ శిక్షగాని అది మరి ఒకటిగా మార్చబడివుండే శిక్షగాని పూరాగా ఆఖరయ్యే వరకు లేక అతను మాఫుచెయ్యబడేవరకు, గవర్నమెంటువారియొక్క లాభముకొరకుతప్ప, యే ఆస్తిన్ని ఆర్జనచెయ్యడమునకు అసమర్థుడుగా వుండవలసినది.

ఆస్తి దండుగకింద పుచ్చుకోనేలాగిన శిక్ష విధించడము.

## దృష్టాంతము.

ఇండియాదేశపు గవర్నమెంటువారిమీద **A** అనే మనిషి దండెత్తినట్టు నేర స్థాపన చెయ్యబడ్డందున అతని దరోబస్తు ఆస్తి దండుగకింద పుచ్చుకోబడడమునకు పాత్రుడవుతున్నాడు. తీర్పుచెయ్యబడ్డ తర్వాతనున్ను ఆ తీర్పు అమలులోవుండే కాల మందున్ను **A** అనేమనిషియొక్క తండ్రి, దండుగకింద పుచ్చుకోవడము లేకపోయిన యెడల **A** అనే మనిషికి చెందబొయ్యే ఒక స్థితివుంచి చనిపోతున్నాడు. ఆ స్థితి గవర్నమెం[illegible] అవుతున్నది.

[illegible] వల్ల శిక్షించబడతగ్గ నేరమునుగురించి యే [illegible]యినా నేరస్థాపన చెయ్యబడ్డప్పుడు, కోర్టు [illegible] తాలూకు చరముగానున్ను స్థిరముగా [illegible] మెంటువారివల్ల [illegible] చెయ్య

చరముగానున్ను స్థిరముగానున్ను వుండే ఆస్తియొక్క ఫాయిదాలున్ను అద్దెలున్ను, వీటిలో అతని కుటుంబమునకేమి అతని యిలాకా మనుష్యులకేమి అట్టి కాలమందు యివ్వడమునకు గవర్నమెంటువారికి యుక్తమనితోచే జీవనాంశముపోగా తక్కిన్నా గవర్నమెంటువారివల్ల దండుగకింద పుచ్చుకోబడవలసినది అని అట్టి కోర్టువారు తీర్పుచెయ్యవచ్చును.

63. జుల్మానా యింతమాత్రమని నిర్ణయించబడనప్పుడు, ఆ నేరస్థుడు పాత్రుడయ్యే జుల్మానాకు మితి యేర్పాటు చెయ్యబడక పోయినప్పటికిన్ని ఆ జుల్మానా అతివ్యాప్తి కాగూడదు.

జుల్మానా మొబల్గు.

64. ఖయిదువల్లనున్ను జుల్మానావల్లనున్ను శిక్షించబడతగ్గదయి, ఖయిదుతో సహాగాని ఖయిదు లేకుండాగాని, నేరస్థునికి జల్మానా శిక్ష విధించబడ్డ ప్రతి నేరపు సంగతిలోనున్ను,

జుల్మానా చెల్లించనందుకు ఖయిదు శిక్ష.

ఖయిదువల్లగాని, జుల్మానావల్లగాని, లేక జుల్మానావల్ల మాత్రముగాని, శిక్షించబడతగ్గదయి, నేరస్థునికి జుల్మానా శిక్ష విధించబడ్డ ప్రతి నేరపు సంగతిలోనున్ను

అట్టి నేరస్థునికి శిక్ష విధించిన కోర్టువారు, నేరస్థుడు జుల్మానా చెల్లించనియెడల, ఒక నిర్ణయమయిన కాలమువరకు ఖయిదులో వుండేలాగున తీర్పులో విధించడము వారి అధికారమునకు లోబడివుండవలసినది, అట్టి ఖయిదు అతనికి విధించబడివుండే, లేక ఒక శిక్ష మార్పడమునకట్టి అతను పాత్రుడయ్యే యేదయినా యితర ఖయిదుగాక యెక్కువగా వుండవలసినది.

జుల్మానాను ఖయిదును విధింపగూడినప్పుడు జుల్మానా చెల్లించనందుకు ఖయిదుకాలపు నిర్ణయము.

65. జుల్మానా చెల్లించకపోయినయెడల నేరస్థుడు ఖయిదుచెయ్యబడేలాగున కోర్టువారు హుకుముచేసేకాలము, ఆ నేరము ఖయిదువల్లనున్ను జుల్మానావల్లనున్ను శిక్షించబడకూడినదిగా వున్నయెడల ఆ నేరముకుగాను నిర్ణయించబడ్డ పూరా ఖయిదుకాలములో నాలుగింటిలో ఒకపాలుకన్నా యెక్కువగా వుండకూడదు.

జుల్మానా చెల్లించనందుకు విధించబడే ఖయిదుతరహా.

66. జుల్మానా చెల్లించకపోయినందునగురించి కోర్టువారు విధించే ఖయిదు, ఆతడు చేసిన నేరమునుగురించి నేరస్థునికి విధించబడగూడివుండే రెండుతరహాలలో యే తరహా దారీగల శిక్షగానయినా వుండవచ్చును.

నేరము, జుల్మానావల్ల మాత్రము శిక్షించబడగూడివున్నప్పుడు జుల్మానా చెల్లించనందుకు విధించబడే ఖయిదు.

67. నేరము జుల్మానావల్లమాత్రము శిక్షించబడగూడినదయిన పక్షమునకు, జుల్మానా చెల్లించనియెడల కోర్టువారు విధించే ఖయిదు సాధారణమైనదిగా వుండవలసినది, మరిన్ని జుల్మానా చెల్లించకపోయినందునగురించి నేరస్థుడు ఖయిదుచెయ్యబడేలాగున కోర్టువారు హుకుముచేసేకాలము యీ క్రిందవచ్చే ప్రమాణములకు యెక్కువకాకూడదు, అవి యేవనగా, జుల్మానా మొబలగు యాభైరూపాయలకంటె యెక్కువ కానప్పుడు రెండుమాసములకు మించని యే కాలమువరకయినా, ఆ మొబలగు వందరూపాయలకంటె యెక్కువ కానప్పుడు నాలుగుమాసములకు మించని యే కాలమువరకయినా, యే యితరసంగతిలోనున్ను ఆరుమాసములకు మించని యే కాలమువరకయినా.

జుల్మానా చెల్లిం

68. జుల్మానా చెల్లించపోయినందుకుగాను విధించబడ్డ ఖయిదు, ఆ జుల్మానా చెల్లించబడ్డ తర్వాతగాని న్యాయశా

ఓన తర్వాత ఖయిదు ఆఖరు కావలసినది.

స్త్రము తాలూకు చర్యవల్ల వసూలు చేసుకోబడ్డ తర్వాతగాని ఆఖరు కావలసినది.

జుల్మానా తాలూకు దామాషాభాగము చెల్లించినతర్వాత ఖయిదు ఆఖరు కావలసినది.

69. జుల్మానా చెల్లించకపోయినందునగురించి నిర్ణయించబడ్డ ఖయిదు తాలూకు కాలము ఆఖరు కానడమునకు ముందు శేషించివుండే ఖయిదు కాలమునకు సమానమయిన మొబల్లగు దామాషామీద చెల్లించబడ్డ పక్షమునకు లేక వసూలుచేసుకోబడ్డ పక్షమునకు అట్లా శేషించివుండే ఖయిదు ఆఖరు కావలసినది.

దృష్టాంతము.

ఎ అనే మనిషికి వందరూపాయీల జుల్మానాయున్ను అది చెల్లించనియెడల నాలుగుమాసముల ఖయిదున్ను విధించబడ్డది. ఇందులో ఖయిదులో ఒక మాసము గడవకముందు జుల్మానాలో డెబ్బయియయిదు రూపాయీలు చెల్లించబడ్డ పక్షమునకు లేక వసూలుచేసుకోబడ్డ పక్షమునకు మొదటిమాసము గడవగానే ఎ అను మనిషిని విడుదల చేస్తున్నారు. ఎ అనే మనిషి ఖయిదులోవుండగా మొదటిమాసము గడచిపోయినకాలమందు లేక ఆదరింవిలాను యే కాలమందయినా డెబ్బయియయిదు రూపాయీలు చెల్లించబడ్డపక్షమునకు లేక వసూలుచేసుకోబడ్డ పక్షమునకు ఎ అనే మనిషిని తక్షణమే విడుదలచేస్తున్నారు. ఖయిదులో రెండుమాసములు గడవకముందు జుల్మానాలో యాభై రూపాయీలు చెల్లించబడ్డపక్షమునకు లేక వసూలుచేసుకోబడ్డ పక్షమునకు రెండుమాసములు పూర్తికాగానే ఎ అను మనిషిని విడుదలచేస్తున్నారు. ఎ అనే మనిషి ఖయిదులోవుండగా ఆ రెండుమాసములు గడచిపోయినకాలమందు లేక ఆదరింవిలాను యాభైరూపాయీలు చెల్లించబడ్డపక్షమునకు లేక వసూలుచేసుకోబడ్డపక్షమునకు ఎ అనే మనిషి తక్షణమే విడుదలచెయ్యాబడవలసినది.

ఆరుసంవత్సరముల లోపుగాగాని ఖయిదు వ యిదాలోగాని

70. జుల్మానా, లేక చెల్లించబడకుండా నిలిచివుండే అందులో యేదయినా భాగము, శిక్ష విధించబడ్డ ఆరు సంవత్సరములకులోపుగా యే కాలమందయినాగాని, తీర్పునుపట్టి ఆ నేరస్థుడు ఆరుసంవత్సరములకంటె యె

జుల్మానా వసూలు చేయవచ్చును.

నేరస్థుడు చనిపోయినప్పటికిన్ని అతని ఆస్తి జుల్మానా అచ్చుదలలోనుంచి విడుదలకానేరదు.

క్కువ కాలమువరకు ఖయిదుకు పాత్రుడయివున్న పక్షమునకు అట్టి వాయిదాలోని యే కాలమందయినా గాని, వసూలు చేసుకోబడవచ్చును-వయిగా నేరస్థుడు చనిపోయినప్పటికిన్ని అతని మరణమువల్ల అతని ఋణములనుగురించి న్యాయముగా అప్పామయివుండే యే ఆస్తిన్ని జుల్మానాయొక్క అచ్చుదలలోనుంచి విడుదలకానేరదు.

అనేక నేరములవల్ల యేర్పాటు చెయ్యబడ్డ నేరమునకు విధించబడే శిక్షయొక్క మితి.

71. నేరములుగావుండే అనేక భాగములు కలిసి ఒక నేరము అయ్యేపక్షమునకు నేరస్థుడు, (అట్లా విశేషముగా నిబంధన యేర్పాటుచెయ్యబడివుంటేనేతప్ప,) తాను చేసిన అట్టి నేరములలో ఒకదానికంటె యెక్కువ భాగములనుగురించిన దండనవల్ల శిక్షించబడకూడదు.

ఏ కార్యమయినా, దేనివల్ల నేరములు నిర్దేశించబడివున్నవో లేక శిక్షించబడివున్నవో తత్కాలమందు అమలులోవున్న అట్టి యేదయినా చట్టముయొక్క రెండు లేదా యెక్కువ ప్రత్యేక నిర్దేశములక్రింద వచ్చే నేరమయ్యేయెడల, లేక

వేటిలో వొకకార్యము, లేక వొకటికంటె యెక్కువకార్యములు తనంతటగాని తమంతటగాని నేరమువునో అట్టి ఆయా కార్యములు చేర్చబడ్డప్పుడు ప్రత్యేక నేరమయ్యేయెడల,

నేరస్థుణ్ని విమర్శించే కోర్టువారు అట్టి నేరములలో యేదయినా వొకదానికొరకు విధించగల దండనకంటే బలమయిన యెక్కువ దండన వల్ల వాడు శిక్షించబడకూడదు.

## దృష్టాంతములు.

(a) A అనేమనిషి, Z అనేమనిషిని ఒక కఱ్ఱతోటి యాభయిదెబ్బలు కొట్టినాడు. ఇందులో A అనేమనిషి దరోబస్తు దెబ్బలవల్లనున్ను ఆ కొట్టడము యొక్క ప్రతి దెబ్బవల్లనున్ను Z అనే మనిషికి ఘాత కలగజేసే నేరము స్వేచ్ఛగా జరిగించివుండవచ్చును. A అనే మనిషి ప్రతి దెబ్బకున్ను శిక్షార్హుడయిన పక్షమున దెబ్బ ఒకటింటికి ఒక సంవత్సరము చొప్పున యాభయి సంవత్సరములవరకు ఆతన్ని ఖయిదుచెయ్యవలసివస్తున్నది. అయితే దరోబస్తు దెబ్బలనుగురించి ఆతను ఒక శిక్షకు మాత్రము పాత్రుడవుతున్నాడు.

(b) అయితే A అనేమనిషి, Z అనేమనిషిని కొట్టుతూవుండగా Y అనేమనిషి అడ్డపడ్డందున Y అనే మనిషిని A అనే మనిషి బుద్ధిపూర్వకముగా కొట్టిన పక్షమునకు యిందులో Y అనే మనిషిని కొట్టినదెబ్బ అనేది A అనే మనిషి Z అనే మనిషికి స్వేచ్ఛగా హానికలిగేటట్టు చేసిన నేరములో ఒక భాగము కానందున A అనే మనిషి, Z అనే మనిషికి స్వేచ్ఛగా ఘాత కలగచేసినందుకుగాను ఒక శిక్షకున్ను Y అనే మనిషిని కొట్టినదెబ్బకుగాను మరివక శిక్షకున్ను పాత్రుడు అవుతున్నాడు.

ఎందునగురించి అయినదిన్ని సందేహముగా వున్నదని తెలియచేసే తీర్పు యివ్వబడ్డ అనేక నేరములలో ఒకదాన్నగురించి నేరస్థాపనచెయ్యబడ్డ మనిషికి శిక్ష.

72. తీర్పులో నమూదుచెయ్యబడ్డ అనేక నేరములలో యొక్క దాన్నిగురించి ఒకమనిషి నేరస్థుడనిన్ని అయితే ఆ నేరములలో దేన్నిగురించి అతను నేరస్థుడుగా వున్నాడో ఆ సంగతినిగురించి సంశయము వున్నదనిన్ని తీర్పు చెప్పబడ్డ దరోబస్తు సంగతులలో నేరస్థుడు, అన్ని నేరములకు అదేశిక్ష విధించబడివుండని యెడల అన్నిటికంటె తక్కువ అయిన శిక్ష విధించబడివుండే నేరమునుగురించి శిక్షించబడవలసినది.

ఏకాంతస్థలమందు చెయ్యబడే ఖయిదు.

73. ఈ స్మృతినిబట్టి కోర్టువారు కఠినమయిన ఖయిదుకు శిక్ష విధించేలాగున అధికారము కలిగివుండే నేరము జరిగించినట్టు యే మనిషి అయినా నేరస్థాపన చెయ్యబడ్డప్పుడు కోర్టువారు, తమతీర్పువల్ల యీకిందవచ్చే ప్రమాణముల

ప్రకారము ఆత్యంతములు మూడుమాసములకు మించకుండా అతనికి తీర్పుచెయ్యబడ్డ ఖయిదులో కొంతకాలము ఏకాంతస్థలమందు నేరస్థుడు ఖయిదున వుంచబడేలాగున హుకుముచెయ్యవచ్చును, అవి యేమనగా--

ఖయిదుకాలము, ఆరుమాసములకు మించనిపక్షమునకు ఒక మాసమునకు మించని కాలము:

ఖయిదుకాలము, ఆరుమాసములకు మించినదయి ఒక సంవత్సరమునకు మించకుండావున్న పక్షమునకు రెండుమాసములకు మించని కాలము:

ఖయిదుకాలము వొక సంవత్సరముకన్నా మించినపక్షమునకు మూడు మాసములకు మించనికాలము.

ఏకాంతస్థలమందు చెయ్యబడే ఖయిదుకు మితి.

74. ఏకాంతస్థలమందు ఖయిదుచెయ్యబడే శిక్ష అమలులోకి తేవడమందు అట్టి ఖయిదు, ప్రతిమాటుకున్నూ పద్నాలుగు రోజులకాలముకంటె యెక్కువగా యెప్పుడున్ను వుండగూడదు, పయిగా ఒక్కొకమాటు యేకాంతస్థలమందుచేసే ఖయిదు నిలిపి తిరిగీ అదే ఆరంభముచేసేటప్పుడు ఆ మొదటి తేపకున్ను మళ్లీ ఆరంభించేకాలమునకున్ను మధ్యను అట్టి ఏకాంతస్థలమందు చెయ్యబడే ఖయిదు యెంతకాలముగా వుంటున్నదో అంతకాలపు అవకాశము వుండవలసినది - తీర్పుచెయ్యబడ్డ ఖయిదు, మూడుమాసములకు యెక్కువగావున్నప్పుడు ఏకాంతస్థలమందు చెయ్యబడే ఖయిదు, తీర్పుచెయ్యబడ్డ దరోబస్తు ఖయిదు తాలూకు యే మాసములోనయినా యేడురోజులకంటె యెక్కువగా వుండకూడదు - పయిగా వొక్కొకమాటు ఏకాంతస్థలమందుచేసే ఖయిదు నిలిపి తిరిగీ అదే ఆరంభముచేసేటప్పుడు ఆ మొదటి తేపకున్ను మళ్లీ ఆరంభించే కాలమున

కున్న మధ్యను అట్టి ఏకాంతస్థలమందు చెయ్యబడే ఖయిదు యెంతకాలముగా వుంటున్నదో అంతకాలపు అవకాశము వుంచవలసినది.

ముందు నేరస్థాపన చెయ్యబడ్డ తర్వాత 12-వ అధ్యాయము క్రిందగాని 17-వ అధ్యాయము క్రిందగాని వచ్చు కొన్ని నేరముల కు జాస్తి శిక్ష.

75. (a) ఈ కోడ్డులోనున్న 12-వ, 17-వ, అధ్యాయములక్రింద మూడు సంవత్సరములవఱకుగాని, అంతకుమించిన కాలమువఱకుగాని రెండు విధములలో నేదోయొక విధమగు ఖయిదువల్ల శిక్షింపబడదగిన నేరమునకు బ్రిటిషు యిండియాలోనున్న కోర్టువారిచేతనో,

(b) బ్రిటిషు యిండియాలో నేరము జరిగినయెడల ఈ కోడ్డుయొక్క సదరు అధ్యాయములక్రింద సదరు బాపతులను సదరు కాల పరిమితియుగల ఖయిదులకు శిక్షింపబడదగిన నేరమునకు, ఆలోచన సభతోగూడిన గవర్నరు జనరలుగారియొక్కయో లోకలు గవర్నమెంటువారియొక్కయో సామాన్య అధికారమునకుగాని ప్రత్యేక అధికారమునకుగాని లోబడి నడుచుకొనుచున్న హిందూదేశములోనుండు స్వదేశ ప్రభువులయు సంస్థానములయు ప్రదేశములలోనున్న కోర్టువారిచేతనో న్యాయస్థానముచేతనో

నేరస్థాపన చేయబడియుండి సదరు యే అధ్యాయముల క్రిందగాని సదరు బాపతులును సదరు కాలపరిమితియుగల ఖయిదులకు శిక్షింపబడదగిన నేరము జరిగించిన మనుష్యుడు అట్టి ప్రతి సరిమిలా నేరమునకును యావజ్జీవ ద్వీపాంతరవాసమునకుగాని, పదిసంవత్సరములవఱకు నుండగలిగిన రెండువిధములలో నేదోయొకవిధమగు ఖయిదునకుగాని పాత్రుడగును.

---

## 4-వ అధ్యాయము.

### సాధారణములయిన మినహాయింపులు.

న్యాయశాస్త్రము నుపట్టి జరిగించేలాగు న బద్ధుడయివుండేమనిషివల్ల, లేక నిజము తెలియక తాను బద్ధుణ్ని అయినానని నమ్మివుండే మనిషివల్ల జరిగించబడ్డకార్యములు.

76. ఒక కార్యము జరిగించడమునకు న్యాయశాస్త్రమువల్ల బద్ధుడయివుండే మనిషిగాని న్యాయశాస్త్రమునుగురించిన పొరబాటువల్ల కాకుండా నిజము తెలియక ఆ కార్యము జరిగించడమునకు తాను బద్ధుడయివున్నట్టు. కృత్రిమము లేకుండా నమ్మివుండే మనిషిగాని జరిగించినపక్షమునకు అతడు నేరస్థుడు కాడు.

### దృష్టాంతములు.

(a) శిపాయీ అయిన A అనే మనిషి, న్యాయశాస్త్ర సంబంధమయిన నిబంధనలను అనుసరించి తన పయి అధికారిగావుండే ఆఫీసరుయొక్క హుకుము ప్రకారము ఒక అల్లరమూకమిద తుపాకి కాలుస్తున్నాడు. A అనే మనిషి యే నేరమున్ను చేసినవాడు కాడు.

(b) కోర్టు ఆఫ్ జస్టిస్ తాలూకు ఆఫీసరుగావుండే A అనే మనిషి, ఆ కోర్టువారివల్ల Y అనె మనిషిని పట్టుకోనేలాగున హుకుము చెయ్యబడి యుక్తమయిన విచారణ చెసినతర్వాత Z అనే మనిషి Y అనే మనిషిగా వున్నట్టు నమ్మి ఆ Z అనే మనిషిని పట్టుకొంటున్నాడు. A అనే మనిషి యే తప్పితమున్ను చేసినవాడు కాడు.

జడ్జీ వుద్యోగము నుపట్టి జడ్జీవల్ల జరిగించబడే కార్యము.

77. న్యాయశాస్త్రమునుపట్టి తమకు యివ్వబడివుండే, లేక యివ్వబడివున్నట్టు కృత్రిమములేకుండా తాము నమ్మే యేదయినా అధికారము చెలాయించడములో జడ్జీ వుద్యోగమునుపట్టి ఒక జడ్జీగారివల్ల జరిగించబడ్డది యేదిన్ని నేరము కాదు.

కోర్టువారి తీర్పును

78. ఒక కోర్టు ఆఫ్ జస్టిస్‌వారి తీర్పు, లేక హుకుము అములులోవుండే కాలమందు అట్టితీర్పు, లేక హుకుము

గాని హుకుమునుగాని అనుసరించి జరిగించబడ్డ కార్యము.

జారీ చెయ్యడమునకు కోర్టువారికి అధికారము లేనప్పటికిన్ని వారి తీర్పును, లేక హుకుమును అనుసరించిగాని అందువల్ల అధికారము కలగ చెయ్యబడిగాని జరిగించబడ్డ యే కార్యమున్ను నేరము కానేరదు- అయితే అట్టి కార్యము జరిగించేమనిషి అట్టి తీర్పు, లేక హుకుము చెయ్యడమునకు కోర్టువారికి అధికారము వున్నట్టు కృత్రిమములేకుండా నమ్మి వున్నపక్షమునకు అందువల్ల బాధకములేదు.

న్యాయశాస్త్రమువల్ల అధికారము కలిగివుండే మనిషివల్లగాని నిజము తెలియక న్యాయశాస్త్రమువల్ల అధికారము కలిగివుండేటట్టు తానునమ్మే మనిషివల్లగాని జరిగించబడ్డ కార్యము.

79. న్యాయశాస్త్రమువల్ల అధికారము కలిగివుండే మనిషివల్లగాని న్యాయశాస్త్రమును గురించిన పొరబాటువల్ల కాకుండా నిజము తెలియక అట్లా న్యాయశాస్త్రమువల్ల అధికారము కలగ చెయ్యబడ్డట్టు కృత్రిమములేకుండా నమ్మివుండే మనిషివల్లగాని జరిగించబడ్డ యే కార్యమున్ను నేరము కాదు.

దృష్టాంతము.

A అనే మనిషికి ఖూనిగా తోచే కార్యము Z అనే మనిషి చేస్తూవుండగా A అనే మనిషి చూచినాడు. ఖూని చేస్తూవుండేటప్పుడు A అనే మనిషి, తన బుద్ధికి తోచినమట్టుకు కృత్రిమములేకుండా ఖూనీఖోర్లను పట్టుకోవడమునుగురించి [illegible] మంచి మనుష్యులకున్ను న్యాయశాస్త్రమువల్ల కలగ చెయ్యబడ్డ అధికారము చెలాయించి Z అనే మనిషిని క్రమమయిన అధికార్లయెదటికి హాజరుచెయ్యగలందులకయి పట్టుకొంటున్నాడు - తరవాత Z అనే మనిషి, ఆత్మసంరక్షణకోసరకు ఆకార్యము జరిగిస్తూవున్నట్టు యేర్పడ్డప్పటికిన్ని A అనే మనిషి వాణ్ని పట్టుకోవడమువల్ల నేరము చేసినవాడు కానేరడు.

80. ఒక క్రమమయిన కార్యము, క్రమమయిన పద్ధతినిపట్టిన్ని క్రమమైన కార్యము క్రమమయిన సాధనములవల్లనున్ను యుక్తమయిన

జరిగించడములో సంభవించే ప్రమాదము.

జాగ్రతతోటిన్ని హెచ్చరికతోటిన్ని జరిగించడములో నేరముగల తలంపు, లేక యెరుక లేకుండా ప్రమాదమువల్లగాని గ్రహచార వశాత్తుగాగాని జరిగించబడ్డది యేదిన్ని నేరము కాదు.

దృష్టాంతము.

**A** అనే మనిషి, గొడ్డటితో పనిచేస్తున్నాడు; గొడ్డటి అలుగు యెగిరిపడి అందువల్ల ఆ చెంతను నిలుచుండివుండే ఒక మనిషి చస్తున్నాడు — ఈ సంగతిలో **A** అనే మనిషియందు యుక్తమయిన జాగ్రతనుగురించి లోపములేనియెడల అనివల్ల జరిగినకార్యము మన్నించబడతగ్గది అవుతున్నదిగాని నేరముకాదు.

చెరుపుకలగచేసేదిగావుండి నేరముగల తలంపు లేకుండాను న్ను-మరివక చెరుపు నివారించడము నకున్ను జరిగించబడ్డకార్యము.

81 ఏదయినా కార్యము చెరుపుకలగచెయ్యవలెననే నేరముగల తలంపులేకుండానున్ను శరీరమునకున్నుగాని ఆ స్తికిగాని మరివొక చెరుపు కలగకుండా నివారించడమునకు, లేక ఆపడమునకుగాను కృత్రిమము లేకుండానున్ను జరిగించబడ్డ పక్షమునకు అందువల్ల చెరుపు కలగవచ్చుననే యెరుకతో అది జరిగించబడ్డదనే కారణమునుపట్టిమాత్రము నేరముకాదు.

**వివరణము.**—ఇట్టి సంగతిలో నివారించబడవలసిన, లేక ఆపబడవలసిన చెరుపు, అట్టి కార్యమువల్ల చెరుపు కలగవచ్చుననే యెరుకతోటి జరిగించడమును నిర్దుష్టపరచడమునకు, లేక మన్నించడమునకు తగ్గట్టు అంత ఆసన్నమయిన ఆపత్తు కలగచేసేదిగా వున్నదా అనేది సంగతులనుపట్టి నిర్ధారణ చెయ్యవలసిన అంశముగా వుంటున్నది.

దృష్టాంతములు.

(a) ఒక పొగవాడకు కేప్టన్ అయిన **A** అనే మనిషికి అకస్మాత్తుగానున్ను తనయందు యేదిన్ని తప్పు, లేక అశ్రద్ధలేకుండానున్ను తనవాడ నిలపబడగూడకముందు అది వెళ్లేదారి మార్చకపోయినయెడల 20, 30 మంది మనుష్యులను యెక్కించివుండే

B అనే పడవను తాను విధిలేక ముంచివెయ్యవలసినటువంటిన్ని తనదారి మార్చినపక్షమునకు యిద్దరిని యెక్కించివుండే C అనే పడవను ఒకవేళ తప్పించగూడినప్పటికిన్ని దాన్ని మునగగొట్టటగ్గ ఆపాయము సంభవించేటటువంటిన్ని స్థితి సంభవిస్తున్నది. ఈ సంగతిలో A అనే మనిషి, C అనే పడవను ముంచివెయ్యవలెననే వుద్దేశములేకుండానున్ను B అనే పడవలో వుండేమనుష్యులకు ఆపద నివారించగలందులకయి కృత్రిమములేకుండానున్ను తనదారి మార్చినందువల్ల C అనే పడవను ముంచివేసినయెడల ఆపదను నివారించవలెనని వుద్దేశించిన ఆపాయము, C అనే పడవను ముంచివేసేటట్టు సంభవించే ఆపదకు తెగించడమును మన్నించతగ్గదిగా వున్నట్టు నిర్ధారణ చెయ్యబడ్డ పక్షమునకు అట్టి కార్యమువల్ల C అనే పడవకు అట్టి ఆపద సంభవించవచ్చుననే యెరుకతోటి అట్టి కార్యము జరిగించినప్పటికిన్ని అందువల్ల అతడు నేరస్థుడుకాడు.

(b) A అనే మనిషి, గొప్ప మంటలో చిచ్చు వ్యాపించకుండా ఆపగలందులకు కొన్ని యిండ్లు పడగొట్టుతున్నాడు. మనుష్యుల ప్రాణములను, లేక ఆస్తిని సంరక్షించవలెననే యత్నముతోటి అతడు యీ కార్యము కృత్రిమములేకుండా జరిగిస్తున్నాడు. ఈ సంగతిలో నివారించబడవలసిన చెరుపు, A అనే మనిషి జరిగించిన కార్యమును మన్నించడమునకు తగిన స్వభావము కలదిగానున్ను అంత ఆసన్నమయినదిగానున్ను నిర్ధారణ చెయ్యబడ్డయెడల అందునగురించి A అనే మనిషి నేరస్థుడు కాడు.

ఏడుసంవత్సరముల యీడుకు తక్కువగావుండే పిల్లవల్ల జరిగించబడ్డ కార్యము.

82. ఏడుసంవత్సరములకంటె తక్కువ యీడుగల పిల్లవల్ల జరిగించబడ్డ యేదిన్ని నేరముగా వుండనేరదు.

ఏడుసంవత్సరములకు పైగానున్ను పన్నెండుసంవత్సరములకు లోపుగానున్ను వుండే యీడుకలిగి చాలినంత జ్ఞానములేని పిల్లవల్ల జరిగించబడ్డ కార్యము.

83. కార్యము జరిగించేసమయమందు తన నడతయొక్క స్వభావమున్ను అందువల్ల సంభవించేవిన్ని నిదానించి తెలుసుకోవడమునకు చాలినంత జ్ఞానము కలిగివుండని యేడుసంవత్సరములకు పయిగానున్ను పన్నెండుసంవత్సరములకు లోపుగానున్ను వుండే యీడుగల పిల్లవల్ల జరిగించబడ్డది యేదిన్ని నేరముకాదు.

84. ఒక కార్యము జరిగించేకాలమందు మతి స్థిరములేకపోవ

మతి స్థిరములేని మనుష్యుల్ల జరిగించబడ్డ కార్యము.

డమువల్ల ఆ కార్యపు స్వభావముగాని తాను జరిగించేకార్యము చెయ్యకూడనిదిగా, లేక న్యాయశాస్త్రమునకు విరోధముగావున్న సంగతిగాని తెలుసుకోవడమునకు అసమర్థుడైన మనిషివల్ల జరిగించబడ్డది యేదిన్ని నేరముకాదు.

తెలిసిన యిష్టమునకు విరోధముగా కలగచెయ్యబడ్డ మత్తువలన కలిగి కారణమునుపట్టి తెలివిలేకుండా వుండే మనిషివల్ల జరిగించబడ్డ కార్యము.

85. ఒక కార్యము జరిగించేటప్పుడు మత్తుగావున్న కారణమునుపట్టి ఆ కార్యపు స్వభావముగాని తాను జరిగించేకార్యము చెయ్యకూడనిదిగా, లేక న్యాయవిరుద్ధముగా వున్న సంగతిగాని తెలుసుకోవడమునకు అసమర్థుడయిన మనిషివల్ల జరిగించబడ్డది యేదిన్ని నేరముకాదు; అయితే యీ సంగతిలో అతనికి మత్తు కలగచేసిన వస్తువ అతనికి తెలియకుండాగాని అతని యిష్టమునకు విరోధముగాగాని పెట్టబడివుండవలసినది.

విశేషమైన తాత్పర్యముగాని యెరుకగాని కలిగివుండవలసిన నేరము, మత్తుగల స్థితిలోవుండే మనిషివల్ల చెయ్యబడడము.

86. ఒక కార్యము, ఒక విశేషమయిన యెరుకతోటిగాని తాత్పర్యముతోటిగాని జరిగించబడనియెడల, నేరముకాకుండావుండే సంగతులలో మత్తుగావుండే స్థితిలో అట్టి కార్యము జరిగించే ఒకమనిషికి మత్తు కలగచేసిన వస్తువ అతని యెరుకలేకుండాగాని యిష్టమునకు విరోధముగాగాని పెట్టబడివుంటేనేతప్ప, మత్తు కలిగివుండనియెడల అతనికి వుండి వుండగూడిన యెరుకతోటి ఆ కార్యము జరిగించినపక్షమందు యేలాగో ఆలాగే శిక్షకు పాత్రుడు కావలసినది.

సమ్మతిమీద జరిగిం

87. మరణము, లేక బలమయిన ఘాతకలిగేలాగున యత్నించబడనటువంటిన్ని ఆ కార్యము జరిగించేమనిషి మర

చబడ్డటువంటిన్ని మరణముగాని బలమైన ఘాతగాని కలగచెయ్యవలెనని యత్నమున్ను యెరుకయున్ను లేకుండా జరిగించబడ్డటువంటిన్ని కార్యము.

ణము, లేక బలమయిన ఘాత కలగవచ్చునని యెరగనటువంటిన్ని యే కార్యమున్ను కలిగే చెరుపును పొందడమునకు స్పష్టముగా, లేక అట్టి భావమయ్యేట్టుగా సమ్మతిపడ్డ పద్దెనిమిది సంవత్సరముల వయసుకు పయిగా వున్నే యే మనిషికయినా అట్టి కార్యమువల్ల కలిగే దానికయినా చెరుపును, లేక దాన్ని జరిగించే మనిషివల్ల కలిగేలాగున యత్నించబడ్డ చెరుపుకట్టిగాని అట్టి చెరుపును సాహసించేలాగున సమ్మతిపడ్డ అట్టి యే మనిషికయినా ఆ కార్యము జరిగించే మనిషివల్ల సంభవించవచ్చునని తెలిసివుండే చెరుపుకట్టిగాని నేరము అని యెంచబడకూడదు

దృష్టాంతము.

A అనే మనిషిన్ని Z అనే మనిషిన్ని వేడుకగా ఒకరితో ఒకరు సాముచెయ్యడమునకు ఒప్పుకొన్నారు. ఈ ఒప్పుకోవడమనేది, ఆసాములో కృత్రిమము లేకుండా కలిగే చెరుపుకు ఒప్పేలాగున వారు యిద్దరూ సమ్మతించినట్టు భావమవుతున్నది: గనుక A అనే మనిషి క్రమముగా సాముచేసేటప్పుడు Z అనే మనిషికి ఘాత కలగచేసిన పక్షమునను A అనే మనిషి నేరముచేసినవాడు కాడు.

ఒకమనిషియొక్క ప్రయోజనము కొరకు కృత్రిమము లేకుండా అతని సమ్మతిమీద జరిగించబడి మరణము కలగచెయ్యవలెనని యత్నించబడని ఒక కార్యము.

88. మరణము కలగచెయ్యవలెనని యత్నించబడని యే కార్యమున్ను అది యెవరి ప్రయోజనార్థము కృత్రిమము లేకుండా జరిగించబడ్డదో ఆ మనిషి అందువల్ల కలిగే చెరుపును పొందడమునకు, లేక ఆ చెరుపును సాహసించడమునకు స్పష్టముగా, లేక అట్టి భావమయ్యేట్టుగా సమ్మతిపడ్డ పక్షమునకు అట్టి యే మనిషికయినా ఆ కార్యమువల్ల కలిగే, లేక, జరిగించే మనిషివల్ల కలగచెయ్యబడేలాగున యత్నించబడ్డ,

లేక జరిగించేమనిషి అది కలగవచ్చునని యెరిగివుండే యేదయినా చెరుపునుపట్టి నేరముకాదు.

## దృష్టాంతము.

రణవైద్యుడయిన **A** అనే మనిషి, ఒక శ్రమకరమయిన రోగమువల్లి కష్టపడుతూవుండే **Z** అనే మనిషికి ఒకానొక అంగచికిత్సవల్ల మరణము సంభవిస్తున్నదని యెరిగివుండిన్ని **Z** అనే మనిషియొక్క మరణము సంభవించేటట్టు చెయ్యవలెననే యత్నములేకుండానున్ను **Z** అనే మనిషికి కృత్రిమములేకుండా మంచి కలగచెయ్యవలెననే యత్నముతోటిన్ని **Z** అనే మనిషియొక్క సమ్మతిమీద ఆతనికి ఆ అంగచికిత్స చేస్తున్నాడు. **A** అనేమనిషి నేరముచేసినవాడు కాడు.

సంరక్షకునివల్ల లేక సంరక్షకునియొక్క సమ్మతిమీద ఒక పిల్లయొక్క, లేక వెఱ్ఱివానియొక్క ప్రయోజనార్థము కృత్రిమము లేకుండా జరిగించబడ్డ కార్యము.

89. పన్నెండుసంవత్సరముల యీడుకు తక్కువగా వుండేటటువంటిగాని మతిస్థిరములేనటువంటిగాని మనిషిని న్యాయముగా తన సంరక్షణలో వుంచుకొనివుండే సంరక్షకుడు, లేక యితరమనిషి, వీరివల్లగాని స్పష్టముగా, లేక అట్టి భావమయ్యేటట్టుగా వారి సమ్మతిమీదగాని అట్టి మనిషియొక్క ప్రయోజనార్థము కృత్రిమములేకుండా జరిగించబడ్డ యే కార్యమున్ను ఆ మనిషికి ఆ కార్యము కలగచేసే, లేక జరిగించే మనిషివల్ల కలగచేసేటట్టు యత్నించబడ్డ, లేక చేసే మనిషివల్ల కలగవచ్చునని తెలుసుకోబడ్డ యేదయినా చెరుపునుపట్టి నేరముకాదు: అయితే—

నిబంధనలు.

మొదటిది.—ఈ మినహాయింపు, ప్రయత్నపూర్వకముగా మరణము కలగచెయ్యడమునకుగాని మరణము కలగచెయ్యవలెనని ప్రయత్నము చెయ్యడమునకుగాని వ్యాపించకూడదు;

రెండోది.—ఈ మినహాయింపు, మరణముగాని బలమయిన ఘాతగాని నివారించడము, లేక యేదయినా బలమయిన రోగము, లేక అశక్తత స్వస్థపరచడము, వీటికంటె యితరమయిన సంగతికొరకు యేదయినా కార్యము జరిగించేమనిషి అందువల్ల మరణము సంభవిస్తున్నదని యెరిగివుండే అట్టికార్యము జరిగించడమునకు వ్యాపించకూడదు;

మూడోది.—ఈ మినహాయింపు, మరణముగాని బలమయిన ఘాతగాని నివారించడము, లేక యేదయినా బలమయిన రోగము, లేక అశక్తత స్వస్థపరచడము, వీటికిగాను అయివుంటేనే తప్ప, స్వేచ్ఛగా బలమయిన ఘాత కలగచెయ్యడమునకుగాని బలమయిన ఘాత కలగచెయ్యవలెనని ప్రయత్నము చెయ్యడమునకుగాని వ్యాపించకూడదు;

నాలుగోది.—ఈ మినహాయింపు, అది వ్యాపించని నేరమునకుగాను చేసే కుమ్మకుకు వ్యాపించకూడదు.

దృష్టాంతము.

ఎ అనే మనిషి, తనపిల్లయొక్క సమ్మతి పొందకనే కృత్రిమములేకుండా ఆ పిల్ల మంచికొరకు శిలామేహ ఒకటివల్ల పిల్లకు ఒకవేళ మరణము సంభవించునని యెరిగివుండిన్ని పిల్లకు మరణము కలగచెయ్యవలెననే యత్నములేకుండా ఆ పిల్లకు శిలామేహముకొరకు రణవైద్యునివల్ల ఒకటి చేయించినాడు. ఎ అనే మనిషి, ఆపిల్లకు స్వస్థము కావలెనని తనకు వుద్దేశము కలిగివున్నందున మినహాయింపు కిందికి వస్తున్నాడు.

90. చెరుపు కలుగుతున్నదనే భయమువల్లగాని సంగతి తప్పుగా గ్రహించడమువల్లగాని ఒకమనిషివల్ల, సమ్మతిపొందబడ్డ పక్షమునకున్ను కార్యము జరిగించేమనిషి అట్టి భయమువల్ల, లేక తప్పుగా గ్రహించడమువల్ల సమ్మతిపడ్డట్టు యెరిగివున్నపక్షమునకున్ను, లేక అట్లా సమ్మతిపడ్డట్టు నమ్మడమునకు కారణము కలిగివున్న పక్షమునకున్ను, లేక

భయమువల్ల, లేక భ్రమవల్ల ఒప్పినట్టు తెలిసిన సమ్మతి.

మతి స్థయిర్యము లేకపోవడమువల్లగాని మత్తువల్లగాని తాను

వెఱ్ఱివానియొక్క సమ్మతి.

సమ్మతిపడేకార్యపు స్వభావమున్ను అందువల్ల సంభవించేదాన్నిన్ని తెలుసుకోలేని వొక మనిషివల్ల సమ్మతి పొందబడ్డ పక్షమునకున్ను, లేక

పూర్వోత్తర సందర్భమునుపట్టి తద్విరోధముగా కనపడనియెడల,

పిల్లయొక్క సమ్మతి.

పన్నెండు సంవత్సరముల యీడుకు తక్కువగావుండే మనిషివల్ల సమ్మతిపొందబడ్డ పక్షమునకున్ను, అట్టి సమ్మతి యీ శాసనపు వుద్దేశమునుపట్టి పొందబడ్డ సమ్మతి కానేరదు.

91. 87, 88, 89 సెక్షన్లలోని మినహాయింపులు, సమ్మతిపడే

కలుగజేయబడిన హానితో సంబంధము లేకనే నేరములగు కార్యములను వేరుపరచుట.

మనిషికి, లేక యెవరితరఫున సమ్మతిపొందబడ్డదో అట్టి మనిషికి అవి కలగచేసే, లేక కలగచేసేటట్టు యత్నించబడ్డ, లేక కలగవచ్చునని యెరిగివుండే యేదయినా చెరుపుగాక నేరములుగావుండే కార్యములకు వ్యాపించనేరవు.

దృష్టాంతము.

(స్త్రీయొక్క ప్రాణసంరక్షణార్థము కృత్రిమము లేకుండా జరిగించబడితే నేతప్ప,) గర్భస్రావము కలగచెయ్యడమనేది, ఆ స్త్రీకి అది కలగచేసే, లేక కలగచేసేటట్టు యత్నించబడ్డ యేదయినా చెరుపుగాక, నేరముగా వుంటున్నది. గనుక "అట్టి చెరుపుయొక్క కారణమునుపట్టి" అది నేరముకాదు, అట్టి గర్భస్రావము కలగచెయ్యడమునకు ఆ స్త్రీయొక్క, లేక ఆమె సంరక్షకునియొక్క సమ్మతి ఆ కార్యమును న్యాయపరచనేరదు.

92. ఒక మనిషియొక్క ప్రయోజనార్థము కృత్రిమము లేకుండా

సమ్మతిపొందకనే ఒకమనిషియొక్క ప్రయోజనార్థము కృత్రి

అతని సమ్మతిపొందకనే జరిగించబడ్డ యేకార్యమున్ను అతడు సమ్మతించడము అసాధ్యముగావున్న పక్షమునకుగాని అతడు సమ్మతిపడడమునకు అస

మము లేకుండా జరిగిం చబడ్డ కార్యము.

మర్థుకయి ఆకార్యము ప్రయోజనకరముగా జరిగించవలసివుండే యుక్తమయిన కాలమందు సమ్మతి పొందడమునకు సాధ్యముగా వుండేటటువంటిన్ని అతణ్ని న్యాయమయిన స్వాధీనమందు వుంచుకొని వుండేటటువంటిన్ని సంరక్షకుడు, లేక యితరమనిషి లేనిపక్షమునకుగాని అందువల్ల సంభవించే చెరుపునుపట్టి నేరముకాదు - అయితే—

నిబంధనలు.

మొదటిది.—ఈ మినహాయింపు, ప్రయత్నపూర్వకముగా మరణము కలగచెయ్యడమునకుగాని మరణము కలగచెయ్యవలెనని ప్రయత్నము చెయ్యడమునకుగాని వ్యాపించకూడదు;

రెండోది.—ఈ మినహాయింపు, మరణముగాని బలమయిన ఘాతగాని నివారించడము, లేక యేదయినా బలమయినరోగము, లేక అశక్తత స్వస్థపరచడము, యివికాకుండా మరణము సంభవిస్తున్నదని యెరిగివుండే యే కార్యమునకున్ను వ్యాపించకూడదు;

మూడోది.—ఈ మినహాయింపు, మరణము, లేక ఘాత, నివారించడముకాకుండా యితరమయిన మరి యే వుద్దేశముతోనయినా స్వేచ్ఛగా ఘాత కలగచెయ్యడమునకుగాని ఘాత కలగచెయ్యవలెనని ప్రయత్నము చెయ్యడమునకుగాని వ్యాపించకూడదు;

నాలుగోది.—ఈ మినహాయింపు, అది వ్యాపించని నేరమునకుగాను చేసే కుమ్మక్కుకు వ్యాపించకూడదు.

దృష్టాంతములు.

(a) Z అనే మనిషి, గుర్రముమీదనుంచి పడ్డందున స్మారకము తప్పిపోయినది. Z అనే మనిషికి కపాలచికిత్స చెయ్యడము జరూరుగా వున్నట్టు రణవైద్యుడయిన A అనే మనిషికి తోచినది. A అనే మనిషి Z అనే మనిషికి మరణముకలగ చెయ్యవలెననే

యత్నములేకుండానున్ను కృత్రిమములేకుండానున్ను Z అనే మనిషికి మంచి కలగ చెయ్యవలెననిన్ని Z అనే మనిషికి స్మృతి తిరిగివచ్చేలోగానే ఆ చికిత్స చేస్తున్నాడు. A అనే మనిషి, నేరముచేసినవాడు కాడు.

(b) Z అనే మనిషిని పులి యెత్తుకపోయినది. A అనే మనిషి, తన తుపాకి వేటువల్ల Z అనే మనిషికి మరణము సంభవించవచ్చునని యెరిగివుండిన్ని Z అనే మనిషిని చంపవలెనని యత్నించకుండానున్ను Z అనే మనిషికి మంచికలగవలెనని కృత్రిమములేకుండానున్ను పులిమిద కాలుస్తున్నాడు. A అనే మనిషి ప్రయోగించిన గుండువల్ల Z అనే మనిషికి మరణకరమైన గాయము తగులుతున్నది. A అనే మనిషి, నేరము చేసినవాడు కాడు.

(c) రణవైద్యుడయిన A అనే మనిషి, తక్షణమే చికిత్స చెయ్యనియెడల మరణకరముగా వుండగూడిన ఒక అపాయస్థితిలోవుండే ఒకపిల్లను చూస్తున్నాడు. ఆ పిల్లయొక్క సంరక్షకునితో చెప్పడమునకు అవకాశములేదు. A అనే మనిషి, ఆ పిల్లకు మంచికలగవలెననే యత్నముతో కృత్రిమములేకుండా ఆపిల్ల వద్దువద్దని వేడుకోంటూ వున్నా ఆ చికిత్స చేసేవాడు. A అనే మనిషి, నేరము చేసినవాడు కాడు.

(d) A అనే మనిషి, నిప్పుతగిలి మండుతూవుండే ఒక యింట్లో Z అనే పిల్లతోకూడా వున్నాడు. కిందవుండేవారు ఒక కంబడి పట్టినారు. A అనే మనిషి, కింద పడడమువల్ల ఆ పిల్లకు మరణము సంభవించవచ్చునని తెలిసిన్ని ఆ పిల్లను చంపవలెననే యత్నములేకుండానున్ను ఆ పిల్లకు మంచికలగవలెననే తాత్పర్యముతో కృత్రిమములేకుండానున్ను మేడమీదనుంచి ఆ పిల్లను కిందికి పడవేస్తున్నాడు. ఇందులో, పడడమువల్ల పిల్ల చనిపోయినా A అనే మనిషి నేరముచేసినవాడు కాడు.

వివరణము.—కేవల ద్రవ్యసంబంధమయిన ప్రయోజనము, 88, 89, 92 సెక్షన్లల అర్థమందలి ప్రయోజనము లేక మంచి అని అర్థముకాదు.

కృత్రిమము లేకుండా తెలియచెయ్యడము.

93. కృత్రిమములేకుండా యేదయినా సంగతి తెలియచెయ్యడము, అది తెలియచెయ్యబడ్డ మనిషియొక్క ప్రయోజనముకొరకు అతనికి తెలియచెయ్యబడ్డపక్షమునకు అందువల్ల కలిగే హానినిపట్టి నేరముకాదు.

## దృష్టాంతము.

ఎ అనే గణవైద్యుడు కృత్రిమములేకుండా ఒక రోగితో అతడు బ్రతకడము దుస్తరమని తన అభిప్రాయము చెప్పుతున్నాడు. రోగి అదిరిపడి చనిపోతున్నాడు. ఆ ప్రకారము చెప్పినందువల్ల ఆ రోగికి మరణము సంభవించవచ్చునని యెరిగివున్న ఎ అనే మనిషి, నేరముచేసినవాడు కాడు.

జడిపించి ఒక మనిషిని నిర్బంధపెట్టడమువల్ల జరిగించబడ్డ కార్యము.

94. ఖూనీయున్ను మరణదండన విధించబడతగివుండే సంస్థానముకు విరోధముగా చెయ్యబడ్డ నేరములున్ను తప్ప, ఒక నేరము జరిగించేకాలమందు తనకు తక్షణము మరణము సంభవించే వాళ్ళభయము సహేతుకముగా కలిగేటట్టు జడిపించడమువల్ల ఆ నేరము జరిగించేలాగున నిర్బంధపెట్టబడ్డ మనిషివల్ల జరిగించబడ్డ యే కార్యమున్ను నేరము కానేరదు; అయితే అతడు తనయిష్టమువిూదగాని తక్షణ మరణముకంటె యితరమయిన చెరుపునుగురించిన కారణము కలిగివుండే భయమువల్లగాని అట్టి నిర్బంధమునకు తాను లోబడ్డ స్థితిలోకి వచ్చినట్టయితే అది నేరము అవుతున్నది.

వివరణము.—(1) స్వేచ్ఛగాగాని కొట్టుతానని మాత్రము జడిపించినందువల్లగాని ఒక బందిపోటు మూకతోటి వారినడత తెలిసివుండిన్ని కలిసే ఒక మనిషి, న్యాయశాస్త్రమునుపట్టి నేరముగావుండే యేదయినా కార్యము జరిగించేలాగున తన సహవాసగాండ్లవల్ల బలవంతపరచబడ్డాడు అనే కారణమునుపట్టి యీ మినహాయింపుయొక్క ప్రయోజనపు హక్కుగలవాడు కానేరడు.

వివరణము.—(2) బందిపోటు మూకచేత పట్టుకోబడి న్యాయశాస్త్రమునుపట్టి నేరముగావుండే ఒక కార్యము జరిగించనియెడల తక్షణము చంపివేస్తామని జడిపించడమువల్ల బలవంతపెట్టబడ్డ ఒక మనిషి మినహాయింపుకు హక్కుగలవాడవుతున్నాడు; ఎట్లాగంటే, బందిపోటు

దొంగలు జొరబడి కొల్లపెట్టకమునకుగాను తన సవిముట్లు తీసుకొనివచ్చి ఒక యింటితలుపు బద్దలు కొట్టనియెడల తమణము చంపుతామని జడి పించకమునల్ల బలవంతపెట్టబడ్డ ఒక కమ్మరి గ్రామినహాయింపునల్ల కలిగే ప్రయోజనమునకు పాత్రుడవుతున్నాడు.

కొద్ది చెరుపు కలగ చేసే కార్యము.

95. సాధారణమయిన తెలివిన్ని తాళిమిన్ని గల యే మనిషి అయినా తనకు సంభవించినట్టు చెప్పకుండావుండే పాళపు కొద్ది చెరుపు అయినపక్షమునకు అది కలగ చేసే, లేక కలగచేసేటట్టు యత్నించబడ్డ, లేక కలగవచ్చునని యెరిగి వుండే యేదయినా చెరుపునుపట్టి యే కార్యమున్ను నేరముకాదు.

## ఆత్మసంరక్షణయొక్క హక్కునుగురించి.

ఆత్మసంరక్షణకొరకు జరిగించబడ్డ కార్యములు.

96. ఆత్మసంరక్షణయొక్క హక్కునుపట్టి జరిగించబడ్డ యే కార్యమున్ను నేరముకాదు.

శరీరముయొక్క, లేక ఆస్తియొక్క సంరక్షణను గురించిన హక్కు.

97. ప్రతి మనిషిన్ని 99-వ సెక్షనులోవుండే నిబంధనలకు లోబడి—

ఒకటోది.—మానవశరీరమునకు హాని కలగచేసే యే నేరమైనా జరగకుండా స్వశరీరమున్ను యే యితరమనిషియొక్క అయినా శరీరమున్ను,

రెండోది.—చోరీ, దోపిడి, కీడు, లేక నేరముగల ప్రవేశము, వీటి నిర్దేశము కిందికివచ్చే నేరముగావుండే, లేక చోరీ, దోపిడి, కీడు, లేక నేరముగల ప్రవేశము, వీటిని చెయ్యవలెననే యత్నముగావుండే యేదయినాకార్యము చెయ్యనివ్వకుండా తనదిగా వున్నాసరే యితరమనిషిదిగా వున్నాసరే చరస్థిరస్వభావకమయిన ఆస్తిన్ని,

సంరక్షించుకొనే హక్కుకలిగి వుంటున్నాడు.

మతి స్థయిర్యము లేని మనుష్యులు వగైరాలు చేసే కార్యములు జరగకుండా సంరక్షించుకొనే హక్కు.

98. ఒక కార్యముచేసే మనిషికి చిన్నతనము, జ్ఞానపరిపాకము కాకుండా వుండటము, మతి స్థయిర్యము లేకపోవడము, మత్తు, లేక యేవిధముగానైనా తప్పుగాగ్రహించడము అనే యీ కారణములు లేనిపక్షమునకు నేరముగావుండవలసిన ఒక కార్యము అటువంటి కారణములు కలిగివుండే ఒక మనిషివల్ల జరిగించబడ్డప్పుడు ఆ కార్యము నేరముగలదిగావుంటే యేలాగో ఆలాగే అది జరగకుండా అడ్డమునకు ప్రతి మనిషికిన్ని కలిగివుండవలసిన ఆత్మసంరక్షణయొక్క హక్కు కలిగవుండవలసినది.

దృష్టాంతములు.

(a) Z అనే మనిషి, వెర్రివల్ల A అనే మనిషిని చంపవలెనని ప్రయత్నము చేస్తున్నాడు. Z అనే మనిషి చేసిన యీ కార్యము నేరముకాదు. అయితే Z అనే మనిషి మతి స్థయిర్యము కలిగివుండివున్నపక్షమున A అనే మనిషి ఆత్మసంరక్షణను గురించి యే హక్కు కలిగివుండవచ్చునో ఆ హక్కు కలిగివుండవలసినది.

(b) A అనే మనిషి, తాను న్యాయముగా ప్రవేశించే హక్కులేని యింట్లోకి పోతున్నాడు. Z అనే మనిషి, A అనే మనిషిని చూచి అతడు వాస్తవముగా కన్నపుదొంగ అనుకొని ఆ A అనే మనిషిమీద దొమ్మిచేస్తున్నాడు. ఇందులో తప్పుగా గ్రహించడమువల్ల Z అనేమనిషి A అనేమనిషిమీద దొమ్మిచెయ్యడము అనేది నేరము కాదు. అయితే A అనే మనిషి, Z అనే మనిషికి అట్టి పొరబాటుమీద దొమ్మిని జరిగించకుండావున్నయెడల యేలాగో ఆలాగే Z అనే మనిషిమీద తనకు కలిగివుండే ఆత్మసంరక్షణ చేసుకొనేహక్కు కలిగివుంటున్నాడు.

ఆత్మ సంరక్షణ యొక్క హక్కు లేని సంగతులు

99. న్యాయశాస్త్రమునుబట్టి ఉచితముగా న్యాయపరచబడక పోయినా వుద్యోగధర్మమునుబట్టి కృత్రిమము లేకుండా వొక పబ్లిక్ వుద్యోగస్థునివల్ల జరిగించబడ్డ లేక జరిగించేలాగున యత్నించబడ్డ మరణము, లేక బలమయిన ఘాత కలగచేసేలాగున సహేతుకముగా భయము కలగచెయ్యని యే కార్యపు విషయములోనున్ను ఆత్మ సంరక్షణయొక్క హక్కు లేదు.

న్యాయశాస్త్రమునుపట్టి ఖచితముగా న్యాయపరిచబడకపోయినా వుద్యోగధర్మమునుపట్టి కృత్రిమములేకుండా వొక పబ్లిక్ వుద్యోగస్థుని యొక్క హుకుమువల్ల జరిగించబడ్డ, లేక జరిగించేలాగున యత్నించబడ్డ మరణము, లేక బలమయిన ఘాత కలగచేసేలాగున సహేతుకముగా భయముకలగచెయ్యని యే కార్యపు విషయములోనున్న ఆత్మసంరక్షణ యొక్క హక్కు లేదు.

పబ్లిక్ అధికారస్థులయొక్క సంరక్షణను పొందడమునకు సదుపాయము కలగచేసుకొనే వాళపు అవకాశముకలిగివున్న సంగతులలో ఆత్మ సంరక్షణనుగురించిన హక్కు లేదు.

ఆ హక్కు చెలాయించగూడిన పరిమితి.

ఆత్మ సంరక్షణనుగురించిన హక్కు, సంరక్షణార్థము జరూరుగా చెయ్యవలసినంతకంటె యెక్కువ చెరుపుచెయ్యడమునకు యే సంగతిలోనూ వ్యాపించదు.

వివరణము.—(1) యేదయినా కార్యము జరిగించే మనిషి పబ్లిక్ వుద్యోగస్థుడుగా వున్నట్టు యెరిగి, లేక నమ్మడమునకు కారణము కలిగి వుంటేనేతప్ప, అతనివల్ల వుద్యోగధర్మమునుపట్టి జరిగించబడ్డ, లేక జరిగించడమునకు యత్నించబడ్డ ఆ కార్యము జరగకుండా నివారించడమును గురించి ఆత్మసంరక్షణయొక్క హక్కు యే మనిషికిన్ని పోగొట్టబడ లేదు.

వివరణము.—(2) యేదయినా కార్యము జరిగించేమనిషి, పబ్లిక్ వుద్యోగస్థుని హుకుముమీద జరిగిస్తున్నాడని యెరిగిన్ని, లేక అట్లా నమ్మడమునకు కారణముకలిగిన్ని, లేక అట్టి మనిషి యే అధికారమును పట్టి ఆ కార్యము తాను జరిగిస్తున్నాడో అట్టి అధికారమును తెలియచేసిన్ని, లేక తాను లిఖితరూపమయిన అధికారము కలిగివుండి అడిగిన మీదట అట్టి అధికారపత్రిక కనపరచిన్నివుంటేనేతప్ప, వొక పబ్లిక్

వుద్యోగస్థునియొక్క హుకుమువిూద జరిగించబడ్డ, లేక జరిగించబడడ మునకు యత్నించబడ్డ కార్యము జరగకుండా నివారించడమునుగురించి ఆత్మ సంరక్షణయొక్క హక్కు యే మనిషికిన్ని పోగొట్టబడలేదు.

శరీరమునుగురించిన సంరక్షణయొక్క హక్కు, మరణము కలగచెయ్యడమునకు యెప్పుడు వ్యాపిస్తున్నది.

100. శరీర సంరక్షణయొక్క హక్కు, యింతకుముందు అన్యవహితముగావుండే సెక్షన్లలో నమూదుచెయ్యబడ్డ నిబంధనలకు లోబడి అట్టి హక్కు చెలాయించే జరూరు కలగచేసిన నేరము యిందులో యికముందు చెప్పబడే తరహాలలో వొకటిగావున్న యెడల దొమ్మి చేసినమనిషికి మరణము, లేక యేదయినా యితర చెరుపు స్వేచ్ఛగా కలగచెయ్యడమునకు వ్యాపిస్తున్నది, ఆ నేరములు యేవంటే:—

మొదటిది.—తాను ముందు మించనియెడల తనకు మరణము సంభవిస్తున్నదని సహేతుకముగా భయముకలగచేసే దొమ్మి;

రెండవది.—తాను ముందుమించనియెడల తనకు బలమయినఘాత సంభవిస్తున్నదని సహేతుకముగా భయముకలగచేసే దొమ్మి;

మూడవది.—స్త్రీని బలాత్కారముగా చెరపవలెననే యత్నము తో చేసిన దొమ్మి;

నాలుగవది.—స్వభావసిద్ధముకాని కామము తీర్చుకోవలెననే యత్నముతో చేసిన దొమ్మి;

అయిదవది.—మనుష్యులను దొంగిలుకొని, లేక యెత్తుకొనిపో వలెననే యత్నముతో జరిగించబడ్డ దొమ్మి;

ఆరవది.—తన విడుదలనిమిత్తము సర్కారు అధికారస్థుల సంరక్షణ పొందడమునకు సాధ్యము వల్ల లేకపోతున్నదని సహేతుకమయిన

భయముకలగచేసే సంగతులలో ఒక మనిషిని అక్రమముగా ఖయిదు చెయ్యవలెననే యత్నముతో జరిగించబడ్డ దొమ్మి.

అట్టిహక్కు, మరణము కాకుండావుండే మరి యేదయినా చెరుపు కలగచెయ్యడమునకు యెప్పుడువ్యాపిస్తున్నది.

**101.** నేరము అనేది యింతకుముందు అవ్యవహితముగా వుండే సెక్షనులో వివరించబడ్డ తరహాలలో యొకటిగా వుండనియెడల శరీర సంరక్షణచేసుకొనే హక్కు, దొమ్మి చేసినమనిషికి స్వేచ్ఛగా మరణము కలగచెయ్యతమునకు వ్యాపించదు. అయితే 99-వ సెక్షనులో నమూదుచెయ్యబడ్డ నిబంధనలకు లోబడి దొమ్మి చేసినమనిషికి మరణముకాకుండావుండే యేదయినా చెరుపు స్వేచ్ఛగా కలగచెయ్యడమునకు వ్యాపిస్తున్నది.

శరీర సంరక్షణయొక్క హక్కు, యెప్పుడు ఆరంభముకావలసినది. అది యెంత కాలము వుండవలసినది.

**102.** శరీర సంరక్షణయొక్క హక్కు, నేరము జరిగించబడకుండా వున్నప్పటికిన్ని, ఆ నేరము జరిగించవలెననే యత్నమువల్ల, లేక జరిగించేలాగున జడిపించడమువల్ల దేహమునకు అపాయము కలుగుతున్నదని సహేతుకమైన భయము పుట్టగానే ఆరంభము అయి దేహమునకు అట్టి అపాయము కలుగుతున్నదనే భయము వుండేవరకు వుండవలసినది.

ఆస్తి సంరక్షణచేసుకొనేహక్కు, మరణము కలగచెయ్యడమునకు యెప్పుడు వ్యాపిస్తున్నది.

**103.** ఆస్తి సంరక్షణ చేసుకొనేహక్కు, 99-వ సెక్షనులో నమూదుచెయ్యబడివుండే నిర్బంధములకు లోబడి, యేది చెయ్యడమువల్ల, లేక యేది చెయ్యవలెనని యత్నించడమువల్ల ఆ హక్కు చెలాయించేలాగున సంభవిస్తున్నదో అట్టి నేరము యిందులో యిక ముందు చెప్పబడే తరహాలలో యేదయినా ఒక తరహాదారీగల నేరముగావున్నయెడల, అక్రమము జరిగించినమనిషికి మరణముగాని యితర

చెరుపుగాని స్వేచ్ఛగా జరిగించడమునకు వ్యాపిస్తున్నది, ఆ నేరములు యేవంటే:—

మొదటిది.—దోపిడి;

రెండవది.—రాత్రివేళ తలుపులు వగయిరాలు బద్దలుకొట్టి యింట్లో జొరబడడము;

మూడవది.—ఏ యిల్లు, డేరా, లేక వాడ, మనుష్యుల వాసస్థానముగాగాని ఆస్తివుండే స్థలముగాగాని వాడబడుతున్నదో అట్టి యేదయినా యింటికి, డేరాకు, లేక వాడకు నిప్పుపెట్టి చెరుపు చెయ్యడము;

నాలుగవది.—ఆత్మ సంరక్షణయొక్క హక్కు అమలులోకి తేబడనియెడల మరణము, లేక బలమైన ఘాత కలుగుతున్నదనే భయము సహేతుకముగా కలగచేసే సంగతులలో జరిగించబడ్డ చోరీ, చెరుపు, లేక ఇంట్లో అక్రమముగా జొరబడడము.

అట్టి హక్కు, మరణము కాకుండావుండే యేదయినా యితర చెరుపు కలగచెయ్యడమునకు యెప్పుడు వ్యాపిస్తున్నది.

104. ఏది జరిగించడమువల్ల, లేక జరిగించవలెనని యత్నించడమువల్ల, ఆస్తి సంరక్షణచేసుకొనే హక్కు అమలులోకి తెచ్చేలాగున సంభవిస్తున్నదో అట్టి నేరము, యింతకుముందు అవ్యవహితముగావుండే సెక్షనులో చెప్పబడ్డ తరహాలలో యేదిన్ని కాకుండావుండే చోరీ, కీడు, లేక నేరముగల ప్రవేశము, యివిగావున్నపక్షమునకు ఆ హక్కు, స్వేచ్ఛగా మరణము కలగచెయ్యడమునకు వ్యాపించనేరదు. అయితే 99-వ సెక్షనులో నమూదుచెయ్యబడ్డ నిబంధనలకు లోబడి మరణముకాకుండా యితరమయిన యే చెరుపు అయినా అక్రమము జరిగించిన మనిషికి స్వేచ్ఛగా కలగచెయ్యడమునకు వ్యాపిస్తున్నది.

ఆస్తి సంరక్షణచేసుకొనేహక్కు యెప్పుడు ఆరంభముకావలసినది, ఎంతకాలము వుండవలసినది.

105. ఆస్తి సంరక్షణచేసుకొనేహక్కు, ఆ ఆస్తికి అపాయము సంభవిస్తున్నదని సహేతుకమైన భయము కలగగానే ఆరంభము కావలసినది.

చోరీ జరగకుండా ఆస్తి సంరక్షణచేసుకొనే హక్కు, నేరస్థుడు ఆ స్తి యెత్తుకొని పారిపొయ్యేవరకుగాని పబ్లిక్ అధికారస్థుల సహాయము పొందబడేవరకుగాని ఆ ఆస్తి మళ్లీ దొరికేవరకుగాని వుంటున్నది.

దోపిడి జరగకుండా ఆస్తియొక్క సంరక్షణ చేసుకొనేహక్కు, నేరస్థుడు యే మనిషికయినా మరణముగాని ఘాతగాని అక్రమమయిన నిర్బంధముగాని కలగచేస్తూవుండేవరకు, లేక కలగచెయ్యవలెనని యత్నిస్తూవుండేవరకు, లేక సద్యోమరణము, సద్యోఘాత, శరీరమునకు సద్యో నిర్బంధము వీటినిగురించిన భయము వుండేవరకు వుంటున్నది.

నేరముగల ప్రవేశము, లేక కీడు జరగకుండా ఆస్తి సంరక్షణ చేసుకొనే హక్కు, నేరస్థుడు ఆ నేరముగల ప్రవేశము, లేక కీడు జరిగిస్తూవుండేవరకు వుంటున్నది.

రాత్రివేళ తలుపులు వగయిరాలు బద్దలుకొట్టి యింట్లో జొరబడకుండా ఆస్తి సంరక్షణచేసుకొనే హక్కు, అట్లా తలుపులు వగయిరాలు బద్దలుకొట్టి యింట్లో జొరబడడముతోటి ప్రారంభించే యింట్లోకి అక్రమముగా జొరబడడము అనే నేరము జరుగుతూవుండేవరకు వుంటున్నది.

నిర్దోషిగావుండే మనిషికి చెరుపుసంభవించేలాగున వుండేటప్పుడు మరణకర

106. మరణభయము సహేతుకముగా కలగచేసే దొమ్మీ జరగకుండా చెయ్యడములో స్వసంరక్షణయొక్క హక్కు చెలాయించడమందు ఒక నిర్దోషి అయిన మనిషికి చెరుపు కలగకుండా సార్థకముగా ఆ హక్కు చెలా

మయిన దొమ్మీజరగకుండా చెయ్యడములో స్వసంరక్షణయొక్క హక్కు.

యించగూడని స్థితిలో ఆ సంరక్షణ చేసుకొనేమనిషి వున్నపక్షమునకు అతని స్వసంరక్షణయొక్క హక్కు అట్టి సాహసము చెయ్యడమునకు వ్యాపిస్తున్నది.

## దృష్టాంతము.

ఎ అనే మనిషి, తనను ఖూనీ చెయ్యవలెనని యత్నించే ఒక గుల్లరిమూకవల్ల దొమ్మిచెయ్యబడ్డాడు. అతను ఆ మూకమీద తుపాకీవేత వెయ్యకనే స్వసంరక్షణయొక్క హక్కు సార్థకముగా చెలాయించలేదు. అయితే ఆ మూకలో కలిసివుండే చిన్న పిల్లలకు చెరుపు సంభవించకుండా ఆ వేత వెయ్యడమునకు వల్లలేక, ఎ అనే మనిషి, అట్లా తుపాకీవేత వెయ్యడమువల్ల ఆ పిల్లలలో యెవరికయినా చెరుపు కలుగచేసినపక్షమునకు అతను నేరముచేసినవాడు కాడు.

---

## 5-వ అధ్యాయము.

### కుమ్మకు చెయ్యడమునుగురించి.

ఒక కార్యమునకు కుమ్మకుచెయ్యడము.

107. ఒక మనిషి ఒక కార్యము జరిగించడమునకుగాను కుమ్మకుచేసినవాడు అవుతున్నాడు - అది యేలాగంటే—

మొదటిది.—ఏ మనిషికయినా ఒక కార్యము చేసేలాగున దుర్బోధచేసినపక్షమునకు, లేక

రెండవది.—ఒక కార్యము జరిగించడమునకయి ఒక మనిషితో, లేక యెక్కువమందితో బందుకట్టుచేసుకోవడము అనగా, అట్లా బందుకట్టు చేసుకోవడమువల్లనున్ను ఆ కార్యము జరిగించడముకొరకున్ను న్యాయశాస్త్రవిరుద్ధమయిన యేదయినా ఒక కార్యముగాని లోపముగాని సంభవించినపక్షమునకు, లేక

మూడవది.—ఒక కార్యము జరగడమునుగురించి న్యాయశాస్త్రవిరుద్ధమయిన ఒక కార్యమువల్ల, లేక లోపమువల్ల బుద్ధిపూర్వకముగా సహాయముచేసిన పక్షమునకు.

వివరణము.—(1) తాను వెల్లడిచెయ్యడమునకు బద్ధుడయివుండే ఒక ముఖ్యమయిన సంగతిని బుద్ధిపూర్వకముగా తప్పుగా తెలియచెయ్యడమువల్లగాని బుద్ధిపూర్వకముగా దాచడమువల్లగాని ఒక కార్యము స్వేచ్ఛగా చేయించే, లేక జరిగించేలాగునచేసే, లేక చేయించడమునకు యత్నించే, లేక జరిగించేలాగున ప్రయత్నముచేసే మనిషి, ఆకార్యము జరిగించడమునకు దుర్బోధన చేస్తున్నాడు అని చెప్పబడివున్నాడు.

దృష్టాంతము.

ఒక పబ్లిక్ వుద్యోగస్థుడయిన **A** అనే మనిషి, ఒక కోర్టు ఆఫ్ జస్టిస్ వారి వారంటువల్ల **Z** అనేమనిషిని పట్టుకొనేలాగున అధికారము కలిగివున్నాడు. **B** అనే మనిషి, అట్లా అధికారముకలిగివుండే సంగతిన్ని **C** అనే మనిషి **Z** అనే మనిషికాడనే సంగతిన్ని యెరిగివుండిన్ని **C** అనే మనిషి **Z** అనే మనిషి అయినట్లు బుద్ధిపూర్వకముగా **A** అనే మనిషికి తప్పుగా తెలియచేసి అందువల్ల బుద్ధిపూర్వకముగా **C** అనే మనిషిని **A** అనే మనిషి పట్టుకొనేలాగున చేస్తున్నాడు. ఈ సంగతిలో దుర్బోధనవల్ల **C** అనే మనిషిని పట్టుకొనేలాగున **B** అనే అతడు కుమ్మకుచేసిన మనిషి అవుతున్నాడు.

వివరణము.—(2) ఒక కార్యము జరిగించడమునకు మునుపు, లేక జరిగించేకాలమందు ఆ కార్యము జరిగించడమును సులభపరచగలందులకయి యేదయినా వొక కార్యము జరిగించి అందువల్ల అది జరిగించడమును సులభపరచే మనిషి ఆ కార్యము జరిగించడమునకు కుమ్మకుచేసినట్టు చెప్పబడివున్నాడు.

కుమ్మకుచేసే మనిషి.

108. ఒక నేరము చెయ్యడమునకుగాని కుమ్మకుచేసే మనిషివలెనే అదే యత్నమున్ను జ్ఞానమున్ను కలిగి నేరము జరిగించడమునుగురించి న్యాయశాస్త్రప్రకారముతగివుండే ఒక మనిషివల్ల జరిగించబడ్డపక్షమునకు నేరముగా వుండగూడిన వొక కార్యము జరిగించడమునకుగాని సహాయముచేసే మనిషి ఆ నేరమునకు కుమ్మకుచేసేమనిషి అవుతున్నాడు.

వివరణము.—(1) న్యాయశాస్త్ర ప్రకారము చెయ్యవలసిన ఒక కార్యము జరిగించకపోవడమునుగురించి చెయ్యబడే కుమ్మకు, అట్లా కుమ్మకుచేసే మనిషి ఆ కార్యము జరిగించడమునకు తాను బద్ధుడు కాక పోయినా వొక నేరము కానచ్చును.

వివరణము.—(2) కుమ్మకు అనే నేరమును యేర్పాటుచెయ్యడమునకుగాను కుమ్మకుచెయ్యబడ్డ కార్యము జరిగించబడడముగాని ఆ నేరము యేర్పాటుచెయ్యడమునకు ఆవశ్యకముగావుండే ఫలము కలగచెయ్యబడడముగాని జరూరు వుండనేరదు.

## దృష్టాంతములు.

(a) ఎ అనే మనిషి సి అనే మనిషిని ఖూనీచేసేలాగున బి అనే మనిషికి దుర్బోధన చేస్తున్నాడు. బి అనే మనిషి, ఆప్రకారము చెయ్యడములేదని చెప్పుతున్నాడు. ఖూనీచేసేలాగున బి అనే మనిషికి దుర్బోధనచేసిన నేరమునుగురించి ఎ అనే మనిషి నేరస్థుడవుతున్నాడు.

(b) ఎ అనే మనిషి డి అనే మనిషిని ఖూనీచేసేలాగున బి అనే మనిషికి దుర్బోధనచేస్తున్నాడు. బి అనే మనిషి ఆ దుర్బోధన విని డి అనే మనిషిని పొడుస్తున్నాడు. డి అనే మనిషికి తగిలిన గాయము ఆ తర్వాత మానుతున్నది. ఖూనీచేసేలాగున బి అనే మనిషికి దుర్బోధనచేసిన నేరమునుగురించి ఎ అనే మనిషి నేరస్థుడవుతున్నాడు.

వివరణము.—(3) కుమ్మకుచెయ్యబడ్డ మనిషి న్యాయశాస్త్రరీత్యా వొక నేరము చెయ్యతగ్గవాడుగాగాని కుమ్మకుచేసేమనిషికి కలిగివుంటూ వచ్చిన నేరముగల వుద్దేశము, లేక యెరుక, లేక మరియేదయినా నేరముగలవుద్దేశము, లేక యెరుకకలిగివుండే మనిషిగాగాని వుండవలసిన జరూరులేదు.

## దృష్టాంతములు.

(a) A అనే మనిషి, నేరముగల వుద్దేశముతో న్యాయశాస్త్రప్రకారము ఒక నేరము జరిగించతగ్గటువంటిన్ని A అనే మనిషికి కలిగివున్న వుద్దేశము కలిగినటువం

టిన్ని ఒక మనిషివల్ల జరిగించబడ్డపక్షమునకు నేరము అయ్యే ఒక కార్యము జరిగించేలాగున ఒక పిల్లకు, లేక వెర్రెత్తినమనిషికి కుమ్మక్కుచేస్తున్నాడు. ఈ సంగతిలో A అనే మనిషి ఆకార్యము జరిగించబడ్డానసరే .జరిగించబడకపోయినానసరే ఒక నేరమునకు కుమ్మక్కుచేసినందునగురించి నేరస్థుడవుతున్నాడు.

(b) A అనే మనిషి, Z అనే మనిషిని ఖూనీ చెయ్యవలెననే వుద్దేశముతో Z అనే మనిషికి మరణము కలగచేసే ఒక కార్యము జరిగించేలాగున యేడుసంవత్సరముల యీడుకులోపుగా వుండే B అనే పిల్లకు దుర్బోధన చేస్తున్నాడు. B అనే పిల్ల, అట్టి కుమ్మక్కువల్ల, A లేని సమయమందు, ఆకార్యము జరిగించి, అందువల్ల Z అనే మనిషికి మరణము కలగచేస్తున్నాడు. ఇందులో న్యాయశాస్త్రప్రకారము B అనేపిల్ల నేరము చెయ్యతగివుండకపోయినా B అనే పిల్ల, న్యాయశాస్త్రప్రకారము ఒక నేరము జరిగించడమునకు తగివుండి ఆ ఖూనీ జరిగించివుంటే యెలాగో ఆలాగే A అనే మనిషి శిక్షకు పాత్రుడు కావలసినది. గనుక మరణదండనకు లోబడుతున్నాడు.

(c) వాసముచేసే ఒకయింటికి నిప్పుపెట్టవలసినదని B అనే మనిషికి A అనే మనిషి దుర్బోధన చేస్తున్నాడు. B అనే మనిషి, మతిస్థయిర్యములేని కారణమువల్ల ఆ కార్యపు స్వభావమునుగాని తప్పుగా, లేక న్యాయశాస్త్రమునకు విరోధముగా వుండే కార్యమును తాను చేస్తూవున్నాననిగాని తెలుసుకోలేక A అనే మనిషియొక్క దుర్బోధన విని ఆ యింటికి నిప్పుపెట్టుతున్నాడు. B అనే మనిషి నేరముచేసినవాడు కాడు. అయితే వాసముచేసే ఒకయింటికి A అనే మనిషి నిప్పుపెట్టడము అనే నేరమునకు కుమ్మక్కుచెయ్యడమునుగురించి నేరస్థుడయి ఆ నేరమునకుగాను నిర్ణయించబడివుండే శిక్షకు పాత్రుడవుతున్నాడు.

(d) A అనే మనిషి, ఒక చోరీ జరిగించబడవలెననే వుద్దేశముతో Z అనే మనిషి తాలూకు ఆస్తి ఆ Z అనే మనిషియొక్క స్వాధీనములోనుంచి యెత్తుకొనివచ్చేలాగున B అనే మనిషికి దుర్బోధనచేస్తున్నాడు. A అనే మనిషి ఆ ఆస్తి తనది అయినట్టు B అనే మనిషి నమ్మేలాగున చేస్తున్నాడు. B అనే మనిషి, అది A అనేమనిషియొక్క ఆస్తి అని నమ్మి కృత్రిమములేకుండా ఆ ఆస్తి Z అనే మనిషియొక్క స్వాధీనములోనుండి యెత్తుకొనివస్తున్నాడు. ఈ పొరబాటుమీద ఆ కార్యము జరిగించే B అనే మనిషి, అయోగ్యముగా యెత్తుకొనిరాలేదు-గనుక చోరీ అనే నేరము జరిగించినవాడు కాడు. అయితే, A అనే మనిషి, చోరీ అనే నేరము [illegible]

గించినందునగురించి నేరస్థుడు అయి B అనే మనిషి చోరీ జరిగించివుంటే యేలాగో ఆలాగే అపేక్షకుడు పాత్రుడవుతున్నాడు.

వివరణము.—(4) ఒక నేరపు కార్యమునకు కుమ్మకుచెయ్యడము అనేది నేరముగావున్నందున అట్టి కుమ్మకుకు కుమ్మకు చెయ్యడముకూడా నేరముగా వుంటున్నది.

దృష్టాంతము.

A అనే మనిషి, Z అనే మనిషిని ఖూనీచేసేలాగున C అనే మనిషికి దుర్బోధన చెయ్యవలసినది అని B అనే మనిషికి దుర్బోధన చేస్తున్నాడు. B అనే మనిషి, అదేప్రకారము Z అనే మనిషిని ఖూనీచేసేలాగున C అనే మనిషికి దుర్బోధన చేస్తున్నాడు. B అనే మనిషియొక్క దుర్బోధనవల్ల C అనే మనిషి ఆ నేరము జరిగిస్తున్నాడు. B అనే మనిషి, ఆ నేరమునుగురించి మరణదండనవల్ల శిక్షించబడడమునకు పాత్రుడవుతున్నాడు. A అనే మనిషి ఆ నేరము జరిగించేలాగున B అనే మనిషికి దుర్బోధన చేసినందున A అనే మనిషికూడా అపేక్షకుడు పాత్రుడవుతున్నాడు.

వివరణము.—(5) ఇతరులతో బందుకట్టుగా నేరము జరిగించడమునకు కుమ్మకు చెయ్యడము అనే నేరమునకు కుమ్మకుచేసేమనిషి ఆ నేరము జరిగించే మనిషితోకూడా ఆ నేరమునుగురించిన యేర్పాట్లు చెయ్యవలసిన జరూరులేదు. దేన్ని అనుసరించి ఆ నేరము జరిగించబడ్డదో అట్టి బందుకట్టులో ప్రవర్తించడమే చాలును.

దృష్టాంతము.

A అనే మనిషి, Z అనే మనిషికి విషముపెట్టవలెనని B అనే మనిషితో ఆలోచన చేస్తున్నాడు. అంతట A అనే మనిషి Z అనే మనిషికి విషము పెట్టేలాగున వారు నిర్ణయించుకొన్నారు. తర్వాత B అనే మనిషి, ఆ యేర్పాటు C అనే మనిషికి తెలియచేసి A అనే మనిషి పేరుచెప్పకుండా Z అనే మనిషికి మరియొకమనిషి విషము పెట్టబోతున్నాడనిమాత్రము తెలియచేస్తున్నాడు. C అనే మనిషి విషము సంపాదించి యివ్వగలందులకు ఒప్పి పయిన వివరించబడ్డ ప్రకారము పెట్టడమునకు విషము సంపాదించి B అనే మనిషివద్ద యిస్తున్నాడు. A అనే మనిషి విషముపెట్టడమువల్ల Z అనే మనిషి చనిపోతున్నాడు. ఇందులో A అనే మనిషిన్ని C అనే మనిషిన్ని కలిసి దురా

లోచన చెయ్యకపోయినా యే బందుకట్టునుపట్టి Z అనే మనిషి ఖూనిచెయ్యబడ్డాడో ఆ బందుకట్టులో C అనే మనిషి ప్రవర్తించినాడు. గనుక C అనే మనిషి యీ సెక్షనులో నిర్ధారణచెయ్యబడ్డ నేరము జరిగించినవాడయి ఖూనీనిగురించిన శిక్షకు పాత్రుడవుతున్నాడు.

బ్రిటిష్ ఇండియాకు వెలుపల నేరముల కు బ్రిటిష్ ఇండియాలో కుమ్మకు చేయడము.

108-A. బ్రిటిష్ ఇండియాలో జరిగింపఁబడినయెడల నేరముగా నేర్పడునట్టి యేకార్యమునైనను బ్రిటిష్ ఇండియాకు వెలుపలను ఆవలను జరగించడమునకు బ్రిటిష్ ఇండియాలో కుమ్మకుచేయువాఁడు, యీకోడు తాత్పర్య ప్రకారము నేరమునకు కుమ్మకుచేసినవాఁడగుచున్నాఁడు.

దృష్టాంతము.

గోవాలోనుండు పరాయిదేశస్థుఁడగు బి అనువాఁడు గోవాలో ఖూనీ చేయడమునకు బ్రిటిష్ ఇండియాలోనుండు ఎ అనువాఁడు వానిని ప్రోత్సాహపఱచుచున్నాఁడు. ఎ అనువాఁడు ఖూనీకి కుమ్మకు చేసినవాఁడగుచున్నాఁడు.

కుమ్మకుచెయ్యబడ్డ కార్యము ఆకుమ్మకును పట్టి జరిగినపక్షమున కున్ను ఆకుమ్మకును గురించిన శిక్షకు విశేషమయిన నిబంధన యేర్పాటు చెయ్యబడకుండా వున్నపక్షమునకున్ను కుమ్మకును గురించిన శిక్ష.

109. ఏదయినా నేరమునకు కుమ్మకుచేసే మనిషి, కుమ్మకు చెయ్యబడ్డకార్యము ఆ కుమ్మకును పట్టి జరిగించబడిన్ని అట్టి కుమ్మకు చేసినందుకుగాను శిక్షించబడగలందులకు యీ స్మృతివల్ల విశేష నిబంధన యేర్పాటుచెయ్యబడిన్ని వుండనిపక్షమునకు కుమ్మకుచెయ్యబడ్డ ఆ నేరమునకుగాను నిబంధన యేర్పాటుచెయ్యబడివుండే శిక్షవల్ల శిక్షించబడవలసినది.

**వివరణము.**—ఒక కార్యముగాని నేరముగాని దుర్బోధనవల్ల, లేక బందుకట్టును అనుసరించి, లేక కుమ్మకు అనే నేరమును యేర్పాటుచేసే కుమ్మకునవల్ల జరిగించబడ్డప్పుడు కుమ్మకునవల్ల జరిగించబడ్డట్టు చెప్పబడుతున్నది.

## దృష్టాంతములు.

(a) ఉద్యోగకార్యములు చెలాయించడములో తనకు వుపకారము చెయ్యవలసినదని A అనే మనిషి B అనే సర్కారునవుకరుకు బహుమానముగా లంచము యిస్తున్నాడు. B అనే మనిషి, ఆ లంచము పుచ్చుకొంటున్నాడు. ఇందువల్ల A అనే మనిషి, 161-వ సెక్షనులో వివరించబడివుండే నేరము చెయ్యడమునకు కుమ్మకుచేసినవాడవుతున్నాడు.

(b) A అనే మనిషి, తప్పుసాక్ష్యము చెప్పేలాగున B అనే మనిషికి దుర్బోధనచేస్తున్నాడు. B అనే మనిషి ఆ దుర్బోధనవల్ల ఆ నేరము జరిగిస్తున్నాడు. ఇందులో A అనే మనిషి ఆ నేరమునకు కుమ్మకుచేసినందునగురించి నేరస్థుడయి B అనే మనిషి పాత్రుడయ్యేశిక్షకు పాత్రుడవుతున్నాడు.

(c) A అనే మనిషిన్ని B అనే మనిషిన్ని Z అనే మనిషికి విషము పెట్టడమునకు కలిసి యేర్పాటుచేసుకొంటున్నారు. ఆట్టి యేర్పాటునుపటి A అనే మనిషి, Z అనే మనిషికి పెట్టడముకొరకు విషముసంపాదించి B అనే మనిషివద్ద యిస్తున్నాడు. ఆ యేర్పాటును అనుసరించి B అనే మనిషి, A అనే మనిషి గయరు హాజరుగావుండేకాలమందు Z అనే మనిషికి ఆ విషముపెట్టి అందువల్ల Z అనే మనిషికి మరణముకలగచేస్తున్నాడు. ఇందులో B అనే మనిషి ఖూనీనిగురించి నేరస్థుడవుతున్నాడు. A అనే మనిషి ఆ యేర్పాటులోకలిసి ఆ నేరమునకు కుమ్మకుచేసినందునగురించి నేరస్థుడయి ఖూనీనిగురించిన శిక్షకు పాత్రుడవుతున్నాడు.

*కుమ్మకుచెయ్యబడ్డ మనిషి, ఆ కుమ్మకుచేసేమనిషికి కలిగివున్న వుద్దేశముగాక యితర వుద్దేశమువల్ల ఒక కార్యము జరిగించినపక్షమునకు ఆ కుమ్మకును గురించిన శిక్ష.*

110. కుమ్మకుచెయ్యబడ్డమనిషి, తనకు కుమ్మకుచేసే మనిషికి కలిగివున్న వుద్దేశము, లేక యెరుక, యివిగాక వేరే యితరవుద్దేశముతోటి, లేక యెరుకతోటి కుమ్మకుచెయ్యబడ్డ కార్యము జరిగించినపక్షమునకు కుమ్మకుచేసేమనిషి తనకు కలిగివున్న వుద్దేశముతోటి, లేక యెరుకతోటి ఆ కార్యము జరిగించబడ్డయెడల అందువల్ల సంభవించే నేరమునుగురించి నిర్ణయించబడ్డ శిక్షవల్లమాత్రము శిక్షింపబడవలసినది.

ఒక కార్యము కుమ్మకుచెయ్యబడి మరియొక కార్యము జరిగించబడ్డప్పుడు. కుమ్మకు చేసినమనిషి పాత్రుడయ్యే శిక్ష.

111. కుమ్మకుచెయ్యబడ్డ కార్యముకాకుండా వేరే మరివొక కార్యము జరిగించబడ్డప్పుడు కుమ్మకుచేసేమనిషి అట్లాజరిగించబడ్డ కార్యమునకు తాను స్వతహాగా కుమ్మకుచేసివుంటే యేలాగో ఆలాగే ఆ కార్యము జరిగించిన తరహాదారీనిపట్టిన్ని అంతమాత్రమునకున్ను శిక్షార్హుడు కావలసినది:

నిబంధన.

అయితే చెయ్యబడ్డకార్యము ఆ కుమ్మకువల్ల సంభవించేదిగా వుండడమేకాకుండా కుమ్మకుచెయ్యడము అనే నేరము యేర్పాటుచేసిన బందుకట్టు సంబంధమయిన దుర్బోధనయొక్క బలమువల్లగాని దాని కుమ్మకువల్లగాని దాన్ని అనుసరించిగాని చెయ్యబడివుండవలసినది.

## దృష్టాంతములు.

(a) A అనే మనిషి, Z అనే మనిషియొక్క ఆహారవస్తువులలో విషమువేసే లాగున ఒక పిల్లవానికి బోధించి అందుకుగాను వానివద్ద విషము యిస్తున్నాడు. ఆ పిల్లవాడు ఆ దుర్బోధనమీద Z అనే మనిషియొక్క పక్కనువుండే Y అనే మనిషియొక్క ఆహారవస్తువులలో పొరబాటువల్ల ఆవిషము వేస్తున్నాడు. ఇందులో ఆ పిల్లవాడు A అనే మనిషియొక్క దుర్బోధనబలమునుపట్టి ఆ కార్యము జరిగించినపక్షమునకున్ను అట్లా జరిగించబడ్డ కార్యము అట్టి కుమ్మకువల్ల సంభవించగూడినదిగా వున్నపక్షమునకున్ను A అనే మనిషి, Y అనే మనిషియొక్క ఆహారవస్తువులలో ఆ విషము వేసేటట్టు ఆపిల్లకు దుర్బోధనచేసివుంటే యేలాగో ఆలాగే అదే తరహాననున్ను అంతమాత్రము శిక్షకున్ను పాత్రుడవుతున్నాడు.

(b) A అనే మనిషి Z అనే మనిషియొక్క యిల్లు తగలపెట్టవలసినదని B అనే మనిషికి దుర్బోధనచేస్తున్నాడు. B అనే మనిషి, ఆ యింటికి నిప్పుపెట్టి అప్పుడే అక్కడవుండే వస్తువులుకూడా దొంగిలుకొని పోతున్నాడు. A అనే మనిషి, ఆ యిల్లు తగలపెట్టేలాగున కుమ్మకుచెయ్యడమునుగురించి నేరస్థుడయినప్పటికిన్ని చోరీకి కుమ్మకుచేసినందునగురించి నేరస్థుడు కాడు; ఎందువల్లనంటే—ఆ చోరీ అనేది ఒక

ప్రత్యేకమయిన కార్యముగా వున్నదిగాని తగలపెట్టడమువల్ల సంభవించగూడినది కాదు.

(c) A అనే మనిషి, దోపిడి జరిగించడమునకుగాను అర్ధరాత్రిసమయమందు మనుష్యులు వాసముచేస్తూవుండే ఒక యింట్లో జొరబడేలాగున B అనే మనిషికిన్ని C అనే మనిషికిన్ని దుర్బోధనచేసి అందుకుగాను ఆయుధములు తెచ్చియిస్తున్నాడు. B అనే మనిషిన్ని C అనే మనిషిన్ని యింట్లోదూరి ఆ యింటిలో వాసముచేసేవారిలో ఒకడయిన Z అనే మనిషివల్ల యెదిరించబడ్డందున Z అనే ఆ మనిషిని ఖూనీ చేస్తున్నారు. ఇందులో ఆ ఖూనీ అనేది కుమ్మక్కునుపట్టి జరగగూడినదిగా వున్నపక్షమునకు A అనే మనిషి, ఖూనీనిగురించి నిర్ణయించబడ్డ శిక్షకు పాత్రుడుగా వుంటున్నాడు.

కుమ్మక్కుచేసేమనిషి, కుమ్మక్కుచెయ్యబడ్డ కార్యముకొరకున్ను జరిగించబడ్డ కార్యముకొరకున్ను జంటింపు శిక్షకు యెప్పుడు పాత్రుడవుతున్నాడు.

112. ఏకార్యమునుగురించి కుమ్మక్కుచేసిన మనిషి యింతకుముందు అన్వయహితముగావుండే సెక్షనుప్రకారము శిక్షార్హుడవుతున్నాడో అట్టికార్యము కుమ్మక్కుచెయ్యబడ్డ కార్యమునకు తోడుగా జరిగించబడిన ఒక ప్రత్యేకమయిన నేరముగు ఏర్పాటుచేసేయెడల కుమ్మక్కుదారుడు, అట్టి ప్రతి నేరమునుగురించి శిక్షకు పాత్రుడవుతున్నాడు.

దృష్టాంతము.

ఏ అనే మనిషి, ఒక పబ్లిక్ వుద్యోగస్థుడు జప్తుచేసేటప్పుడు బలాత్కారముగా యెదిరించేలాగున బి అనే మనిషికి దుర్బోధనచేస్తున్నాడు. ఆ దుర్బోధనవల్ల బి అనే మనిషి ఆ జప్తు చెయ్యబడకుండా యెదిరించుతున్నాడు. అట్లా యెదిరించడములో బి అనే మనిషి ఆ జప్తుచేసే ఆఫీసరుకు స్వేచ్ఛగా బలమయినఘాత కగలచెయించుతున్నాడు. ఇందులో బి అనే మనిషి, జప్తుచెయ్యబడకుండా యెదిరించడమనే నేరమున్ను స్వేచ్ఛగా బలమయినఘాత కలగచెయ్యడమనే నేరమున్ను యీ రెండున్ను జరిగించినందున బి అనేమనిషి, రెండు నేరములనుగురించిన్ని శిక్షకు పాత్రుడవుతున్నాడు; గనుక బి అనేమనిషి, జప్తుచెయ్యబడకుండా యెదిరించడమందు స్వేచ్ఛగా బలమైన ఘాత కలగచేస్తాడని ఏ అనేమనిషి యెరిగివున్నపక్షమునకు ఏ అనేమనిషికూడా అట్టి ప్రతి నేరమునుగురించిన్ని శిక్షకు పాత్రుడవుతున్నాడు.

113. కుమ్మకుదారునివల్ల ఒక విశేషమయిన పర్యవసానము సంభవింపచెయ్యవలెననే వుద్దేశముతో ఒక కార్యమునకు కుమ్మకుచెయ్యబడి కుమ్మకుద్వారా అతను శిక్షార్హుడయ్యే ఒక కార్యమువల్ల అతడు వుద్దేశించినదిగాక మరియొకటి పర్యవసించినపక్షమునకు కుమ్మకుదారుడు, కుమ్మకుచెయ్యబడ్డ కార్యమువల్ల అట్టి పర్యవసానము సంభవించవచ్చునని యెరిగివున్నయెడల ఆ పర్యవసానమే సంభవింపచెయ్యవలెననే వుద్దేశముతో ఆ కార్యమునకు అతను కుమ్మకుచేసివుంటే యేలాగో ఆలాగే అందుల తరహాదాకినిపట్టిన్ని అంతమాత్రమునకున్ను సంభవించిన పర్యవసానమునుగురించి శిక్షార్హుడుకావలసినది.

కుమ్మకుచెయ్యబడ్డ కార్యమువల్ల కుమ్మకుదారుడు వుద్దేశించినదిగాక మరియొకటి పర్యవసించిన పక్షమునకు అందునగురించి కుమ్మకుదారుడు శిక్షార్హుడుకావలసినది

దృష్టాంతము.

A అనేమనిషి Z అనేమనిషికి బలమయినఘాతకలగచేసేలాగున B అనేమనిషికి దుర్బోధన చేస్తున్నాడు. ఈ దుర్బోధనవల్ల B అనేమనిషి, Z అనేమనిషికి బలమయిన ఘాతకలగచేసినందున ఆ Z అనేమనిషి చనిపోతున్నాడు. ఇందులో A అనేమనిషి, తనవల్ల కుమ్మకుచెయ్యబడ్డ బలమైన ఘాత అనేది మరణము కలగచెయ్యడమునకు తగినది అని యెరిగివున్నపక్షమునకు ఖూనినిగురించి నిర్ణయించబడివుండే శిక్షవల్ల శిక్షించబడడమునకు పాత్రుడవుతున్నాడు.

114. నేరము హాజరుగావుండిన్ని కుమ్మకుదారుడుగా శిక్షించబడడమునకు పాత్రుడుగావుండే యేమనిషి అయినా, కుమ్మకుచెయ్యడమునుగురించి తాను శిక్షించబడతగ్గ కార్యముగాని నేరముగాని జరిగినప్పుడు హాజరుగావున్నయెడల ఆ మనిషి తానే అట్టి కార్యముగాని నేరముగాని చేసినట్టు యెంచబడవలసినది.

కుమ్మకుదారుడు నేరము జరిగించబడేటప్పుడు హాజరుగా వుండడము.

115. మరణమువల్లగాని యావజ్జీవము ద్వీపాంతరవాసమువల్ల గాని శిక్షించబడతగ్గ ఒక నేరము జరిగించడమునకు కుమ్మకుచేసే యేమనిషి అయినా, ఆ నేరము కుమ్మకువల్ల జరిగించబడనిపక్షమునకున్ను అట్టి కుమ్మకు యొక్క శిక్షకుగాను యీ స్మృతివల్ల విశేషమయిన నిబంధన యేర్పాటుచెయ్యబడివుండనిపక్షమునకున్ను యేడుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలము వరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్ల శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడుకావలసినది;

మరణమువల్లగాని యావజ్జీవము ద్వీపాంతర వాసమువల్లగాని శిక్షించబడతగ్గ నేరమునకు కుమ్మకుచేయుట — నేరము జరగని యెడల;

కుమ్మకునుగురించి కుమ్మకుదారుడు శిక్షార్హుడయ్యేటటువంటిన్ని యేమనిషికయినా ఘాత కలగచేసేటటువంటిన్ని యే దయినా కార్యము జరిగించబడ్డపక్షమునకు ఆ కుమ్మకుదారుడు, పద్నాలుగు సంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్ల శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడు కావలసినది.

అందువల్ల చెరుపు కలగచేసే కార్యము జరిగించబడ్డయెడల.

దృష్టాంతము.

A అనేమనిషి Z అనేమనిషిని ఖూనీచెయ్యవలసినదని B అనేమనిషికి ప్రోత్సాహము చేస్తున్నాడు. ఆ నేరము జరిగించబడలేదు. B అనేమనిషి Z అనేమనిషిని ఖూని చేసివున్నపక్షమునకు అతను మరణదండనకుగాని యావజ్జీవము ద్వీపాంతరవాసమునకు గాని పాత్రుడయివుండును గనుక, A అనేమనిషి యేడుసంవత్సరములకు వ్యాపించ గూడిన కాలమువరకు ఖయిదుకున్ను జుల్మానాకున్ను పాత్రుడవుతున్నాడు; కుమ్మకు చెయ్యడమువల్ల Z అనేమనిషికి యేదయినా ఘాత సంభవించివున్నపక్షమునకు పద్నాలుగు సంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు ఖయిదుకున్ను జుల్మానాకున్ను అతడు పాత్రుడగుతున్నాడు.

116. ఖయిదువల్ల శిక్షించబడతగ్గ ఒక నేరమునకు కుమ్మకుచేసే యే మనిషి అయినా, ఆ నేరము కుమ్మకునుపట్టి జరి

ఖయిదువల్ల శిక్షిం

చబడతగ్గ నేరమునకు కుమ్మక్కు చేయడము-నేరము జరగనియెడల;

గించబడకపోయినపక్షమునకున్ను అట్టి కుమ్మక్కును గురించి శిక్షించడమునకు యీ స్మృతివల్ల విశేషమయిన నిబంధన యేర్పాటుచెయ్యబడక వున్నపక్షమునకున్ను ఆ నేరమునకుగాను నిర్ణయించబడ్డ ఖయిదు తాలూకు అన్నిటికంటె గొప్పఅయినకాలములో నాలుగింటిలో ఒకపాలుకు వ్యాపించగూడిన కాలమువరకు ఆ నేరమునకుగాను నిర్ణయించబడివుండే రెండు తరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని ఆ నేరమునకుగాను నిర్ణయించబడివుండే జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది:

కుమ్మక్కుచేసేమనిషి, లేక కుమ్మక్కుచెయ్యబడ్డమనిషి, నేరము జరగకుండా ఆపవలసినపని తనదిగావుండే పబ్లిక్ వుద్యోగస్థుడు అయినయెడల.

మరిన్ని కుమ్మక్కుచేసేమనిషి, లేక కుమ్మక్కుచెయ్యబడ్డమనిషి, ఆ నేరము జరగకుండా ఆపవలసినపని తనదిగావుండే పబ్లిక్ వుద్యోగస్థుడు అయినయెడల, ఆ కుమ్మక్కు చేసేమనిషి ఆ నేరముకొరకు నిర్ణయించబడివుండే అన్నిటికంటె గొప్ప అయిన కాలములో రెంటిలో ఒకపాలుకు వ్యాపించగూడిన కాలమువరకు ఆ నేరమునుగురించి నిర్ణయించబడివుండే రెండుతరహాల లో ఒకతరహా ఖయిదువల్లగాని ఆ నేరమునకుగాను నిర్ణయించబడివుండే జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

## దృష్టాంతములు.

**(a)** ఉద్యోగకార్యములు చెలాయించడములో తనకు ఉపకారము చెయ్యవలసినదని ఎ అనేమనిషి బి అనే సర్కారు వుద్యోగస్థునికి బహుమానముగా యేమైనా లంచము యిస్తున్నాడు. బి అనేమనిషి, ఆ లంచము పుచ్చుకోవడము లేదంటున్నాడు. ఇందులో ఎ అనేమనిషి, యీ సెక్షన్ ప్రకారము శిక్షించబడడమునకు తగివుంటున్నాడు.

**(b)** ఎ అనేమనిషి తప్పుసాక్ష్యము చెప్పేలాగున బి అనేమనిషికి దుర్బోధన చేస్తున్నాడు. ఇందులో బి అనేమనిషి తప్పుసాక్ష్యము చెప్పకపోయినప్పటికిన్ని ఎ అనే

మనిషి యీ సెక్షనులో నిర్ధారణచెయ్యబడ్డ నేరము జరిగించినవాడు అవుతున్నాడు. గనుక అదేప్రకారము అతడు శిక్షించబడవలసినది.

(c) దోపిడి జరగకుండా ఆపడము తనపనిగావుండే పోలీస్ ఆఫీసరయిన ఏ అనే మనిషి, దోపిడికి కుమ్మక్కు చేస్తున్నాడు. అందులో దోపిడి జరగకపోయినా ఏ అనే మనిషి, ఆ దోపిడి నేరముకొరకు నిర్ధారణచెయ్యబడివుండే అన్నిటికంటె గొప్పయిన కాలములో రెంటిలో ఒకపాలు ఖయిదుకున్ను జుల్మానాకున్ను పాత్రుడవుతున్నాడు.

(d) దోపిడి నేరము జరగకుండా ఆపడము తనపనిగావుండే పోలీస్ ఆఫీసర్ అయిన ఏ అనే మనిషివల్ల దోపిడి జరిగించబడేటందుకు బి అనే మనిషి కుమ్మక్కు చేస్తున్నాడు. అందులో దోపిడి జరగకపోయినా బి అనేమనిషి ఆ దోపిడి నేరముకొరకు నిర్ధారణచెయ్యబడివుండే అన్నిటికంటె గొప్పయిన కాలములో రెంటిలో ఒకపాలు ఖయిదుకున్ను జుల్మానాకున్ను పాత్రుడవుతున్నాడు.

జనులవల్ల, లేక పదింటికన్నా యెక్కువమందివల్ల నేరము జరిగించబడేటందుకు కుమ్మక్కు.

117. సాధారణముగా జనులవల్లగాని పదిమందికన్నా యెక్కువ సంఖ్యగల యే తరగతి మనుష్యులవల్లనయినాగాని ఒక నేరము జరిగించబడుటకు కుమ్మక్కు చేసే యేమనిషి అయినా, మూడుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒక తరహా ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

దృష్టాంతము.

ఏ అనేమనిషి, ఒక ఊరేగింపు జరుగుతూవుండేటప్పుడు ఆ ఊరేగేవారిమీద దొమ్మిచెయ్యడముకొరకు ఒక నిర్ణయమైనకాలమందున్ను స్థలమందున్ను పదిమందికంటె యెక్కువమంది జనులను కలిగివుండే యేదయినా గొడవ తాలూకు మనుష్యులు పోగు అయ్యేలాగున ప్రోత్సాహనచేసే ఒక యిస్తిహారినామా ఒక వెల్లడైన స్థలమందు అంటిస్తున్నాడు. ఏ అనేమనిషి, యీ సెక్షనులో నిర్ధారణచెయ్యబడ్డ నేరము జరిగించినవాడవుతున్నాడు.

మరణమువల్లగాని యావజ్జీవము ద్వీపాంతరవాసము వల్లగాని శిక్షించబడ వలసిన నేరము జరిగించవలెననే వుద్దేశము దాచడము;

118. మరణమువల్లగాని యావజ్జీవము ద్వీపాంతరవాసమువల్లగాని శిక్షించబడవలసిన యేదయినా నేరమును సులభపరచవలెననే వుద్దేశముతోటిగాని తాను అందువల్ల ఆ నేరము జరిగించడమును సులభపరచవచ్చునని యెరిగివుండిగాని,

యేదయినా కార్యము జరిగించడమువల్ల, లేక న్యాయశాస్త్రవిరోధమయిన లోపము సంభవింపచెయ్యడమువల్ల అట్టి నేరము జరిగించవలెననే వుద్దేశమును స్వేచ్ఛగా దాచే, లేక అట్టి వుద్దేశమును గురించి అవాస్తవముగా వున్నట్టు తాను యెరిగివుండే యేదయినా సమాచారము తెలియచేసే యే మనిషి అయినా,

నేరము జరిగించబడ్డయెడల; నేరము జరిగించబడనియెడల.

ఆ నేరము జరిగించబడ్డపక్షమునకు యేడుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒక తరహా ఖయిదువల్లగాని లేక నేరము జరిగించబడనియెడల మూడుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒక తరహా ఖయిదువల్లగాని శిక్షించబడవలసినది; పయిగా యీ రెండు సంగతులలోనున్న జుల్మానాకుకూడా పాత్రుడుకావలసినది.

## దృష్టాంతము.

ఎ అనేమనిషి బి అనే స్థలమందు బందిపోటు జరగబోతున్నదని తెలిసివుండిన్ని అక్కడికి యెదటివైపునవుండే సి అనే స్థలమందు ఒక బందిపోటు జరగబోతున్నదని మేజిస్ట్రేటువారికి తప్పుసమాచారము తెలియచేసి అందువల్ల ఆ నేరమును సులభపరచవలెననే వుద్దేశముతో మేజిస్ట్రేటువారిని భ్రమపెట్టుతున్నాడు. చేసుకొన్న వుద్దేశప్రకారము బి అనే స్థలమందు ఆ బందిపోటు జరిగించబడ్డది. ఎ అనే మనిషి, యీ సెక్షన్ ప్రకారము శిక్షించబడవలసినవాడు అవుతున్నాడు.

ఆపడము తనపని గావుండే నేరము జరిగించవలెననే వుద్దేశమును దాచే పబ్లిక్ వుద్యోగస్థుడు;

119. తాను పబ్లిక్ వుద్యోగస్థుడుగావుండి నేరము జరగకుండా ఆపడము తనపనిగావుండే ఒక నేరమును సులభపరచవలెననే వుద్దేశముతోగాని తాను అందువల్ల సులభపరచవచ్చునని యెరిగివుండిగాని,

యేకయినా కార్యమువల్ల, లేక న్యాయశాస్త్రవిరోధమయిన లోపమువల్ల అట్టి నేరము జరిగించవలెనని కలిగివుండే వుద్దేశమును స్వేచ్ఛగా దాచే, లేక అట్టి వుద్దేశమునుగురించి అవాస్తవముగా వున్నట్టు తాను యెరిగివుండే యేకయినా సమాచారమును తెలియచేసే యే మనిషి అయినా,

నేరము జరిగించబడ్డయెడల;

ఆ నేరము జరిగించబడ్డపక్షమునకు ఆ నేరమునకుగాను నిర్ణయించబడ్డ అన్నిటికంటె గొప్ప అయిన ఖయిదు కాలములో రెంటిలో ఒకపాలుకు వ్యాపించగూడిన కాలమువరకు ఆ నేరమునకుగాను నిర్ణయించబడివుండే రెండు తరహాలలో ఒక తరహా ఖయిదువల్లగాని ఆ నేరమునకుగాను నిర్ణయించబడివుండే జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది;

నేరము, మరణము వగైరాలవల్ల శిక్షించబడవలసినదిగా వున్న యెడల;

లేక ఆ నేరము మరణమువల్లగాని యావజ్జీవము ద్వీపాంతరవాసమువల్లగాని శిక్షించబడవలసినది అయివున్నయెడల పదిసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒక తరహా ఖయిదువల్ల శిక్షించబడవలసినది;

లేక నేరము జరిగించబడనియెడల ఆ నేరమునకుగాను నిర్ణ

నేరము జరిగించ బడనియెడల.

యించబడ్డ అన్నిటికంటె గొప్ప అయిన ఖయిదు కాలములో నాలుగింట్లో ఒకపాలుకు వ్యాపించే కాలమువరకు ఆ నేరమునకుగాను నిర్ణయించబడివుండే రెండుతరహాల లో ఒకతరహా ఖయిదువల్లగాని ఆ నేరమునకుగాను నిర్ణయించబడి వుండే జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

దృష్టాంతము.

పోలిస్ ఆఫిసరుఅయిన ఎ అనేమనిషి, దోపిడినిగురించి తనకు తెలియవచ్చే దరోబస్తు వుద్దేశములతాలూకు సంగతులు న్యాయశాస్త్రరీత్యా తెలియచేసేలాగన బద్ధుడయివుండిన్ని బి అనేమనిషి దోపిడి జరిగించడమునకు వుద్దేశిస్తున్నాడని యెరిగి వుండిన్ని ఆట్టి నేరమును సులభపరచవలెననే వుద్దేశముతో దాన్నిగురించి తెలియ చెయ్యకుండా పోతున్నాడు. ఇంతలో ఎ అనేమనిషి న్యాయశాస్త్రవిరోధమయిన లోపముద్వారా బి అనేమనిషికి కలిగివుండే వుద్దేశమును దాచినాడు గనుక యీ సెక్షన్ తాలూకు నిబంధనలనుపట్టి శిక్షకు పాత్రుడవుతున్నాడు.

ఖయిదువల్ల శిక్షించబడవలసిన నేరము జరిగించవలెననే వుద్దేశము దాచడము;

120. ఖయిదువల్ల శిక్షించబడవలసిన యే దయినా నేరమును సులభపరచవలెననే వుద్దేశము తోటిగాని తాను అందువల్ల సులభపరచవచ్చునని యెరిగివుండిగాని,

యేదయినా కార్యమువల్ల, లేక న్యాయశాస్త్రవిరోధమయిన లోపమువల్ల అట్టి నేరము జరిగించడమునుగురించి కలిగివుండే వుద్దేశ మును స్వేచ్ఛగాదాచే, లేక అట్టి వుద్దేశమునుగురించి అవాస్తవముగా వున్నట్టు తాను యెరిగివుండే యేదయినా సమాచారము తెలియచేసే యే మనిషి అయినా,

నేరము జరిగించబడ్డయెడల ఆ నేరమునకుగాను నిర్ణయించబడి

నేరము జరిగించ బడ్డయెడల;

వుండే తరహాదారీగల అన్నిటికంటె గొప్ప అయిన ఖయిదుకాలములో నాలుగింట్లో ఒకపాలుకున్ను

నేరము జరిగించ బడనియెడల. నేరము జరిగించబడనియెడల అందులో యినిమిదింట్లో ఒకపాలుకున్ను వ్యాపించేకాలమువరకు శిక్షమువల్లగాని ఆ నేరమునకుగాను నిర్ణయించబడిన్ని జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

---

## 5-A వ అధ్యాయము.

### నేరముతోగూడిన బందకట్టు.

నేరముతోగూడిన బందకట్టు అనుదాని నిర్వచనము. **120-A.** ఇద్దరు మనుష్యులుగాని ఇద్దరికంటె నెక్కువ మనుష్యులుగాని చేరి

(1) శాసన విరుద్ధమయిన పనినో, లేదా

(2) శాసన విరుద్ధముకాని పనిని, శాసనవిరుద్ధములగు సాధనములచేతనో

చేయుటకుగాని చేయించుటకుగాని, ఒడంబడిక చేసుకొన్నయెడల, అట్లు చేరి చేసుకొన్న ఒడంబడిక నేరముతోగూడిన బందకట్టు అని చెప్పబడును:

కాని, నేరమును చేయునిమిత్తము చేసుకొన్న ఒడంబడికతప్ప వేరే యే యొడంబడిక అయినను, సదరు ఒడంబడిక కాకుండ అట్టి యొడంబడికకు పార్టీలుగానుండే ఒక్కరో ఎక్కువమందియో, దానిని బట్టి యేదో ఒకపనిని చేసియుంటేనేతప్ప, నేరముతోగూడిన బందకట్టు కానేరదు.

**వివరణము.**—శాసన విరుద్ధమయిన సదరు పని అట్టి యొడంబడిక తాలూకు కడపటియుద్దేశమో లేదా ఆ యుద్దేశముతో ఊరక సంబంధించినదో అనునది ముఖ్యాంశముకాదు.

120-B. (1) మరణమువల్లగాని, ద్వీపాంతరవాసమువల్లగాని, రెండుసంవత్సరములు లేదా ఎక్కువకాలమువరకు కఠినమయిన ఖయిదువల్లగాని శిక్షింపదగ్గ నేరమును చేయుటకై నేరముతోగూడిన బందుకట్టుకు పార్టీగానుండు వాడెవడయినను, అట్టి బందుకట్టుకై శిక్షించుటకు ఈ స్మృతియందు స్పష్టమయిన నిబంధన ఏదిన్ని చేయబడియుండనిపక్షమున, తాను అట్టి నేరమునకు కుమ్మకుచేసియుండిన నట్లో అట్లే శిక్షింపబడవలెను.

నేరముతోగూడిన బందుకట్టుకు శిక్ష.

(2) పైనిచెప్పిన విధమున శిక్షింపదగ్గ నేరమును చేయునిమిత్తమయిన నేరముతోగూడిన బందుకట్టుకానట్టి వేరే నేరముతోగూడిన బందుకట్టుకు పార్టీగానుండే ఎవడయినను, ఆరుమాసములకు మించని కాలమువరకు రెండుతరహాలలో నొక తరహా ఖయిదువల్లగాని, జుల్మానావల్లగాని ఈ రెంటివల్లగాని శిక్షింపబడవలెను.

---

## 6-వ అధ్యాయము.

### సంస్థానమునకు విరోధముగా జరిగించబడే నేరములనుగురించి.

121. శ్రీ రాణిగారిమీద దండెత్తే, దండెత్తవలెనని యత్నముచేసే, లేక దండెత్తడమునకు కుమ్మకుచేసే యే మనిషి అయినా, మరణమువల్లగాని యావజ్జీవము ద్వీపాంతరవాసమువల్లగాని శిక్షించబడడమేగాకుండా అతనిజాలూకు యావదాస్తిన్ని దండుగకింద పుచ్చుకోబడవలసినది..

శ్రీ రాణిగారిమీద దండెత్తడము, లేక దండెత్తవలెనని యత్నించడము, లేక అందుకు కుమ్మకు చెయ్యడము.

### దృష్టాంతములు.

(a) ఎ అనే మనిషి, శ్రీ రాణిగారిమీద చెయ్యబడే కలహములో కలుస్తున్నాడు. ఎ అనే మనిషి, యీ సెక్షనువల్ల నిర్ధారణ చెయ్యబడ్డ నేరము జరిగించినవాడవుతున్నాడు.

(b) ఇండియాలోవుండే ఏ అనే మనిషి, కలహగాండ్లకు ఆయుధములు పంపడమువల్ల సిలోనులో శ్రీ రాణిగారి గవర్న్మెంటుమీద జరిగే కలహమునకు కుమ్మకు చేస్తున్నాడు. ఏ అనే మనిషి, శ్రీ రాణిగారిమీద దండెత్తడమునకు కుమ్మకు చేసిన దానిగురించి నేరస్థుడవుతున్నాడు.

121-వ సెక్షనును బట్టి శిక్షింపబడతగిన నేరములను జరిగించడానికిగాను బందు కట్టు కట్టుటను.

121-A. బ్రిటిష్ ఇండియాకు లోపునైనా వెలుపటనైనా సరే యే మనిషి అయినా 121-వ సెక్షనునుబట్టి శిక్షింపబడతగిన నేరములలో దేన్ని అయినా జరిగించడమునకుగాని బ్రిటిష్ ఇండియాయొక్క లేక అందులో యేదైనా భాగముయొక్క ప్రభుత్వమును శ్రీ మహారాణీగారికి లేకుండా చేయడమునకుగాని బందుకట్టు కట్టిన పక్షమునకు అయినా నేరముగల బలవంతము జరిగించి లేక నేరముగల బలవంతము జరిగించేటట్టు కనపరచి ఇండియా గవర్న్మెంటువారినిగాని మరి యే లోకల్ గవర్న్మెంటువారిని అయినాగాని జడిపించగలందులకు బందుకట్టుకట్టినపక్షమునకు అయినా యావజ్జీవము వరకు లేక అంతకంటె తక్కువగావుండే యేదైనా కాలమువరకు ద్వీపాంతరవాసమునకుగాని పది సంవత్సరములకు మించని కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదుకుగాని శిక్షింపబడవలసినది.

వివరణము.—ఈ సెక్షనునుబట్టి బందుకట్టు కట్టబడి యేర్పాటుచేయడమునకు ఆ బందుకట్టు విషయమై కార్యము జరిగించిగాని న్యాయశాస్త్రము జరిగించకుండాపోయిగాని వుండవలెన

122. శ్రీ [illegible]గారిమీద

యుద్ధముతో ఆయుధ ములు వగయిరాలు పోగుచెయ్యడము.

సామగ్రిని పోగుచేసిన, లేక మరియొకతరహాగా దండెత్తడమునకు తయారుచేసే యే మనిషి అయినా, యావజ్జీవము ద్వీపాంతరవాసమువల్లగాని పదిసంవత్సరములకు మించని కాలమువరకు రెండుతరహాలలో ఒక తరహా ఖయిదువల్లగాని శిక్షించబడడమేగాకుండా అతని తాలూకు యావదాస్తిన్ని దండుగకింద పుచ్చుకోబడవలసినది

దండెత్తవలెననే యత్నము సులభపరచవలెననే వుద్దేశముతో దాచడము.

123. దండెత్తవలెననే యత్నము దాచడమువల్ల ఆ యత్నమునకు సౌలభ్యము కలగవలెననే వుద్దేశముతో యిట్టి అట్టి దాచడమువల్ల సౌలభ్యము కలగవచ్చునని యెరిగివుండిన్ని శ్రీ రాణిగారిమీద దండెత్తడమునకు కలిగివుండే యత్నము యేదయినా కార్యమువల్లగాని న్యాయశాస్త్రవిరోధమయిన లోపమువల్లగాని దాచే యే మనిషి అయినా, పదిసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒక తరహా ఖయిదువల్ల శిక్షించబడడమేగాకుండా జుల్మానాకున్ను పాత్రుడుకావలసినది.

న్యాయశాస్త్రప్ర... ...న యేదైనా ...చెలా...

124. ఇండియా దేశపు శ్రీ గవర్నర్ జనరల్ గారు, యే రాజధానియొక్క అయినా శ్రీ గవర్నరుగారు, లెఫ్టినెంట్ గవర్నరుగారు, లేక ఇండియా దేశపు గవర్నరు జనరల్ గారి కవున్సిల్ యొక్కగాని యే ...ధాని తాలూకు అయినా కవున్సిల్ యొక్క ...రుగారు, వీరు తమ తాలూకు న్యాయ ...మయిన అధికారములు యే తరహా ...లాయించేల... లేక చెలాయిం...

వారిమీద దొమ్మిచేసే, లేక అక్రమముగా బలవంతపెట్టే, లేక అక్రమముగా బలవంతపెట్టవలెనని యత్నించే, లేక నేరముగల బలవంతమువల్లగాని నేరముగల బలవంతము కనపరచడమువల్లగాని జడిపించే, లేక జడిపించవలెనని యత్నించే యే మనిషి అయినా,

ఏడుసంవత్సరములకు వ్యాపించగూడినకాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్ల శిక్షించబడడమేగాకుండా జుల్మానాకున్ను పాత్రుడుకావలసినది.

124-A. పలుకఁబడినట్టి లేక వ్రాయఁబడినట్టి మాటలవల్లఁగాని లేక సైగలవల్లఁగాని లేక ప్రత్యక్షముగా కనఁబడు రూపమువల్లఁగాని మఱి యే విధముగాఁగాని శ్రీరాణిగారియెడలనైనను లేక బ్రిటిష్ ఇండియాలో చట్టమునుబట్టి స్థాపింపఁబడియుండు, గవర్న్మెంటువారియెడలనైనను ఏ మనుష్యుఁడైన ద్వేషమునైనను తిరస్కారమునైనను కలుగఁజేసినయెడల లేక కలుగఁజేయుటకు ప్రయత్నించినయెడల, లేక అహితత్వమును కలుగఁజేసినయెడల లేక కలుగఁజేయుటకు ప్రయత్నించినయెడల, అతఁడు జుల్మానాసహితముగఁగాని జుల్మానా లేకుండఁగాని యావజ్జీవముపకయినను అంతకంటె తక్కువకాలముపకయినను, ద్వీపాంతరవాసముతోఁగాని, జుల్మానా సహితముగఁగాని జుల్మానా లేకుండఁగాని మూఁడు సంవత్సరములమట్టుకు కయిదుతోఁగాని, లేక జుల్మానాతోఁగాని, శిక్షింపఁబడవలయును.

రాజద్రోహము.

వివరణము.—(1) "అహితత్వము" అను మాటలో రాజభక్తి హీనతయును శత్రుత్వమనోభావములన్నియును చేరను.

వివరణము.—(2) ద్వేషమునుగాని తిరస్కారమునుగాని అహితత్వమునుగాని కలుగఁజేయకుండ లేక కలుగఁజేయుటకు ప్రయత్నింపకుండ, గవర్న్మెంటువారి కార్యములను చట్టము సమ్మతమయిన విధ

మున నూర్పించవలయుననెడి యుద్దేశముతో సదరు కార్యముల విష యమై అసమ్మతిని తెలుపుచు చేయఁబడు వ్యాఖ్యలు ఈ సెక్షనునుబట్టి నేరముగా నేర్పడవు.

వివరణము.—(3) ద్వేషమును, తిరస్కారమును లేక అహితత్వ మును కలుగఁజేయకుండను కలుగఁజేయుటకు ప్రయత్నింపకుండను గవర్న్మెంటువారి పరిపాలన కార్యమునకుఁగాని మఱి యే కార్యమున కుఁగాని అసమ్మతిని తెలుపుచు చేయఁబడు వ్యాఖ్యలు యీ సెక్షనును బట్టి నేరముగా నేర్పడవు.

125. శ్రీ రాణిగారితోటి ఒడంబడిక చేసుకొనివుండే లేక సమాధానముగావుండే ఏషియాలోని యే రాజ్యమువారిమీద నయినా దండెత్తే, లేక దండెత్తవలెనని యత్నించే, లేక అట్లా దండెత్తడమునకు కుమ్మకుచేసే యే మనిషి అయినా, యావజ్జీవము ద్వీపాంతరవాసము వల్ల శిక్షించబడడమేగాకుండా జుల్మానా కూడా వెయ్యబడవచ్చును, లేక యేడుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్ల శిక్షించబడడమేగాకుండా జుల్మానాకూడా వెయ్యబడవచ్చును, లేక జుల్మానా (మాత్రము) వెయ్యబడవచ్చును

శ్రీ రాణిగారితో ఒడంబడిక చేసుకొని వుండే ఏషియాలోని యే రాజ్యమువారిమీదనయినా దండెత్తడము.

126. శ్రీ రాణిగారితో ఒడంబడికచేసుకొని, లేక సమాధానముగావుండే యే రాజ్యములవారి దేశములలోనయినా లూటీచేసే, లేక లూటీచెయ్యడమునకు సన్నాహములుచేసే యే మనిషి అయినా, యేడు సంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్ల శిక్షించబడి జుల్మానాకున్ను అట్టి లూటీ

శ్రీ రాణిగారితోటి సమాధానముగా వుండే రాజ్యమువారి దేశములలో లూటీ చెయ్యడము.

చెయ్యడములో వాడుకోబడ్డ, లేక వాడుకోవలెనని వుద్దేశించబడ్డ, లేక అట్టి లూటీవల్ల పొందబడ్డ యేదైనా ఆస్తి దండుగకింద పోగొట్టుకోవడమునకున్ను కూడా పాత్రుడు కావలసినది.

125, 126-వ సెక్షనులలో నమూదు చెయ్యబడ్డ యుద్ధము వల్లగాని లూటీవల్లగాని పొందబడ్డ ఆస్తి పుచ్చుకోవడము.

127. 125, 126 సెక్షనులలో నమూదుచెయ్యబడ్డ నేరములలో యేదయినా జరిగించడమందు పొందబడ్డట్టు తాను యెరిగివుండే యేదయినా ఆస్తి పుచ్చుకొనే యే మనిషి అయినా, యేడు సంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒక తరహా ఖయిదువల్ల శిక్షించబడడమేగాకుండా జుల్మానాకున్ను అట్లా పుచ్చుకోబడ్డ ఆస్తి దండుగకింద పోగొట్టుకోవడమునకున్ను పాత్రుడు కావలసినది.

సంస్థానము తాలూకు, లేక యుద్ధములో పట్టుకోబడ్డ, ఖయిదీని స్వేచ్ఛగా తప్పించుకొని పోనిచ్చే పబ్లిక్ వుద్యోగస్థుడు.

128. సంస్థానమునకు విరోధముగా నేరముచేసిన ఖయిదీని, లేక యుద్ధములో పట్టుకోబడ్డ ఖయిదీని, తన స్వాధీనమందు వుంచుకొనివుండి అట్టి ఖయిదీ ఖయిదుచెయ్యబడివుండే యే స్థలములోనుంచి అయినా స్వేచ్ఛగా తప్పించుకొని పారిపోనిచ్చే పబ్లిక్ వుద్యోగస్థుడు అయిన యే మనిషి అయినా, యావజ్జీవము ద్వీపాంతరవాసమువల్లగాని పదిసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని శిక్షించబడడమేగాకుండా జుల్మానాకున్ను పాత్రుడు కావలసినది.

అట్టి ఖయిదీని అశ్రద్ధవల్ల తప్పించుకొని పోనిచ్చే పబ్లిక్ వుద్యోగస్థుడు.

129. సంస్థానమునకు విరోధముగా నేరముచేసిన ఖయిదీని, లేక యుద్ధములో పట్టుకోబడ్డ ఖయిదీని, తన స్వాధీనమందు వుంచుకొనివుండి అట్టి ఖయిదీ ఖయిదు చెయ్యబడివుండే ఖయిదుఖానాలోనుంచి అశ్రద్ధ

వల్ల తప్పించుకొని పారిపోనిచ్చే పబ్లిక్ వుద్యోగస్థుడు అయిన యే మనిషి అయినా, మూడు సంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు సాధారణమయిన ఖయిదువల్ల శిక్షించబడడమేగాకుండా జుల్మానాకు కూడా పాత్రుడు కావలసినది.

అట్టి ఖయిదీ తప్పించుకొని పారిపోవడమునకు కుమ్మకు చెయ్యడము, బలాత్కారముగా విడదల కలగచెయ్యడము, లేక అతనికి స్థలము యివ్వడము.

130. సంస్థానమునకు విరోధముచేసిన ఖయిదీ, లేక యుద్ధములో పట్టుకోబడ్డ ఖయిదీ న్యాయశాస్త్ర సమ్మతమయిన ఖయిదులోనుంచి తప్పించుకొని పారిపోవడమందు యెరిగివుండి కుమ్మకు లేక మద్దతుచేసే, లేక అట్టి యే ఖయిదీని అయినా బలాత్కారముగా విడదల చేసే, లేక అట్లా విడదలచెయ్యవలెనని ప్రయత్నము చేసే, లేక న్యాయశాస్త్రసమ్మతమయిన ఖయిదులోనుంచి తప్పించుకొని పారిపోయిన అట్టి యే ఖయిదీకి అయినా స్థలముయిచ్చే, లేక అతన్ని దాచే, లేక అట్టి ఖయిదీని తిరిగీ పట్టుకొనేటప్పుడు యెదిరించే, లేక యెదిరించవలెనని ప్రయత్నముచేసే యే మనిషి అయినా, యావజ్జీవ ద్వీపాంతరవాసమువల్లగాని పదిసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడు కావలసినది.

వివరణము.—బ్రిటిష్ ఇండియాలో నిర్ణయించబడే కొన్ని సరిహద్దులకు లోపుగా తన హామీమీద ఖులాసాగావుండేలాగున అనుమతిపొందిన, సంస్థానమునకు విరోధముచేసిన ఖయిదీ, లేక యుద్ధములో పట్టుకోబడ్డ ఖయిదీ, తాను ఖులాసాగా వుండేలాగున అనుమతిపొందివుండే సరిహద్దుల వెలపలికి వెళ్లినపక్షమునకు న్యాయశాస్త్రసమ్మతమైన ఖయిదులోనుంచి తప్పించుకొని పారిపోయినట్టు చెప్పబడుతున్నాడు.

---

## 7-వ అధ్యాయము.

### సేనలతోటిన్ని యుద్ధపు వాడలతోటిన్ని ఖులాకాగల నేరములు.

131. శ్రీ రాణీగారి సేనలలోగాని యుద్ధపు వాడలలోగాని వుండే ఒక ఆఫీసరు, సిపాయీ, సోల్జరు, లేక వాడపని వాడు, వీరివల్ల తిరగబాటు జరిగించబడేలాగున కుమ్మకుచేసే, లేక అట్టి ఆఫీసరు, సిపాయీ, సోల్జరు, లేక వాడపనివాడు విధేయుడుగా వుండకుండా, లేక నవుకరీ చెయ్యకుండావుండేలాగున దుర్బోధన చెయ్యడమునకు ప్రయత్నముచేసే యే మనిషి అయినా, యావజ్జీవము ద్వీపాంతరవాసమువల్లగాని పదిసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమునకు రెండు తెరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడుకావలసినది.

తిరగబాటుకు కుమ్మకు చెయ్యడము, లేక ఒక సిపాయీగాని సోల్జరుగాని వాడపనివాడుగాని తన నవుకరీ చెయ్యకుండా దుర్బోధన చెయ్యడమునకు యత్నించడము.

వివరణము.— ఈ సెక్షనులోవుండే "ఆఫీసరు" "సోల్జరు" అనేమాటలు, హార్ మెజస్టి రాణీగారి సేనను నుకీ చక్కగా పరిపాలన చేయుటముగురించి పుట్టిన ఆర్టికల్స్ అఫ్ వార్ (Articles of War) అనే దండు సంబంధమయిన నిబంధనలకుగాని 1869-వ సంవత్సరపు 5-వ అధ్యాయములో వుండే దండు సంబంధమయిన నిబంధనలకుగాని లోబడే యే మనిషిని అయినా చెప్పుకొంటున్నవి.

132. శ్రీ రాణీగారి సేనలలోగాని యుద్ధపు వాడలలోగాని వుండే ఆఫీసరు, సిపాయీ, సోల్జరు, లేక వాడపనివాడు, వీరివల్ల తిరగబాటు జరిగించబడేలాగున కుమ్మకుచేసే యే మనిషి అయినా, అట్టి కుమ్మకునుపట్టి తిరగబాటు జరిగించబడ్డపక్షమునకు మరణమువల్లగాని యావజ్జీవము ద్వీపాంతరవా

కుమ్మకునుపట్టి తిరగబాటు సంభవించినయెడల అట్టి కుమ్మకునుగురించి శిక్ష.

సమున్నా గాని పదిసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండు తరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడు కావలసినది.

ఉద్యోగపుపని జరిగిస్తూవుండే తన పయి ఆఫీసరుమీద సిపాయీవల్లగాని సోల్జరువల్లగాని వాడపనివానివల్లగాని జరిగించబడే దొమ్మీకి కుమ్మకు చెయ్యడము.

133. ఉద్యోగపుపని జరిగిస్తూవుండే యే పయి ఆఫీసరుమీదనయినా, శ్రీ రాణిగారి సేనలలో, లేక యుద్ధపు వాడలలోవుండే ఒక ఆఫీసరువల్ల, సిపాయీవల్ల, సోల్జరువల్ల, లేక వాడపనివానివల్ల జరిగించబడే దొమ్మీకి కుమ్మకుచేసే యే మనిషి అయినా, మూడు సంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండు తరహాలలో ఒక తరహా ఖయిదువల్ల శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడు కావలసినది.

దొమ్మీ జరిగించబడ్డ పక్షమునకు అట్టి దొమ్మీకి చెయ్యబడ్డ కుమ్మకునుగురించి శిక్ష.

134. ఉద్యోగపుపని జరిగిస్తూవుండే యే పయి ఆఫీసరుమీదనైనా శ్రీ రాణిగారి సేనలలో లేక యుద్ధపువాడలలో వుండే ఒక ఆఫీసరువల్ల, సిపాయీవల్ల, సోల్జరువల్ల, లేక వాడపనివానివల్ల జరిగించబడే దొమ్మీకి కుమ్మకుచేసే యేమనిషి అయినా, అట్టి కుమ్మకునుపట్టి దొమ్మీ చెయ్యబడ్డపక్షమునకు యేడుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒక తరహా ఖయిదువల్ల శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడు కావలసినది.

ఒక సిపాయి, సోల్జరు, లేక వాడపనివాడు వదలిపెట్టి పారిపోవడమునకు కుమ్మకు.

135. శ్రీరాణిగారి సేనలలో, లేక యుద్ధపు వాడలలో వుండే యెవరయినా ఆఫీసరు, సిపాయీ, సోల్జరు, లేక వాడపనివాడు, వీరు వదలిపెట్టి పారిపోవడమునకు కుమ్మకుచేసే యేమనిషి అయినా, రెండు సంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండు తర

హాలలో ఒక తరహా ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని ఈ రెంటివల్ల గాని శిక్షించబడవలసినది.

వదిలిపెట్టి పారిపోయినమనిషికి స్థలము యివ్వడము.

136. ఇందులో యికముందు మినహాయించబడే ప్రకారమయితేనేతప్ప, శ్రీ రాణిగారిసేనలలో, లేక యుద్ధపువాడలలో వుండే ఒక ఆఫిసరు, సిపాయీ, సోల్జరు లేక వాడపనివాడు వదిలిపెట్టి పారిపోయినట్టు యెరిగి వుండి, లేక నమ్మడమునకు కారణముకలిగివుండి అట్టి ఆఫిసరుకు, సిపాయీకి, సోల్జరుకు, లేక వాడపనివానికి స్థలమునిచ్చే యేమనిషి అయినా, రెండుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలముదాకు రెండు తరహాలలో ఒక తరహా ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని యీ రెంటి వల్లగాని శిక్షించబడవలసినది.

మినహాయింపు.—ఈ నిబంధన, భార్య అయినది తనభర్తకు స్థలము యివ్వడమునుగురించి వ్యాపించనేరదు.

వదలిపెట్టి పారిపోయినమనిషి, వర్తకపు వాడయొక్క మాస్టరుగారి అశ్రద్ధవల్ల ఆ వాడమీద దాగివుండడము.

137. శ్రీ రాణిగారి సేనలలోనుంచి లేక యుద్ధపువాడలలోనుంచి వదిలిపెట్టి పారిపోయినమనిషి దాగివుండే వర్తకపు వాడమాస్టరు, లేక ఆ వాడ తనవశమందు వుంచుకొనివుండే మనిషి, అట్టి దాగడము సంగతి తెలియనివాడయి వున్నప్పటికిన్ని లేక వుద్యోగధర్మమునుపట్టి తనపనిలో అశ్రద్ధచెయ్యకనున్న వారిమీది క్రమములనుగురించి లోపము జరిగించకనున్న వుండెవున్నపక్షమునకు అట్టి దాగడమునుగురించి తెలుసుకోకలిగి వుంటున్నాడు గనుక అట్టి సంగతిలో అయిదువందలురూపాయీలకు మించని జుల్మానాకు పాత్రుడు కావలసినది.

138. శ్రీ రాణిగారిసేనలో లేక యుద్ధపువాడలలో వుండే ఒక

సిపాయిగాని సోల్జరుగాని వాడపనివాడుగాని జరిగించే అవిధేయతకు కుమ్మకు చెయ్యడము.

ఆఫీసరు, సిపాయీ, సోల్జరు, లేక వాడపనివాడు, వీరివల్ల జరిగించబడే కార్యము అవిధేయతగావున్నట్టు యెరిగివుండి దానికి కుమ్మకుచేసే యే మనిషి అయినా, అట్టి కుమ్మకునుపట్టి అట్టి అవిధేయత జరిగించబడ్డపక్షమునకు ఆరుమాసములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒక తరహా ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

పై సెక్షన్లను ఇండియా దేశపు మెరీన్ సర్వీసుకు సంబంధపరచడము.

138-A. ఈ అధ్యాయముయొక్క పై సెక్షన్లు - శ్రీ హర్ మెజస్టి రాణిగారియొక్క ఇండియా దేశపు మెరీన్ సర్వీసు అయినది. శ్రీ రాణిగారి యుద్ధపువాడలలో చేరివుంటే యెట్లాగో అట్లాగే సంబంధపడవలసినది.

ఆర్టికల్స్ అఫ్ వార్ అనే నిబంధనలకు లోబడ్డ మనుష్యులు.

139. శ్రీ రాణిగారి సేననుగురించిన, లేక యుద్ధపు వాడలను గురించిన, లేక అట్టి సేనలో, లేక యుద్ధపువాడలలో యేదయినా భాగమునుగురించిన ఆర్టికల్స్ అఫ్ వార్ అనే యే నిబంధనలకయినా లోబడ్డ యే మనిషిన్ని, యీ అధ్యాయములో నిర్ధారణ చెయ్యబడివుండే యే నేరములను గురించిన్ని యీ స్మృతిప్రకారము శిక్షకు పాత్రుడు కాకూడదు.

సోల్జరు ఉపయోగించునట్టి దుస్తులు ధరించుకోవడము లేక గుర్తును ఉంచుకోవడము.

140. శ్రీ రాణిగారి సేనాసంబంధమయిన, లేక యుద్ధపువాడల సంబంధమయిన నవుకరిలోవుండే సిపాయీ, లేక సోల్జరు కాకుండావుండి తాను సిపాయీని, లేక సోల్జరును అని నమ్మించవలెననే వుద్దేశముతో అట్టి సిపాయీలు, లేక సోల్జర్లు వాడే యేదయినా దుస్తులయొక్క, లేక గుర్తులయొక్క పోలికగావుండే యేదయినా దుస్తులు

ఘరించుకొనే, లేక యేమయినా గుర్తులు వాడుకొనే యేమనిషి అయినా, మూడుమాసములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుగ్రాహోలలో ఒకతరహా ఖయిదువల్లగాని అయిమువందల రూపాయిలకు వ్యాపించగూడిన జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

---

## 8-వ అధ్యాయము.

### జనుల నెమ్మదికి విరోధముగా జరిగించబడే నేరములనుగురించి.

న్యాయశాస్త్ర విరోధమైన మూక.

141- అయిదుగురు, లేక యెక్కువమందివుండే మూక, అందులో వుండేవారు పోగు కావడమునకు వారికి కలిగివుండే వుద్దేశములు యీకింద నమూదుచెయ్యబడే సంగతులనుగురించి అయినయెడల "న్యాయశాస్త్రవిరోధమైన మూక" అని చెప్పబడుతున్నది, ఆ సంగతులు యేవంటే—

మొదటిది.—ఇండియాదేశపు లెజిస్లేటివ్ గవర్న్మెంటువారిని గాని, ఎగ్జెక్యుటివ్ గవర్న్మెంటువారినిగాని యే రాజధానియొక్క అయినా గవర్న్మెంటువారినిగాని యెవరయినా లెఫ్టినెంట్ గవర్నరుగారిని గాని న్యాయశాస్త్ర సమ్మతమయిన తన అధికారములు చెలాయిస్తూ వుండగా ఒక పబ్లిక్ వుద్యోగస్థుణ్నిగాని నేరముగల బలవంతమువల్ల, లేక నేరముగల బలవంతము జరిగించబొయ్యేలాగున కనపరచడమువల్ల జడిపించడము; లేక

రెండోది.—ఏదయినా న్యాయశాస్త్రముగాని న్యాయశాస్త్ర సంబంధమయిన చర్యగాని అమలులోకి తేకుండా యెదిరించడము; లేక

మూడోది.—ఏదయినా కీడు, నేరముగల ప్రవేశము, లేక యితర నేరము జరిగించడము; లేక

11

నాలుగోది.—ఏమనిషికయినా నేరముగల బలవంతము చెయ్యడమువల్ల, లేక నేరముగల బలవంతము చెయ్యబొయ్యేలాగున కనపరచడమువల్ల యేదయినా ఆస్తి పుచ్చుకోవడము, లేక స్వాధీనపరచుకోవడము, లేక ఒకమనిషి యొక్క అనుభవములోవుండే మార్గమందు నడవడమునుగురించిన హక్కు, లేక నీళ్లయొక్క వుపయోగము, లేక స్వాధీనమందున్ను అనుభవమందున్ను వుండే యేదయినా నిరాకారమయిన యితర హక్కు, వీటిని లేకుండా చెయ్యడము, లేక యేదయినా హక్కు గాని తనకు కలిగివున్నట్టు తాను యెంచుకొన్న హక్కుగాని బలవంతము మీాద కలగచేసుకోవడము; లేక

అయిదోది.—నేరముగల బలవంతమువల్ల, లేక నేరముగల బలవంతము జరిగించబొయ్యేలాగున కనపరచడమువల్ల యేమనిషి అయినా న్యాయశాస్త్రానుసారముగా తాను జరిగించడమునకు బద్ధుడుకాని కార్యము అతడు జరిగించేలాగున, లేక తాను జరిగించడమునకు న్యాయశాస్త్ర సమ్మతముగా హక్కుగలవాడయివుండే కార్యము జరిగించక పొయ్యేలాగున బలవంతపెట్టడము.

వివరణము.—పోగయ్యేకాలమందు న్యాయశాస్త్ర విరుద్ధము కాకుండావుండే ఒక సమూహము, ఆదరింపిలాను న్యాయశాస్త్ర విరోధమయిన మూక కావచ్చును.

న్యాయశాస్త్ర విరుద్ధమయిన మూకలో కలిసేవుండడము.

142. ఏదయినా సమూహము, న్యాయశాస్త్ర విరోధమయిన మూక అయ్యేలాగున చేసే సంగతులు యెరిగివుండి ఆ మూకలో ప్రయత్నపూర్వకముగా కలిసే, లేక అందులో నిలిచివుండే యేమనిషి అయినా, న్యాయశాస్త్రవిరోధమయిన మూకలో కలిసిన ఒక మనిషిగావున్నట్టు చెప్పబడుతున్నాడు.

143. న్యాయశాస్త్ర విరోధమయిన మూకలో కలిసివుండే యేమనిషి అయినా, ఆరుమాసములకు వ్యాపించ గూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని యీరా రెంటివల్లగాని శిక్షించబడ వలసినది.

శిక్ష.

144. మరణకరమయిన యేదయినా ఆయుధముగాని ఆయుధముగా వుపయోగపరచబడ్డప్పుడు మరణము కలుగ చెయ్యతగ్గ యేదయినా వస్తువుగాని ధరించుకొని న్యాయశాస్త్ర విరోధమయిన మూకలో కలిసివుండే యేమనిషి అయినా రెండుసంవత్సరములకు వ్యాపించ గూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని యీరా రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

మరణకరమయిన ఆయుధమును ధరించుకొని న్యాయశాస్త్రవిరోధమైన మూకలో కలియడము.

145. న్యాయశాస్త్రమువల్ల విధించబడ్డప్రకారము చెదిరిపొయ్యేలాగున హుకుము చెయ్యబడివున్నదని యెరిగివుండిన్ని న్యాయశాస్త్ర విరోధమయిన మూకలో కలిసే, లేక అందులో నిలిచివుండే యేమనిషి అయినా, రెండు సంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్ల గాని జుల్మానావల్లగాని యీరా రెంటివల్లగాని శిక్షించ బడవలసినది.

చెదిరిపొయ్యేలాగున హుకుము చెయ్యబడివున్నదని యెరిగి వుండిన్ని న్యాయశాస్త్ర విరోధమయిన మూకలో కలియడము, లేక అందులో నిలిచివుండడము.

146. న్యాయశాస్త్ర విరోధమయిన మూక తాలూకు మనుష్యులయొక్క సాధారణమయిన వుద్దేశము అమలులోకి తేవడమునుగురించి అట్టి మూకవల్లగాని వాటిలో ఒక మనిషివల్లగాని బలవంతము, లేక దౌర్జన్యము జరిగించబడ్డ

అల్లరి చేయడము.

ప్పుడు అట్టి మూక తాలూకు ప్రతి మనిషిన్ని అల్లరచెయ్యడపు నేరముగురించి నేరస్థుడుగా వుంటున్నాడు.

అల్లరచెయ్యడమును గురించిన శిక్ష.

147. అల్లరచెయ్యడమును గురించి నేరస్థుడుగావుండే యేమనిషి అయినా, రెండు సంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండు తరహాలలో ఒక తరహా ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

మరణకరమయిన ఆయుధము ధరించుకొని అల్లర చెయ్యడము.

148. మరణకరమయిన యేదయినా ఆయుధముగాని ఆయుధముగా వుపయోగపరచబడ్డప్పుడు మరణము కలగచెయ్యతగ్గ యేదయినా వస్తువగాని ధరించుకొని అల్లరచెయ్యడమును గురించి నేరస్థుడయ్యే ప్రతి మనిషిన్ని, మూడుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

న్యాయశాస్త్ర విరోధమయిన మూక తాలూకు సాధారణమయిన వుద్దేశము నెరవేర్చడములో జరుగు నేరమునుగురించు ఆ మూకలోని ప్రతి మనిషిన్ని నేరస్తుడగును.

149. న్యాయశాస్త్ర విరోధమయిన మూక తాలూకు సాధారణమయిన వుద్దేశము నెరవేర్చడమును గురించి యేదయినా నేరముగాని ఆ వుద్దేశము నెరవేర్చడమునుగురించి జరిగించబడవచ్చునని ఆ మూకలోనారు యెరిగివుండే యేదయినా నేరముగాని ఆ మూకలోవుండే యేమనిషివల్లనయినా. జరిగించబడ్డపక్షమునకు ఆ నేరము జరిగించేకాలమందు ఆ మూకలో కలిసివుండే ప్రతి మనిషిన్ని ఆ నేరము జరిగించినవాడుగా యెంచబడవలసినది.

150. న్యాయశాస్త్రవిరోధమయిన యేదయినా మూకలో

న్యాయశాస్త్ర విరోధమయిన మూకలో కలియడమునకు గాను మనుష్యులకు పయికముయిచ్చి కుదుర్చుకోవడము, లేక అట్లా కుదుర్చుకోవడపు సంగతినిగురించి వుపేక్షించడము.

కలిసేలాగున, లేక అందులో ఒకడు అయ్యేలాగున యెవరినయినా పయికముయిచ్చి కుదుర్చుకొనే, లేక వుంచుకొనే, లేక నిర్నయించుకొనే, లేక కుదుర్చుకోవడమునకు, వుంచుకోవడమునకు, లేక నిర్నయించుకోవడమునకు మద్దతుచేసే, లేక వుపేక్షించే యేమనిషి అయినా, న్యాయశాస్త్ర విరోధమయిన అట్టె మూకలో ఒకడుగా వుండడమును గురించిన్ని అట్లా కుదుర్చుకొన్నమనిషి న్యాయశాస్త్ర విరోధమయిన అట్టె మూకలో ఒకడుగావుండి అట్లా కుదుర్చుకోవడము, వుంచుకోవడము, లేక నిర్నయించుకోవడము, వీటిని అనుసరించి యేమయినా నేరము జరిగించినయెడల కుదిర్చినమనిషి అట్టి మూకలో ఒకడుగా వుండిగాని, లేక తాను ఆ నేరము జరిగించిగాని వున్నట్టయితే యేలాగో ఆలాగే ఆ నేరము గురించిన్ని శిక్షించబడతగివుండవలసినది.

చెదిరిపొయ్యేలాగున హుకుము చెయ్యబడ్డతర్వాత అయినా గుడా, లేక యెక్కువమంది మనుష్యులువుండే మూకలో యెరిగి వుండికలియడము లేక నిలిచివుండడము.

151. జనుల నెమ్మదికి భంగము కలగచెయ్యతగ్గ అయిదుగురు, లేక యెక్కువమంది మనుష్యులువుండే యే మూక అయినా న్యాయశాస్త్రమును అనుసరించి చెదిరిపొయ్యేలాగున హుకుము చెయ్యబట్టమీదట ఆ హుకుము యెరిగివుండి అందులో కలిసే, లేక నిలిచివుండే యేమనిషి అయినా, ఆరుమాసములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

వివరణము.—ఆ మూక, 141-వ సెక్షనుయొక్క అర్థప్రకారము న్యాయశాస్త్ర విరోధమయిన మూకగా వున్నపక్షమునకు నేరస్థుడు 145-వ సెక్షనుప్రకారము శిక్షించబడతగి వుండవలసినది.

అల్లరవగయిరాలు అవుచూవుండగా పబ్లిక్ వుద్యోగస్తునిమీద దౌమ్మి చెయ్యడము, లేక అతణ్ని ఆటంక పెట్టడము.

152. న్యాయశాస్త్ర విరోధమయిన ఒక మూకను చెదర గొట్టడమునకుగాని ఒక అల్లర, లేక గత్తర ఆపడ మునకుగాని ప్రయత్నముచెయ్యడమందు తనవుద్యోగధర్మమునుపట్టి పనిచేసే యే పబ్లిక్ వుద్యోగస్థుని మీదనయినా దౌమ్మిచేసే, లేక దౌమ్మిచేసే లాగున జడిపించే, లేక ఆటంకపెట్టే, లేక ఆటంక పెట్టవలెనని యత్నముచేసే, లేక అట్టి పబ్లిక్ వుద్యోగస్థునిమీద నేర ముగల బలవంతముచేసే, లేక చేసేలాగున జడిపించే, లేక యత్నించే యేమనిషి అయినా, మూడుసంవత్సరములకు వ్యాపించగూడిన కాల మువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని జుల్మానావల్ల గాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

అల్లర చెయ్యవలెననే యత్నముతో నిష్కారణముగా ఆగ్రహకారణము కలగ చెయ్యడము.

153. తాను కలగచేసే ఆగ్రహకారణమువల్ల అల్లర నేరము జరిగించబడవలెనని యత్నించి, లేక జరిగించబడ వచ్చునని యెరిగివుండి న్యాయశాస్త్ర విరోధముగా వుండే యేకార్యమయినా జరిగించడమువల్ల కావే షమీద, లేక నిష్కారణముగా యెవరికయినా ఆగ్రహకారణము కలగచేసే యేమనిషి అయినా,

అల్లర జరిగించబడ్డపక్షమునకు.

అట్టి ఆగ్రహకారణమువల్ల అల్లర నేరము జరిగించ బడ్డపక్షమునకు ఒక సంవత్సరమునకు వ్యాపించ గూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా

అల్లర జరిగించబడనిపక్షమునకు.

ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని యీ రెంటివల్ల గాని; అల్లర నేరము జరిగించబడనిపక్షమునకు ఆరుమాసములకు వ్యా పించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్ల గాని జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

ఒక తెగవారియెడల మఱియొక తెగవారికి వైరము బలపర్చుట.

153-A. పలుకఁబడినట్టి లేక వ్రాయఁబడినట్టి మాటలవల్లఁగాని లేక సైగలవల్లఁగాని ప్రత్యక్షముగా కనఁబడు రూపమువల్లఁగాని మఱి యేవిధముగాఁగాని శ్రీ రాణిగారి ప్రజలలో ఒక తెగవారియెడల మఱియొక తెగవారికి వైరభావమును లేక ద్వేషభావమును ఏ మనుష్యుఁడైన బలపఱిచినయెడల లేక బలపర్చుటకు ప్రయత్నించినయెడల, అతఁడు రెండుసంవత్సరములమట్టుకు కయిదుతోఁగాని. జుల్మానాతోఁగాని, లేక రెంటితోఁగాని, శిక్షింపఁబడవలయును.

వివరణము.—శ్రీ రాణిగారి ప్రజలలో ఒక తెగవారియెడల మఱియొక తెగవారికి వైరభావమునుగాని ద్వేషమునుగాని పుట్టించుచున్నట్టి లేక పుట్టించు స్వభావము కలిగినట్టి విషయములను, దురుద్దేశములేకుండను, వానిని తొలఁగింపవలయునని సద్భావముతోను, తెలియపఱుచుట యీ సెక్షను తాత్పర్యప్రకారము నేరముగా నేర్పడదు.

న్యాయశాస్త్రవిరోధమయిన మూకపోగయ్యే భూమి తాలూకు ఖావందు, లేక అనుభవదారుడు.

154. న్యాయశాస్త్రవిరోధమయిన యేదయినా మూకపోగైనప్పుడుగాని అల్లర జరిగినప్పుడుగాని న్యాయశాస్త్రవిరోధమయిన అట్టి మూకపోగయిన, లేక అల్లర జరిగించబడ్డ భూమి తాలూకు ఖావందు, లేక అనుభవదారుడున్ను ఆ భూమిలో నేదయినా అక్కర కలిగివుండే, లేక అక్కరకలిగివున్నట్టు యెంచే మనిషిన్ని,

అతనుగాని అతని యేజెంటు, లేక మానేజరుగాని అటువంటి నేరము జరుగుతూవున్నదని, లేక జరిగించబడ్డదని యెరిగివుండి, లేక అది జరిగించబడవచ్చునని నమ్మడమునకు కారణము కలిగివుండి అందునుగురించి తనకు, లేక తమకు సాధ్యముగా వుండేటంత త్వరలో

వర్తమానము అక్కడికి సమీపమందు వుండే పోలీస్ స్టేషనులో ముఖ్యుడయిన ఆఫీసరుకు తెలియచెయ్యక పోయినపక్షమునకున్ను,

అది జరగబోతున్నదని తాను లేక తాము నమ్మడమునకు కారణము కలిగివుండే సంగతిలో, దాన్ని ఆపడమునకు తనకు లేక తమకు సాధ్యముగావుండే న్యాయశాస్త్ర సమ్మతమయిన దరోబస్తు సాధనములు వుపయోగపరచక పోయినపక్షమునకున్ను అది సంభవించిన యెడల ఆ అల్లరి ఆపడమునకు, లేక న్యాయశాస్త్ర విరోధమయిన ఆ మూక చెదరగొట్టడమునకు తనకు లేక తమకు సాధ్యముగావుండే న్యాయశాస్త్ర సమ్మతమయిన దరోబస్తు సాధనములు వుపయోగపరచకపోయిన పక్షమునకున్ను,

వెయ్యి రూపాయిలకు మించని జుల్మానావల్ల శిక్షించబడతగి వుండవలసినది.

ఎవరి ప్రయోజనముకొరకు అల్లర జరిగించబడ్డదో అట్టి మనిషియొక్క జవాబుదారీ.

155. ఏ భూమినిగురించి అల్లర సంభవిస్తున్నదో అట్టి భూమి తాలూకు ఖావందుగా, లేక అనుభవదారుడుగా వుండే, లేక అట్టి భూమిలో, లేక అల్లరకు కారణము కలగచేసిన యే వివాదయొక్క అయినా సంగతిలో. యేదైనా అక్కర కలిగివున్నట్టు యెంచే, లేక ఆ అల్లరవల్ల యేదైనా ప్రయోజనము అంగీకరించి లేక పొంది వుండే యే మనిషియొక్క అయినా ప్రయోజనముకొరకుగాని అతని తరఫునగాని ఒక అల్లర జరిగించబడ్డప్పుడు,

అట్టి మనిషి, అతని ఏజెంటు, లేక మానేజరు అట్టి అల్లర జరగవచ్చుననిగాని అట్టి అల్లర జరిగించిన న్యాయశాస్త్ర విరోధమయిన మూకపోగు కాబోతున్నదనిగాని నమ్మడమునకు కారణము కలిగి వుండి అట్టి మూక పోగుకాకుండా, లేక అల్లర జరగకుండా నివారించడ

మునకున్ను వాటిని ఆపడమునకున్ను చెదరగొట్టడమునకున్ను తనకు లేక తమకు సాధ్యముగా వుండే దరోబస్తు న్యాయశాస్త్ర సమ్మతము లయిన సాధనములు వుపయోగపరచకపోయినపక్షమునకు జుల్మానా వల్ల శిక్షించబడవలసినది.

ఎవరి ప్రయోజనముకొరకు అల్లర జరిగించబడ్డదో అట్టిఖావంద తాలూకు, లేక అనుభవదారుని తాలూకు ఏజెంటుయొక్క జవాబుదారీ.

156. ఏ భూమినిగురించి అల్లర సంభవిస్తున్నదో అట్టి భూమి తాలూకు ఖావందుగా, లేక అనుభవదారుడుగా వుండే, లేక అట్టి భూమిలో, లేక అల్లరకు కారణముకలగచేసిన యే వివాదముయొక్క అయినా సంగతిలో యేదయినా అక్కరకలిగివున్నట్టు యెంచే, లేక ఆ అల్లరవల్ల యేదయినా ప్రయోజనము అంగీకరించి లేక పొందివుండే యే మనిషియొక్క అయినా ప్రయోజనముకొరకుగాని అతని తరఫునగాని ఒక అల్లర జరిగించబడ్డప్పుడు,

అట్టి మనిషియొక్క ఏజెంటుగాని మానేజరుగాని అట్టి ఏజెంటు, లేక మానేజరు, అట్టి అల్లర జరగవచ్చునని, లేక అట్టి అల్లర జరిగించిన న్యాయశాస్త్ర విరోధమయిన మూక పోగు కాబోతున్నదని నమ్మడమునకు కారణము కలిగివుండి అట్టి మూక పోగుకాకుండా, లేక అల్లర జరగకుండా నివారించడమునకున్ను వాటిని ఆపడమునకున్ను చెదరకొట్టడమునకున్ను తనకు సాధ్యముగావుండే న్యాయశాస్త్రసమ్మతమయిన దరోబస్తు సాధనములు వుపయోగపరచక పోయినపక్షమునకు జుల్మానావల్ల శిక్షించబడతగివుండవలసినది.

న్యాయశాస్త్రవిరోధమయిన మూక

157. న్యాయశాస్త్రవిరోధమైన మూకలో కలియడముకొరకు, లేక ఆ మూక తాలూకు మనుష్యులు కావడముకొరకు యెవరయినా పయికమునకు కుదుర్చుకొ

లో కలియడముకొరకు పైకము యిచ్చి కుదుర్చుకోబడ్డ మనుష్యులకు స్థలము యివ్వడము.

బడ్డట్టు, వుంచుకోబడ్డట్టు, లేక నిర్నయించుకోబడ్డట్టుగాని అట్లా కుదుర్చుకోబడబొయ్యేటట్టు, వుంచుకోబడబొయ్యేటట్టు, లేక నిర్నయించుకోబడబొయ్యేటట్టుగాని యెరిగివుండి అట్టి యే మనుష్యులకైనా తన అనుభవమందు, స్వాధీనమందు, లేక తన అధికారమందు వుండే యేదయినా యింట్లో, లేక ఆవరణములో స్థలము యిచ్చే, లేక వారిని రాబట్టుకొనే, లేక పోగుచేసే యే మనిషి అయినా, ఆరుమాసములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండు తరహాలలో ఒక తరహా ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

న్యాయశాస్త్ర విరోధమయిన ఒకమూకలోగాని అల్లరిలోగాని కలియడముకొరకు పయికముపుచ్చుకొని కుదరడము.

158. 141-వ సెక్షనులో నమూదుచెయ్యబడివుండే కార్యములలో యేదైనా జరిగించడముకొరకు, లేక జరిగించడములో సహాయముచెయ్యడముకొరకు పైకమునకు కుదుర్చుకోబడ్డ, లేక వుంచుకోబడ్డ, లేక అట్లా కుదుర్చుకోబడేలాగున, లేక వుంచుకోబడేలాగున, సమ్మతించే, లేక యత్నించే యే మనిషి అయినా, ఆరుమాసములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండు తరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది;

లేక ఆయుధపాణి అయిపోవడము.

మరిన్ని పయిన నమూదుచెయ్యబడ్డ ప్రకారము అట్లా కుదుర్చుకోబడి, లేక వుంచుకోబడి మరణకరమైన యేదయినా ఆయుధముగాని ఆయుధముగా వుపయోగపరచబడ్డయెడల మరణము కలగచెయ్యతగ్గ యేదైనా వస్తువగాని ధరించుకొనివెళ్లే, లేక ధరించుకొని వేళ్లేలాగున ఒప్పుకొనే, లేక సమ్మ

తించే యే మనిషి అయినా, రెండుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని జుల్మానా వల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

గత్తర.

159. ఇద్దరుగాని యెక్కువమందిగాని ఒక బహిరంగమయిన స్థలమందు పోట్లాడడమువల్ల జనుల నెమ్మదికి భంగము కలగచేసినప్పుడు వారు ఒక గత్తర జరిగించినట్టు చెప్పబడుతున్నారు.

గత్తర జరిగించిన యెడల శిక్ష.

160. గత్తర జరిగించే యే మనిషి అయినా, ఒక మాసమునకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని వందరూపాయీలకు వ్యాపించగూడిన జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

---

## 9-వ అధ్యాయము.

### పబ్లిక్ వుద్యోగస్థులవల్ల జరిగించబడే, లేక వారితో యిలాకాకలిగివుండే నేరములనుగురించి.

తన వుద్యోగసంబంధమయినయేదయినా పనినిగురించిన్యాయశాస్త్ర సమ్మతమయిన ప్రతిఫలము కాకుండా యితరమైన ప్రయోజనముపొందే పబ్లిక్ వుద్యోగస్థుడు.

161. పబ్లిక్ వుద్యోగస్థుడుగావుండి, లేక పబ్లిక్ వుద్యోగస్థుడు కాబోయ్యేలాగున నిరీక్షిస్తూవుండి తన వుద్యోగ సంబంధమైన యేదయినా పని చెయ్యడమునకుగాని చెయ్యక మానుకోవడమునకుగాని తన వుద్యోగ కార్యములు జరిగించడమందు యే మనిషికైనా అనుగ్రహము, లేక నిగ్రహము చెయ్యడమునకుగాని చెయ్యక మానుకోవడమునకుగాని ఇండియా దేశపు లెజిస్లేటివ్, లేక ఎగ్జెక్యూటివ్ గవర్న్మెంటు

వారిద్వారా, యే రాజధానియొక్క అయినా గవర్న్మెంటువారిద్వారా, లెఫ్టినెంట్ గవర్నర్ గారిద్వారా, లేక పబ్లిక్ వుద్యోగస్థుడుగా వుండడమునుపట్టి యెవరైనా పబ్లిక్ వుద్యోగస్థునిద్వారా యే మనిషికైనా వుపకారము, లేక అపకారము చెయ్యడమునకుగాని చెయ్యవలెనని యత్నించడమునకుగాని ప్రోత్సాహముగా, లేక ప్రత్యుపకారముగా తనతాలూకు న్యాయశాస్త్రిసమ్మతమైన ప్రతిఫలము కాకుండావుండే యేదైనా ప్రయోజనము తనకొరకుగాని మరియెవరికొరకయినాగాని యే మనిషివల్లనయినా అంగీకరించే, లేక పొందే, లేక అంగీకరించడమునకు ఒప్పే, లేక పొందడమునకు యత్నించే యే మనిషి అయినా, మూడుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

వివరణములు.—“పబ్లిక్ వుద్యోగస్థుడు అయ్యేలాగున నిరీక్షిస్తూవుండడము.” ఒక వుద్యోగములో ప్రవేశించడమునకు నిరీక్షిస్తూ వుండని యే మనిషి అయినా, తాను వుద్యోగములో ప్రవేశించబోతాననిన్ని అప్పట్లో వుపకారము చేస్తాననిన్ని నమ్మించి యితరులను దగా చెయ్యడమువల్ల యేదైనా ప్రయోజనము పొందినపక్షమునకు దగా చెయ్యడమునుగురించి అతడు నేరస్థుడు కావచ్చునుగాని యీ సెక్షనులో నిర్ధారణచెయ్యబడ్డ నేరమునుగురించి నేరస్థుడు కాడు.

“ప్రయోజనము.” “ప్రయోజనము” అనేమాటకు, ద్రవ్యసంబంధమైన ప్రయోజనము, లేక ద్రవ్యముగా గణితీచెయ్యగూడిన ప్రయోజనము అనిమాత్రము అర్థము కావడమేగాకుండా యితర ప్రయోజనము అనికూడా అర్థము కావలసినది.

“న్యాయశాస్త్రి సమ్మతమైన ప్రతిఫలము.” “న్యాయశాస్త్రి

సమ్మతమైన ప్రతిఫలము” అనేమాటలకు, ఒక పబ్లిక్ వుద్యోగస్థుడు న్యాయశాస్త్రి సమ్మతముగా అడగకూడిన ప్రతిఫలము అనిమాత్రము అర్థము కావడమేకాకుండా తాను నవుకరీచేసే గవర్న్మెంటువారివల్ల పుచ్చుకొనేలాగున సెలవుపొందిన యావత్తు ప్రతిఫలము, లవాజిమాలు వగయిరాలు అని అర్థము కావలసినది.

“ఒక కార్యము చెయ్యడమునకు ప్రోత్సాహము, లేక ప్రత్యుపకారము.” తాను జరిగించవలెనని యత్నించకుండా వుండేదాన్ని జరిగించడమునకు ప్రోత్సాహముగా, లేక తాను జరిగించనిదాన్ని జరిగించి వున్నట్టు ప్రత్యుపకారముగా ప్రయోజనము పొందే ఒకమనిషి, యీ మాటలయొక్క అర్థము కిందికి వస్తున్నాడు.

దృష్టాంతములు.

(a) మునసబుగా వుండే A అనే మనిషి, సావుకారుగా వుండే Z అనే మనిషి పక్షముగా ఒక వ్యాజ్యము తీర్పుచేసినందుకు ప్రత్యుపకారముగా A అనేమనిషి యొక్క సహోదరునికి Z అనే మనిషివద్ద Z అనే మనిషియొక్క కోఠిలో ఒక వుద్యోగము కలగచేసినాడు. A అనేమనిషి, యీ సెక్షనులో నిర్ధారణచేయ్యబడ్డ నేరము జరిగించినవాడవుతున్నాడు.

(b) ఒక రాజుయొక్క సంస్థానములో రెసిడెంటుగా వుండే A అనేమనిషి, సంస్థానము తాలూకు దివానువద్దనుంచి లక్షరూపాయీలు పుచ్చుకొంటున్నాడు. A అనే మనిషి, తన వుద్యోగములో యిలాకాగల యేదో ఒక విశేషమైన కార్యము జరిగించడమునకు, లేక జరిగించక మానుకోవడమునకుగాని ప్రిటిష్ గవర్న్మెంటువారివద్ద ఆ సంస్థానము తరఫున యేదయినా విశేషమైన వుపకారము చెయ్యడమునకుగాని అనేలాగున యత్నించడమునకుగాని ప్రోత్సాహముగా, లేక ప్రత్యుపకారముగా యీ మొబలగు పుచ్చుకొన్నట్టు కనపడదు. అయితే A అనేమనిషి, తన వుద్యోగముతో యిలాకాగల పనులు జరిగించడమందు ఆ సంస్థానపక్షమాయి సాధారణముగా అనుగ్రహము కనపరచునందుకు ప్రోత్సాహముగా, లేక ప్రత్యుపకారముగా యీ మొబలగు పుచ్చుకొన్నట్టు కనబడుతున్నది. A అనేమనిషి, యీ సెక్షనులో నిర్ధారణచెయ్యబడ్డ నేరము జరిగించినవాడవుతున్నాడు.

(c) పబ్లిక్ వుద్యోగస్థుడుగావుండే A అనేమనిషి, గవర్నమెంటువారితోటి మాట్లాడి A అనేమనిషికి కలిగివుండే శక్తివల్ల Z అనే మనిషికి, ఒక బిరుదు కలగ చెయ్యబడ్డట్టు Z అనేమనిషి తప్పుగా నమ్మేలాగునచేసి యీ వుపకారమునకుగాను తనకు Z అనేమనిషి కొంతపయికము యిచ్చేటట్టు చేస్తున్నాడు. A అనేమనిషి, యీ సెక్షనులో నిర్ధారణచెయ్యబడ్డ నేరము జరిగించినవాడవుతున్నాడు.

పబ్లిక్ ఉద్యోగస్థున్ని దుష్టమైన లేక న్యాయశాస్త్ర విరోధమయిన సాధనములవల్ల ప్రేరేపించడమునకుగాను ప్రయోజనము పొందడము.

162. ఉద్యోగసంబంధమయిన యేదయినా పనిచేసేలాగునగాని చెయ్యక మానుకొనేలాగునగాని తన ఉద్యోగకార్యములు జరిగించడమందు యేమనిషికయినా అనుగ్రహము, లేక నిగ్రహము చేసేలాగునగాని ఇండియాదేశపు లెజిస్లేటివ్, లేక ఎగ్జిక్యూటివ్ గవర్న్మెంటువారిద్వారా, యే రాజధానియొక్క అయినా గవర్న్మెంటువారిద్వారా లెఫ్టినెంట్ గవర్నర్ గారిద్వారా, అలహాబాదు యూనివర్సిటీయొక్క సెనెటులోని యెవరైన మెంబరుద్వారా, లేక పబ్లిక్ వుద్యోగస్థుడుగా వుండడమునుపట్టి యెవరయినా పబ్లిక్ వుద్యోగస్థునిద్వారా యేమనిషికయినా వుపకారము, లేక అపకారము చేసేలాగునగాని చెయ్యవలెనని యత్నించేలాగునగాని దుష్టమయిన, లేక న్యాయశాస్త్రవిరోధమయిన సాధనమువల్ల యే పబ్లిక్ వుద్యోగస్థున్ని అయినా ప్రేరేపించి అందుకు ప్రోత్సాహముగా, లేక ప్రత్యుపకారముగా యేదయినా "ప్రయోజనము" తనకొరకుగాని మరియెవరికొరకయినాగాని అంగీకరించే, లేక పొందే, లేక అంగీకరించడమునకు ఒప్పే, లేక పొందడమునకు యత్నించే యే మనిషి అయినా మూడుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒక తరహా ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

163. ఉద్యోగసంబంధమయిన యేదయినా పనిచేసేలాగునగాని

పబ్లిక్ వుద్యోగస్తు నివద్ద తనకు కలిగివుండే మురబ్బీ వినియోగపరచడము కొరకు ప్రయోజనము పొందడము.

చెయ్యక మానుకొనేలాగునగాని తన వుద్యోగకార్యములు జరిగించడమందు యే మనిషికి అయినా అనుగ్రహము, లేక నిగ్రహము చేసేలాగునగాని ఇండియా దేశస్థ లెజిస్లేటివ్, లేక ఎగ్జెక్యూటివ్ గవర్నమెంటువారిద్వారా, యే రాజధానియొక్క అయినా గవర్నమెంటువారిద్వారా లెఫ్టినెంట్ గవర్నర్ గారిద్వారా, అలహాబాదు యూనివర్సిటీయొక్క సెనెటులోని యెవరైన మెంబరుద్వారా లేక పబ్లిక్ వుద్యోగస్థుడుగా వుండడమునుపట్టి యెవరయినా పబ్లిక్ వుద్యోగస్థునిద్వారా యేమనిషికయినా వుపకారము, లేక అపకారము చేసేలాగునగాని చెయ్యవలెనని యత్నించేలాగునగాని వారివద్ద తనకు కలిగివుండే మురబ్బీనిపట్టి యే పబ్లిక్ వుద్యోగస్థుణ్ని అయినా ప్రేరేపించి అందుకు ప్రోత్సాహముగా, లేక ప్రత్యుపకారముగా యేదయినా "ప్రయోజనము" తనకొరకుగాని మరి యెవరికొరకయినగాని అంగీకరించే, లేక పొందే లేక అంగీకరించడమునకు ఒప్పే, లేక పొందడమునకు యత్నించే యే మనిషి అయినా, ఒకసంవత్సరమునకు వ్యాపించగూడిన కాలమువరకు సాధారణమయిన ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

## దృష్టాంతము.

న్యాయాధిపతిగారి యెదటవుండే ఒక వ్యాజ్యమునుగురించి వాదించడమునకు రుసుము పుచ్చుకొనే వకీల్లున్ను; అర్జీదారుయొక్క నవుకరీలున్ను దావాలున్ను నమూదుచేసి గవర్నమెంటువారి పేరట మనవి అర్జీ వ్రాయడమున్ను దిద్దడమున్ను పయికము పుచ్చుకొనే ఒక మనిషిన్ని; నేరస్థాపన చెయ్యబడ్డ నేరస్తునికిగాను ఆ నేరస్థాపన అన్యాయమైనదని కనపరచడమును వినియోగించే కయిఫియ్యతులు గవర్నమెంటువారికి కనపరచే పయికము యివ్వబడ్డ గుమాస్తాయున్ను. వీరు యీ సెక్షను యొక్క అర్థము కిందికి రారు, ఎందువల్లనంటే:—వారు అధికారస్థులవద్ద మురబ్బీ వినియోగములోకి తేనూలేదు, పయిగా తెచ్చేటట్టు చెప్పనూలేదు.

164. ఎవనినిగురించి అయితే యింతకుముందు అన్యనహితము గావుండే రెండు సెక్షనులలో నిర్దేశించబడ్డ యే నేరమయినా జరిగించబడ్డదో అట్టి పబ్లిక్ వుద్యోగస్థుడయివుండి ఆ నేరమునకు కుమ్మకుచేసే యేమనిషి అయినా, మూడుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడ వలసినది.

162.వ లేక 163_వ సెక్షనులలో నిర్దేశింపబడిన నేరములకు పబ్లిక్ వుద్యోగస్థుడు కుమ్మకు చెయ్యడమును గురించి శిక్ష.

దృష్టాంతము.

ఎ అనేమనిషి, ఒక పబ్లిక్ వుద్యోగస్థుడుగా వుంటున్నాడు. ఎ అనే మనిషి యొక్క భార్య అయిన బి అనే స్త్రీ, ఒకానొక మనిషికి ఒక యుద్యోగము యిచ్చేలాగున ఎ అనే మనిషి వెదుకోవడమునకు ప్రోత్సాహముగా ఒక బహుమానము పుచ్చుకొంటున్నది. ఎ అనేమనిషి, ఆమె ఆలాగు చెయ్యడమునకు కుమ్మకుచేస్తున్నాడు. బి అనే స్త్రీ, ఒక సంవత్సరమునకు మించనికాలమువరకు ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడతగివుండవలసినది. ఎ అనేమనిషి, మూడు సంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడతగి వుండవలసినది.

165. తనవల్ల జరిగించబడ్డ, లేక జరిగించబడబొయ్యే, లేక తన యొక్కగాని తాను లోబడివుండే యే పబ్లిక్ వుద్యోగస్థునియొక్క అయినాగాని వుద్యోగసంబంధమైన కార్యములతోటి సంబంధము కలిగివుండే యేదయినా వ్యాజ్యెములో, లేక పనిలో యిలాకాపడివున్నట్టు, లేక యిలాకా కలిగివుంటూవున్నట్టు, లేక కలిగి వుండబొయ్యేటట్టు తాను యెరిగివుండే యేమనిషి వద్దినుంచి అయినా,

తనవల్ల జరిగించబడ్డ వ్యాజ్యెములో లేక పనిలో యిలాకాగల మనిషివద్దినుంచి ప్రతి ఫలా మివ్వకుండా కిమ్మత్తుగల వస్తువు పుచ్చుకొనే పబ్లిక్ వుద్యోగస్థుడు.

లేక ఆ ప్రకారము యిలాకా పడివుండే మనిషితోటి అక్కర, లేక బంధుత్వము కలిగివుండేటట్టు తాను యెరిగివుండే యేమనిషి వద్ది నుంచి అయినా,

యేదిన్ని ప్రతిపద్ధాగా యివ్వకుండాగాని చాలనిది అని తాను యెరిగివుండే ప్రతిపద్ధా యిచ్చిగాని యేదయినా కిమ్మతుగల వస్తువ తన కొరకుగాని మరి యే యితర మనిషికొరకయినాగాని పుచ్చుకొనే, లేక పొందే, లేక పుచ్చుకోవడమునకు సమ్మతించే, లేక పొందడమునకు యత్నించే యే పబ్లిక్ వుద్యోగస్థుడయినా,

రెండు సంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు సాధారణమయిన ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

దృష్టాంతములు.

(a) కలక్టరు అయిన **A** అనేమనిషి, తనయెదట వ్యాజ్యము జరుగుతూవుండే ఒక వ్యాజ్యదారుడైన **Z** అనేమనిషి తాలూకు ఒక యిల్లు అద్దెకు పుచ్చుకొంటున్నాడు. ఆ యిల్లు, కృత్రిమములేకుండా అద్దె నిర్ణయించుకోబడ్డపక్షమునకు **A** అనేమనిషి మాసమునకు రెండువందల రూపాయీలు యివ్వవలసివచ్చేది అయివుండగా **A** అనే మనిషి మాసమునకు యాభై రూపాయీలు యిచ్చేలాగున నిర్ణయించుకొన్నాడు. ఇందులో **A** అనేమనిషి చాలనిదిగావుండే ప్రతిపద్ధాకు **Z** అనే మనిషివద్ద కిమ్మతుగలవస్తువ పొందినవాడవుతున్నాడు.

(b) జడ్జి అయిన **A** అనేమనిషి, సాధారణముగా నూటికి కొంత యెక్కువ ఖరీదుకు అమ్మకముచేస్తూవున్నప్పుడు కొంత తక్కువ ఖరీదుకు గవర్నమెంటుపత్రములు తన కోర్టులో వ్యాజ్యదారుడైన **Z** అనే మనిషివద్ద ఖరీదుచేసినాడు. **A** అనేమనిషి, చాలినంత ప్రతిపద్ధాలేకుండా **Z** అనే మనిషివద్దనుంచి కిమ్మతుగల వస్తువ పుచ్చుకొన్నవాడవుతున్నాడు.

(c) **Z** అనే మనిషియొక్క సహోదరుడు, తప్పుసాక్ష్యము చెప్పినాడనే ఫిర్యాదుమీద పట్టుకోబడి మేజిస్ట్రేటు అయిన **A** అనేమనిషి యెదటికి హాజరుచెయ్య

బడ్డాడు. A అనేమనిషి సాధారణముగా కొంతతక్కువ ఖరీదుకు అమ్మకముచేస్తూ వున్నప్పుడు యెక్కువ ఖరీదుకు ఒక బాంకీలోని పాళ్లు Z అనే మనిషికి విక్రయిస్తు న్నాడు. Z అనేమనిషి ఆదేప్రకారము ఆ పాళ్లకుగాను A అనే మనిషికి పయికము చెల్లించుచూవున్నాడు. A అనే మనిషివల్ల ఆ ప్రకారము పుచ్చుకోబడ్డ పయికము చాలినంత ప్రతిఫలములేకుండా అతనివల్ల పొందబడ్డ కిమ్మతుగల వస్తువగా వుంటున్నది.

ఏ మనిషికయినా హాని చెయ్యావలెననే యత్నముతో న్యాయ శాస్త్రమును వుల్లంఘించే పబ్లిక్ వుద్యోగస్థుడు.

166. ఏ మనిషికయినా హానిచెయ్యాడమునకు యత్నించిగాని అందువల్ల తాను హానికలగచేయవచ్చునని యెరిగి వుండిగాని పబ్లిక్ వుద్యోగస్థుడుగా తాను ప్రవర్తించ వలసిన పద్ధతినిగురించిన న్యాయశాస్త్రపు నిబంధన యెరిగివుండిన్ని వుల్లంఘునచేసి నడుచుకొనే పబ్లిక్ వుద్యోగస్థుడయిన యే మనిషి అయినా, ఒక సం వత్సరమునకు వ్యాపించగూడిన కాలమువరకు సాధారణమయిన ఖయిదు వల్లగాని జుల్మానావల్లగాని ఈ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

దృష్టాంతము.

కోర్టు ఆఫ్ జస్టీసువారివల్ల Z అనేమనిషి తరఫున చెయ్యాబడ్డ తీర్పుకు చెల్లుగా ఆస్తి జప్తుచేసేలాగున న్యాయశాస్త్రమునుపట్టి నిర్ణయించబడ్డ ఒక ఆఫీసరు అయిన A అనేమనిషి, Z అనే మనిషికి అందువల్ల హానికలగవచ్చుననే యెరుకతో ఆ న్యాయ శాస్త్రపు నిబంధనలను బుద్ధిపూర్వకముగా వుల్లంఘునచేసి నడుస్తున్నాడు. A అనే మనిషి, యీ సెక్షనులో నిర్ధారణ చెయ్యాబడ్డ నేరము జరిగించినవాడవుతున్నాడు.

హానికలగ చెయ్యావలెననే యత్నముతో సరికాకుండా వుండే ఒక దస్తావేజు సృష్టించే ఒక పబ్లిక్ వుద్యోగస్థుడు.

167. ఒక పబ్లిక్ వుద్యోగస్థుడుగావుండిన్ని అట్లా పబ్లిక్ వుద్యోగస్థుడుగా యేదయినా దస్తావేజు తయారుచేసే, లేక తర్జుమాచేసే పనిచూస్తూవుండిన్ని అందువల్ల యెవరికయినా హానికలగచెయ్యావలెననిగాని అందువల్ల హానికలగవచ్చునని యెరిగివుండిగాని సరి అయినది కానట్టు తాను యెరిగివుండే, లేక నమ్మే తరహాను ఆ దస్తావేజు సృష్టించే, లేక తర్జుమాచేసే యేమనిషి అయినా, మూడు

సంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతెరహాలలో ఒక తెరహా ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది,

న్యాయశాస్త్రవిరోధముగా వర్తకములో ప్రవేశించే పబ్లిక్ వుద్యోగస్థుడు.

168. పబ్లిక్ వుద్యోగస్థుడుగావుండిన్ని అట్లా పబ్లిక్ వుద్యోగస్థుడుగా వర్తకమందు ప్రవేశించకుండా వుండేలాగున న్యాయశాస్త్రమువల్ల బద్ధుడయివుండిన్ని వర్తకములో ప్రవేశించే యేమనిషి అయినా, ఒకసంవత్సరమునకు వ్యాపించగూడిన కాలమువరకు సాధారణమయిన ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

ఏదయినా ఆస్తి న్యాయశాస్త్రవిరోధముగా ఖరీదుచేసే, లేక యేలములో అడిగే పబ్లిక్ వుద్యోగస్థుడు.

169. పబ్లిక్ వుద్యోగస్థుడుగావుండిన్ని అట్లా పబ్లిక్ వుద్యోగస్థుడుగా ఒకానొక ఆస్తి ఖరీదుచెయ్యకుండా, లేక యేలములో అడగకుండా వుండేలాగున న్యాయశాస్త్రమువల్ల బద్ధుడయివుండిన్ని తనపేరట, లేక మరి ఒకరిపేరట వుమ్మడిగాగాని యితరులతో పాలుగాగాని ఆ ఆస్తి ఖరీదుచేసే, లేక యేలములో అడిగే యేమనిషి అయినా రెండుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు సాధారణమయిన ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది; ఖరీదు చెయ్యబడి వున్నపక్షమునకు ఆ ఆస్తి దండుగకింద పుచ్చుకోబడవలసినది.

తాను ఒక పబ్లిక్ వుద్యోగస్థుడయినట్టు మాయగా నటించడము.

170. ఒక పబ్లిక్ వుద్యోగము తనకు లేదని యెరిగివుండిన్ని అట్టి వుద్యోగము తనకు వున్నట్టు సూచనచేస్తూ, లేక అట్టి వుద్యోగము వుంచుకొనివుండే యే యితర మనిషి అయినా తానుగావున్నట్టు మాయగా నటిస్తూ అట్లా వహించుకోబడ్డ వుద్యోగపు మిషమీద యేదయినా కార్య

ము జరిగించే, లేక జరిగించవలెనని యత్నించే యేమనిషి అయినా, రెండు సంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాల లో ఒకతరహా ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది,

దగా యత్నముతో పబ్లిక్ వుద్యోగస్థుడు ధరించుకొనే వస్త్రములు ధరించుకోవడము, లేక వాని గుర్తు కూడా తీసుకొనివెళ్లడము.

171. పబ్లిక్ వుద్యోగస్థుల తరగతిలో తాను ఒకడుగా వున్నట్టు నమ్మబడవలెననే యత్నముతో, లేక అట్లా నమ్మబడవచ్చుననే యెరుకతో అట్టి పబ్లిక్ వుద్యోగస్థుల తరగతివారు ధరించుకొనే యేదయినా వస్త్రమువంటి, లేక గుర్తువంటి యేదయినా వస్త్రము ధరించుకొనే, లేక యేదయినా గుర్తుకూడా తీసుకొని వెళ్లే పబ్లిక్ వుద్యోగస్థుల తాలూకు అట్టి తరగతిలో ఒకడుగా వుండని యే మనిషి అయినా మూడుమాసములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండు తరహాలలో ఒక తరహా ఖయిదువల్లగాని రెండువందలరూపాయీలకు వ్యాపించగూడిన జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

---

## 10-వ అధ్యాయము.

### పబ్లిక్ వుద్యోగస్థుల తాలూకు న్యాయశాస్త్ర సమ్మతమయిన అధికారములను తిరస్కరించడమును గురించి.

సమ్మన్సుగాని యితర చర్యగాని అప్పగింత చెయ్యబడకుండా పారిపోవడము.

172. ఉద్యోగధర్మమునుబట్టి సమ్మన్సు, నోటీసు, లేక హుకుము సాదరు చెయ్యడమునకు న్యాయశాస్త్రరీత్యా తగివుండే యే పబ్లిక్ వుద్యోగస్థునివల్లనైనా సాదరు చెయ్యబడే సమ్మన్సు, నోటీసు, లేక హుకుము అప్పగింతచెయ్యబడకుండా పారిపొయ్యే యేమనిషి అయినా, ఒక మాసము

నకు వ్యాపించగూడిన కాలమువరకు సాధారణమయిన ఖయిదువల్లగాని అయిదువందల రూపాయలకు వ్యాపించగూడిన జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని;

అట్టి సమ్మన్సు, నోటీసు, లేక హుకుము, అతడు ఒక కోర్టు ఆఫ్ జస్టిసులో ఖుద్దున, లేక ఏజెంటుద్వారా హాజరు కావడముకొరకుగాని ఒక దస్తావేజు హాజరు చెయ్యడముకొరకుగాని అయివున్నయెడల ఆరు మాసములకు వ్యాపించగూడిన కాలమువరకు సాధారణమయిన ఖయిదువల్లగాని వెయ్యిరూపాయలకు వ్యాపించగూడిన జుల్మానావల్లగాని ఈ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

సమ్మన్సు, లేక యితరచర్య అప్పగింత చెయ్యబడకుండాగాని అది ప్రసిద్ధపరచకుండాగాని ఆటంకపెట్టడము.

**173.** ఉద్యోగధర్మమునుపట్టి సమ్మన్సు, నోటీసు, లేక హుకుము సాదరు చెయ్యడమునకు న్యాయశాస్త్రరీత్యా తగివుండే యే పబ్లిక్ వుద్యోగస్థునివల్లనైనా సాదరు చెయ్యబడ్డ సమ్మన్సు, నోటీసు లేక హుకుము తనకుగాని, లేక యే యితర మనిషికయినాగాని అప్పగింత చెయ్యబడకుండా యే తరహానయినా మనఃపూర్వకముగా ఆటంకపెట్టే,

లేక అట్టి సమ్మన్సు, నోటీసు, లేక హుకుము యే స్థలమందైనా న్యాయశాస్త్రప్రకారము అంటించబడకుండా మనఃపూర్వకముగా ఆటంకపెట్టే,

లేక న్యాయశాస్త్రప్రకారము అంటించబడివుండే స్థలములోనుంచి యేదైనా అట్టి సమ్మన్సు, నోటీసు, లేక హుకుము మనఃపూర్వకముగా తీసివేసే,

లేక వుద్యోగధర్మమునుపట్టి యేదైనా ఇస్తిహారు చేసేలాగున హుకుముచెయ్యడమునకు న్యాయశాస్త్రరీత్యా తగవుండే యే పబ్లిక్

వుద్యోగస్థునియొక్క అయినా అధికారముమీద న్యాయశాస్త్రప్రకారము యేదయినా ఇస్తిహారు చెయ్యబడకుండా మనఃపూర్వకముగా ఆటంకపెట్టే యేమనిషి అయినా,

ఒక మాసమునకు వ్యాపించగూడిన కాలమువరకు సాధారణమయిన ఖయిదువల్లగాని అయిదువందల రూపాయీలకు వ్యాపించగూడిన జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని;

సమ్మన్సు, నోటీసు, హుకుము, లేక ఇస్తిహారు ఒక కోర్టు ఆఫ్ జస్టిసులో ఖుద్దున, లేక ఏజెంటుద్వారా హాజరుకావడముకొరకుగాని ఒక దస్తావేజు హాజరుచెయ్యడముకొరకుగాని అయివున్నయెడల ఆరు మాసములకు వ్యాపించగూడిన కాలమువరకు సాధారణమయిన ఖయిదువల్లగాని వెయ్యి రూపాయీలకు వ్యాపించగూడిన జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

ఒక పబ్లిక్ వుద్యోగస్థునివల్ల సాదరు చెయ్యబడ్డ హుకుముప్రకారము హాజరు కాక పోవడము.

174. ఉద్యోగధర్మమునుపట్టి సమ్మన్సు, నోటీసు, హుకుము, లేక ఇస్తిహారు సాదరు చెయ్యడమునకు న్యాయశాస్త్రరీత్యా తగివుండే యే పబ్లిక్ వుద్యోగస్థునివల్లనయినా సాదరు చెయ్యబడ్డ సమ్మన్సు, నోటీసు, హుకుము, లేక ఇస్తిహారు, వీటిప్రకారము నిర్ణయమైన స్థలమందున్ను కాలమందున్ను ఖుద్దునగాని ఏజెంటుద్వారాగాని హాజరయ్యేలాగున న్యాయశాస్త్రప్రకారము బద్ధుడయివుండి,

ఆ స్థలమందు, లేక ఆకాలమందు మనఃపూర్వకముగా హాజరు కాకపొయ్యే, లేక హాజరయినతర్వాత తాను న్యాయశాస్త్రప్రకారము తిరిగీ వెళ్లిపోగూడినకాలమునకు ముందు తాను హాజరుగావుండతమునకు బద్ధుడయివుండే స్థలములోనుంచి వెళ్లిపొయ్యే యే మనిషి అయినా,

ఒక మాసమునకు వ్యాపించగూడిన కాలమువరకు సాధారణమయిన ఖయిదువల్లగాని అయిదువందల రూపాయీలకు వ్యాపించగూడిన జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని,

సమ్మన్సు, నోటీసు, హుకుము, లేక ఇస్తిహారు ఒక కోర్టు ఆఫ్ జస్టిసులో ఖుద్దున, లేక ఏజెంటుద్వారా హాజరుకావడముకొరకు అయివున్న యెడల ఆరుమాసములకు వ్యాపించగూడిన కాలమువరకు సాధారణమయిన ఖయిదువల్లగాని వెయ్యిరూపాయీలకు వ్యాపించగూడిన జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

దృష్టాంతములు.

(a) కలకత్తాలోవుండే సుప్రీంకోర్టువారివల్ల సాదరు చెయ్యబడ్డ సాక్షిసమ్మన్సు ప్రకారము ఆ సుప్రీంకోర్టువారి యెదట హాజరయ్యేలాగున న్యాయశాస్త్రప్రకారము బద్ధుడయివుండే ఎ అనేమనిషి, మనఃపూర్వకముగా హాజరుకాకుండా పోతున్నాడు. ఎ అనేమనిషి, యీ సెక్షనులో నిర్ధారణచెయ్యబడ్డ నేరము జరిగించనవాడవుతున్నాడు.

(b) ఒక జిల్లా జడ్జీగారివల్ల సాదరు చెయ్యబడ్డ సమ్మన్సుప్రకారము సాక్షిగా జిల్లా కోర్టుయెదట హాజరయ్యేలాగున న్యాయశాస్త్రప్రకారము బద్ధుడయివుండే ఎ అనేమనిషి, మనఃపూర్వకముగా హాజరుకాకుండా పోతున్నాడు. ఎ అనేమనిషి, యీ సెక్షనులో నిర్ధారణచెయ్యబడ్డ నేరము జరిగించనవాడవుతున్నాడు.

దస్తావేజు హాజరు చేసేలాగున న్యాయశాస్త్రప్రకారము బద్ధుడయివుండేమనిషి, పబ్లిక్ వుద్యోగస్థుని యెదట దానిని హాజరు చెయ్యకపోవడము.

175. ఉద్యోగధర్మమునుపట్టి ఒక పబ్లిక్ వుద్యోగస్థునివద్ద యేదయినా దస్తావేజు హాజరుచేసేలాగునగాని అప్పగింత చేసేలాగునగాని న్యాయశాస్త్రప్రకారము బద్ధుడయివుండి అది మనఃపూర్వకముగా హాజరు చెయ్యకుండా, లేక అప్పగింత చెయ్యకుండాపోయ్యేమనిషి అయినా, ఒక మాసమునకు వ్యాపించగూడిన కాలమువరకు సాధారణమయిన ఖయిదువల్లగాని అయిదువందల రూపాయీలకు వ్యాపించగూడిన జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని;

ఆ దస్తావేజు ఒక కోర్టు ఆఫ్ జస్టిసుయెదట హాజరు చెయ్యబడ వలసినదిగా, లేక అప్పగింత చెయ్యబడవలసినదిగా వున్నపక్ష ముకు ఆరుమాసములకు వ్యాపించగూడిన కాలమువరకు సాధారణ మయిన ఖయిదువల్లగాని వెయ్యిరూపాయీలకు వ్యాపించగూడిన జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

దృష్టాంతము.

ఒక జిల్లా కోర్టువారియెదట ఒక దస్తావేజు హాజరుచేసేలాగున న్యాయశాస్త్ర ప్రకారము బద్ధుడయివుండే ఎ అనేమనిషి, మనఃపూర్వకముగా అది హాజరు చెయ్యకుండా పోతున్నాడు. ఇందులో, ఎ అనేమనిషి, యీ సెక్షనులో నిర్ధారణ చెయ్యబడ్డ నేరము జరిగించినవాడవుతున్నాడు.

176. ఉద్యోగధర్మమునుపట్టి ఒక పబ్లిక్ వుద్యోగస్థునికి యే సంసంగతినిగురించి అయినా యేదయినా నోటీసు యిచ్చేలాగున, లేక సమాచారము తెలియచేసేలాగున న్యాయశాస్త్రమువల్ల బద్ధుడయివుండి న్యాయశాస్త్రమువల్ల నిర్ణయించబడ్డ తరహాననున్న కాలమందున్న అట్టి నోటీసు యివ్వకగాని అట్టి సమాచారము తెలియచెయ్యకగాని మనఃపూర్వకముగా తప్పిపొయ్యే యేమనిషి అయినా, ఒక మాసమునకు వ్యాపించగూడిన కాలమువరకు సాధారణ మయిన ఖయిదువల్లగాని అయిదువందల రూపాయీలకు వ్యాపించగూడిన జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని;

నోటీసు యిచ్చేటట్టుగాని సమాచారము తెలియచేసేటట్టుగాని న్యాయశాస్త్రమువల్ల బద్ధుడయివుండే మనిషి పబ్లిక్ వుద్యోగస్థునికి దానిని యివ్వకుండా లేక తెలియచెయ్యకుండా పోవడము.

అట్లా యివ్వవలసిన నోటీసు, లేక తెలియచెయ్యవలసిన సమాచారము చెయ్యబడ్డ నేరముతో సంబంధము కలిగివుండేదిగా, లేక ఒక నేరము జరిగించబడకుండా ఆపడముకొరకు, లేక ఒక నేరస్థుణ్ని, పట్టు

కోవడముకొరకే జరూరయినదిగా వున్న పక్షమునకు ఆరుమాసము లకు వ్యాపించగూడిన కాలమువరకు సాధారణమయిన ఖయిదువల్ల గాని వెయ్యిరూపాయీలకు వ్యాపించగూడిన జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

అవాస్తవమయిన సమాచారము తెలియచెయ్యడము.

177. వుద్యోగధర్మమునుపట్టి ఒక పబ్లిక్ వుద్యోగస్థునికి యే సంగతినిగురించి అయినా, సమాచారము తెలియ చేసేలాగున న్యాయశాస్త్రమువల్ల బద్ధుడయివుండి ఆ సంగతినిగురించి అవాస్తవముగా వుండేలాగున తాను యెరిగివుండే, లేక నమ్మడమునకు కారణము కలిగివుండే యే దయినా సమాచారము వాస్తవమైనట్టు తెలియచేసే యేమనిషి అయి నా, ఆరుమాసములకు వ్యాపించగూడిన కాలమువరకు సాధారణమైన ఖయిదువల్లగాని వెయ్యిరూపాయీలకు వ్యాపించగూడిన జుల్మానావల్ల గాని యీ రెంటివల్లగాని;

అట్లా తెలియచెయ్యడమునకు అతను న్యాయశాస్త్రమువల్ల బద్ధుడైవుండే సమాచారము చెయ్యబడ్డ ఒక నేరముతో సంబంధించి నదిగా, లేక ఒక నేరము జరిగించబడకుండా ఆపడముకొరకు, లేక ఒక నేరస్థుణ్ని పట్టుకోవడముకొరకు జరూరయినదిగా వున్న పక్షము నకు రెండుసంవత్సరములకు వ్యాపించగూడినకాలమువరకు రెండు తర హాలలో ఒక తరహా ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని యీ రెంటి వల్లగాని శిక్షించబడవలసినది.

దృష్టాంతములు.

(a) జమీన్‌దారు అయిన A అనేమనిషి, తనభూముల సరిహద్దులకు లోపుగా ఒక ఖూనీ జరిగినట్టు యెరిగివుండి ఒకపాము కరవడమువల్ల దైవవశాత్తుగా ఆ మరణము సంభవించినదని ఆ డిస్ట్రిక్టు తాలూకు మేజిస్ట్రేటుగారికి బుద్ధిపూర్వకముగా

తప్పుసమాచారము తెలియచేస్తున్నాడు. A అనేమనిషి, యీ సెక్షనులో నిర్ధారణ చెయ్యబడ్డ నేరమునుగురించి నేరస్థుడు అవుతున్నాడు.

(b) గ్రామ తలారీ అయిన A అనేమనిషి, ఆ సమీపమందు వాసము చేసే భాగ్యముగల వర్తకుడైన Z అనే మనిషియొక్క యింట్లో ఒక బందిపోటు జరిగించడము కొరకు మనుష్యుల తాలూకు ఒక గొప్ప మూక పనగ్రామము మీదుగా వెళ్లిపోయినట్టు యెరిగివుండిన్ని బంగాళా చట్టపుస్తకము తాలూకు 1821-వ సంవత్సరపు 3-వ రెగ్యులేషన్ యొక్క 7-వ సెక్షనులోని 5-వ క్లాజుప్రకారము ఆసంగతినిగురించి అక్కడికి సమీపముగావుండే పోలీసుస్టేషన్ తాలూకు ఆఫీసరుకు వెంటనే తప్పకుండా సమాచారము తెలియచెయ్యవలసినవాడై వుండిన్ని మరి ఒక దిక్కునవుండే ఒక దూర స్థలమందు బందిపోటు జరిగించవలెననే తాత్పర్యముతో తన గ్రామముమీదుగా సంశయాస్పదులయిన మనుష్యులతాలూకు ఒక మూక వెళ్లినదని ఆ పోలీసు ఆఫీసరుకు బుద్ధిపూర్వకముగా తప్పుసమాచారము తెలియచేస్తున్నాడు. ఇందులో, A అనే మనిషి, యీ సెక్షనుయొక్క కడపటిభాగములో నిర్ధారణచెయ్యబడ్డ నేరమునుగురించి నేరస్థుడుగా వుంటున్నాడు.

వివరణము.—176-వ సెక్షనులోను ఈ సెక్షనులోను „నేరము" అను పదములో ఏకార్యము బ్రిటిష్ ఇండియాలో జరిగినయెడల ఈక్రింది సెక్షనులలో, అనగా 302, 304, 382, 392, 393, 394, 395, 396, 397, 398, 399, 402, 435, 436, 449, 450, 457, 458, 459, 460, సెక్షనులలో దేని ననుసరించియయినను సరే శిక్షార్హమగునో బ్రిటిష్ ఇండియాకు వెలుపల ఏ స్థలమందైన జరిగింపబడిన అట్టి యే కార్యమైనను చేరును; మఱియు „నేరస్థుడు" అను పదములో, అట్టియే కార్యమునైన చేయుటవల్ల దోషియైనట్టు చెప్పబడు ఏ మనుష్యుడైనను చేరును.

ఒక పబ్లిక్ వుద్యోగస్థుడు ప్రమాణము లేక రూఢివాక్యము

178. వాస్తవము చెప్పడమునుగురించి ప్రమాణమువల్ల లేక రూఢివాక్యమువల్ల బద్ధుడుకావలసినది అని ఆజ్ఞాపించడమునకు న్యాయశాస్త్రప్రకారము తగివుండే ఒక పబ్లిక్ వుద్యోగస్థునివల్ల అట్లా బద్ధుడయ్యే

చేసేలాగున క్రమముగా ఆజ్ఞాపించినప్పుడు అట్లా చెయ్యకుండా తిరగబాటు చెయ్యడము.

లాగున ఆజ్ఞాపించబడిన్ని అట్లా చెయ్యకుండా తిరగబాటుచేసే యే మనిషి అయినా, ఆరుమాసములకు వ్యాపించగూడిన కాలమువరకు సాధారణమైన ఖయిదువల్లగాని వెయ్యిరూపాయీలకు వ్యాపించగూడిన జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

సవాలు చెయ్యడమునకు అధికారముగల పబ్లిక్ వుద్యోగస్థునికి జవాబు చెప్పక తిరగబాటు చెయ్యడము.

179. ఏ పబ్లిక్ వుద్యోగస్థునికైనా యేదైనా సంగతినిగురించి యథార్థము చెప్పేలాగున న్యాయశాస్త్రరీత్యా బద్ధుడయివుండి అట్టి పబ్లిక్ వుద్యోగస్థునియొక్క న్యాయశాస్త్రసమ్మతమైన అధికారములు చెలాయించడమందు అతనివల్ల ఆ సంగతినిగురించి వెయ్యబడ్డ యే సవాలుకు అయినా జవాబు చెప్పక తిరగబాటుచేసే యే మనిషి అయినా, ఆరుమాసములకు వ్యాపించగూడిన కాలమువరకు సాధారణమైన ఖయిదువల్లగాని వెయ్యిరూపాయీలకు వ్యాపించగూడిన జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

కయిఫియ్యతుమీద దస్కతు చెయ్యకుండా తిరగబాటు చెయ్యడము.

180. కయిఫియ్యతుమీద దస్కతుచేసేలాగున ఆజ్ఞాపించడముకొరకు న్యాయశాస్త్రప్రకారము [illegible] ఒక పబ్లిక్ వుద్యోగస్థునివల్ల ఆ కయిఫియ్యతుమీద దస్కతుచేసేలాగున ఆజ్ఞాపించబడి తనవల్ల యివ్వబడ్డ అట్టి యే కయిఫియ్యతుమీదనైనా దస్కతుచెయ్యకుండా తిరగబాటుచేసే యేమనిషి అయినా, మూడుమాసములకు వ్యాపించగూడిన కాలమువరకు సాధారణమైన ఖయిదువల్లగాని అయిదువందల రూపాయీలకు వ్యాపించగూడిన జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

ప్రమాణము లేక రూఢివాక్యముచేయించడమునకు అధికారముకలిగివుండే పబ్లిక్ వుద్యోగస్థుని వద్దగాని యితరమనిషివద్దగాని ప్రమాణము లేక రూఢి వాక్యముమీద అవాస్తవమైన కయిఫియ్యతు యివ్వడము.

131. ప్రమాణము లేక రూఢివాక్యము చేయించడమునకు న్యాయశాస్త్రమునుపట్టి అధికారము కలిగివుండే ఒక పబ్లిక్ వుద్యోగస్థునికిగాని యితరమనిషికిగాని యే సంగతినిగురించి అయినా యథార్థము చెప్పేటట్టు ప్రమాణము లేక రూఢివాక్యము మీద న్యాయశాస్త్రరీత్యా బద్ధుడయివుండి అట్టి సంగతిని గురించి అవాస్తవముగా వుండేటటువంటిన్ని అవాస్తవముగావున్నట్టు తాను యెరిగివుండే లేక నమ్మేటటువంటిన్ని వాస్తవముగా వున్నట్టు తాను నమ్మనటువంటిన్ని యేదైనా కయిఫియ్యతు అట్లా పైన చెప్పబడ్డ పబ్లిక్ వుద్యోగస్థునికిగాని యితర మనిషికిగాని యిచ్చే యే మనిషి అయినా, మూడుసంవత్సరములవరకు వ్యాపించగూడినకాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్ల శిక్షించబడడమేగాకుండా జుల్మానాకున్ను పాత్రుడు కావలసినది.

పబ్లిక్ వుద్యోగస్థుడు న్యాయమైన తన యధికారమును మరియొక మనుష్యునికి హాని కలుగులాగున వినియోగపరుచునట్లు చేయావలెనను ఉద్దేశముతో అతనికి వాస్తవముకానిసమాచారమును తెలియఁజేయుట.

182. ఏ మనుష్యుఁడైనను—

(a) వేనినిగురించి సమాచారము తెలియఁజేయఁబడ్డదో అట్టి సఁగతులయొక్క యథార్థస్థితి పబ్లిక్ వుద్యోగస్థునికి తెలిసియున్నయెడల అట్టి వుద్యోగస్థుఁడు జరిగింపఁగూడనట్టి, లేక మానుకొనఁగూడనట్టి ఏ కార్యమునైన అతఁడు జరిగించునట్లు లేక మానుకొనునట్లు, లేక

(b) అట్టి పబ్లిక్ వుద్యోగస్థుఁడు న్యాయమైన తన యధికారమును ఏ మనుష్యునికైన హానిగాని ఆర్తిగాని కలుగులాగున వినియోగపఱుచునట్లు,

చేయవలెనని యత్నించి, లేక బహుశః చేయుంతునని ఎఱింగియుండి, వాస్తవముకాదని తనకు తెలిసియుండునట్టిగాని తాను నమ్మునట్టిగాని సమాచారమును దేనినైన అట్టి యే పబ్లిక్ ఉద్యోగస్థునికైనను తెలియఁజేయు పక్షమున, అతఁడు ఆఱుమాసములదాఁక ఎంతకాలముకైనైన రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లఁగాని వేయిరూపాయీలవఱకు జుల్మానావల్లఁగాని ఈ రెంటివల్లఁగాని శిక్షింపఁబడఁ యును.

## దృష్టాంతములు.

(a) A అనువాఁడు, తాను తెలియఁజేయు సమాచారము అవాస్తవమైనదని ఎఱింగియుండియు, అట్టి సమాచారమువలన మాజిస్ట్రేటు తనకు తాబేదారుండు పోలీసు ఆఫీసరైన Z అనువానిని తీసివేయవచ్చునని ఎఱింగియుండియు, Z అనువాఁడు తన పనిలో అశ్రద్ధచేసినాఁడని, లేక దుష్ప్రవర్తన జరిగించినాఁడని, అట్టి మాజిస్ట్రేటుకు తెలియఁజేయును. A అనువాఁడు ఈ సెక్షనులో నిర్వచనము చేయఁబడిన నేరము జరిగించినవాఁ డగును.

(b) A అనువాఁడు, తాను తెలియఁజేయు సమాచారము అవాస్తవమైనదని ఎఱింగియుండియు, ఆ సమాచారమువలన బహుశః Z అనువానికి ఆర్తి కలుగునట్లు సదరు Z అనువాని యిల్లు సోదాచేయఁబడునని ఎఱింగియుండియు, Z అనువానియొద్ద ఒక రహస్యమయిన స్థలమందు నిషిద్ధమయిన ఉప్పు ఉన్నదని ఒక పబ్లిక్ ఉద్యోగస్థునితో అవాస్తవముగా తెలియఁజేయును. A అనువాఁడు, ఈ సెక్షనులో నిర్వచనము చేయఁబడిన నేరము జరిగించినవాఁ డగును.

(c) A అనువాఁడు, ఒకానొక గ్రామమునకు సమీపమందు తన్ను దొమ్మిచే దోఁచుకొనినారని పోలీసువానితో అవాస్తవముగా తెలియఁజేయును. అతఁడు తన్ను దొమ్మిచేసినవారిలో ఏ మనుష్యుని పేరును చెప్పఁడు, కాని ఈ సమాచారమువల్ల బహుశః సదరు పోలీసువారు, గ్రామస్థులకుఁగాని వారిలో కొందఱికిఁగాని ఆర్తి కలుగునట్లు గ్రామములో విచారణలుచేసి శోధనలు చేయుదురని తెలియును. A అనువాఁడు ఈ సెక్షను ననుసరించి నేరము జరిగించినవాఁ డగును.

183. పబ్లిక్ వుద్యోగస్థుడని తాను యెరిగివుండి, లేక నమ్మడమునకు కారణము కలిగివుండి ఒక పబ్లిక్ వుద్యోగస్థునియొక్క న్యాయశాస్త్ర సమ్మతమైన అధికారమువీూద ఆస్తి తీసుకొనిపోబడకుండా యెదిరించే యే మనిషి అయినా ఆరుమాసములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని వెయ్యిరూపాయీలకు వ్యాపించగూడిన జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

పబ్లిక్ వుద్యోగస్థుని తాలూకు న్యాయశాస్త్ర సమ్మతి మయిన అధికారము మీద ఆస్తి తీసుకొని పోబడకుండా యెదిరించడము.

184. ఉద్యోగధర్మమునుపట్టి ఒక పబ్లిక్ వుద్యోగస్థునియొక్క న్యాయశాస్త్ర సమ్మతమయిన అధికారమువీూద విక్రయముకొరకు వుంచబడ్డ ఆస్తి విక్రయించకుండా మనఃపూర్వకముగా అడ్డే యే మనిషి అయినా, ఒక మాసమునకు వ్యాపించగూడిన కాలమువరకు రెండు తరహాలలో ఒక తరహా ఖయిదువల్లగాని ఐదువందల రూపాయీలకు వ్యాపించగూడిన జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

పబ్లిక్ వుద్యోగస్థునియొక్క అధికారమువీద విక్రయముకొరకు వుంచబడ్డ ఆస్తి విక్రయించకుండా అడ్డడము.

185. ఉద్యోగధర్మమునుపట్టి ఒక పబ్లిక్ వుద్యోగస్థునియొక్క న్యాయశాస్త్ర సమ్మతమయిన అధికారమువీూద జరిగించబడే ఆస్తి తాలూకు యే విక్రయకాలమునందయినా, ఆ విక్రయకాలమందు అట్టి ఆస్తి ఖరీదు చెయ్యడమునకు న్యాయశాస్త్రమునుపట్టి అర్హత లేనట్టు యెరిగివుండి యే మనిషికొరకయినాసరే, లేక తనకొరకు అయినాసరే ఆ ఆస్తి ఖరీదుచేసే, లేక వేలములో అడిగే, లేక అట్లా అడగడమువల్ల తనకు కలిగే

పబ్లిక్ వుద్యోగస్థునియొక్క అధికారమువీద విక్రయముకొరకు వుంచబడ్డఆస్తి న్యాయశాస్త్ర విరోధముగా ఖరీదు చెయ్యడము లేక అడగడము.

షరతుల ప్రకారము నెరవేర్చని వారిని ప్రశ్నించకుండా అట్టి ఆక్టు దేశముంలో అడిగే యే మనిషి అయినా, ఒకమాసమునకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని రెండువందల రూపాయీలకు వ్యాపించగూడిన జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

పబ్లిక్ వుద్యోగస్థుడు పబ్లిక్ పనులు జరిగించేటప్పుడు ఆటంకపెట్టడము.

186. పబ్లిక్ వుద్యోగస్థుడు తన పబ్లిక్ పనులు జరిగించేటప్పుడు స్వేచ్ఛగా ఆటంకపెట్టే యే మనిషి అయినా, మూడుమాసములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని అయిదువందల రూపాయీలకు వ్యాపించగూడిన జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

న్యాయశాస్త్రమునుసట్టి సహాయము చెయ్యడము విధాయకమయివుండగా పబ్లిక్ వుద్యోగస్థునికి సహాయము చెయ్యకుండా పోవడము.

187. పబ్లిక్ వుద్యోగస్థుడు తన పబ్లిక్ పనులు జరిగించేటప్పుడు అతనికి సహాయము చేసేలాగున న్యాయశాస్త్రమువల్ల బద్ధుడయివుండి మనఃపూర్వకముగా అట్టి సహాయ్యము చెయ్యకుండా పొయ్యే యే మనిషి అయినా ఒకమాసమునకు వ్యాపించగూడిన కాలమువరకు సాధారణమయిన ఖయిదువల్లగాని రెండువందల రూపాయీలకు వ్యాపించగూడిన జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది;

మరిన్ని ఒక కోర్టు ఆఫ్ జస్టిసువారివల్ల న్యాయశాస్త్రరీత్యా సాదరు చెయ్యబడ్డ యేదయినా చర్య అమలులోకి తేవడమునకు, లేక ఒక నేరము జరిగించబడకుండా ఆపడమునకు, లేక ఒక అల్లరగాని ఖత్తరగాని నివారించడమునకు, లేక ఒక నేరము జరిగించినట్టు చెప్పబడ్డ, లేక ఒక నేరము జరిగించిన, లేక న్యాయశాస్త్రి సమ్మత

మయిన ఖయిదులోనుంచి తప్పించుకొని పారిపోయిన ఒక మనిషిని పట్టుకోవడమునకుగాను అట్టి సహాయము కోరడమునకు న్యాయశాస్త్రమువల్ల అర్హుడయివుండే ఒక పబ్లిక్ వుద్యోగస్థునివల్ల ఆ సహాయము చేసేలాగున కోరబడి చెయ్యకపోయినపక్షమునకు అతను, ఆరు మాసములకు వ్యాపించగూడిన కాలమువరకు సాధారణమయిన ఖయిదువల్లగాని అయిదువందల రూపాయీలకు వ్యాపించగూడిన జుల్మానావల్లగాని ఈ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

పబ్లిక్ వుద్యోగస్థునివల్ల క్రమముగా ప్రసిద్ధపరచబడ్డ హుకుమునకు లోబడకుండా పోవడము.

188. ఒక హుకుము ప్రసిద్ధపరచడమునకు న్యాయశాస్త్రరీత్యా అధికారము కలగచెయ్యబడ్డ ఒక పబ్లిక్ వుద్యోగస్థునివల్ల ప్రసిద్ధపరచబడ్డ హుకుమునుపట్టి తాను ఒకానొక కార్యము జరిగించకుండా మానుకొనేలాగునగాని తన స్వాధీనమందు, లేక తన అధికారముకింద వుండే ఒకానొక ఆస్తినిగురించి యేదయినా కార్యము జరిగించేలాగునగాని ఆజ్ఞాపించబడ్డట్టు తాను యెరిగివుండి అట్టి హుకుమునకు లోబడకుండాపొయ్యే యేమనిషి అయినా,

ఆ ప్రకారము అతను లోబడకుండా పోవడమువల్ల న్యాయశాస్త్రరీత్యా పనిచేస్తూవుండే యే మనిషికి అయినా అడ్డు, బాధ, లేక హానిగాని అడ్డు, బాధ, లేక హాని సంభవించగూడిన ప్రమాదముగాని కలగచేసినా, కలగచెయ్యడమునకు తగివున్నా, ఒక మాసమునకు వ్యాపించగూడిన కాలమువరకు సాధారణమయిన ఖయిదువల్లగాని రెండువందల రూపాయీలకు వ్యాపించగూడిన జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది;

మరిన్ని అట్లా లోబడకుండా పోవడమువల్ల మనిషియొక్క ప్రాణమునకుగాని ఆరోగ్యమునకుగాని క్షేమమునకుగాని అపాయము

కలగచేసినా, లేక కలగచెయ్యడమునకు తగివున్నా, ఒక అల్లర, లేక గత్తర కలగచేసినా, కలగచెయ్యడమునకు తగివున్నా ఆరుమాసములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని వెయ్యిరూపాయీలకు వ్యాపించగూడిన జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

వివరణము.—నేరస్థుడు చెరుపు కలగచెయ్యవలెనని యత్నించడముగాని తాను లోబడకుండా పోవడమువల్ల చెరుపు కలగవచ్చునని యెంచడముగాని యీ నేరమునకు జరూరు కానేరదు. అతడు, తాను దేనికి లోబడకుండా పోతున్నాడో అట్టి హుకుమునుగురించి యెరిగివుండడమున్ను అతను లోబడకుండా పోవడమువల్ల చెరుపు కలగడము, లేక చెరుపు కలగతగివుండడమున్ను చాలును.

దృష్టాంతము.

మతసంబంధమయిన ఒక ఊరేగింపు ఒకానొకవీధి వెంబడి వెళ్లకూడదని ఆజ్ఞాపించే ఒక హుకుము, అట్టి హుకుముచెయ్యడమునకు న్యాయశాస్త్రరీత్యా అధికారము కలగచెయ్యబడ్డ ఒక పబ్లిక్ వుద్యోగస్థునివల్ల ప్రసిద్ధపరచబడ్డది. A అనేమనిషి, యెరిగివుండిన్ని ఆ హుకుమును నిర్లక్ష్యముచేసి అందువల్ల ఒక అల్లర కలగవచ్చునని భయమును కలగచేస్తున్నాడు. A అనేమనిషి, యీ సెక్షనులో నిర్ధారణచెయ్యబడ్డ నేరము జరిగించినవాడు అవుతున్నాడు.

పబ్లిక్ వుద్యోగస్థునికి హాని కలుగునని జడిపించడము.

189. ఏ పబ్లిక్ వుద్యోగస్థునికయినాగాని ఆ పబ్లిక్ వుద్యోగస్థుడు యిలాకా కలిగివుండేలాగున తాను నమ్మే యే మనిషికయినాగాని ఆ పబ్లిక్ వుద్యోగస్థుడు పబ్లిక్ వుద్యోగకార్యములు జరిగించడముతోటి సంబంధముగల యేదయినా కార్యము జరిగించేలాగున, లేక జరిగించకుండా మానుకొనేలాగున, లేక ఆలస్యపరచేలాగున అట్టి పబ్లిక్ వుద్యోగస్థుని ప్రేరేపించడమునకుగాను హానికలుగునని జడిపించే యేమనిషి అయినా,

రెండుసంవత్సరములకు వ్యాపించగూడినకాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించ బడవలసినది.

ఏ మనిషి అయినా పబ్లిక్ వుద్యోగస్థుని యొక్క సంరక్షణకోరకుండా మానుకొనే లాగున చెయ్యగలందులకై హాని కలుగునని జడిపించడము.

190. సంరక్షణచెయ్యడమునకు, లేక చేయించడమునకు వుద్యోగధర్మమునుపట్టి న్యాయశాస్త్రసమ్మతమయిన అధికారము కలిగివుండే యే పబ్లిక్ వుద్యోగస్థుణ్ని అయినా తనకు యేదో ఒక హానికలగకుండా సంరక్షించవలసినదని న్యాయశాస్త్రప్రకారము కోరకుండా ఆ మనిషి మానుకొనేలాగున, లేక కోరకుండావుండేలాగున చెయ్యగలందులకయి యే మనిషికయినా హాని కలుగునని జడిపించే. యే మనిషి అయినా ఒక సంవత్సరమునకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

---

## 11-వ అధ్యాయము.

### తప్పుసాక్ష్యమును గురించిన్ని న్యాయవిచారణకు విరోధముగావుండే నేరములనుగురించిన్ని.

తప్పుసాక్ష్యము చెప్పడము.

191. న్యాయశాస్త్రరీత్యా ప్రమాణమువల్లగాని న్యాయశాస్త్రముతాలూకు విశేషమైననిబంధనవల్లగాని యథార్థము చెప్పేలాగున బద్ధుడయివుండి, లేక యే సంగతినిగురించి అయినా కయిఫియ్యతు యిచ్చేలాగున న్యాయశాస్త్రమువల్ల బద్ధుడయివుండి అవాస్తవముగా వుండేటటువంటిన్ని అవాస్తవముగా వుండేటట్టు తాను యెరిగివుండే, లేక నమ్మే, లేక వాస్తవముగా

వుండేటట్టు తాను నమ్మనటువంటిన్ని యేదయినా కయిఫియ్యతు యిచ్చే యే మనిషి అయినా, తప్పుసాక్ష్యము చెప్పినట్టు చెప్పబడుతున్నాడు.

వివరణము.—(1) నోటిమాటలుగాగాని మరియొకతరహాగాగాని యివ్వబడ్డ కయిఫియ్యతు యీ సెక్షనుయొక్క అర్థముకిందికి వస్తున్నది.

వివరణము.—(2) సాక్ష్యము చెప్పేమనిషి, తనకు కలిగివుండే నమ్మకమునుగురించి యిచ్చేతప్పు కయిఫియ్యతు యీ సెక్షనుయొక్క అర్థము కిందికి వస్తున్నది. ఒక మనిషి, తాను నమ్మకుండావుండే సంగతి తాను నమ్మినట్టు చెప్పడమువల్లనున్ను తాను యెరగనిసంగతి యెరిగినట్టు చెప్పడమువల్లనున్ను తప్పుసాక్ష్యము చెప్పడము అనే నేరమునుగురించి నేరస్థుడు కావచ్చును.

## దృష్టాంతములు.

(a) వెయ్యిరూపాయీలకు Z అనే మనిషిమీద B అనే మనిషికి కలిగివుండే న్యాయమయిన దావాకు ఆధారముగా B అనే మనిషియొక్క దావా నిజమయినదని Z అనేమనిషి తాను వినగా యొకరారుపడ్డట్టు A అనేమనిషి విచారణకాలమంద ప్రమాణముమీద తప్పుసాక్ష్యము చెప్పుతున్నాడు. ఇందులో A అనేమనిషి, తప్పుసాక్ష్యము చెప్పినవాడవుతున్నాడు.

(b) A అనేమనిషి, యథార్థము చెప్పేలాగున ప్రమాణమువల్ల బద్ధుడయివుండి Z అనే మనిషియొక్క దస్కతుగావున్నట్టు తాను నమ్మకుండావుండే ఒకానొక దస్కతు Z అనే మనిషియొక్క దస్తూరిగా వున్నట్టు తాను నమ్ముతున్నానని చెప్పుతున్నాడు. ఇందులో A అనేమనిషి అవాస్తవముగా వున్నట్టు తాను యెరిగివుండే సంగతి చెప్పినాడు గనుక తప్పుసాక్ష్యము చెప్పినవాడవుతున్నాడు.

(c) A అనే మనిషి, Z అనే మనిషియొక్క సాధారణమయిన దస్తూరి యెరిగివుండి ఒకానొక దస్కతు చూచి అది Z అనే మనిషియొక్క దస్తూరీ అని సంశయములేకుండా నమ్మి ఆ దస్తూరీ Z అనే మనిషిదిగా వున్నట్టు తాను నమ్ముతున్నానని చెప్పుతున్నాడు. ఇందులో A అనేమనిషి చెప్పినసంగతి తాను నమ్మేసంగతిని గురించిమాత్రము అయివుండి వాస్తవముగా కూడా వున్నదిగనుక ఆ దస్కతు Z అనే

మనిషియొక్క దస్కతు కాకపోయినా A అనేమనిషి తప్పుసాక్ష్యము చెప్పినవాడు కాడు.

(d) A అనే మనిషి, యథార్థము చెప్పేలాగున ప్రమాణముమీద బద్ధుడయి వుండి యేమీ యెరిగివుండకనే ఒకానొక స్థలమందు ఒకానొకరోజున Z అనేమనిషి వున్నట్టు తాను యెరుగుదునని చెప్పుతున్నాడు. Z అనేమనిషి, ఆ ప్రకారము చెప్ప బడ్డ స్థలమందు ఆ రోజునవున్నాసరే లేకపోయినాసరే A అనేమనిషి తప్పుసాక్ష్యము చెప్పినవాడవుతున్నాడు.

(e) ద్విభాషిగా, లేక తర్జుమాచేసే మనిషిగావుండే A అనేమనిషి యథార్థ మయిన అర్థముగా, లేక తర్జుమాగావుండని, లేక వుండేటట్టు తాను నమ్మనిదాన్ని యథార్థముగా అర్థము తెలియచేసేలాగున, లేక తర్జుమా చేసేలాగున ప్రమాణముమీద తాను బద్ధుడయివుండే ఒక కయిఫియ్యతుయొక్క, లేక దస్తావేజుయొక్క యథార్థ మయిన అర్థముగా, లేక తర్జుమాగా వుండేటట్టు చెప్పుతున్నాడు, లేక నిజపరుస్తు న్నాడు. ఇందులో A అనేమనిషి తప్పుసాక్ష్యము చెప్పినవాడవుతున్నాడు.

192. న్యాయవిచారణసంబంధమయిన చర్యలోనయినా వుద్యో

తప్పుసాక్ష్యము సృష్టిచెయ్యడము.

గధర్మమునుపట్టి న్యాయశాస్త్రప్రకారము ఒకవు ద్యోగస్థునియెదట, లేక ఒక పంచాయతీదారుయె దట జరుగుతూవుండే చర్యలోనయినా సాక్ష్యముగా కనపడవలెననిగాని ఆ ప్రకారము సాక్ష్యముగా కనపడడమువల్ల యే మనిషి అయితే అట్టి చర్యలో ఆ సాక్ష్యమువిూద అభిప్రాయము యేర్పాటుచెయ్యవలసివున్న దో ఆ మనిషి అట్టి చర్యయొక్క ఫయిసలాకు ముఖ్యముగావుండే యే అంశమునుగురించి అయినా తప్పుఅభిప్రాయము పొందేలాగున చెయ్యా వలెననిగాని యత్నించి యేదయినా సంగతి వుండేటట్టుచేసే, లేక యే దయినా పుస్తకములో, లేక గ్రంథములో తప్పుదాఖలుచేసే, లేక యే దైనా తప్పుసంగతి కలిగివుండే దస్తావేజు సృష్టిచేసే యే మనిషి అయినా, "తప్పుసాక్ష్యము సృష్టించినట్టు" చెప్పబడుతున్నాడు.

దృష్టాంతములు.

(a) A అనేమనిషి, Z అనేమనిషి తాలూకు పెట్టెలో కనపడేలాగునన్ను అందువల్ల Z అనే మనిషిమీద చోరీనిగురించిన నేరస్థాపన చెయ్యబడేలాగునన్ను చెయ్యవలెననే యత్నముతోటి అతనిపెట్టెలో కొన్ని ఆభరణములు వుంచుతున్నాడు. ఇందులో A అనేమనిషి, తప్పుసాక్ష్యము సృష్టించినవాడవుతున్నాడు.

(b) A అనేమనిషి, ఒక కోర్టు ఆఫ్ జస్టీసులో వుపబలముగావుండే సాక్ష్యముగా వుపయోగపరచడముకొరకు తన మకానపు లెక్కపుస్తకములో తప్పుదాఖలు చేస్తున్నాడు. A అనేమనిషి, తప్పుసాక్ష్యము సృష్టించినవాడవుతున్నాడు.

(c) A అనేమనిషి నేరముగల బందుకట్టునుగురించి Z అనే మనిషిమీద నేరస్థాపన చేయించవలెననే యత్నముతో అట్టి నేరముగల బందుకట్టులో సహకారియయిన ఒక మనిషికి వ్రాసినట్టు అర్థమయ్యేలాగున Z అనే మనిషియొక్క దస్తూరీని అనుకరించే ఒక ఉత్తరము వ్రాసి ఆ వుత్తరము పోలీసు ఆఫీసర్లు సోదాచేస్తారని తాను యెరిగివుండే స్థలమందు వుంచుతున్నాడు. A అనేమనిషి, తప్పుసాక్ష్యము సృష్టించినవాడవుతున్నాడు.

193. న్యాయవిచారణ సంబంధమయిన ఒకచర్య యే దశలో వున్నప్పుడు అయినా మనఃపూర్వకముగా తప్పుసాక్ష్యము చెప్పే, లేక న్యాయవిచారణ సంబంధమైన ఒక చర్య యే దశలోవున్నప్పుడు అయినా అందులో వుపయోగపరిచే నిమిత్తముకుగాను తప్పుసాక్ష్యము సృష్టించే యేమనిషి అయినా, యేడుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్ల శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడు కావలసినది;

తప్పుసాక్ష్యమునకు శిక్ష.

మరి యే యితర సంగతులలోనయినా మనఃపూర్వకముగా తప్పుసాక్ష్యము చెప్పే, లేక సృష్టించే యేమనిషి అయినా, మూడుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్ల శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడు కావలసినది.

వివరణము.—(1) ఒక కోర్టుమార్షల్ యెదట జరిగేవిచారణ న్యాయవిచారణ సంబంధమయిన చర్యగా వుంటున్నది.

వివరణము.—(2) ఒక కోర్టు ఆఫ్ జస్టీసుయెదట జరగపొయ్యే చర్యకుముందు న్యాయశాస్త్రమువల్ల ఆజ్ఞాపించబడ్డ విచారణ అనేది, ఆ కోర్టు ఆఫ్ జస్టీసుయెదట జరగకపోయినా న్యాయవిచారణ సంబంధ మయిన చర్య తాలూకు ఒక దశగా వుంటున్నది.

దృష్టాంతము.

A అనేమనిషి, విచారణకుగాను Z అనేమనిషి పంపించబడవలసినదా లేదా అని నిశ్చయించగలందులకై ఒక మేజిస్ట్రేటుగారియెదట జరుగుతూవుండే విమర్శలో ప్రమాణముమీద అవాస్తవముగా వున్నట్టు తాను యెరిగివుండే ఒక కయిఫియ్యతు యిస్తున్నాడు. ఈ విమర్శ అనేది, న్యాయవిచారణసంబంధమయిన చర్య తాలూకు ఒక దశగా వున్నందున A అనేమనిషి తప్పుసాక్ష్యము చెప్పినవాడవుతున్నాడు.

వివరణము.—(3) న్యాయశాస్త్రప్రకారము ఒక కోర్టు ఆఫ్ జస్టీసువారివల్ల ఆజ్ఞాపించబడ్డటువంటిన్ని ఒక కోర్టు ఆఫ్ జస్టీసువారి అధికారముకింద జరిపించబడ్డటువంటిన్ని ఒక విచారణ, అది ఒక కోర్టు ఆఫ్ జస్టీసువారియెదట జరగకపోయినప్పటికిన్ని న్యాయవిచారణ సంబంధమయిన ఒక చర్యతాలూకు దశగా వుంటున్నది.

దృష్టాంతము.

A అనేమనిషి, ఒక పొలము తాలూకు సరిహద్దులు అక్కడనే నిశ్చయపరచ గలందులకుగాను ఒక కోర్టు ఆఫ్ జస్టీసువారివల్ల అధికారముయిచ్చి పంపించబడ్డ ఒక ఆఫీసరుయెదట జరిగే విచారణలో అవాస్తవముగా వున్నట్టు తాను యెరిగివుండే సంగతి ప్రమాణముమీద చెప్పుతున్నాడు. ఈ విమర్శ అనేది, న్యాయవిచారణసంబంధ మయిన చర్య తాలూకు ఒక దశగా వున్నందున A అనేమనిషి తప్పుసాక్ష్యము చెప్పిన వాడవుతున్నాడు.

మరణదండనకు తగి వుండే నేరమునుగురించి నేరస్థాపన కలగ చెయ్యవలెననే యత్నముతో తప్పుసాక్ష్యము చెప్పడము, లేక సృష్టించడము;

194. బ్రిటిష్ ఇండియాయొక్క లేక ఇంగ్లండుయొక్క చట్టమునుపట్టి మరణదండనకు తగివుండే యేదయినా నేరమునుగురించి యే మనిషిమీదనయినా నేరస్థాపన అయ్యేటట్టు చెయ్యవలెనని యత్నించి, లేక అందువల్ల నేరస్థాపనకావచ్చునని యెరిగివుండి తప్పుసాక్ష్యము చెప్పే, లేక సృష్టించే యేమనిషి అయినా, యావజ్జీవము ద్వీపాంతరవాసమువల్లగాని పది సంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు కఠినమయిన ఖయిదువల్లగాని శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడు కావలసినది;

అందువల్ల నిర్దోషి అయిన మనిషిమీద నేరస్థాపన చెయ్యబడి మరణదండన జరిగించబడివున్న పక్షమునకు.

మరిన్ని అట్టి తప్పుసాక్ష్యమువల్ల నిర్దోషి అయిన ఒక మనిషిమీద నేరస్థాపన చెయ్యబడి మరణదండన జరిగించబడివున్నపక్షమునకు అట్టి తప్పుసాక్ష్యము చెప్పినమనిషి, మరణమువల్లగాని యింధులో యింతకుముందు నిర్ణయించబడ్డ శిక్షవల్లగాని శిక్షించబడవలసినది.

ద్వీపాంతరవాసమువల్లగాని ఖయిదువల్లగాని శిక్షించబడతగ్గ నేరమునుగురించి నేరస్థాపన కలగచెయ్యవలెననేయత్నముతో తప్పుసాక్ష్యము చెప్పడము, లేక సృష్టించడము.

195. బ్రిటిష్ ఇండియాయొక్క లేక ఇంగ్లండుయొక్క చట్టమునుపట్టి మరణదండన కానటువంటిన్ని యావజ్జీవము ద్వీపాంతరవాసమువల్లగాని యేడుసంవత్సరములవరకు, లేక అంతకంటె యెక్కువకాలమువరకు ఖయిదువల్లగాని శిక్షించబడతగినటువంటిన్ని యేదైనా నేరమునుగురించి యే మనిషిమీదనయినా నేరస్థాపన అయ్యేటట్టు చెయ్యవలెనని యత్నించి, లేక అట్లా నేరస్థాపనకావచ్చునని యెరిగివుండి తప్పుసా

ష్యము చెప్పే, లేక సృష్టించే యే మనిషి అయినా, ఆ నేరమునుగురించి నేరస్థాపన చెయ్యబడ్డ మనిషి యే శిక్షకు అర్హుడు అవుతున్నాడో అదే శిక్ష పొందవలసినది.

## దృష్టాంతము.

**A** అనే మనిషి **Z** అనే మనిషిమీద బందిపోటునుగురించిన నేరస్థాపన అయ్యేటట్టు చెయ్యవలెనని యత్నించి ఒక కోర్టు ఆఫ్ జస్టిసుయెదట తప్పుసాక్ష్యము చెప్పుతున్నాడు. బందిపోటునుగురించిన నేరమునకుగాను యావజ్జీవము ద్వీపాంతరవాసమువల్ల గాని జుల్మానాతోటి, లేక జుల్మానాలేకుండా పదిసంవత్సరములకు వ్యాపించకూడిన కాలమువరకు కఠినమయిన ఖయిదువల్లగాని శిక్షించబడవలసివుంటున్నది. గనుక **A** అనేమనిషి, ఆ ప్రకారము ద్వీపాంతరవాసమునకుగాని జుల్మానాతోటి, లేక జుల్మానాలేకుండా ఖయిదుకుగాని పాత్రుడవుతున్నాడు.

*అవాస్తవముగా వున్నట్టు యెరిగివుండే సాక్ష్యము వుపయోగపరచడము.*

196. అవాస్తవముగాగాని సృష్టించబడ్డదిగాగాని వున్నట్టు తాను యెరిగివుండే యే సాక్ష్యమునయినా యథార్థమైన, లేక అకల్పితమయిన సాక్ష్యముకింద దురాగతముగా వుపయోగపరచే, లేక వుపయోగపరచవలెనని యత్నించే యేమనిషి అయినా, తాను తప్పుసాక్ష్యము చెప్పివుంటే, లేక సృష్టించివుంటే యేలాగో ఆలాగే శిక్షించబడవలసినది.

*తప్పు సర్టిఫికేట్టు సాదరు చెయ్యడము, లేక దస్కతు చెయ్యడము.*

197. ఏదయినా ముఖ్యమయిన అంశమందు అవాస్తవముగా వున్నట్టు యెరిగివుండి, లేక నిమ్మివుండి న్యాయశాస్త్రమువల్ల యివ్వబడవలసినదిగా, లేక దస్కతు చెయ్యబడవలసినదిగా వుండే, లేక యే సంగతిని గురించి న్యాయశాస్త్రమునుపట్టి సాక్ష్యముగా దాఖలుచేసుకోబడగూడివుంటున్నదో అట్టి సంగతితోటి యిలాకాకలిగివుండే యేదయినా సర్టిఫికేట్టు సాదరుచేసే, లేక దస్కతుచేసే యేమనిషి అయినా, తాను తప్పుసాక్ష్యము చెప్పివుంటే యేలాగో ఆలాగే శిక్షించబడవలసినది.

అవాస్తవముగావున్నట్టు యెరిగివుండే సర్టిఫికేట్టు వాస్తవమయినట్టు వుపయోగపరచడము.

198. ఏదయినా ముఖ్యమైన అంశమందు అవాస్తవముగా వున్నట్టు తాను యెరిగివుండే యేదైనా అట్టి సర్టిఫికేట్టు వాస్తవమైనట్టు దురాగతముగా వుపయోగపరచే, లేక వుపయోగపరచవలెనని యత్నించే యేమనిషి అయినా, తాను తప్పుసాక్ష్యము చెప్పివుంటే యేలాగో ఆలాగే శిక్షించబడవలసినది.

న్యాయశాస్త్రమునుపట్టి సాక్ష్యముగా పుచ్చుకోబడగూడిన కయిఫియ్యతులో వ్రాయబడ్డ తప్పుసంగతి.

199 ఏదయినా కోర్టు ఆఫ్ జస్టీసువారు, పబ్లిక్ వుద్యోగస్థులు, లేక యితరమనిషి యేదైనా సంగతినిగురించి సాక్ష్యముగా పుచ్చుకొనేలాగున న్యాయశాస్త్రమును పట్టి బధ్ధులయి, లేక అధికారము కలగచెయ్యబడివుండేటటువంటిన్ని తనవల్ల యివ్వబడ్డ, లేక సస్కతుచెయ్యబడ్డటువంటిన్ని యే కైఫియ్యతులోనైనా దేన్నిగురించి ఆ కైఫియ్యతు యివ్వబడ్డదో, లేక వుపయోగపరచబడ్డదో అట్టి వుద్దేశమునకు ముఖ్యముగావుండే యేదైనా అంశమునుగురించి అవాస్తవముగా వుండేటటువంటిన్ని అవాస్తవముగావున్నట్టు తాను యెరిగివుండే, లేక నమ్మేటటువంటిన్ని యథార్థముగావున్నట్టు తాను నమ్మనటువంటిన్ని యేదైనా సంగతి నమూదుచేసే యే మనిషి అయినా, తాను తప్పుసాక్ష్యము చెప్పివుంటే యేలాగో ఆలాగే శిక్షించబడవలసినది.

అవాస్తవముగావున్నట్టు యెరిగివుండే అట్టి కయిఫియ్యతువాస్తవముగావున్నట్టువుపయోగపరచడము.

200. ఏదైనా ముఖ్యమైన అంశమందు అవాస్తవముగావున్నట్టు తాను యెరిగివుండే యేదైనా అట్టి కైఫియ్యతు వాస్తవముగావున్నట్టు దురాగతముగా వుపయోగపరచే, లేక వుపయోగపరచవలెనని యత్నించే యే మనిషి అయినా, తాను తప్పుసాక్ష్యము చెప్పివుంటే యేలాగో ఆలాగే శిక్షించబడవలసినది.

వివరణము.—ఏదో ఒక క్రమలోపమనే కారణమునుపట్టే మాత్రము సాక్ష్యముగా అంగీకరించబడగూడినిదిగా వుండే ఒక కయిఫియ్యతు, 199, 200 సెక్షనులయొక్క అర్థమందలి కయిఫియ్యతుగా వుంటున్నది.

నేరమును గురించిన సాక్ష్యము కనపడకుండా చెయ్యడము, లేక నేరస్థుణ్ని మరుగుపరచడమునకుగాను తప్పుసమాచారము చెప్పడము.

201. ఒక నేరము జరిగించబడ్డదని యెరిగివుండి, లేక నమ్మడమునకు కారణముకలిగివుండి నేరస్థునికి న్యాయశాస్త్రసమ్మతమైన శిక్ష జరగకుండా మరుగుపరచవలెననే యత్నముతో ఆ నేరము జరిగినందునగురించి వుండుకొన్న యేదైనా సాక్ష్యము కనపడకుండా చేసే, లేక అట్టి యత్నముతోటి ఆ నేరమును గురించి అవాస్తవముగా వుండేలాగున తాను యెరిగివుండే లేక నమ్మే యేదైనా సమాచారము తెలియచేసే యేమనిషి అయినా, జరిగించబడ్డట్టు తాను యెరిగివుండే,

నేరము మరణదండనవల్ల శిక్షించబడతగ్గది అయినపక్షమునకు;

లేక నమ్మే ఆ నేరము మరణదండనవల్ల శిక్షించబడతగ్గదిగా వున్నపక్షమునకు యేడుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్ల శిక్షించబడడమేగాకుండా జుల్మానాకు కూడా పాత్రుడు కావలసినది;

ద్వీపాంతరవాసమువల్ల శిక్షించబడతగ్గది అయినపక్షమునకు;

మరిన్ని ఆ నేరము యావజ్జీవము ద్వీపాంతరవాసమువల్లగాని పదిసంవత్సరములకు వ్యాపించగూడిన ఖయిదువల్లగాని శిక్షించబడతగ్గదయిన పక్షమునకు మూడు సంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్ల శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడు కావలసినది;

పయిగా ఆ నేరము పదిసంవత్సరములకు వ్యాపించని యేకాలమువరకు అయినా ఖయిదువల్ల శిక్షించబడతగ్గదైన పక్షమునకు ఆ నేరమునకుగాను నిర్ణయించబడ్డ ఖయిదు తాలూకు అన్నిటికంటె యెక్కువ అయినకాలములో నాలుగింట్లో ఒక పాలుకు వ్యాపించగూడిన కాలమువరకు ఆ నేరమునకుగాను నిర్ణయించబడివుండే తరహాదారీగల ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

పదిసంవత్సరములకంటె తక్కువ ఖయిదువల్ల శిక్షించబడతగ్గది అయిన పక్షమునకు.

దృష్టాంతము.

A అనేమనిషి, Z అనే మనిషిని B అనేమనిషి ఖూనీచేసినాడని యెరిగివుండి B అనేమనిషికి శిక్షలేకుండా మరుగుపరచవలెననే యత్నముతో ఆ కళేబరము దాచడమునకుగాను B అనే మనిషికి సహాయముచేస్తున్నాడు. A అనేమనిషి యేడుసంవత్సరములవరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదుకున్ను జుల్మానాకున్ను పాత్రుడౌతున్నాడు.

202. ఒక నేరము జరిగించబడ్డదని యెరిగివుండి, లేక నమ్మడమునకు కారణము కలిగివుండి ఆ నేరమునుగురించి తాను తెలియచేసేలాగున న్యాయశాస్త్రమువల్ల బద్ధుడైవుండి ఆ సమాచారము మనఃపూర్వకముగా తెలియచెయ్యకపొయ్యే యేమనిషిన్ని అయినా, ఆరుమాసములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

సమాచారము తెలియచెయ్యడమునకు బద్ధుడయివుండే మనిషి మనఃపూర్వకముగా నేరమునుగురించిన సమాచారము తెలియచెయ్యకపోవడము.

203. ఒక నేరము జరిగించబడ్డదని యెరిగివుండి, లేక నమ్మడమునకు కారణము కలిగివుండి, ఆ నేరమునుగురించి అవాస్తవముగా వున్నట్టు తాను యెరిగివుండే లేక

జరిగించబడ్డ ఒక నేరమునుగురించి

అవాస్తవమయిన సమాచారము తెలియచెయ్యడము.

నమ్మే యేదైనా సమాచారము తెలియచేసే యే మనిషి అయినా, రెండు సంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

వివరణము.—201-వ, 202-వ, సెక్షన్లలోను ఈ సెక్షనులోను నేరము అనుపదములో ఏ కార్యము బ్రిటిష్ ఇండియాలో జరిగిన పక్షమున ఈ క్రింది సెక్షన్లలో, అనగా 302, 304, 382, 392, 393, 394, 395, 396, 397, 398, 399, 402, 435, 436, 449, 450, 457, 458, 459, 460 సెక్షన్లలో దేని ననుసరించియైననుసరే శిక్షార్హమగునో బ్రిటిష్ ఇండియాకు వెలుపల ఏస్థలమందైన జరిగింపబడెడు అట్టి యేకార్యమైనను చేరును.

సాక్ష్యముగా హాజరు చెయ్యబడకుండా పోవడమునకుగాను దస్తావేజు నశింపచెయ్యడము.

204. ఏదైనా కోర్టు ఆఫ్ జస్టీసులోగాని వుద్యోగధర్మమును పట్టి ఒక పబ్లిక్ వుద్యోగస్థునియెదట న్యాయశాస్త్రప్రకారముగా జరిగించబడే యేదైనా చర్యలోగాని న్యాయశాస్త్రప్రకారము తాను హాజరు చెయ్యడమునకు బద్ధుడయ్యేలాగున చెయ్యగూడిన యేదైనా దస్తావేజును దాచే, లేక నశింపచేసే, లేక అట్టి కోర్టువారియెదట లేక పైనచెప్పబడ్డ పబ్లిక్ వుద్యోగస్థునియెదట సాక్ష్యముగా హాజరుచెయ్యబడకుండా లేక వుపయోగపరచబడకుండా చెయ్యవలెననే యత్నముతోటిగాని అందుకుగాను ఆ దస్తావేజు హాజరుచేసేలాగున న్యాయశాస్త్రప్రకారము సమ్మను చెయ్యబడ్డ లేక ఆజ్ఞాపించబడ్డ తర్వాతగాని అట్టి దస్తావేజు యావత్తుగాని అందులో కొంతగాని తుడిచివేసే లేక చదవగూడనిదిగాచేసే యేమనిషి అయినా, రెండు

సంవత్సరములకు వ్యాపించగూడినకాలమువరకు రెండుతరహాలలో ఒక తరహా ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

వ్యాజ్యములో లేక ఫిర్యాదులో కార్యము నుగురించగాని చర్య నుగురించిగాని ఒకమనిషికి ప్రత్యామ్నాయము మాయగా ప్రవర్తించడము.

205. మరి ఒకమనిషికి ప్రత్యామ్నాయము మాయగా ప్రవర్తించి అట్టి మాయమనిషిగా యేదైనా వ్యాజ్యములో లేక ఒక క్రిమినల్ విచారణలో యేదైనా ఎకరారుచేసే, లేక కయుఫియ్యతు యిచ్చే, లేక సంగతి ఒప్పుకొనే, లేక యేదైనా చర్య సాదరయ్యేటట్టు చేసే, లేక తానే జామీను ఉండే లేక పూటపడే, లేక మరి యేదైనా కార్యము జరిగించే యే మనిషి అయినా, మూడు సంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

దండుగకిందగాని తీర్పు అమలు జరుపుటలోగాని ఆస్తిని పట్టుకోకుండా ఆపడముకొరకు దానినిదగా మీద మరిఒకచోటికి తీసుకొనిపెళ్లడము లేక దాచడము.

206. కోర్టు ఆఫ్ జస్టీసువారివల్ల, లేక యుక్తమైన యితర అధికారస్థునివల్ల విధించబడ్డ, లేక విధించబడబోతున్నదని తాను యెరిగివుండే తీర్పుకింద దండుగగా గాని జుల్మానాకు చెల్లుగాగాని పుచ్చుకోబడకుండా, లేక ఒక సివిల్ వ్యాజ్యములో కోర్టు ఆఫ్ జస్టీసువారివల్ల చెయ్యబడ్డ లేక చెయ్యబడబోతున్నదని తాను యెరిగివుండే ఒక తీర్పుకింద, లేక హుకుముకింద అమలులోకి తేబడకుండా ఆపవలెనని యత్నించి యేదైనా ఆస్తి లేక అందులోకలిగే యేదైనా హక్కు దగాగా మరియొక స్థలమునకు తీసుకొనివెళ్లే, దాచే, మరియొక మనిషికి పరము చేసే, లేక అప్పగింతపెట్టే యేమనిషి అయినా, రెండుసంవత్సరము

లకు వ్యాపించగూడిన కాలమువరకు రెండు తరహాలలో ఒక తరహా ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

దండుగకింద గాని తీర్పు అమలు జరుపుటలోగాని ఆస్తిని పట్టుకొనిపోకుండ ఆపడముకొరకు దానిని గురించి దగా దావా చెయ్యడము.

207. ఒక కోర్టు ఆఫ్ జస్టీసువారివల్ల, లేక యుక్తమైన యితర అధికారస్థునివల్ల విధించబడ్డ, లేక విధించబడబోతున్నది అని తాను యెరిగివుండే తీర్పుకింద దండుగగాగాని జుల్మానాకు చెల్లుగాగాని ఒక సివిల్ వ్యాజ్యములో కోర్టు ఆఫ్ జస్టీసువారివల్ల చెయ్యబడ్డ లేక చెయ్యబడబోతున్నదని తాను యెరిగివుండే ఒక తీర్పుకింద లేక హుకుముకింద అమలులోకి తేబడకుండా ఆపవలెనని యత్నించి యేదయినా ఆస్తికి లేక అందులోకలిగే యేదయినా హక్కుకు తనకు బాధ్యతగాని న్యాయమైన యేదైనా దావాగాని లేదని యెరిగివుండి అట్టి ఆస్తి లేక అందులో కలిగే యేదైనా హక్కు దగాగా అంగీకరించే, పుచ్చుకొనే, లేక దావాచేసే, లేక యేదయినా ఆస్తియొక్క బాధ్యతనుగురించి లేక అందులో కలిగే హక్కునుగురించి యేదైనా మోసముచేసే యే మనిషి అయినా, రెండుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలము వరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

బాకీలేని మొబల్లగునుగురించి తీర్పు చెయ్యబడేలాగున దగాగా ఒప్పడము.

208. ఏమనిషివల్లనయినా తేబడే వ్యాజ్యములో తాను బాకీలేని మొబల్లగుకుగాని అట్టి మనిషికి బాకీవుండేటంతకంటె యెక్కువ మొబల్లగుకుగాని అట్టి మనిషికి హక్కులేని యేదైనా ఆస్తికి లేక ఆస్తిలో హక్కుకుగాని ఒకతీర్పు లేక హుకుము, తనమీద చెయ్యబడేలాగున

దగాగా జరిగించే లేక ఒప్పే, లేక ఒక తీర్పుకుగాను, లేక హుకుము నకుగాను పూరాగా చెల్లుయిచ్చినతర్వాతగాని, యేవస్తువునుగురించి పూరాచెల్లు యివ్వబడ్డదో అట్టి వస్తువునుగురించిగాని తనమీద ఆ తీర్పు లేక హుకుము అములులోకి తేబడేలాగున దగాగాజరిగించే లేక ఒప్పే యే మనిషి అయినా, రెండుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని జుల్మానా వల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

## దృష్టాంతము.

A అనేమనిషి, Z అనే మనిషిమీద న్యాయ్యము దాఖలుచేస్తున్నాడు. A అనే మనిషి తనమీద తీర్పు పొందబోతున్నాడని Z అనేమనిషి యెరిగివుండి B అనేమనిషి తనకోరకుగాని Z అనే మనిషియొక్క ప్రయోజనముకోరకుగాని A అనేమనిషి పొందే తీర్పుక్రింద విక్రయించబడె Z అనేమనిషి తాలూకు ఆస్తి యొక్క విక్రయమువల్ల వచ్చే సొమ్ములో కొంత పుచ్చుకోవలెనని తనమీద న్యాయమయిన దావాలేని B అనే మనిషి యొక్క న్యాయ్యములో అంతకంటె గొప్ప మొబలగు తీర్పు జరిగించబడేలాగున దగా ఒప్పుతున్నాడు. Z అనే మనిషి, యీ సెక్షను ప్రకారము నేరము జరిగించినవాడవుతున్నాడు.

**కోర్టులో అయోగ్యముగా అవాస్తవముయిన దావా చెయ్యడము.**

209. దగాగా, లేక అయోగ్యముగా, లేక యెవరికయినా హాని చెయ్యవలెననే, లేక బాధ కలగచెయ్యవలెననే యత్నముతో అవాస్తవముగా పుట్టేటట్టు తాను యెరిగివుండే యేదయినా దావా ఒక కోర్టు ఆఫ్ జస్టీసులో తెచ్చే యేమనిషి అయినా రెండుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్ల శిక్షించబడడమే గాకుండా జుల్మానాకున్నూ పాత్రుడు కావలసినది.

బాకీలేకుండావుండే మొబల్లగుకుదగాగా తీర్పుపొందడము.

210. బాకీలేని మొబల్లగుకుగాని బాకీవుండేటంతకంటె యెక్కువ మొబల్లగుకుగాని తనకు హక్కులేని యేదైనా ఆస్తికి లేక ఆస్తిలో హక్కుకుగాని యేమనిషిమీదనైనా ఒక తీర్పు లేక హుకుము దగాగా పొందే, లేక తీర్పుకు, లేక హుకుముకు చెల్లుయిచ్చినతర్వాతగాని యే వస్తువునుగురించి అట్లా చెల్లుయివ్వబడ్డదో అట్టి వస్తువునుగురించిగాని యే మనిషిమీదనైనా తీర్పు, లేక హుకుము అమలులోకి తేబడేలాగున దగాగా జరిగించే, లేక తనపేరట యేదయినా అట్టి కార్యము జరిగించబడేలాగున దగాగా ఒప్పే లేక అంగీకరించే యేమనిషి అయినా, రెండుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని ఈ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

హాని కలగ చెయ్యవలెననే యత్నముతో యేదయినా నేరమునుగురించి అవాస్తవమయిన ఫిర్యాదు చెయ్యడము.

211. ఏ మనిషికయినా హాని కలగ చెయ్యవలెనని యత్నించి ఆమనిషిమీద యేదయినా క్రిమినల్ సంబంధమైన చర్య లేక ఫిర్యాదు తేవడమునకు న్యాయమయిన, లేక న్యాయశాస్త్ర సమ్మతమైన కారణము లేదని యెరిగివుండి అతనిమీద యేదయినా క్రిమినల్ చర్య తెచ్చే లేక తెచ్చేటట్టుచేసే లేక ఒక నేరము జరిగించినట్టు అవాస్తవమయిన ఫిర్యాదుచేసే యేమనిషి అయినా, రెండు సంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది;

మరిన్ని మరణమువల్లగాని యావజ్జీవము ద్వీపాంతరవాసమువల్లగాని యేడు సంవత్సరములువరకు లేక యెక్కువకాలమువరకు

ఖయిదువల్లగాని శిక్షించబడతగ్గ నేరమునుగురించిన అవాస్తవమయిన ఫిర్యాదుమీద అట్టి క్రిమినల్ చర్య తేబడివున్నపక్షమునకు యేడుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్ల శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడు కావలసినది.

నేరస్థునికి స్థలమివ్వడము—

212. ఒక నేరము జరిగించబడ్డప్పుడు అందునగురించి న్యాయశాస్త్రసమ్మతమయిన శిక్ష జరగకుండా మరుగుపరచవలెననే యత్నముతో ఆ నేరముచేసినట్టు తాను యెరిగివుండే, లేక నమ్మడమునకు కారణము కలిగివుండే ఒకమనిషికి స్థలముయిచ్చే లేక అతణ్ని దాచే యేమనిషి అయినా,

నేరము, మరణదండనవల్ల శిక్షించబడతగ్గదిఅయినయెడల;

ఆ నేరము మరణదండనవల్ల శిక్షించబడతగ్గదిగా వున్నపక్షమునకు అయిదుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్ల శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడు కావలసినది;

ఆ నేరము, యావజ్జీవము ద్వీపాంతరవాసమువల్లగాని ఖయిదువల్లగాని శిక్షించబడ తగ్గదిగా వున్న యెడల.

ఆ నేరము, యావజ్జీవము ద్వీపాంతరవాసమువల్లగాని పదిసంవత్సరములకు వ్యాపించగూడిన ఖయిదువల్లగాని శిక్షించబడవలసినదిగా వున్నపక్షమునకు మూడుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్ల శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడు కావలసినది;

ఆ నేరము పదిసంవత్సరములవరకు కాకుండా ఒక సంవత్సరమునకు వ్యాపించగూడినదిగావుండే ఖయిదువల్ల శిక్షించబడతగ్గదిగా వున్న పక్షమునకు ఆ నేరమునకుగాను నిర్ణయించబడ్డ ఖయిదు తాలూకు

అన్నిటికంటె యెక్కువ అయిన కాలములో నాలుగింట్లో ఒకపాలుకు వ్యాపించగూడిన కాలమువరకు ఆ నేరమునకుగాను నిర్ణయించబడివుండే తరహాదారీగల ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

ఈ సెక్షనులో "నేరము" అను పదములో ఏ కార్యము బ్రిటిష్ ఇండియాలో జరిగినయెడల ఈ క్రింది సెక్షన్లలో, అనగా 302, 304, 382, 392, 393, 394, 395, 396, 397, 398, 399, 402, 435, 436, 449, 450, 457, 458, 459, 460 సెక్షన్లలో దేని ననుసరించియైనను సరే శిక్షార్హమగునో బ్రిటిష్ ఇండియాకు వెలుపల యే స్థలమందైన జరిగింపఁబడెడు అట్టి యేకార్యమయినను చేరును; మఱియు అట్టి ప్రతికార్యము, ఈ సెక్షనుయొక్క కార్యములకొఱకు, నేరము మోపఁబడ్డ మనుష్యుఁడు ఆ కార్యమును బ్రిటిష్ ఇండియాలో చేసి దోషియైయున్నయెడల ఏలాగో ఆలాగే శిక్షార్హమయినదిగ గ్రహింపఁబడును.

మినహాయింపు.—ఈ నిబంధన నేరముచేసిన పెనిమిటికి భార్యగాని భార్యకు పెనిమిటిగాని స్థలము యివ్వడము, లేక దాచడము అనే సంగతులకు వ్యాపించకూడదు.

### దృష్టాంతము.

బి అనేమనిషి, ఒకబందిపోటు జరిగించినట్టు ఎ అనేమనిషి యెరిగివుండి న్యాయశాస్త్రసమ్మతమయిన శిక్ష జరగకుండా మరుగుపరచగలందులకయి బి అనే మనిషిని బుద్ధి పూర్వకముగా దాస్తున్నాడు. ఇందులో బి అనేమనిషి, యావజ్జీవము ద్వీపాంతరవాసమునకు పాత్రుడైవున్నందున మూడుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదుకు ఎ అనేమనిషి పాత్రుడు కావడమేకాకుండా జుల్మానాకుకూడా పాత్రుడు అవుతున్నాడు.

213. తాను ఒకనేరము దాచడమునుగురించిగాని యే నేరము

నేరస్థునికి శిక్ష జరగకుండా మరుగుపరచగలందులకై బహుమానము వగయిరాలు పుచ్చుకోవడము—

విషయములోనయినా న్యాయశాస్త్ర సమ్మతమైన శిక్ష జరగకుండా యేమనిషిని అయినా మరుగుపరచడమునుగురించిగాని అతనికి న్యాయశాస్త్రసమ్మతమయిన శిక్ష కలిగేలాగున చెయ్యగలందులకయి యేమనిషిమీదనయినా చర్య జరిగించకపోయినందునగురించిగాని తన కొరకు, లేక మరియొక మనిషికొరకు యేదయినా ప్రయోజనమును, లేక ఆస్తి తిరిగీ యిచ్చివెయ్యడమును అంగీకరించే, పొందవలెనని యత్నించే, లేక అంగీకరించడమునకు సమ్మతించే యేమనిషి అయినా,

నేరము, మరణదండనవల్ల శిక్షించబడతగ్గది అయినయెడల;

ఆ నేరము మరణదండనవల్ల శిక్షించబడతగ్గదిగా వున్నపక్షమునకు యేడుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్ల శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడు కావలసినది;

ఆ నేరము, యావజ్జీవము ద్వీపాంతరవాసమువల్లగాని ఖయిదువల్లగాని శిక్షించబడతగ్గదిగా వున్న యెడల.

ఆ నేరము యావజ్జీవము ద్వీపాంతరవాసమువల్లగాని పదిసంవత్సరములకు వ్యాపించగూడిన ఖయిదువల్లగాని శిక్షించబడతగ్గదిగా వున్నపక్షమునకు మూడుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్ల శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడు కావలసినది;

ఆ నేరము, పదిసంవత్సరములకు వ్యాపించని ఖయిదువల్ల శిక్షించబడతగ్గదిగా వున్నపక్షమునకు ఆ నేరమునకుగాను నిర్ణయించబడ్డ ఖయిదు తాలూకు అన్నిటికంటె యెక్కువ అయిన కాలములో నాలుగింట్లో ఒకపాలుకు వ్యాపించగూడిన కాలమువరకు ఆ నేరమునకుగాను నిర్ణయించబడివుండే తరహా దారీగల ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని ఆ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

214. తాను ఒక నేరము దాచడమునుగురించిగాని యే నేరమూ విషయములోనయినా న్యాయశాస్త్రసమ్మతమయిన శిక్ష జరగకుండా యేమనిషిని అయినా మరుగుపరచడమునుగురించిగాని అతనికి న్యాయశాస్త్రసమ్మతమయిన శిక్ష కలిగేలాగున చెయ్యగలందులకయి యేమనిషిమీాదనయినా చర్య జరిగించకపోయినందునగురించిగాని యేమనిషికయినా యేదయినా ప్రయోజనము, లేక ఆస్తి తిరిగీ యిచ్చివెయ్యడము కలగచేసే లేక చేసే, లేక కలగచేసేటట్టు లేక చేసేటట్టు, చెప్పే లేక ఒప్పే, లేక యిచ్చే, లేక యిప్పించేలాగున చెప్పే లేక ఒప్పే యే మనిషి అయినా,

నేరస్థుని మరుగు పరచడమునకు గాను బహుమానముయిస్తాననడము, లేక ఆస్తి తిరిగీ యిచ్చివేస్తాననడము;

ఆ నేరము, మరణదండనవల్ల శిక్షించబడతగ్గదిగా వున్నపక్షమునకు యేడుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్ల శిక్షించబడకమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడు కావలసినది;

నేరము, మరణ దండనవల్ల శిక్షించ బడతగ్గని అయినయెడల;

ఆ నేరము, యావజ్జీవము ద్వీపాంతరవాసమువల్లగాని పదిసంవత్సరములకు వ్యాపించగూడిన ఖయిదువల్లగాని శిక్షించబడతగ్గదిగా వున్నపక్షమునకు మూడుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్ల శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడు కావలసినది;

ఆ నేరము, యావజ్జీవము ద్వీపాంతర వాసమువల్లగాని ఖయిదువల్లగాని శిక్షించబడతగ్గది అయిన యెడల.

ఆ నేరము, పదిసంవత్సరములకు వ్యాపించని ఖయిదువల్ల శిక్షించబడతగ్గదిగా వున్నపక్షమునకు ఆ నేరమునకుగాను నిర్ణయించబడ్డ ఖయిదుతాలూకు అన్నిటికంటె యెక్కువ అయినకాలములో నాలుగింట్లో

ఒకపాలుకు వ్యాపించగూడిన కాలమువరకు ఆ నేరమునకుగాను నిర్ణయించబడివుండే తరహాదారీగాు ఖయిదునల్లగాని జుల్మానాన్లగాని యీరెంటినల్లగాని శిక్షించబడవలసినది.

మినహాయింపు.—ఆ నేరము న్యాయశాస్త్రసమ్మతముగా సమాధానముచేసుకోబడే యే సంగతికిన్ని 213, 214 సెక్షనులు తాలూకు నిబంధనలు వ్యాపించవు.

దృష్టాంతములు.—1882-వ సంవత్సరపు 10-వ యాక్టువలన రద్దుపరచబడినవి.

చోరీసొమ్ము వగైరాలు తిరిగి పొందేలాగున సహాయము చెయ్యడమునకు బహుమానము పుచ్చుకోవడము.

215. ఈ శాసనమునుపట్టి శిక్షించబడతగ్గ యే నేరమువల్లనైనా పోగొట్టుకోబడ్డ యేదయినా చరాస్తి తిరిగి రాబట్టుకొనేలాగున సహాయము చేస్తానని మిషపెట్టిగాని సహాయము చెయ్యడమునకుగాని యేదయినా "ప్రయోజనము" పుచ్చుకొనే, లేక పుచ్చుకొనేలాగున ఒప్పే, లేక సమ్మతించే యే మనిషి అయినా, నేరస్థుడు పట్టుపడేలాగునున్ను ఆ నేరమువిషయమై నేరస్థాపన చెయ్యబడేలాగునున్ను చెయ్యడమునకు తన యావచ్ఛక్తి వినియోగపరచనియెడల రెండుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదునల్లగాని జుల్మానావల్లగాని యీరెంటివల్లగాని శిక్షించబడవలసినది.

ఎవడయితే ఖయిదులోనుంచి తప్పించుకొని పారిపోయినాడో, లేక యెవణ్ని అయితే పట్టుకొనేలాగున హుకుము చెయ్యబడ్డదో ఆట్టి నేరస్థునికి స్థలమియ్యడము.

216. ఒక నేరమునుగురించి నేరస్థాపనచెయ్యబడ్డ లేక నేరము మోపబడ్డ యే మనిషి అయినా అట్టి నేరమునుగురించి న్యాయశాస్త్రసమ్మతమయిన ఖయిదులో వుంటూ వుండి అట్టి ఖయిదులోనుంచి తప్పించుకొని పారిపోయినప్పుడుగాని,

ఒక పబ్లిక్ వుద్యోగస్థుడు తన వుద్యోగధర్మమునుపట్టి న్యాయశాస్త్రసమ్మతమయిన తన అధికారములు చెలాయించడమందు యేదైనా నేరమునుగురించి ఒకానొక మనిషి పట్టుకోబడేలాగున హుకుము చేసినప్పుడుగాని ఆ ప్రకారము పారిపోయిన లేక పట్టుకొనేలాగున హుకుము సాదరు చెయ్యబడివున్న సంగతి యెరిగివుండి పట్టుకోబడకుండా చెయ్యవలెననే యత్నముతో ఆ మనిషికి స్థలమునియ్యే లేక అతన్ని దాచే యే మనిషి అయినా,

నేరము, మరణదండనవల్ల శిక్షించబడతగ్గ అయినయెడల;

దేన్నిగురించి నేరస్థుడు ఖయిదులో వుంచబడి వుంటూవచ్చినాడో లేక పట్టుకోవడమునకు హుకుము చెయ్యబడ్డదో అట్టి నేరము మరణదండనవల్ల శిక్షించబడతగ్గదిగా వున్న పక్షమునకు, యేడుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్ల శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడుకావలసినది;

ఆ నేరము, యావజ్జీవము ద్వీపాంతరవాసమువల్లగాని ఖయిదువల్లగాని శిక్షించబడతగ్గది అయినయెడల.

ఆ నేరము, యావజ్జీవము ద్వీపాంతరవాసమువల్లగాని పదిసంవత్సరములవరకు ఖయిదువల్లగాని శిక్షించబడతగ్గదిగా వున్నపక్షమునకు, జుల్మానాతోటిగాని జుల్మానాలేకుండాగాని మూడుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్ల శిక్షించబడవలసినది;

ఆ నేరము, పదిసంవత్సరములవరకు కాకుండా ఒక సంవత్సరమునకు వ్యాపించగూడినదిగావుండే ఖయిదువల్ల శిక్షించబడతగ్గదిగా వున్న పక్షమునకు, ఆ నేరమునకుగాను నిర్ణయించబడ్డ ఖయిదు తాలూకు అన్నిటికంటె యెక్కువ అయినకాలములో నాలుగింట్లో ఒకపాలుకు వ్యాపించగూడిన కాలమువరకు ఆ నేరమునకుగాను నిర్ణయించబడి

వుండే తరహాదాకీగల ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

ఈ సెక్షనులో "నేరము" అను మాటకు ఒక మనిషి బ్రిటిష్ ఇండియాకు వెలపల యేది చెయ్యడమువల్ల లేక చెయ్యక మానుకోవడమువల్ల దోషి అని చెప్పబడుతున్నాడో ఆ విషయమయి, అతడు బ్రిటిష్ ఇండియాలో దోషి అయివున్న పక్షమందు ఎది ఒక నేరమువలె శిక్షించబడతగ్గదయి, యెందు నిమిత్తము, శిక్ష తప్పించుకొనిపోయిన నేరస్థులను ఒప్పగించడముతో సంబంధముగా యేదయినా చట్టమును పట్టిగాని 1881-వ సంవత్సరపు ఫ్యుజిటివ్ అఫెండర్సు ఆక్టు (పరారి అయిన నేరస్థులనుగురించిన ఆక్టు)ను పట్టిగాని మరియొకదానిని పట్టిగాని అతడు బ్రిటిష్ ఇండియాలో పట్టుకోబడుటకయినను కావలిలో వుంచబడుటకయినను పాత్రుడయివుంటున్నాడో అట్టి యేదయినా కార్యము, లేక చెయ్యక మానుకోవడము అనికూడా అర్థమవుతున్నది; అట్టి ప్రతికార్యము, లేక చెయ్యక మానుకోవడము నేరము పెట్టబడ్డవానిపై బ్రిటిష్ ఇండియాలో అందునగురించి దోషిగావుండే యెట్లాగో అట్లాగే యీ సెక్షనుయొక్క కార్యములకుగాను శిక్షించబడతగినదిగా వున్నట్టు గ్రహించబడవలసినది.

మినహాయింపు.—ఈ నిబంధన, పట్టుకోబడవలసిన పెనిమిటికి భార్యగాని భార్యకు పెనిమిటిగాని స్థలమియివ్వడము, లేక దాచడము అనే సంగతులకు వ్యాపించదు.

దొంగలకుగాని బందిపోటు దొంగలకుగాని (దాగుటకు)

**216-A.** ఏమనుష్యులైనను దొంగతనమునుగాని బందిపోటునుగాని జరిగింపనున్నారని లేదా ఇటీవల జరిగించిరని తెలిసియుండియైనను నమ్ముటకు కారణముండియైనను, అట్టి దొంగతనమునుగాని బందిపోటునుగాని

స్థలమిచ్చుటకుఁగాను శిక్ష.

జరిపించుటయందు సౌలభ్యము కలుగఁజేసెడు లేదా వారినిగాని వారిలో ఎవరినిగాని శిక్షనుండి మరుగు చేసెడు వుద్దేశముతో అట్టివారికిఁగాని వారిలో ఎవరికయినఁగాని (దాఁగుటకు) స్థలమిచ్చు ఏ మనుష్యుఁడుగాని, ఏడుసంవత్సరములవరకు కఠినమయిన ఖయిదు శిక్షకు పాత్రుఁడగుటయేగాక జుల్మానాకు సయితము పాత్రుఁడు కావలయును.

వివరణము.—ఈ సెక్షనుయొక్క కార్యములకుఁగాను సదరు దొంగతనము లేక బందిపోటు జరిగింపఁబడునట్లు ఉద్దేశింపఁబడినది లేక జరిగింపఁబడినది బ్రిటిష్ ఇండియాలోనా లేక వెలుపలనా అనునది ముఖ్యముకాదు.

మినహాయింపు.—నేరముచేసిన మానిసియొక్క పెనిమిటిగాని భార్యగాని (దాఁగుటకు) స్థలమిచ్చు సంగతికి ఈ నిబంధన వ్యాపింపదు.

212,216, 216-A సెక్షనులలో '(దాఁగుటకు) స్థలమిచ్చుట' అనుమాటయొక్క నిర్వచనము.

216-B. 212, 216, 216-A సెక్షనులలో '(దాఁగుటకు) స్థలమిచ్చుట' అను పదములో ఒకనికి రక్షణమునైనను, ఆహారమునయినను, పానమునయినను, పైకమునయినను, వస్త్రములనయినను, ఆయుధములనయినను, మందుగుండు మొదలగు యుద్ధ సామగ్రులనయినను, వాహనములనయినను, అమర్చుటగాని పట్టుపడకుండ తప్పించుకొనుటకు ఎవనికయిన ఏవిధమునయిన సాహాయ్యము చేయుటగాని చేరును.

ఒక మనిషికి శిక్ష జరగకుండాగాని ఆస్తి దండుగకింద పుచ్చుకోబడకుండా

217.—పబ్లిక్ వుద్యోగస్థుడుగావుండి యే మనిషికయినా న్యాయశాస్త్రసమ్మతమయిన శిక్ష జరగకుండా తప్పించవలెనని యత్నించి, లేక అట్లా జరగకుండా తప్పించవచ్చునని, లేక అతడు పాత్రుడయివుండేటంతకంటె

గాని చెయ్యవలెననే యత్నముతో పబ్లిక్ వుద్యోగస్థుడు న్యాయశాస్త్ర సంబంధమైన నిబంధన వుల్లంఘించడము.

తక్కువ శిక్షు అతనికి కలిగేలాగున చెయ్యవచ్చునని యెరిగివుండి, లేక యేదైనా ఆస్తి దండుగకింద పుచ్చుకోబడకుండాగాని న్యాయశాస్త్రమువల్ల అది పాత్రముగావుండే యేదైనా ఖర్చుకు లోబరచబడకుండాగాని తప్పించవలెనని యత్నించి, లేక తప్పించవచ్చునని యెరిగివుండి, తాను పబ్లిక్ వుద్యోగస్థుడుగా ప్రవర్తించవలసిన పద్ధతినిగురించి న్యాయశాస్త్రమువల్ల తాను బద్ధుడైవుండే యేదైనా నిబంధనను బుద్ధిపూర్వకముగా వుల్లంఘనచేసే యే మనిషి అయినా, రెండుసంవత్సరములకు న్యాపించగూడిన కాలమువరకు రెండు తరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

మనిషికి శిక్షజరగకుండాగాని ఆస్తిదండుగకింద పుచ్చుకోబడకుండాగానితప్పించవలెననే యత్నముతో పబ్లిక్ వుద్యోగస్థుడు సరిగావుండని దస్తావేజు లేక లిఖితము యేర్పాటుచెయ్యడము.

218. పబ్లిక్ వుద్యోగస్థుడుగావుండి ఆ వుద్యోగధర్మమునుపట్టి యేదైనా దస్తావేజు లేక యితర లిఖితము తయారుచేసే పని తనదిగావుండి, జనులకుగాని యే మనిషికైనాగాని నష్టము లేక హాని కలగచెయ్యవలెనని యత్నించి, లేక కలగవచ్చునని యెరిగివుండి, లేక యేమనిషికైనా న్యాయశాస్త్రసమ్మతమైన శిక్షు జరగకుండా తప్పించవలెనని యత్నించి, లేక తప్పించవచ్చునని యెరిగివుండి, లేక యేదైనా ఆస్తిదండుగకింద పుచ్చుకోబడకుండాగాని న్యాయశాస్త్రమువల్ల అది పాత్రమయ్యే యేదైనా యితర ఖర్చుకు లోపరచబడకుండాగాని తప్పించవలెనని యత్నించి, లేక తప్పించవచ్చునని యెరిగివుండి సరిగావుండనట్టు తాను యెరిగివుండే తరహాను అట్టి దస్తావేజు, లేక యితరలిఖితము యేర్పాటుచేసే యేమనిషి అయినా మూడుసంవత్సర

ములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

పబ్లిక్ వుద్యోగస్థుడు, న్యాయవిచారణ సంబంధమయిన చర్యలో న్యాయశాస్త్రమునకు విరోధముగా రిపోర్టు వగయిరాలు అయోగ్యముగా చెయ్యడము.

219. ఒక పబ్లిక్ వుద్యోగస్థుడుగావుండి న్యాయవిచారణ సంబంధమైన చర్య తాలూకు యేదశలోనైనా న్యాయశాస్త్రమునకు విరోధముగావున్నట్టు తాను యెరిగివుండే యేదైనా రిపోర్టు, హుకుము, ఫయిసలా, లేక తీర్పు అయోగ్యముగాగాని కావేషీమీదగాని చేసే లేక చెప్పే యే మనిషి అయినా, యేడుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

న్యాయశాస్త్రమునకు విరోధముగా తాను జరిగిస్తూవున్నట్టు యెరిగివుండి అధికారముగల మనిషివల్ల విచారణ చెయ్యబడడముకొరకు పంపడము లేక ఖయిదు చెయ్యడము.

220. మనుష్యులను విచారణకు, లేక ఖయిదుకు పంపించేలాగున, లేక ఖయిదులో వుంచేలాగున న్యాయశాస్త్ర సమ్మతమైన అధికారము కలగచేసే యే వుద్యోగములోనైనా వుండి అట్టి అధికారము చెలాయించడములో తాను న్యాయశాస్త్రమునకు విరోధముగా జరిగిస్తూవున్నట్టు యెరిగివుండి యేమనిషిని అయినా అయోగ్యముగా, లేక కావేషీమీద విచారణకుగాని ఖయిదుకుగాని పంపించే, లేక ఖయిదులోవుంచే యేమనిషి అయినా, యేడుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

221. పబ్లిక్ వుద్యోగస్థుడుగావుండి ఒక నేరము మోపబడ్డ

ఎవరిని అయినా పట్టుకోవలసిన పబ్లిక్ వుద్యోగస్థుడు అతణ్ని మనఃపూర్వకముగా పట్టుకోకుండా పోవడము.

లేక పట్టుకోబడతగ్గ యేమనిషిని అయినా తన వుద్యోగధర్మమునుపట్టి పట్టుకోవడమునకుగాని ఖైదున వుంచడమునకుగాని న్యాయశాస్త్రమువల్ల బద్ధుడైవుండి అట్టి మనిషిని మనఃపూర్వకముగా పట్టుకోకుండాపోతే, లేక అట్టి ఖయిదులోనుంచి ఆ మనిషిని మనఃపూర్వకముగా తప్పించుకొని పారిపోనిచ్చే, లేక అట్టి మనిషి తప్పించుకొని పారిపోవడములో, లేక తప్పించుకొని పారిపోవతానని యత్నించడములో మనఃపూర్వకముగా కుమ్మకుచేసే యేమనిషి అయినా యీ కింద నమూదుచెయ్యబడే ప్రకారము శిక్షించబడవలసినది, యెట్లాగంటే:—

ఖయిదులోవుండే, లేక పట్టుకోబడివుండవలసిన మనిషి, మరణదండనవల్ల శిక్షించబడతగ్గ నేరము మోపబడిగాని దాన్నిగురించి పట్టుకోబడతగిగాని వుండివున్నపక్షమునకు జుల్మానాతోటిగాని జుల్మానా లేకుండాగాని యేడుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్ల శిక్షించబడవలసినది; లేక

ఖయిదులోవుండే లేక పట్టుకోబడివుండవలసిన మనిషి యావజ్జీవము ద్వీపాంతరవాసమువల్ల, లేక పదిసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు ఖయిదువల్ల శిక్షించబడతగ్గ నేరము మోపబడిగాని దాన్నిగురించి పట్టుకోబడతగిగాని వుండివున్న పక్షమునకు జుల్మానాతోటిగాని జుల్మానాలేకుండాగాని మూడుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్ల శిక్షించబడవలసినది; లేక

ఖయిదులోవుండే, లేక పట్టుకోబడి వుండవలసిన మనిషి పది సంవత్సరములకు తక్కువ అయిన కాలమువరకు ఖయిదువల్ల శిక్షించ-

బడవలసిన నేరము మోపబడిగాని దాన్నిగురించి పట్టుకోబడతగిగాని వుండివున్నపక్షమునకు జుల్మానాతోటిగాని జుల్మానాలేకుండాగాని రెండు సంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్ల శిక్షించబడవలసినది.

తీర్పుపొందివుండే లేక న్యాయశాస్త్రసమ్మతముగా ఖయిదుకు పంపబడివుండే మనిషిని పట్టుకోనేలాగున బద్ధుడయివుండే పబ్లిక్ వుద్యోగస్థుడు మనఃపూర్వకముగా పట్టుకోకుండాపోవడము.

222. పబ్లిక్ వుద్యోగస్థుడుగావుండి వుద్యోగధర్మమునుపట్టి యే నేరమునుగురించి అయినా ఒక కోర్టు ఆఫ్ జస్టీసువారి తీర్పుపొందివుండే లేక న్యాయశాస్త్రసమ్మతముగా ఖయిదుకు పంపబడివుండే ఒక మనిషిని పట్టుకోవడమునకుగాని ఖయిదున వుంచడమునకుగాని న్యాయశాస్త్రమువల్ల బద్ధుడైవుండి అట్టి మనిషిని మనఃపూర్వకముగా పట్టుకోకుండా పోయ్యే, లేక అట్టి మనిషిని మనఃపూర్వకముగా తప్పించుకొని పారిపోనిచ్చే, లేక అట్టి ఖయిదులోనుంచి అట్టి మనిషి తప్పించుకొని పారిపోవడములో, లేక తప్పించుకొనిపారిపోవలెనని యత్నించడములో మనఃపూర్వకముగా కుమ్మక్కుచేసే యే మనిషి అయినా, యీ కింద నమూదుచెయ్యబడేప్రకారము శిక్షించబడవలసినది, యెట్లాగంటే:—

ఖయిదులోవుండే, లేక పట్టుకోబడివుండవలసిన మనిషికి మరణదండన విధించబడివున్నపక్షమునకు యావజ్జీవము ద్వీపాంతరవాసమువల్లగాని జుల్మానాతోటి, లేక జుల్మానాలేకుండా పధ్నాలుగు సంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని శిక్షించబడవలసినది; లేక

ఖయిదులోవుండే, లేక పట్టుకోబడివుండవలసినమనిషి, కోర్టు ఆఫ్ జస్టీస్‌వారి తీర్పువల్లగాని అట్టితీర్పు తగ్గించి మార్చడమువల్లగాని

యావజ్జీవము ద్వీపాంతరవాసమునకు, లేక యావజ్జీవము ఖయిదీగా శిక్షాసంబంధమైన పనిచెయ్యడమునకు, లేక పదిసంవత్సరముల కాలమువరకుగాని అంతకంటె యెక్కువకాలమువరకుగాని ద్వీపాంతరవాసమునకు, లేక ఖయిదీగా శిక్షాసంబంధమైన పనిచెయ్యడమునకు, లేక ఖైదుకు లోబడివున్నయెడల జుల్మానాతోటిగాని జుల్మానా లేకుండాగాని యేడుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్ల శిక్షించబడవలసినది; లేక

ఖయిదులోవుండే, లేక పట్టుకోబడివుండవలసినమనిషి. ఒక కోర్టు ఆఫ్ జస్టీసువారి తీర్పువల్ల పదిసంవత్సరములకు వ్యాపించనికాలమువరకు ఖయిదుకు లోబడివున్నయెడల లేక ఆ మనిషి న్యాయశాస్త్రసమ్మతముగా ఖయిదుకు పంపబడివున్నయెడల మూడుసంవత్సరములకు వ్యాపించగూడినకాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

పబ్లిక్ వుద్యోగస్థుడు, తన అశ్రద్ధవల్ల యేమనిషినిఅయినా ఖయిదులోనుంచి లేక కావలిలోనుంచి తప్పించుకొని పారిపోనివ్వడము.

223. పబ్లిక్ వుద్యోగస్థుడుగావుండి వుద్యోగధర్మమునుబట్టి యేదైనా నేరము మోపబడ్డ, లేక నేరస్థాపన చెయ్యబడ్డ లేక న్యాయశాస్త్రసమ్మతముగా ఖయిదుకు పంపబడ్డ యేమనిషి అయినా ఖయిదులో భద్రపరచడమునకు న్యాయశాస్త్రమువల్ల బద్ధుడై వుండి తన అశ్రద్ధవల్ల అతిణ్ని ఖయిదులోనుంచి తప్పించుకొని పారిపోనిచ్చే యేమనిషి అయినా, రెండుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు సాధారణమైన ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

ఏమనిషి అయినా తాను న్యాయశాస్త్ర రీత్యా పట్టుపడకయెదిరించడము, లేక ఆటంకపెట్టడము.

224. తనమీద మోపబడ్డ, లేక తాను నేరస్థాపనచెయ్యబడ్డ యేనేరమునుగురించి అయినా న్యాయశాస్త్రరీత్యా తాను పట్టుబడక మనఃపూర్వకముగా యేదైనా యెదిరింపు, లేక న్యాయశాస్త్రవిరోధమైన ఆటంకముచేసే, లేక అట్టి యే నేరమునుగురించి అయినా తాను న్యాయశాస్త్రరీత్యా వుంచబడ్డ ఖయిదులోనుంచి తప్పించుకొని పారిపొయ్యే, లేక తప్పించుకొని పారిపోవలెనని ప్రయత్నముచేసే యే మనిషి అయినా, రెండుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

వివరణము.—ఈ సెక్షనులోవుండే శిక్ష, పట్టుకోబడవలసిన, లేక ఖయిదులో వుంచబడవలసిన మనిషిమీద మోపబడ్డ, లేక అతనిమీద నేరస్థాపనచెయ్యబడ్డ నేరమునుగురించి అతను పాత్రుడుగా వుంటూవచ్చిన శిక్షగాక యెక్కువగా వుండవలసినది.

మరిఒకమనిషిన్యాయశాస్త్రరీత్యాపట్టుకోబడకుండా యెదిరించడము, లేక ఆటంకపెట్టడము.

225. ఒక నేరమునుగురించి యేమనిషి అయినా న్యాయశాస్త్రరీత్యా పట్టుకోబడకుండా మనఃపూర్వకముగా యేదైనా యెదిరింపు, లేక న్యాయశాస్త్ర విరోధమైన ఆటంకముచేసే, లేక ఒక నేరమునుగురించి ఆమనిషి న్యాయశాస్త్రరీత్యా వుంచబడ్డ ఖయిదులోనుంచి తప్పించుకొని పొయ్యేలాగున చేసే, లేక తప్పించుకొని పొయ్యేలాగున చెయ్యడమునకు ప్రయత్నముచేసే యేమనిషి అయినా, రెండుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది;

లేక పట్టుకోబడవలసిన, లేక తప్పించుకొని పోయ్యేలాగున చెయ్యబడ్డ, లేక తప్పించుకొని పోయ్యేలాగున చెయ్యడమునకు ప్రయత్నము చెయ్యబడ్డ మనిషి, యావజ్జీవము ద్వీపాంతరవాసమువల్లగాని పదిసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు ఖయిదువల్లగాని శిక్షించబడతగ్గ నేరమునుగురించి నేరము మోపబడివున్నపక్షమునకు, లేక పట్టుకోబడడమునకు తగివున్నపక్షమునకు మూడుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్ల శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడుకావలసినది;

లేక పట్టుకోబడవలసిన, లేక తప్పించుకొని పోయ్యేలాగున చెయ్యబడ్డ, లేక తప్పించుకొని పోయ్యేలాగున చెయ్యడమునకు ప్రయత్నము చెయ్యబడ్డ మనిషి, మరణదండనవల్ల శిక్షించబడతగ్గ నేరమునుగురించి నేరము మోపబడివున్నపక్షమునకు, లేక పట్టుకోబడడమునకు తగివున్నపక్షమునకు, యేడుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్ల శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడుకావలసినది;

లేక పట్టుకోబడవలసిన, లేక తప్పించుకొని పోయ్యేలాగున చెయ్యబడ్డ, లేక తప్పించుకొని పోయ్యేలాగున చెయ్యడమునకు ప్రయత్నము చెయ్యబడ్డ మనిషి, ఒక కోర్టు ఆఫ్ జస్టీసువారి తీర్పువల్లగాని తగ్గించి మార్చబడ్డ అట్టి తీర్పువల్లగాని యావజ్జీవము ద్వీపాంతరవాసమునకు, లేక పదిసంవత్సరముల కాలమువరకుగాని యెక్కువకాలమువరకుగాని ద్వీపాంతరవాసమునకు, లేక ఖయిదీగా శిక్షాసంబంధమైన పని చెయ్యడమునకు, లేక ఖయిదుకు లోబడివున్నయెడల సోడుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్ల శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడుకావలసినది;

లేక పట్టుకోబడవలసిన, లేక తప్పించుకొని పొయ్యేలాగున చెయ్యబడ్డ, లేక తప్పించుకొనిపోయ్యేలాగున చెయ్యడమునకు ప్రయత్నము చెయ్యబడ్డ మనిషికి మరణదండన విధించబడివున్న పక్షమునకు యావజ్జీవము ద్వీపాంతరవాసమువల్లగాని పదిసంవత్సరములకు మించని కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడు కావలసినది.

వేరువిధమున నిబంధన కలగచేయని సంగతులలో పబ్లిక్ నవుకరు ఒకమనిషినిపట్టుకోకుండా యూనుకోవడము, లేక తప్పించుకొనిపోవడమునుఒప్పడము.

225-A. పబ్లిక్ వుద్యోగస్థుడుగావుండే యెవడైనను, 221, 222, లేక 223-వ సెక్షనులో, లేదా ఆయాకాలములయందు అమలులోవున్న యేదైనా యితర చట్టములో నిబంధన కలగచెయ్యబడని యే సంగతిలోనయినా, యే మనిషినయినను పట్టుకొనుటకుగాని కావలిలో వుంచుటకుగాని అట్టి పబ్లిక్ వుద్యోగస్థుడుగా న్యాయశాస్త్రసమ్మతిమున బద్ధుడయి వుండి ఆ మనిషిని పట్టుకోకుండా తప్పిపోయినపక్షమందు లేక కావలిలోనుండితప్పించుకొనిపొయ్యేటట్టుఒప్పినపక్షమందు-

(a) అతడు ఆప్రకారము ప్రయత్నపూర్వకముగా చేసినయెడల, మూడుసంవత్సరములకు వ్యాపించగల కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని, మరిన్ని

(b) అతడు ఆ ప్రకారము అశ్రద్ధగాచేసినయెడల, రెండుసంవత్సరములకు వ్యాపించగల కాలమువరకు సాధారణ ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని, అతడు శిక్షించబడవలసినది.

225-B. 224-వ సెక్షనులోగాని 225-వ సెక్షనులోగాని, లేక

వేరువిధమున నిబంధన కలగచేయని సంగతులలో న్యాయశాస్త్రరీత్యా పట్టుకోబడకుండా యెదిరించడము, లేక ఆటంకపెట్టడము, లేదా తప్పించుకొని పోవడము, లేక తప్పించుకొనిపొయ్యేటట్టు చెయ్యడము.

తత్కాలమందు అమలులోవున్న యేదైనా యితర చట్టములోగాని నిబంధన కలగచేయబడని యే సంగతిలోనయినా, తానైనను యే యితరమనిషి అయినను న్యాయశాస్త్రరీత్యా పట్టుకోబడకుండా మనఃపూర్వకముగా యేదయినా యెదిరింపు, లేక న్యాయశాస్త్రవిరోధమయిన ఆటంకముచేసే, లేక తాను న్యాయశాస్త్రరీత్యా వుంచబడ్డ ఖయిదులోనుంచి తప్పించుకొని పారిపొయ్యే, లేక తప్పించుకొని పారిపోవలెనని ప్రయత్నముచేసే, లేక యే యితరమనిషి అయినను న్యాయశాస్త్రరీత్యా వుంచబడ్డ ఖయిదులోనుంచి ఆమనిషి తప్పించుకొనిపొయ్యేలాగునచేసే, లేక తప్పించుకొనిపొయ్యేలాగున చెయ్యడమునకు ప్రయత్నముచేసే యే మనిషి అయినా ఆరుమాసములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

ద్వీపాంతరవాసపు శిక్షలోవుండిఅక్కడనుంచి న్యాయశాస్త్రవిరోధముగా తిరిగీ రావడము.

226. న్యాయశాస్త్రరీత్యా ద్వీపాంతరవాసమునకు పంపించబడి ద్వీపాంతరవాసపు శిక్షయొక్క కాలము నడిచిపోక ముందున్ను తనశిక్ష తీసివెయ్యబడకుండానున్ను అట్టి ద్వీపాంతరవాసములోనుంచి తిరిగీవచ్చే యేమనిషి అయినా, యావజ్జీవము ద్వీపాంతరవాసమునెల్ల శిక్షించబడవలసినది; మరిన్ని అతడు జుల్మానాకుకూడా పాత్రుడు కావడమే గాకుండా ఆప్రకారము తిరిగీ ద్వీపాంతరవాసమునకు పంపించబడక ముందు మూడుసంవత్సరములకు మించనికాలమువరకు కఠినమయిన ఖయిదుతోటి ఖయిదు చెయ్యబడడమునకున్ను పాత్రుడు కావలసినది.

227. తనకు విధించబడ్డ శిక్ష యే షరతుమీద తీసివెయ్యబడ్డ

శిక్ష తీసివెయ్యడ మునుగురించిన షరతుకు భంగము కలగ చెయ్యడము.

దో ఆ షరతుకు ఒప్పుకొని అట్టి షరతుకు బుద్ధిపూర్వకముగా భంగము కలగచేసే యే మనిషి అయినా, ఆ శిక్షాకాలములో యెంతమాత్రమున్ను అంతకు ముందే పొందివుండనియెడల అదేశిక్షవల్లనున్ను అందులో యెంతమాత్రము అయినా పొందివున్నయెడల శేషించివుండేమాత్రపు శిక్షాకాలమువల్లనున్ను శిక్షించబడవలసినది.

న్యాయవిచారణ సంబంధమైనచర్యలో పని జరిగిస్తూవుండే పబ్లిక్ వుద్యోగస్థుణ్ని మనః పూర్వకముగా తిరస్కరించడము, లేక ఆటంకపెట్టడము.

228. ఒక పబ్లిక్ వుద్యోగస్థుడు న్యాయవిచారణ సంబంధమైన చర్య తాలూకు యేదశలోనయినా పని జరిగిస్తూవుండేటప్పుడు అతణ్ని మనఃపూర్వకముగా తిరస్కరించే, లేక ఆటంకపెట్టే, యేమనిషి అయినా, ఆరుమాసములకు వ్యాపించగూడిన కాలమువరకు సాధారణమయిన ఖయిదువల్లగాని వెయ్యిరూపాయీలకు వ్యాపించగూడిన జుల్మానావల్లగాని యీరెంటివల్లగాని శిక్షించబడవలసినది.

జూరరుగా, లేక అస్సెస్సరుగా ప్రత్యామ్నాయము, మాయగా నటించడము.

229. ఏ యితరమనిషివలెనైనా మాయగాగాని మరి యే తరహాగానైనాగాని న్యాయశాస్త్రమునుపట్టి ఒక జూరరుగా, లేక అస్సెస్సరుగా నిర్ణయించబడడమునకు, సత్యము చేయించబడడమునకు, లేక ప్రమాణము చేయించబడడమునకు తనకు హక్కులేదని తాను యెరిగివుండి ఆప్రకారము నిర్ణయించబడేలాగున, సత్యము చేయించబడేలాగున, లేక ప్రమాణము చేయించబడేలాగున మనఃపూర్వకముగాచేసే, లేక బుద్ధిపూర్వకముగా ఒప్పే, లేక ఆ ప్రకారము న్యాయశాస్త్రమునకు విరోధముగా తాను నిర్ణయించబడ్డట్టు, సత్యము చేయించబడ్డట్టు, లేక ప్రమాణము చేయించబడ్డట్టు, యెరిగివుండి స్వేచ్ఛగా అట్టి జూరీగా, లేక అస్సెస్స

రుగా పని జరిగించే యే మనిషి అయినా, రెండుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

---

### 12వ అధ్యాయము.

నాణెములు, గవర్న్మెంటు ముద్రకాకితములు వగయిరాలు, వీటితో యిలాకాగల నేరములనుగురించి.

230. నాణెము అనగా, పయికముగా వుపయోగించబడేకొరకు యేదో ఒక సంస్థానముయొక్క లేక రాజ్యముయొక్క అధికారమువల్ల ముద్రవెయ్యబడి సాదరు చెయ్యబడి అప్పట్లో పయికముగా వుపయోగించబడే లోహముగా వుంటున్నది.

"నాణెము" నిర్ణయించబడ్డది.

రాణిగారి నాణెమనఁగా, పైకముగా వాడఁబడు నిమిత్తము రాణిగారి యధికారముచొప్పునఁగాని, ఇండియా గవర్న్మెంటువారియొక్క యయినను, ఏ ప్రెసిడెన్సీ గవర్న్మెంటువారియొక్కయయినను, రాణిగారి రాజ్యములలో నుండునట్టి యే గవర్న్మెంటువారియొక్కయయినను, అధికారము చొప్పునఁగాని, ముద్రింపఁబడి సాదరు చేయఁబడిన లోహమని యర్థము; అట్లు ముద్రింపఁబడి సాదరు చేయఁబడిన లోహము పైకముగా వాడఁబడక నిలిచిపోయి యున్నప్పటికిని, ఈ యధ్యాయముయొక్క కార్యములకొఱకు అది రాణిగారి నాణెముగానె యెంచఁబడును.

రాణిగారి నాణెము.

దృష్టాంతములు.

(a) గవ్వలు నాణెములు కావు.

(b) ముద్రవెయ్యబడని రాగిముక్కలు పయికముగా వాడబడ్డప్పటికిన్ని నాణెములు కావు.

(c) మెడల్స్ అనే బిరుదుబిళ్లలు పయికముగా వాడబడేలాగున వుద్దేశించ బడనందున నాణెములు కావు.

(d) కంపెనీరూపాయీ అని చెప్పబడ్డ నాణెము శ్రీ రాణిగారి నాణెముగా వుంటున్నది.

(e) పూర్వము ఇండియా గవర్నమెంటువారి యధికారముచొప్పున పైక ముగా వాడఁబడుచుండిన 'ఫరుఖాబాదు రూపాయ,' ఆ ప్రకారము ఇప్పుడు వాడఁ బడకపోయినను, అది రాణిగారి నాణెమే యగును.

నాణెపు పోలికను తప్పుసృష్టి చెయ్యడము

231. నాణెపు పోలికను తప్పుసృష్టిచేసే, లేక నాణెపు పోలికను తప్పుసృష్టిచెయ్యడమునుగురించి యే కార్యమైనా బుద్ధిపూర్వకముగా జరిగించే యేమనిషి అయినా, యేడుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాల లో ఒకతరహా ఖయిదువల్ల శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడు కావలసినది.

వివరణము.—దగాచెయ్యవలెనని వుద్దేశించి, లేక అందువల్ల దగా జరగవచ్చునని యెరిగివుండి మంచినాణెము మరియొకతరహా నాణె ముగా కనపడేలాగున చేసే ఒకమనిషి, యీ నేరము జరిగించినవా డవుతున్నాడు.

శ్రీరాణిగారి నాణెపు పోలికను తప్పు సృష్టి చెయ్యడము.

232. శ్రీ రాణిగారి నాణెపు పోలికను తప్పుసృష్టిచేసే, లేక తప్పుసృష్టి చెయ్యడమునుగురించి యే కార్యమైనా బుద్ధిపూర్వకముగా జరిగించే యే మనిషి అయినా, యావజ్జీవము ద్వీపాంతరవాసమువల్లగాని పదిసంవ త్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒక తరహా ఖయిదువల్లగాని శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడు కావలసినది.

233. నాణెపు పోలికను తప్పుసృష్టి చెయ్యగలందులకయి వుపయోగపరచడము కొరకుగాని అట్లా వుపయోగపరచబడేలాగున వుద్దేశించబడ్డట్టు యెరిగివుండి, లేక అట్లా నమ్మడమునకు కారణముకలిగివుండిగాని యేదయినా ముద్ర, లేక ఆయుధము చేసే, బాగుచేసే, లేక చెయ్యడము, బాగుచెయ్యడము, వీటిని గురించిన కార్యములలో యే కార్యమయినా జరిగించే, లేక ఖరీదుచేసే, లేక విక్రయించే, లేక వినియోగపరచే యే మనిషి అయినా, మూడు సంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండు తరహాలలో ఒకతరహా ఖయిదువల్ల శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడు కావలసినది.

నాణెపు పోలికను తప్పుసృష్టి చెయ్యడమునకుగాను యేదైనా ఆయుధము చెయ్యడము, లేక విక్రయించడము.

234. శ్రీ రాణీగారి నాణెపుపోలికను తప్పుసృష్టి చెయ్యగలందులకయి వుపయోగపరచడముకొరకుగాని అట్లా వుపయోగపరచబడేలాగున వుద్దేశించబడ్డట్టు యెరిగివుండి, లేక అట్లా నమ్మడమునకు కారణము కలిగివుండిగాని యేదయినా ముద్ర, లేక ఆయుధము చేసే, బాగుచేసే, లేక చెయ్యడము, బాగుచెయ్యడము, వీటినిగురించిన కార్యములలో యేకార్యమయినా జరిగించే, లేక ఖరీదుచేసే, లేక విక్రయించే, లేక వినియోగపరచే యేమనిషి అయినా, యేడుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్ల శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడు కావలసినది.

శ్రీరాణీగారి నాణెపుపోలికను తప్పుసృష్టి చెయ్యడమునకుగాను యేదయినా ఆయుధము చెయ్యడము, లేక విక్రయించడము.

235. నాణెపుపోలికను తప్పుసృష్టి చెయ్యగలందులకయి వుప

నాణెపు పోలికను తప్పుసృష్టి చెయ్యడమునకు వుపయోగపరచడమునకుగాను, ఏదయినా ఆయుధము, లేక మూలవస్తువస్వాధీనమందు వుంచుకోవడము;

యోగపరచడముకొరకుగాని ఆ కార్యముకొరకు వుపయోగపరచబడేలాగున వుద్దేశించబడ్డట్టు యెరిగి వుండి, లేక అట్లా నమ్మడమునకు కారణము కలిగి వుండిగాని యేదయినా ఆయుధము, లేక మూల వస్తువ స్వాధీనమందు కలిగివుండే యేమనిషి అయినా, మూడుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్ల శిక్షించబడడమే గాకుండా జుల్మానాకుకూడా పాత్రుడు కాలసినది;

రాణిగారి నాణెమువంటిది అయినయెడల.

పయిగా తప్పుసృష్టి చెయ్యబడబొయ్యే నాణెము శ్రీ రాణిగారి నాణెమువంటిది అయినయెడల పదిసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్ల శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడు కావలసినది.

ఎవరయినా ఇండియాలోవుండి ఇండియాదేశమునకు వెలపల ఒకనాణెపుపోలికను తప్పుసృష్టి చెయ్యడమునకు కుమ్మక్కు చెయ్యడము.

236. బ్రిటిష్ ఇండియాదేశమునకు లోపల వుండి బ్రిటిష్ ఇండియాకు వెలపల ఒక నాణెపు పోలికను తప్పుసృష్టి చెయ్యడమునకు కుమ్మక్కుచేసే యేమనిషి అయినా, అట్టి నాణెపు పోలికను బ్రిటిష్ ఇండియాకులోపుగా తప్పుసృష్టి చెయ్యగలందులకయి కుమ్మక్కుచేస్తే యేలాగో ఆలాగే శిక్షించబడవలసినది.

తప్పుసృష్టి చెయ్యబడ్డనాణెము దిగుమతీ, లేక యెగుమతి చెయ్యడము.

237. తప్పునాణెము అని యెరిగివుండి, లేక తప్పునాణెముగా వున్నట్టు నమ్మడమునకు కారణముకలిగివుండి, బ్రిటిష్ ఇండియాలోకి దిగుమతీచేసే లేక అక్కడనుంచి యెగుమతీచేసే యేమనిషి అయినా, మూడు

సంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒక తరహా ఖయిదువల్ల శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడు కావలసినది.

శ్రీరాణిగారి నాణెపుపోలికను తప్పగా సృష్టించబడ్డ నాణెము దిగుమతీ లేక యెగుమతీ చెయ్యడము.

238. శ్రీ రాణిగారి నాణెపు పోలికను తప్పగా సృష్టించబడ్డ నాణెము అని తాను యెరిగివుండే లేక అట్టి తప్పు నాణెముగావున్నట్టు నమ్మడమునకు కారణముకలిగి వుండే యేదయినా తప్పనాణెము బ్రిటిష్ ఇండియాలోకి దిగుమతీచేసే లేక అక్కడనుంచి యెగుమతీ చేసే యేమనిషి అయినా, యావజ్జీవము ద్వీపాంతరవాసమువల్లగాని పదిసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడుకావలసినది

తప్పనాణెము అనే యెరుకతో తనవద్ద వుండే నాణెము అప్పగింత పెట్టడము.

239. తనవద్దికి వచ్చినకాలమందు తప్పనాణెము అయినట్టు తాను యెరిగివుండే యేదైనా తప్పనాణెము వుంచుకొనివుండి దగాగాగాని దగా జరగవలెననే యత్నముతోటిగాని దాన్ని యే మనిషికి అయినా అప్పగింత చేసే, లేక యేమనిషి అయినా పుచ్చుకొనేలాగున ప్రేరేపించడమునకు యత్నించే యేమనిషి అయినా, అయిదుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్ల శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడుకావలసినది.

తప్పనాణెము అనే యెరుకతో తనవద వుండే శ్రీరాణిగారి

240. శ్రీ రాణిగారి నాణెపుపోలికను తప్పగా సృష్టించబడ్డటువంటిన్ని తనవద్దికివచ్చిన కాలమందు శ్రీ రాణిగారి నాణెపుపోలికను సృష్టించబడ్డ తప్పనాణెము అని తాను యెరిగివుండేటటువంటిన్ని యేదయినా తప్ప

నాణెపు పోలికగల నాణెము అప్పగింతపెట్టడము.

నాణెము వుంచుకొనివుండి దగాగాగాని దగా జరగవలెననే యత్నముతోటిగాని దాన్ని యే మనిషికి అయినా అప్పగింతచేసే లేక యేమనిషి అయినా పుచ్చుకొనేలాగున ప్రేరేపించడమునకు యత్నించే యేమనిషి అయినా, పదిసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్ల శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడుకానలసినది.

అప్పగింతచేసేమనిషి, మొదట తనవద్దికి వచ్చినప్పుడుతప్పునాణెము అని యెరిగివుండనితప్పునాణెమును మంచిది అయినట్టు అప్పగింత వెయ్యడము.

241 తప్పుగా సృష్టించబడ్డట్టు తాను యెరిగివుండేటటువంటిన్ని తాను దాన్ని పుచ్చుకొన్నకాలమందు తప్పునాణెము అని యెరిగివుండనటువంటన్ని యేదయినా తప్పునాణెము మంచిది అయినట్టు యే యితర మనిషికి అయినా అప్పగింత పెట్టే, లేక మంచినాణెముకింద యే యితరమనిషి అయినా పుచ్చుకొనేలాగున ప్రేరేపించడమునకు యత్నించే యేమనిషి అయినా, రెండుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని తప్పుగా సృష్టించబడ్డ నాణెముల కిమ్మతుకు పదింతలకు వ్యాపించగూడిన మొబల్గువరకు జుల్మానావల్లగాని యీరెంటివల్లగాని శిక్షించబడవలసినది.

## దృష్టాంతము.

తప్పునాణెములుచేసే ఎ అనేమనిషి, చెలాయించగలందులకయి తన సహకారి అయిన బి అనే మనిషివద్ద కంపెనీ రూపాయీల పోలికగల తప్పునాణెములు అప్పగింతచేస్తున్నాడు. బి అనేమనిషి, తప్పునాణెములు చెలాయించే సి అనే యితరమనిషికి ఆ రూపాయీలు విక్రయిస్తున్నాడు, అతడు అవి తప్పునాణెములు అని యెరిగివుండి వాటిని ఖరీదు చేస్తున్నాడు. సి అనేమనిషి, సరకులకుగాను డి అనే మనిషికి ఆ రూపాయీలు చెల్లిస్తున్నాడు. డి అనేమనిషి ఆ రూపాయీలు తప్పునాణెములని

యెరగక వాటిని పుచ్చుకొన్నతర్వాత అవి తప్పునాణెములు అని తెలుసుకొని వాటిని మంచి నాణెములకింద చెల్లించివేస్తున్నాడు. ఇందులో డి అనేమనిషి యీ సెక్షనును పట్టి మాత్రము శిక్షించబడతగివుంటున్నాడు, అయితే బి అనే మనిషిన్ని సి అనే మనిషిన్ని ఆయాసంగతులకు తగ్గట్టు 239-వ లేక 240-వ సెక్షన్ ప్రకారము శిక్షించబడతగి వుంటున్నారు.

తనవద్దికి వచ్చినప్పుడు తప్పునాణెము అని యెరిగివుండే ఒక మనిషి దాన్ని వుంచుకోవడము.

242. తనవద్దికి వచ్చినప్పుడు తప్పుసృష్టిచెయ్యబడ్డ నాణెము అని యెరిగివుండి, దగాగా లేక దగాజరగవలెననే యత్నముతో అట్టి తప్పునాణెము వుంచుకొనివుండే యేమనిషి అయినా, మూడుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒక తరహా ఖయిదువల్ల శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడు కావలసినది.

తనవద్దికి వచ్చినప్పుడు శ్రీరాణిగారి నాణెమువంటి తప్పునాణెము అని యెరిగివుండి దాన్ని వుంచుకోవడము.

243. శ్రీ రాణిగారి నాణెపుపోలికను తప్పుగా సృష్టించబడ్డ తప్పునాణెము తనవద్దికి వచ్చినప్పుడు అది తప్పునాణెము అని యెరిగివుండి దగాగా లేక దగాచెయ్యవలెననే యత్నముతో దాన్ని వుంచుకొనివుండే యేమనిషి అయినా, యేడుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒక తరహా ఖయిదువల్ల శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడు కావలసినది.

టంకసాలలో వుద్యోగస్థుడుగావుండి న్యాయశాస్త్రమును పట్టి నిర్ణయించబడ్డ తూనికలో లేక మిశ్ర

244. బ్రిటిష్ ఇండియాలో న్యాయశాస్త్రరీత్యా స్థాపించబడ్డ యే టంకసాలలోనైనా వుద్యోగస్థుడుగావుండి ఆ టంకసాలలోనుంచి సాదరు చెయ్యబడ్డ యేదైనా నాణెము న్యాయశాస్త్రమువల్ల నిర్ణయించబడ్డ తూనికకంటె లేక మిశ్రమముకంటె భేదమైన తూ

మములో భేదముగా వుండేలాగున ఒక నాణెము చేసే మనిషి.

నిక లేక మిశ్రమము కలిగివుండేలాగున చెయ్య వలెననే యత్నములో యేదైనా కార్యము జరిగించే, లేక న్యాయశాస్త్రమునుపట్టి తాను విధాయకముగా చెయ్యవలసిన యేదైనా కార్యము జరిగించకపొయ్యే యే మనిషి అయినా, యేడుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలము వరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్ల శిక్షించబడడమే గాకుండా జుల్మానాకుకూడా పాత్రుడుకావలసినది.

టంకసాలలోనుంచి నాణెములుచేసే ఆయుధము న్యాయశాస్త్ర విరోధముగా యెత్తుకొనిపోవడము.

245. బ్రిటిష్ ఇండియాలో న్యాయశాస్త్రరీత్యా స్థాపించబడ్డ యే టంకసాలలోనుంచి అయినా నాణెములుచేసే యేదైనా పనిముట్టు లేక ఆయుధము న్యాయశాస్త్ర సమ్మతమైన అధికారము లేకుండా యెత్తుకొనిపొయ్యే యేమనిషి అయినా, యేడుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్ల శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడు కావలసినది.

దగాగా లేక అయోగ్యముగా నాణెముయొక్క తూనిక తక్కువచెయ్యడము, లేక మిశ్రమము భేదపరచడము.

246. ఏదైనా నాణెముయొక్క తూనిక తక్కువ అయ్యేలాగున, లేక మిశ్రమము భేదపడేలాగున అట్టి నాణెమునకు యేదైనా కార్యము దగాగా లేక అయోగ్యముగాచేసే యేమనిషి అయినా, మూడుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్ల శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడుకావలసినది.

వివరణము.—ఏదైనా నాణెము తొలిచి కొంత పుచ్చుకొని అందుకు బదులుగా ఆ బెజ్జములో మరియేదైనావుంచే యేమనిషి అయినా, ఆ నాణెముయొక్క మిశ్రమమును భేదపరచినవాడవుతున్నాడు.

247. శ్రీరాణిగారి తాలూకు నాణెముయొక్క తూనిక తక్కువ అయ్యేలాగున, లేక మిశ్రమము భేదపడేలాగున అట్టి నాణెమునకు యేదైనా కార్యము దగాగా లేక అయోగ్యముగా చేసే యేమనిషి అయినా, ఏడు సంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్ల శిక్షించ బడడమేగాకుండా జుల్మానాకుకూడ పాత్రుడు కావలసినది.

దగాగా లేక అయోగ్యముగా శ్రీ రాణిగారి తాలూకు నాణెముయొక్క తూనిక తక్కువ చెయ్యడము, లేక మిశ్రమము భేదపరచడము.

248. మరిఒక తరహాదారీగల నాణెముగా చెల్లవచ్చుననే వుద్దేశముతో యేదైనా నాణెముయొక్క రూపము భేదపడేలాగున అట్టి నాణెమునకు యేదైనా కార్యముచేసే యేమనిషి అయినా, మూడుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్ల శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడు కావలసినది.

మరిఒక తరహాదారీగల నాణెముగా చెల్లవచ్చుననే వుద్దేశముతో నాణెముయొక్క రూపము భేదపరచడము.

249. మరిఒక తరహాదారీగల నాణెముగా చెల్లవచ్చుననే వుద్దేశముతో శ్రీ రాణిగారి తాలూకు యేదైనా నాణెముయొక్క రూపము భేదపడేలాగున అట్టి నాణెమునకు యేదైనా కార్యముచేసే యేమనిషి అయినా యేడుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖైదువల్ల శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడుకావలసినది.

మరిఒక తరహాదారీగల నాణెముగా చెల్లవచ్చుననే వుద్దేశముతో శ్రీ రాణిగారి నాణెముయొక్క రూపము భేదపరచడము.

250. 246-వ లేక 248-వ సెక్షనులో నిర్దేశించబడ్డ నేరము జరిగించబడివుండే నాణెము తనవద్ద వుంచుకొనినన్ని,

భేదపరచబడ్డట్టు యెరిగివుండి తనవద్ద వుండే నాణెము అప్పగింత చెయ్యడము.

అట్టి నాణెము తనవద్దికి వచ్చినప్పుడు దాన్ని గురించి అట్టి నేరము జరిగించబడివున్నట్టు యెరిగివుండిన్ని, దగాగా లేక దగా జరగవలెననే యత్నముతో యేమనిషికయినా అట్టి నాణెము అప్పగింత చేసే, లేక యేమనిషి అయినా దాన్ని పుచ్చుకొనేలాగున ప్రేరేపించడమునకు యత్నించే, యేమనిషి అయినా అయిదుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్ల శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడుకావలసినది.

భేదపరచబడ్డట్టు తెలిసివుండి తనవద్ద వుండే శ్రీ రాణిగారి నాణెము అప్పగింత చెయ్యడము.

251. 247-వ లేక 249-వ సెక్షన్‌లో నిర్దేశించబడ్డ నేరము జరిగించబడివుండే నాణెము తనవద్ద వుంచుకొనిన్ని, అట్టి నాణెము తనవద్దికి వచ్చినప్పుడు దానికి అట్టి నేరము జరిగించబడియున్నట్టు యెరిగివుండిన్ని, దగాగా లేక దగా జరగవలెననే యత్నముతో యేయితరమనిషికయినా అట్టి నాణెము అప్పగింతచేసే, లేక దాన్ని యేయితరమనిషి అయినా పుచ్చుకొనేలాగున ప్రేరేపించడమునకు యత్నించే, యేమనిషి అయినా పదిసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్ల శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడుకావలసినది.

తనవద్దికివచ్చినప్పుడు నాణెము భేదపరచబడ్డట్టు యెరిగివుండేమనిషి దాన్ని వుంచుకోవడము.

252. దగాగా లేక దగా జరగవలెననే యత్నముతో, 246-వ సెక్షన్‌లోగాని 248-వ సెక్షన్‌లోగాని నిర్దేశించబడ్డ నేరము జరిగించబడివుండే నాణెము తనవద్దికి వచ్చినప్పుడు దానికి అట్టి నేరము జరిగించబడివున్నట్టు యెరిగివుండి దాన్ని తనవద్దవుంచుకొనివుండే యేమనిషి అయినా మూడుసంవత్సరములకు వ్యాపించగూడిన

కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్ల శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడు కావలసినది.

శ్రీరాణిగారినాణెము తనవద్దికివచ్చినప్పుడు అది భేదపరచబడ్డట్టు యెరిగివుండేమనిషి దాన్ని వుంచుకోవడము.

253. దగాగా లేక దగా జరగవలెననే యత్నముతో, 247-వ సెక్షనులోగాని 249-వ సెక్షనులోగాని నిర్దేశించబడ్డ నేరము జరిగించబడివుండే నాణెము తనవద్దికి వచ్చినప్పుడు దానికి అట్టి నేరము జరిగించబడివున్నట్టు యెరిగివుండి దాన్ని తనవద్ద వుంచుకొనివుండే యేమనిషి అయినా, అయిదు సంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్ల శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడు కావలసినది.

అప్పగించేచేసేవానివద్దికి నాణెము మొదట వచ్చినప్పుడు భేదపరచబడ్డట్టు తెలియకుండావుండి అది మంచిది అయినట్టు అప్పగింప చెయ్యడము

254. 246,247,248, లేక 249 సెక్షనులలో నమూదుచెయ్యబడ్డ యేకార్యమైనా దానికి జరిగించబడ్డట్టు తాను యెరిగివుండేటటువంటిన్ని, మొదట తాను స్వాధీన పరచుకొన్నకాలమందు అట్టి కార్యము జరిగించబడ్డట్టు తాను యెరిగివుండనటువంటిన్ని, యేదైనా నాణెము మంచినాణెముకింద గాని అదివుండే తరహాగాక మరిఒకతరహా నాణెముకిందగాని యే యితర మనిషికైనా అప్పగింతచేసే, లేక మంచినాణెముకిందగాని అది వుండే తరహాగాక మరి ఒకతరహా నాణెముకిందగాని యేమనిషి అయినా పుచ్చుకొనేలాగున ప్రేరేపించడమునకు యత్నించే, యేమనిషి అయినా రెండుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండు తరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని ఆ భేదపరచబడ్డ నాణెము దేనికింద చెలాయించబడ్డదో లేక చెలాయించేలాగున యత్నించబడ్డదో

అట్టి నాణెపు కిమ్మతుకు పదింతలకు వ్యాపించగూడిన మొబల్లగువరకు జుల్మానావల్ల గాని శిక్షించబడవలసినది.

గవర్న్మెంటు స్టాంపుపోలికనుతప్పు సృష్టి చెయ్యడము.

255. రెవిన్యూకొరకు గవర్న్మెంటువారివల్ల సాదరు చెయ్య బడ్డ యేదైనా స్టాంపుపోలికను తప్పుసృష్టిచేసే, లేక తప్పుసృష్టి చెయ్యడమునుగురించి యేదైనా కార్యము బుద్ధిపూర్వకముగా జరిగించే, యేమనిషి అయినా యావజ్జీవము ద్వీపాంతరవాసమువల్లగాని పదిసంవత్సరము లకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడు కావలసినది.

వివరణము.—ఒకతరహా దారీగల మంచిస్టాంపు మరిఒక తర హా దారీగల మంచిస్టాంపుగా కనపడేలాగున తప్పుసృష్టిచేసే ఒకమనిషి యీ నేరము జరిగించినవాడవుతున్నాడు.

గవర్న్మెంటు స్టాంపుపోలికను తప్పు సృష్టి చెయ్యగలందు లకు ఆయుధము లేక మూలవస్తువ స్వాధీన మందు వుంచకోవడ ము.

256. రెవిన్యూకొరకు గవర్న్మెంటువారివల్ల సాదరు చెయ్య బడ్డ యేదైనా స్టాంపుపోలికను తప్పుసృష్టి చెయ్య గలందులకు వుపయోగపరచడమునకుగాను, లేక అది వుపయోగపరచవలెనని యత్నించబడ్డట్టు యెరిగివుండి, లేక అట్లా నమ్మడమునకు కారణము కలిగివుండి, యేదైనా ఆయుధముగాని మూలవస్తువ గాని తనస్వాధీనమందు వుంచుకొనివుండే యే మనిషి అయినా యేడుసంవత్సరములకు వ్యాపించగూడేన కాలము వరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్ల శిక్షించబడడమే గాకుండా జుల్మానాకుకూడా పాత్రుడు కావలసినది.

257. రెవిన్యూకొరకు గవర్న్మెంటువారివల్ల సాదరు చెయ్య

గవర్నమెంటు స్టాంపుపోలికను తప్పుసృష్టి చెయ్యడమునకు ఆయుధము చెయ్యడము లేక విక్రయించడము.

బడ్డ యేదైనా స్టాంపుపోలికను తప్పుసృష్టి చెయ్యగలందులకు వుపయోగపరచడమునకుగాను, లేక అది వుపయోగపరచవలెనని యత్నించబడ్డట్టు యెరిగివుండి, లేక అట్లా నమ్మడమునకు కారణము కలిగివుండి, యేదైనా ఆయుధముచేసే లేక చెయ్యడమునుగురించిన యేదైనా కార్యములో యేభాగమైనా జరిగించే, లేక ఖరీదుచేసే, లేక విక్రయించే, లేక వినియోగపరచే, యేమనిషి అయినా ఏడుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్ల శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడు కావలసినది.

గవర్నమెంటు స్టాంపుపోలికను తప్పుగా సృష్టించబడి వుండే స్టాంపు విక్రయించడము.

258. రెవిన్యూకొరకు గవర్నమెంటువారివల్ల సాగు చెయ్యబడ్డ యేదైనా స్టాంపుపోలికను తప్పుసృష్టి చెయ్యబడివున్నట్టు తాను యెరిగివుండే, లేక అట్లా నమ్మడమునకు కారణముకలిగివుండే, ఏదైనా స్టాంపు విక్రయించే, లేక విక్రయమునకు కనపరిచే, ఏమనిషి అయినా ఏడుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్ల శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడు కావలసినది.

గవర్నమెంటు స్టాంపుపోలికనుతప్పుసృష్టి చెయ్యబడివుండేస్టాంపు స్వాధీనమందువుంచుకోవడము.

259. రెవిన్యూకొరకు గవర్నమెంటువారివల్ల సాగు చెయ్యబడ్డ ఏదైనా స్టాంపుపోలికను తప్పుసృష్టి చెయ్యబడ్డట్టు తాను యెరిగివుండే ఏదైనా స్టాంపు మంచి స్టాంపుకింద వుపయోగపరచవలెనని, లేక వినియోగపరచవలెనని వుద్దేశించిగాని మంచిస్టాంపుకింద వుపయోగపరచబడగలందులకుగాని తనవద్ద వుంచుకొనివుండే

ఏమనిషి అయినా, ఏడుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలము వరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్ల శిక్షించబడడమే గాకుండా జుల్మానాకుకూడా పాత్రుడు కావలసినది.

గవర్న్మెంటు స్టాంపుపోలికనుతప్పుసృష్టి చెయ్యబడ్డట్టు యెరిగివుండి మంచిస్టాంపుకింద వుపయోగపరచడము.

260. రెవిన్యూకొరకు గవర్న్మెంటువారివల్ల సాదరు చెయ్యబడ్డ యేదైనా స్టాంపుపోలికను తప్పుసృష్టి చెయ్యబడ్డట్టు తాను యెరిగివుండే యేదైనా స్టాంపు మంచిస్టాంపుకింద వుపయోగపరచే యేమనిషి అయినా, ఏడుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలము వరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్ల గాని జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

గవర్న్మెంటువారికి నష్టము కలగచెయ్యవలెననే వుద్దేశముతో గవర్న్మెంటు స్టాంపువుండే వస్తువమీద వ్రాయబడివుండే వాన్ని చెరిపివెయ్యడము, లేక దస్తావేజుమీద వెయ్యబడ్డస్టాంపునుతీసివెయ్యడము.

261. దగాగా, లేక గవర్న్మెంటువారికి నష్టము కలగచెయ్యవలెననే వుద్దేశముతో, రెవిన్యూకొరకు గవర్న్మెంటువారివల్ల సాదరు చెయ్యబడ్డ యేదయినా స్టాంపువుండే ఒకవస్తువమీదనుంచి, యే లిఖితమును గురించి లేక దస్తావేజునుగురించి అట్టి స్టాంపు వుపయోగపరచబడ్డదో యేదయినా అట్టి లిఖితము లేక దస్తావేజు తీసివేసే, లేక చెరిపివేసే, లేక అట్టి స్టాంపు మరిఒక లిఖితమునకు లేక దస్తావేజుకు వుపయోగపరచబడగలందులకయి యేదయినా లిఖితమునకు లేక దస్తావేజుకు వుపయోగపరచబడ్డ ఒక స్టాంపు అట్టి లిఖితముమీదినుంచి లేక దస్తావేజుమీదినుంచి తీసివేసే, యేమనిషి అయినా మూడుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

ముందు వుపయోగపరచబడ్డట్టు యెరిగివుండి గవర్న్మెంటు స్టాంపు తిరిగీ వుపయోగపరచడము.

262. దగాగా, లేక గవర్న్మెంటువారికి నష్టము కలగచెయ్యవలెననే వుద్దేశముతో, ముందు వుపయోగపరచబడ్డట్టు తాను యెరిగివుండే, రెవిన్యూకొరకు గవర్న్మెంటువారివల్ల సాదరు చెయ్యబడ్డ, ఒక స్టాంపు యే కార్యముకొరకయినా తిరిగీ వుపయోగపరచే యేమనిషి అయినా, రెండుసంవత్సరములకు వ్యాపించగూడినకాలము వరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

ఒక స్టాంపు వుపయోగపరచబడ్డట్టు తెలియచేసే గుర్తు గోకివెయ్యడము.

263. దగాగా, లేక గవర్న్మెంటువారికి నష్టము కలగచెయ్యవలెననే వుద్దేశముతో, రెవిన్యూకొరకు గవర్న్మెంటువారివల్ల సాదరు చెయ్యబడ్డ ఒకస్టాంపుమీదినుంచి అది వుపయోగపరచబడ్డది అని తెలియచెయ్యడముకొరకు దానిమీద వెయ్యబడ్డ లేక ముద్రించబడ్డ యేదయినా గుర్తు గోకివేసే లేక తీసివేసే, లేక అట్టి గుర్తు గోకివెయ్యబడ్డ లేక తీసివెయ్యబడ్డ యేదయినా స్టాంపు బుద్ధిపూర్వకముగా తనవద్ద వుంచుకొనివుండే, విక్రయించే, లేక వినియోగపరచే, లేక వుపయోగపరచబడ్డట్టు తాను యెరిగివుండే అట్టి యే స్టాంపు అయినా విక్రయించే లేక వినియోగపరచే, యేమనిషి అయినా మూడుసంవత్సరములకు వ్యాపించగూడినకాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

కృత్రిమ స్టాంపులను నసిషేధించుట.

263-A. (1) ఏమనుష్యుండయినను—

(a) ఏ కృత్రిమ స్టాంపునయిన చేసినయెడల, బుద్ధిపూర్వకముగా మార్చినయెడల, వ్యాపారముచేసినయెడల, లేక విక్ర

యించినయెడల, లేక ఏ కృత్రిమస్టాంపునైన ఏ తపాలా కార్యముకొఱకయినను బుద్ధిపూర్వకముగా ఉపయోగించినయెడల, లేక

(b) ఏ కృత్రిమ స్టాంపునయిన న్యాయమయిన కారణములేకయే స్వాధీనమందుంచుకొనియున్నయెడల, లేక

(c) కృత్రిమ స్టాంపును దేనినయిన చేయుటకయి ఏ ముద్రనుగాని, అచ్చునుగాని, ఆయుధమునుగాని, సామానునుగాని, చేసినయెడల లేక న్యాయమగు కారణము లేకయే స్వాధీనమందుంచుకొని యున్నయెడల,

అతఁడు రెండువందల రూపాయలవఱకు జుల్మానావలన శిక్షింపఁబడవలయును.

(2) కృత్రిమ స్టాంపును దేనినయిన చేయుటకుఁగాను ఏ మనుష్యుని స్వాధీనమందైన ఉండెడు అట్టి స్టాంపును, ముద్రను, అచ్చును, ఆయుధమును, లేక సామానును దేనినయిన జప్తుచేయవచ్చును, మఱియు అది సర్కారుదయి పోవలయును:

(3) ఈ సెక్షనులో 'కృత్రిమస్టాంపు' అను మాటకు పోస్టేజి రేటును తెలుపుటకుఁగాను గవర్న్మెంటువారిచే సాదరు చేయఁబడినట్లు కృత్రిమముగా భావమయ్యెడు ఏదయిన స్టాంపు, లేక అట్టి పోస్టేజి రేటును తెలుపుటకుఁగాను గవర్న్మెంటువారిచే సాదరు చేయఁబడిన ఏ స్టాంపుదయిన (ఫాక్‌సిమిలి) తుల్యప్రతి, ప్రతికల్పన, లేక ఆకారము, కాగితముమీఁదనయినను వేఱువిధముననయినను, అని అర్థమగుచున్నది.

(4) ఈ సెక్షనులోను, 255 మొదలు 263 వఱకు, రెండు చేరి గల సెక్షన్లలోను, పోస్టేజి రేటును తెలుపుటకుఁగాను సాదరు

చేయఁబడిన ఏ స్టాంపుకయినను సంబంధించునట్లుగాని ప్రస్తావన కలిగి యుండునట్లుగాని ఉపయోగింపఁబడినప్పుడు, 17-వ సెక్షనులో ఏమి చెప్పియున్ననుసరే, 'గవర్న్మెంటువారు' అనుమాట, ఇండియాలో ఏ భాగమందైనను, మఱియు హర్ మాజస్టీరాణిగారియొక్క రాజ్యములలో ఏభాగమందయిన, లేక ఏ పరాయి దేశములోనయినను, ఎగ్జిక్యుటివ్ గవర్న్మెంటు తాలూకు కార్యములను నిర్వహించుటకు విధ్యుక్తముగా అధికారమియ్యఁబడిన మనుష్యునిగాని మనుష్యులనుగాని చేర్చుకొనినట్లు గ్రహింపఁబడవలయును.

---

## 13-వ అధ్యాయము.

### పడికట్లు, కొల్చేసాధనములు, వీటితో యిలాకాగల నేరములనుగురించి.

తూచే తప్పుయంత్రము దగాగా వాడడము.

264. తప్పుగావున్నట్టు తాను యెరిగివుండే యేదయినా తూచే యంత్రము దగాగా వాడే యేమనిషి అయినా, ఒక సంవత్సరమునకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

తప్పుపడికట్టు, లేక తప్పుకొల సాధనము దగాగా వాడడము.

265. ఏదయినా తప్పుపడికట్టుగాని పొడుగునుగురించిన లేక ప్రమాణమునుగురించిన తప్పుకొల సాధనముగాని దగాగా వాడే, లేక యేదయినా పడికట్టుగాని పొడుగునుగురించిన లేక ప్రమాణమునుగురించిన కొల సాధనముగాని అది యేదిగావున్నదో అట్టిదికాకుండా వేరు పడికట్టుగా లేక వేరు కొలసాధనముగా దగాగా వాడే యేమనిషి అయినా, ఒకసంవత్సరమునకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

266. తప్పుగావున్నట్టు తాను యెరిగివుండిన్ని, దగాగా వాడబడ్డవలెననే వుద్దేశముతోనున్ను, యేదయినా తూచే యంత్రము, పడికట్టు, లేక పొడుగునుగురించిన లేక ప్రమాణమునుగురించిన కొలసాధనము వుంచుకొని వుండే యేమనిషి అయినా, ఒక సంవత్సరమునకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

తప్పుపడికట్టులేక తప్పుకొల సాధనము వుంచుకొనివుండడము

267. ఖరాగా వుండేటట్టు వాడబడగలందులకయి, లేక ఖరాగా వుండేటట్టు వాడబడవచ్చునని యెరిగివుండి, తప్పుగా వున్నట్టు తనకు తెలిసివుండే యేదయినా తూచేయంత్రము, పడికట్టు, లేక పొడుగునుగురించిన లేక ప్రమాణమునుగురించిన కొలసాధనముచేసే, విక్రయించే, లేక వినియోగపరచే యేమనిషి అయినా, ఒక సంవత్సరమునకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

తప్పుపడికట్లు, లేక తప్పుకొల సాధనము చెయ్యడము, లేక విక్రయించడము.

---

## 14-వ అధ్యాయము.

### జనుల ఆరోగ్యము, క్షేమము, సౌఖ్యము, మర్యాద, నీతి వీటికి హాని కలగచేసే నేరములనుగురించి.

268. సమీపమందు వాసముచేసే లేక యేదయినా స్థితి వుంచుకొనివుండే ప్రజలకు సాధారణముగా లేక సర్వజనులకు, యేదయినా సాధారణమయిన హాని, ప్రమాదము, లేక వుపద్రవము కలగచేసే, లేక యేదయినా సర్వసాధారణమయిన హక్కు చెలాయించుకొనే మనుష్యులకు హాని, ఆటంకము, ప్రమాదము, లేక వుపద్రవము ఆవశ్యకముగా కలగచెయ్యవలసిన యే

జనోపద్రవము.

దయినా కార్యము జరిగించే, లేక న్యాయశాస్త్రవిరోధమయిన లోపము జరిగించే, యేమనిషి అయినా, జనోపద్రవము జరిగించిన నేరమును గురించి నేరస్థుడు అవుతున్నాడు.

సర్వజనోపద్రవమువల్ల యేదో ఒక సౌఖ్యము లేక ప్రయోజనము కలుగుతున్నదనే కారణమునుపట్టి అది మన్నించబడనేరదు.

ప్రాణమునకు ప్రమాదకరమయిన రోగము సోకేలాగున వ్యాపింప చెయ్యగూడిన అశ్రద్ధ కార్యము.

269. ప్రాణమునకు ప్రమాదకరమయిన యేదయినా రోగము సోకేలాగున వ్యాపింపచెయ్యగూడివుండే, లేక వ్యాపింపచెయ్యగూడినది అని తాను యెరిగివుండే, లేక వ్యాపిస్తున్నది అని నమ్మడమునకు కారణము కలిగివుండే యేదయినా కార్యము న్యాయశాస్త్ర విరోధముగా లేక అశ్రద్ధగా చేసే యేమనిషి అయినా, ఆరుమాసములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

ప్రాణమునకు ప్రమాదకరమయిన రోగము సోకేలాగున వ్యాపింప చెయ్యగూడిన కానెషీ కార్యము.

270. ప్రాణమునకు ప్రమాదకరమయిన యేదయినా రోగము సోకేలాగున వ్యాపింపచెయ్యగూడివుండే, లేక వ్యాపింపచెయ్యగూడినది అని తాను యెరిగివుండే, లేక వ్యాపిస్తున్నది అని నమ్మడమునకు కారణము కలిగివుండే యేదయినా కార్యము కానేషీమీరి జరిగించే యేమనిషి అయినా, రెండుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

271. ఏదయినా వాడను క్వారంటీన్ స్థితిలో వుంచడమునకుగాను, లేక క్వారంటీన్ స్థితిలోవుండే వాడగట్టున

క్వారంటీన్ నిబంధనలకు విరోధముగా జరిగించడము.

వుండేవాటితోటిగాని యితర వాడలతోటిగాని కలిగి వుండే సంపర్కము క్రమపరచడమునకుగాను, లేక సోకువ్యాధి వుండే స్థలములకున్ను యితర స్థలములకున్ను కలిగివుండే సంపర్కము క్రమపరచడమునకుగాను, ఇంన్డియా గవరన్మెంటువారివల్లగాని మరి యేదయినా గవరన్మెంటువారివల్లగాని చెయ్యబడి ప్రసిద్ధపరచబడ్డ యేదయినా నిబంధనలకు బుద్ధిపూర్వకముగా విరోధము జరిగించే యేమనిషి అయినా, ఆరుమాసములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

విక్రయముకోరకు వుద్దేశించబడ్డ ఆహారవస్తువతోటి లేక పానవస్తువతోటి మరి యేదయినా కల్తీ చెయ్యడము.

272. ఏదయినా ఆహారవస్తువ లేక పానవస్తువ ఆహారవస్తువగా లేక పానవస్తువగా విక్రయించడమునకు వుద్దేశించిగాని, అది ఆహారవస్తువగా లేక పానవస్తువగా విక్రయించబడవచ్చునని యెరిగివుండిగాని, అది ఆహారవస్తువగా లేక పానవస్తువగా వుపద్రవకరమయ్యేలాగున అందులో యేదయినా కల్తీచేసే యేమనిషి అయినా, ఆరుమాసములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని వెయ్యిరూపాయలకు వ్యాపించగూడిన జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

ఉపద్రవకరమైన ఆహారవస్తువ లేక పానవస్తువ విక్రయించడము.

273. ఆహారమునకు లేక పానమునకు తగని స్థితిలోవుండే, లేక వుపద్రవకరము అయివుండే, లేక వుపద్రవకరముగా చెయ్యబడ్డ యేదయినా ఆహారవస్తువ లేక పానవస్తువ, అది ఆహారవస్తువగా లేక పానవస్తువగా వుపద్రవకరము అని యెరిగివుండి, లేక అట్లా వున్నట్టు నమ్మడమునకు కారణము కలిగివుండి, దాన్ని విక్రయించే, లేక అమ్మజూపే లేక అమ్మక

మునకు కనపరచే యేమనిషి అయినా, ఆరుమాసములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని వెయ్యిరూపాయలకు వ్యాపించగూడిన జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

ఔషధపు వస్తువులలో యేదైనా కల్తీ చెయ్యడము.

274. కల్తీచెయ్యబడకుండా వున్నట్టు యేయినా ఔషధపు కార్యములకొరకు విక్రయించబడవలెనని, లేక వాడబడవలెనని వుద్దేశించిగాని, విక్రయించబడవచ్చును లేక వాడబడవచ్చును అని యెరిగివుండి, లేక నమ్మడమునకు కారణముకలిగివుండిగాని, యేవయినా ఔషధపు వస్తువుయొక్క లేక ఔషధముగాచెయ్యబడ్డ వస్తువుయొక్క బలము తగ్గించేలాగున, లేక దాని క్రియ భేదపరిచేలాగున, లేక అది వుపద్రవకరము అయ్యేలాగున, అందులో యేవయినా కల్తీచేసే యేమనిషి అయినా, ఆరుమాసములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని వెయ్యిరూపాయలకు వ్యాపించగూడిన జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

కల్తీ చెయ్యబడ్డ ఔషధపు వస్తువులు విక్రయించడము.

275. ఏవయినా ఔషధపువస్తువు, లేక ఔషధముగా చెయ్యబడ్డవస్తువు అందుల బలము తగ్గేలాగునగాని అందుల క్రియ భేదపడేలాగునగాని అది వుపద్రవకరమయ్యేలాగునగాని కల్తీచెయ్యబడ్డట్టు యెరిగివుండి, అది కల్తీచెయ్యబడనట్టు విక్రయించే, లేక అమ్మజూపే, లేక అమ్మకమునకు కనపరచే, లేక ఔషధపు కార్యములకొరకు యేవయినా ఔషధశాలలోనుంచి యిచ్చే, లేక అట్టి కల్తీ సంగతినిగురించి యెరగని యేమనిషివల్లనయినా ఔషధపు కార్యములకొరకు వాడబడేలాగునచేసే యేమనిషి అయినా, ఆరుమాసములకు వ్యాపించగూడిన కాలమువరకు

రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని వెయ్యిరూపాయలకు వ్యాపించగూడిన జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

ఔషధపువస్తువు, మరియొక ఔషధపు వస్తువుగా లేక ఔషధముగా చెయ్యబడ్డ వస్తువుగా విక్రయించడము.

276. ఏదయినా ఔషధపువస్తువును లేక ఔషధముగా చెయ్యబడ్డ వస్తువును మరియొక ఔషధపు వస్తువుగా, లేక మరియొక ఔషధముగా చెయ్యబడ్డ వస్తువుగా బుద్ధిపూర్వకముగా విక్రయించే, లేక అమ్మజూపే, లేక అమ్మకమునకు కనపరచే, లేక యేదయినా ఔషధపు కార్యములకుగాను ఔషధశాలలోనుంచి యిచ్చే యేమనిషి అయినా, ఆరుమాసములకు వ్యాపించగూడిన కాలము వరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని వెయ్యిరూపాయలకు వ్యాపించగూడిన జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

సర్వజనోపయుక్తమయిన వూటయొక్క లేక జలాశయముయొక్క నీరు అశుద్ధపరచడను.

277. సర్వజనోపయుక్తమయిన వూటయొక్క లేక జలాశయముయొక్క నీరు, అది సాధారణముగా వాడబడే కార్యమునకు అంత తగివుండకుండాపొయ్యేలాగున, స్వేచ్ఛగా అశుద్ధపరచే, లేక మురికిచేసే యేమనిషి అయినా, మూడుమాసములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని అయిదువందలరూపాయలకు వ్యాపించగూడిన జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

వాయువు, జనుల ఆరోగ్యమునకు వుప

278. సమీపమందు వాసముచేసే, లేక యేదయినా పనిచేసే, లేక సర్వజనోపయుక్తమయిన దారిని నడిచే జనుల ఆరోగ్యమునకు సాధారణముగా వుపద్రవకరము

ప్రవకరమయ్యేలాగు చెయ్యడము.

అయ్యేలాగున యే స్థలమందయినా వాయువును స్వేచ్ఛగా చెరిపే యేమనిషి అయినా, అయిదువందల రూపాయలకు వ్యాపించగూడిన జుల్మానావల్ల శిక్షించబడవలసినది.

సర్వజనోపయుక్తమయిన దారిని ముందువెనుక చూడకుండా బండ్లు తోలడము, లేక సవారీ చెయ్యడము.

279. మనుష్యప్రాణమునకు అపాయము కలిగేలాగున, లేక మరి యే మనిషికైనా ఘాత లేక హాని సంభవించగూడేలాగున, ముందు వెనుక చూడకుండానున్ను అజాగ్రతగానున్ను సర్వజనోపయుక్తమైన యేదైనా మార్గమందు యేవాహనమైనా తోలే లేక సవారీ చేసే యేమనిషి అయినా, ఆరుమాసములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని వెయ్యిరూపాయలకు వ్యాపించగూడిన జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

వాడ అజాగ్రతగా నడపడము.

280. మనుష్యప్రాణమునకు అపాయము కలిగేలాగున, లేక మరి యేమనిషికైనా ఘాత, లేక హాని సంభవించగూడేలాగున, ముందు వెనుక చూడకుండానున్ను అజాగ్రతగానున్ను యేదైనా వాడ నడిపే యేమనిషి అయినా, ఆరుమాసములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని వెయ్యిరూపాయలకు వ్యాపించగూడిన జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

తప్పువెలుగు, గుర్తు, లేక బోయాకట్టెకనపరచడము.

281. వాడ నడిపే యేమనిషి అయినా భ్రమపడవలెనని యత్నించి, లేక భ్రమపడవచ్చునని యెరిగివుండి, యేదైనా తప్పువెలుగు, గుర్తు, లేక బోయాకట్టె కనపరచే యేమనిషి అయినా, ఏడుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా

ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

అత్యధికముగా బరువు యెక్కించబడి వుండే లేక భద్రముకాని వాడమీద అద్దెకు మనిషిని తీసుకొనిపోవడము.

282. ఒకవాడ, మనిషియొక్క ప్రాణమునకు అపాయము కలగచెయ్యగూడిన స్థితిలోగాని అంత అత్యధికముగా బరువు యెక్కించబడిగాని వున్నప్పుడు, యెరిగివుండి, లేక అజాగ్రతగా అట్టి వాడలో యే మనిషిని అయినా అద్దెకు నీటిమీద తీసుకొనిపొయ్యే, లేక తీసుకొనిపొయ్యేలాగునచేసే యేమనిషి అయినా ఆరుమాసములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని వెయ్యిరూపాయలకు వ్యాపించగూడిన జుల్మానావల్లగాని ఈ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

సర్వజనోపయుక్తమయిన దారిని, లేక నీటిమీదవెళ్లేదారిలో ప్రమాదము, లేక అడ్డు కలగచెయ్యడము.

283. ఒక కార్యము జరిగించడమువల్లగాని, తనస్వాధీనమందు లేక తనపరమందు వుండే యేదైనా ఆస్తినిగురించి బందోబస్తు చెయ్యకుండా పోవడమువల్లగాని, సర్వజనోపయుక్తమైనదారిని లేక నీటిమీదవెళ్లే దోవలో యేమనిషికైనా ప్రమాదము, అడ్డు, లేక హాని కలగచేసే ఏమనిషి అయినా, రెండువందల రూపాయలకు వ్యాపించగూడిన జుల్మానావల్ల శిక్షించబడవలసినది.

విషవస్తువును గురించి అశ్రద్ధగా జరిగించడము.

284. ఏదైనా విషవస్తువుతోటి, మనుష్యప్రాణమునకు అపాయము సంభవించేలాగునగాని మరి ఏమనిషికైనా ఘాత లేక హాని సంభవించగూడేలాగునగాని, ముందు వెనక చూడకుండానున్ను అజాగ్రతగానున్ను ఏదైనా కార్యము జరిగించే,

లేక తనస్వాధీనమందు వుండే విషవస్తువువల్ల మనుష్యప్రాణముకు కలగగూడిన ప్రమాదము సంభవించకుండా చెయ్యడమునకు, చాలినంత బందోబస్తు యెరిగివుండి లేక అజాగ్రతవల్ల చెయ్యకుండాపొయ్యే ఏమనిషి అయినా,

ఆరుమాసములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని వెయ్యిరూపాయలకు వ్యాపించగూడిన జుల్మానావల్లగాని ఈ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

నిప్పునుగురించి, లేక నిప్పు అంటుకొనే గుణముగల వస్తువనుగురించి అజాగ్రతగా జరిగించడము.

285. నిప్పుతోటి లేక నిప్పు అంటుకొనే గుణముగల యేదైనా వస్తువతోటి మనుష్యప్రాణమునకు ప్రమాదము సంభవించేలాగునగాని మరి యేమనిషికైనా ఘాత లేక హాని సంభవించగూడేలాగునగాని ముందు వెనక చూడకుండానున్ను అజాగ్రతగానున్ను యేదైనా కార్యము జరిగించే,

లేక తనస్వాధీనమందువుండే నిప్పువల్ల, లేక నిప్పు అంటుకొనే గుణముగల వస్తువవల్ల మనుష్యప్రాణమునకు కలగగూడిన ప్రమాదము సంభవించకుండా చెయ్యడమునకు యెరిగివుండి లేక అజాగ్రతవల్ల చాలినంత బందోబస్తు చెయ్యకుండాపోయ్యే ఏమనిషి అయినా,

ఆరుమాసములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని వెయ్యిరూపాయిలకు వ్యాపించగూడిన జుల్మానావల్లగాని ఈ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

ధమీలున వేటుకలిగే వస్తువనుగురించి

286. ఏదైనా ధమీలున వేటుకలిగే వస్తువతోటి మనుష్యప్రాణమునకు ప్రమాదము సంభవించేలాగునగాని మరి యేమనిషికైనా ఘాత లేక హాని సంభవించ

అజాగ్రతగా జరిగించడము.

గూడేలాగునగాని ముందు వెనక చూడకుండానున్ను అజాగ్రతగానున్ను యేదైనా కార్యము జరిగించే,

లేక తనస్వాధీనమందువుండే ధమీలున వేటుకలిగే వస్తువ వల్ల మనుష్యప్రాణమునకు కలగగూడిన ప్రమాదము సంభవించకుండా చెయ్యడమునకు యెరిగివుండి లేక అజాగ్రతగా చాలినంత బందోబస్తు చెయ్యకుండాపొయ్యే ఏమనిషి అయినా,

ఆరుమాసములకు వ్యాపించగూడినకాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని వెయ్యిరూపాయలకు వ్యాపించగూడిన జుల్మానావల్లగాని ఈ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

యంత్రమునుగురించి అజాగ్రతగా జరిగించడము.

287. ఏదైనా యంత్రముతోటి మనుష్యప్రాణమునకు ప్రమాదము సంభవించేలాగునగాని మరి యేమనిషికైనా ఘాత లేక హాని సంభవింపగూడేలాగునగాని ముందు వెనక చూడకుండానున్ను అజాగ్రతగానున్ను ఏదైనా కార్యము జరిగించే,

లేక తన స్వాధీనమందు లేక పరమందువుండే యంత్రము వల్ల మనుష్యప్రాణమునకు కలగగూడిన ప్రమాదము సంభవించకుండా చెయ్యడమునకు యెరిగివుండి లేక అజాగ్రతగా చాలినంత బందోబస్తు చెయ్యకుండాపొయ్యే ఏమనిషి అయినా,

ఆరుమాసములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని వెయ్యిరూపాయీలకు వ్యాపించగూడిన జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

288. ఏదైనా గృహము పడగొట్టడములోగాని మరమ్మతు చెయ్యడములోగాని అట్టి గృహము లేక అందులో

గృహములు పడ గొట్టడములో, లేక మరమ్మతు చెయ్యడములో అజాగ్రతగా జరిగించడము.

యేదైనా భాగము పడడమువల్ల మనుష్యప్రాణమునకు కలగగూడిన ప్రమాదము సంభవించకుండా చెయ్యడమునకు యెరిగివుండి లేక అజాగ్రతగా చాలినంత బందోబస్తు చెయ్యకుండాపొయ్యే ఏ మనిషి అయినా, ఆరుమాసములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని వెయ్యిరూపాయీలకు వ్యాపించగూడిన జుల్మానావల్లగాని ఈ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

ఏదయినా మృగమునుగురించి అజాగ్రత జరిగించడము.

289. తన స్వాధీనమందువుండే ఏదైనా మృగమువల్ల మనుష్య ప్రాణమునకు కలగగూడిన ఏదైనా ప్రమాదము లేక బలమైనఘాత సంభవించకుండా చెయ్యడమునకు అట్టి మృగమునుగురించి యెరిగివుండి లేక అజాగ్రతగా చాలింతి బందోబస్తు చెయ్యకుండాపొయ్యే ఏమనిషి అయినా, ఆరుమాసములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండు తరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని వెయ్యిరూపాయీలకు వ్యాపించగూడిన జుల్మానావల్లగాని ఈ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

జనోపద్రవమునుగురించి శిక్ష.

290. ఈ శాసనమువల్ల మరి ఒక తరహాగా శిక్షించబడగూడని యేదైనా సంగతిలో జనోపద్రవము కలగచేసే ఏమనిషి అయినా రెండువందలరూపాయీలకు వ్యాపించగూడిన జుల్మానావల్ల శిక్షించబడవలసినది.

మానుకోనేలాగున హుకుము చెయ్యబడ్డ తర్వాత వుపద్రవము జరిగిస్తూవుండడము.

291. ఏదైనా జనోపద్రవము తిరిగీ జరిగించకుండా లేక జరిగిస్తూవుండకుండా హుకుము సాదరు చెయ్యడమునకు న్యాయశాస్త్రసమ్మతమైన అధికారముగల ఏ పబ్లిక్ వుద్యోగస్థునివల్లనైనా అట్టి హుకుము చెయ్య

బడ్డతర్వాత జనోపద్రవకరమైన ఆ కార్యము తిరిగీ జరిగించే, లేక జరిగిస్తూవుండే ఏమనిషి అయినా, ఆరుమాసములకు వ్యాపించగూడిన కాలమువరకు సాధారణమైన ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని ఈ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

292. ఏదైనా బండుబూతుగావుండే పుస్తకము, సంచిక, కాకితము, తస్వీరు, చిత్తరువు, రూపము, లేక విగ్రహము విక్రయించే, లేక పంచిపెట్టే, లేక దిగుమతీచేసే, లేక విక్రయముకొరకుగాని కూలికిగాని ఛాపావేసే, లేక బుద్ధిపూర్వకముగా జనులు చూచేలాగున కనపరచే, లేక ఆప్రకారము జరిగించడమునకు యత్నించే, లేక జరిగిస్తానవే యేమనిషి అయినా, మూడుమాసములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

బండు బూతుగా వుండే పుస్తకములు విక్రయించడము వగయిరా.

మినహాయింపు.—ఈ సెక్షను, యేదైనా గుడిలో లేక గుడిమీదగాని, విగ్రహములను తీసుకొనిపోగలందులకై వుపయోగించబడ్డ, లేక మతసంబంధమైన కార్యమునకుగాను వుంచబడే యేదైనా రథముమీదగాని, మలచబడ్డ, చెక్కబడ్డ, చిత్రించబడ్డ, లేక మరిఒక తరహాగా ఏర్పాటుచెయ్యబడ్డ ఏ రూపమునకున్ను వ్యాపించనేరదు.

293. విక్రయముకొరకు, పంచిపెట్టడముకొరకు, లేక జనులకు కనపరచడముకొరకు యింతకుముందటి సెక్షనులో నమూదుచెయ్యబడియుండే యేదైనా బండుబూతు పుస్తకము లేక యితరవస్తువ తన స్వాధీనమందు వుంచుకొనివుండే యేమనిషి అయినా, మూడుమాసములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండు

విక్రయముకొరకుగాని కనపరచడముకొరకుగాని బండుబూతు పుస్తకమువగైరా స్వాధీనమందు వుంచుకొనివుండడము

తరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని ఈ రెంటి వల్లగాని శిక్షించబడవలసినది.

అసహ్యమైన పనులును బూతుపాటలును

294. ఇతరులకు బాధకలుగునట్లు ఏ మనుష్యుఁడయినను,

(a) ఏ బహిరంగ స్థలమందైనను ఏదైన అసహ్యమైన పని జరిగించినయెడలగాని, లేక

(b) ఏ బహిరంగ స్థలమందైనఁగాని అట్టి స్థలమునకు సమీపమందైనఁగాని ఏవైన బూతుపాటలు, పదములు, లేక మాటలు, పాడినయెడలగాని, చదివినయెడలగాని, లేక చెప్పినయెడలగాని,

మూఁడుమాసములదాఁక ఎంతకాలమునకైన రెండుతరహాలలో నొకతరహా ఖయిదువల్లఁగాని, జుల్మానావల్లఁగాని. ఈ రెంటివల్లఁగాని, శిక్షింపఁబడవలయును.

లాటరీ(Lottery) ఆఫీసును వుంచుకొని వుండడము.

294-A. గవర్నమెంటువారివల్ల శెలవివ్వబడని యేదైనా లాటరీచీటి వేయడమునకుగాను యేదైనా ఆఫీసును లేక స్థలమును ఏమనిషి అయినా వుంచుకొనివున్న పక్షమునకు ఆరుమాసములకు మించని కాలము వరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదుతోటిగాని జుల్మానాతోటిగాని ఈ రెంటితోటిగాని శిక్షించబడవలసినది.

పయిగా యేదయినా అట్టి లాటరీలో యేదైనా చీటిని, పాలును, నంబరును, లేక అంకెను వేసి పుచ్చుకోవడముతో చేరిన లేక ఆ విషయమునకు వుపయోగముయ్యే యేసంగతినిపట్టి అయినా లేక యిక ముందు సంభవించవచ్చునని యెంచే యే సంగతినిపట్టి అయినా నే

మనిషియొక్క ప్రయోజనార్థమయినా యేదయినా పయికమును చెల్లించేటట్టుగాని యేవయినా సరకులను వొప్పగించేటట్టుగాని యే కార్యమున్నైనా చేసేటట్టుగాని చేయకుండా మానుకొనేటట్టుగాని యే మనిషి అయినా ప్రసిద్ధపరచిన పక్షమునకు వెయ్యిరూపాయలకు,మించని జుల్మానాతోటి శిక్షించబడవలసినది.

---

## 15-వ అధ్యాయము.

### మతముతో యిలాకాగల నేరములనుగురించి.

ఏతరగతివారియొక్క అయినా మతమును పరిభవపరచవలెననే యత్నముతో పూజాస్థలమునకు హాని కలగ చెయ్యడము, లేక అనాచారపరచడము.

295. ఏ తరగతిగల మనుష్యులయొక్క అయినా మతమును పరిభవపరచవలెననే యత్నముతోగాని, హాని, చెరుపు, లేక అనాచారము, యివి కలగచెయ్యడమువల్ల వారు పరిభవము అని యెంచుకోవచ్చుననే జ్ఞానముతోగాని, యేదయినా పూజాస్థలమునకు లేక యేతరగతి మనుష్యులవల్లనైనా పూజార్హముగా వుంచుకోబడ్డ వస్తువకు హానికలగచేసే, చెరిపే, లేక అనాచారపరచే యేమనిషి అయినా, రెండు సంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

మతసంబంధమైన సభకు కలత జరిగించడము.

296. మతసంబంధమయిన పూజగాని మతసంబంధమయిన క్రియలుగాని జరిగించడమందు క్రమముగా ప్రవర్తిస్తూవుండే యేసభకు అయినా స్వేచ్ఛగా కలత జరిగించే యేమనిషి అయినా, ఒకసంవత్సరమునకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని ఈ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

297. ఏ మనిషియొక్క అయినా మనస్సుకు ఆయాసము కలగ చెయ్యవలెననే లేక యే మనిషియొక్క అయినా మతమును పరిభవపరచవలెననే యత్నముతోటిగాని, యే మనిషియొక్క అయినా మనస్సుకు ఆయాసము కలగవచ్చునని లేక అందువల్ల యే మనిషియొక్క అయినా మతము పరిభవపరచబడవచ్చునని యెరిగివుండిగాని,

శ్మశాన స్థలము వగయిరాలలో అక్రమముగా ప్రవేశించడము.

ఏదయినా పూజాస్థలమందు, లేక శ్మశానస్థలమందు, లేక అపరక్రియలు జరిగించడమునకు లేక చనిపోయినవారి శవములు వుంచడమునకుగాను యేర్పాటుచెయ్యబడ్డ ఏదయినాస్థలమందు యేదయినా అక్రమమయిన ప్రవేశము జరిగించే, లేక మనుష్యసంబంధమయిన శవమునకు అమర్యాదచేసే, లేక అపరక్రియలు జరిగించడముకొరకు పోగయిన యే మనుష్యులకయినా కలతజరిగించే ఏమనిషి అయినా,

ఒకసంవత్సరమునకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

298. మతవిషయమయి యే మనిషియొక్క అయినా మనస్సుకు ఆయాసము కలగవలెనని బుద్ధిపూర్వకమయిన యత్నముతో ఆమనిషి వినేటట్టు ఏదయినా మాట అనే, లేక ఏదయినా ధ్వనిచేసే, లేక ఆమనిషి చూచేటట్టు అంగవిన్యాసము చేసే, లేక ఏదయినా వస్తువు వుంచే ఏమనిషి అయినా, ఒకసంవత్సరమునకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

మతవిషయమయి యేమనిషియొక్క అయినా మనస్సుకు ఆయాసము కలగవలెనని బుద్ధిపూర్వకమైన యత్నముతో మాటలు అనడము వగయిరాలు.

## 16వ అధ్యాయము.

### మనుష్యశరీరమునకు హాని కలగచేసే నేరములనుగురించి.

### మనుష్యప్రాణమునకు హాని కలగచేసే నేరములనుగురించి.

నేరముగల నరహత్య.

299. మరణము కలగచెయ్యావలెననే వుద్దేశముతో, లేక మరణము కలగచెయ్యగూడిన శరీరఘాత కలగచెయ్యావలెననే వుద్దేశముతో, లేక అందువల్ల మరణము కలగవచ్చును అనే యెరుకతో, యేదయినా కార్యము జరిగించడమువల్ల మరణము కలగచేసే ఏమనిషి అయినా, నేరముగల నరహత్య అనే నేరము జరిగించినవాఁ డవుతున్నాడు.

దృష్టాంతములు.

(a) A అనేమనిషి, మరణము కలగ చెయ్యావలెననే వుద్దేశముతో, లేక అందువల్ల మరణము కలగవచ్చుననే యెరుకతో, ఒక గోతిమీద సన్నకర్రలున్ను గరికచెక్కలున్ను పరుస్తున్నాడు. Z అనేమనిషి, ఆ భూమి గట్టిగావున్నదని నమ్మి దానిమీదుగా నడిచవెళ్లడములో అందులో పడి చస్తున్నాడు. A అనేమనిషి, నేరముగల నరహత్య అనే నేరము జరిగించినవాఁడవుతున్నాడు.

(b) A అనేమనిషి, ఒక పొదవెనక Z అనేమనిషి వున్నట్టు యెరిగివున్నాడు. B అనేమనిషి ఆసంగతి యెరగడు. A అనేమనిషి Z అనేమనిషికి మరణముకలగచెయ్యావలెనని వుద్దేశించి, లేక కలగవచ్చునని యెరిగివుండి, పొదమీద తుపాకీ కాల్చవలసినదని B అనే మనిషిని ప్రేరేపిస్తున్నాడు. B అనేమనిషి తుపాకీకాల్చి Z అనే మనిషిని చంపుతున్నాడు. ఇందులో B అనేమనిషి, యే నేరమునుగురించిన్ని నేరస్థుడు కాకుండా పోవచ్చును; అయితే A అనేమనిషి, నేరముగల నరహత్య చేసినవాఁడవుతున్నాడు.

(c) ఒక కోడిని చంపి యెత్తుకొనిపోవలెననే వుద్దేశముతో A అనేమనిషి దానిమీద తుపాకీ కాల్చడమువల్ల ఒక పొదకు వెనకపక్కనవుండే B అనే మనిషికి తగిలి అతడు చస్తున్నాడు; A అనేమనిషి, అతడు అక్కడవున్నట్టు యెరగడు. ఇందులో A అనేమనిషి న్యాయశాస్త్రవిరోధమయిన ఒక కార్యము చేస్తూవున్నప్పటికిన్ని

B అనే మనిషిని చంపవలెననిగాని మరణము కలగచెయ్యగూడినదని తాను యెరిగి వున్న ఒక కార్యము జరిగించడమువల్ల మరణము కలగచెయ్యవలెననిగాని వుద్దేశించనందున నేరముగల నరహత్యనుగురించి నేరస్థుడుగా వుండనేరడు.

వివరణము.—(1) ఒకవ్యాధి, రోగము, లేక శరీర దౌర్బల్యము, వీటివల్ల శ్రమపడుతూవుండే ఒక మనిషికి శరీరహాని కలగచేసి అందువల్ల ఆ మనిషికి క్రమమయిన కాలముకంటె నడిగా మరణము కలగచేసే మనిషి, అతనికి మరణము కలగచేసినట్టు యెంచబడుతున్నాడు.

వివరణము.—(2) శరీరహానివల్ల మరణము కలగచెయ్యబడ్డప్పుడు యుక్తమయిన చికిత్సలున్ను నేర్పుగల వైద్యములున్ను కలగచేసుకోవడమువల్ల అట్టి మరణము సంభవించకుండా ఆపబడగూడినప్పటికిన్ని ఆ శరీరహాని కలగచేసినమనిషి, మరణము కలగచేసినట్టు యెంచబడవలసినది.

వివరణము.—(3) తల్లిగర్భములోవుండే పిల్లకు మరణము కలగచెయ్యడము నరహత్యకానేరదు. అయితే ఒకపిల్ల శ్వాసము విడవకుండానున్ను గర్భములోనుంచి పూరాగా బయిటరాకుండానున్ను వున్నప్పటికిన్ని ఆ పిల్ల తాలూకు శరీరములో యేదయినా భాగము వెలుపలికి వచ్చివున్నపక్షమునకు బ్రతికివుండే అట్టి పిల్లకు మరణము కలగచెయ్యడము నేరముగల నరహత్య కావచ్చును.

300. ఇందులో యికముందు మినహాయించబడివుండే సంగతులలో తప్ప, మరణము కలగచెయ్యబడ్డ కార్యము మరణము కలగచెయ్యవలెననే వుద్దేశముతో జరిగించబడ్డపక్షమునకు నేరముగల నరహత్య ఖూనీ అవుతున్నది, లేక—

ఖూనీ.

రెండోది.—ఆ కార్యము, చెరుపు కలగచెయ్యబడ్డమనిషికి మరణము సంభవింపచెయ్యగూడినట్టు నేరస్థుడు యెరిగివుండే శరీరహాని కలగచెయ్యవలెననే వుద్దేశముతోటి జరిగించబడ్డ పక్షమునకు, లేక—

మూడోది.—ఆ కార్యము, యేమనిషికయినా శరీరహాని కలగ చెయ్యవలెననే వుద్దేశముతోటి జరిగించబడి కలగచేసేలాగున వుద్దేశించబడ్డ శరీరహాని సాధారణముగా మరణము కలగచెయ్యడమునకు చాలివున్నపక్షమునకు, లేక—

నాలుగోది.—ఆ కార్యము జరిగించేమనిషి, అందువల్ల మరణముగాని మరణము కలగచెయ్యగూడిన శరీరహానిగాని బహుశః సంభవింపచెయ్యగూడినంత అపాయకరమయినదిగా వున్నదని యెరిగివుండి పైన నమూదుచెయ్యబడ్డప్రకారము మరణము, లేక అట్టిహాని సాహసించి చేసినందుకు యే కారణమున్ను లేకుండా అట్టి కార్యము జరిగించినపక్షమునకు.

## దృష్టాంతములు.

(a) A అనేమనిషి, చంపవలెననే వుద్దేశముతో Z అనే మనిషిమీద తుపాకీ కాలుస్తున్నాడు. అందువల్ల Z అనేమనిషి చనిపోతున్నాడు. A అనేమనిషి ఖూనీ చేసినవాడవుతున్నాడు.

(b) A అనేమనిషి, ఒక దెబ్బవల్ల మరణము కలగగూడిన రోగముతోటి Z అనేమనిషి, శ్రమపడుతున్నాడని యెరిగివుండి శరీరహాని కలగచెయ్యవలెననే వుద్దేశముతో అతణ్ని ఒకదెబ్బ కొట్టినాడు. ఆ దెబ్బవల్ల Z అనేమనిషి చనిపోతున్నాడు. ఆదెబ్బ, మంచి దేహపటుత్వము కలిగివుండే ఒకమనిషికి సాధారణముగా మరణము కలగచెయ్యడమునకు చాలివుండనప్పటికిన్ని A అనేమనిషి, ఖూనీనిగురించి నేరస్థుడుగా వుంటున్నాడు. అయితే A అనేమనిషి, యేదయినా రోగమువల్ల Z అనే మనిషి శ్రమపడుతున్నాడని తెలియకుండా మంచి శరీరపటుత్వముగల ఒకమనిషిని సాధారణముగా చంపడమునకు చాలివుండని ఒకదెబ్బ కొట్టినపక్షమునకు శరీరహాని కలగచెయ్యవలెనని వుద్దేశించినప్పటికిన్ని మరణముగాని సాధారణముగా మరణముకలగచెయ్యతగ్గ శరీరహానిగాని కలగచెయ్యవలెనని వుద్దేశించినయెడల A అనేమనిషి ఖూనీనిగురించి నేరస్థుడు కానేరడు.

(c) A అనేమనిషి, సాధారణముగా ఒకమనిషికి మరణము కలగచెయ్యడమునకు చాలివుండే ఒక కత్తి నరుకుగాని లాటీకర్ర గాయముగాని Z అనే మనిషికి

మనఃపూర్వకముగా కలగచేస్తున్నాడు. అందువల్ల Z అనేమనిషి చనిపోతున్నాడు. ఇందులో Z అనే మనిషికి మరణము కలగచెయ్యవలెనని వుద్దేశించి వుండకపోయినా A అనేమనిషి, ఖూనీనిగురించి నేరస్థుడుగా వుంటున్నాడు.

(d) A అనేమనిషి, బారుచేసిన ఫిరంగీ యే కారణమున్ను లేకుండా మనుష్యులగుంపులోకి కాల్చి వారిలో ఒకరిని చంపుతున్నాడు. ఎవరినో ఒకరిని చంపవలెనని ఆంతకుముందు వుద్దేశము కలిగివుండకపోయినప్పటికిన్ని A అనేమనిషి, ఖూనీని గురించి నేరస్థుడవుతున్నాడు.

నేరముగల నరహత్య యెప్పుడు ఖూనీ కానేరదు.

మినహాయింపు.—(1) నేరస్థుడు, గొప్పయినటువంటిన్ని అకస్మాత్తుగా సంభవించినటువంటిన్ని ఆగ్రహకారణమువల్ల దేహముమీద స్పృహ లేకుండావున్నప్పుడు ఆగ్రహకారణము కలగచేసినమనిషికి మరణముకలగచేసినా, లేక పొరబాటువల్లగాని ప్రమాదవశాత్తుగాగాని మరి యే మనిషికయినా మరణము కలగచేసినా నేరముగల నరహత్య ఖూనీ కానేరదు.

ఈ పయి మినహాయింపు, యీగా క్రిందవచ్చే నిబంధనలకు లోబడి వుంటున్నది:—

మొదటది.—కలగచెయ్యబడ్డ ఆగ్రహకారణము అనేది, యేమనిషినైనా చంపడమునకుగాని ఘాత కలగచెయ్యడమునకుగాని ఒక కారణముగా నేరస్థునివల్ల సంభవింపచెయ్యబడ్డదిగా, లేక స్వేచ్ఛగా కలగచేసుకోబడ్డదిగా వుండకూడదు.

రెండోది.—కలగచెయ్యబడ్డ ఆగ్రహకారణము అనేది, న్యాయశాస్త్ర ప్రకారము జరిగించబడ్డ దేనివల్లనయినా, లేక ఒకపబ్లిక్ వుద్యోగస్థుడు తన అధికారములు న్యాయశాస్త్రరీత్యా చెలాయించడమందు అట్టి ఏ పబ్లిక్ వుద్యోగస్థునివల్ల

నయినా చెయ్యబడ్డ యేకార్యమువల్లనున్ను సంభవించి నదిగా వుండకూడదు.

మూడోది.—కలగచెయ్యబడ్డ ఆగ్రహకారణము అనేది, ఆత్మసంరక్షణనుగురించిన హక్కు న్యాయశాస్త్రప్రకారము చెలాయించడమందు జరిగించబడ్డ దేనివల్లనయినా సంభవించి నదిగా వుండకూడదు.

వివరణము.—కలగచెయ్యబడ్డ ఆగ్రహకారణము అనేది, ఖూనీ కాకుండా నేరమును ఆపడమునకు చాలినంత గొప్పదిగానున్ను అకస్మాత్తుగా సంభవించినదిగానున్ను వున్నదా అని ఆయాసంగతులనుపట్టి విచారణ చెయ్యవలసినది.

## దృష్టాంతములు.

(a) A అనేమనిషి, Z అనే మనిషివల్ల సంభవించిన ఆగ్రహకారణమువల్ల కలగచెయ్యబడ్డ వుగ్రకోపముమీద Z అనే మనిషియొక్క పిల్లను ప్రయత్నపూర్వకముగా చంపుతున్నాడు. ఆ ఆగ్రహకారణము ఆ పిల్లవల్ల కలగ చెయ్యబడనందుననున్ను ఆ పిల్లయొక్క మరణము ఆగ్రహకారణమువల్ల కలగచెయ్యబడ్డ ఒక కార్యము జరిగించడమందు సంభవించిన ప్రమాదమువల్లగాని గ్రహచార వశాత్తుగాగాని కలగనందుననున్ను ఆ నేరము ఖూనీగా వుంటున్నది.

(b) Y అనేమనిషి, A అనే మనిషికి బలముగానున్ను అకస్మాత్తుగానున్ను ఆగ్రహకారణము కలగచేస్తున్నాడు. A అనేమనిషి, యీ ఆగ్రహకారణముమీద Y అనే మనిషివద్ద కనపడకుండావుండే Z అనే మనిషిని చంపవలెనని వుద్దేశించకుండానున్ను తాను చంపబోతానని తెలియకుండానున్ను Y అనే మనిషిమీద ఒక పిస్తోలు కాల్చి Z అనే మనిషిని చంపుతున్నాడు. ఇందులో A అనేమనిషి, ఖూనీచెయ్యలేదుగాని నేరముగల నరహత్యమాత్రము చేసినవాడు అవుతున్నాడు.

(c) A అనేమనిషి, బెయిలిఫ్ అనగా, కోర్టు బంట్రోతు అయిన Z అనేమనిషివల్ల న్యాయశాస్త్రప్రకారము పట్టుకోబడ్డాడు. A అనే మనిషి, తన్ను పట్టుకోపడమువల్ల అకస్మాత్తుగానున్ను బలముగానున్ను కోపముకలిగి Z అనే మనిషిని చంపు

తున్నాడు. ఇంగలో ఒక పబ్లిక్ వుద్యోగస్థుడు తన అధికారములు చెలాయించడ ములో అతనివల్ల జరిగించబడ్డ ఒక కార్యమువల్ల ఆగ్రహకారణము కలిగినందున యిది ఖూనీ అవుతున్నది.

(d) మేజిస్ట్రేటు అయిన Z అనే మనిషియెదట సాక్షిగా A అనేమనిషి హాజ రవుతున్నాడు. Z అనేమనిషి, A అనే మనిషియొక్క వాజ్మూలములోవుండే ఒక మాట అయినా తాను నమ్మడములేదనిన్ని A అనేమనిషి తప్పుసాక్ష్యము పలికినాడనిన్ని చెప్పుతున్నాడు. ఈ మాటలు విని A అనే మనిషికి అకస్మాత్తుగా కోపమువచ్చి Z అనే మనిషిని చంపుతున్నాడు. ఇది ఖూనీ అవుతున్నది.

(e) A అనేమనిషి, Z అనే మనిషియొక్క ముక్కుపట్టి లాగవలెనని యత్ని స్తున్నాడు. Z అనేమనిషి, ఆత్మసంరక్షణనుగురించిన హక్కు చెలాయించడములో A అనేమనిషి ఆప్రకారము జరిగించకుండా ఆపగలందులకు అతణ్ని పట్టుకొంటున్నా డు. A అనే మనిషికి అందువల్ల అకస్మాత్తుగా బలమయిన కోపముకలిగి Z అనేమని షిని చంపుతున్నాడు. ఆత్మసంరక్షణనుగురించిన హక్కు చెలాయించడమందు జరి గించబడ్డ ఒక కార్యమువల్ల ఆగ్రహకారణము కలగచెయ్యబడ్డందున యిది ఖూనీ అవు తున్నది.

(f) Z అనేమనిషి, B అనే మనిషిని కొట్టుతున్నాడు. యీ ఆగ్రహకార ణమువల్ల B అనే మనిషికి బలమయిన కోపము కలుగుతున్నది. పక్కనవుండే A అనే మనిషి, B అనేమనిషికి కోపముకలిగిన సమయము కనుక్కొని Z అనేమనిషిని B అనే మనిషి చంపేలాగున చెయ్యవలెనని వుద్దేశించి అందుకుగాను B అనేమనిషి చేతికి ఒక కత్తి యిస్తున్నాడు. B అనేమనిషి, ఆ కత్తితోటి Z అనే మనిషిని చంపుతున్నాడు. ఇందులో B అనేమనిషి నేరముగల నరహత్యమాత్రము జరిగించివుండవచ్చును. అయితే A అనేమనిషి, ఖూనీజరిగించిన నేరస్థుడుగా వుంటున్నాడు.

మినహాయింపు.—(2) నేరముగల నరహత్య అనేది, దేహమును గురించిన, లేక ఆస్తినిగురించిన సంరక్షణయొక్క హక్కు కృత్రిమము లేకుండా జరిగించడమందు న్యాయశాస్త్రమువల్ల తనకు కలగచెయ్య బడ్డ అధికారమును అతిక్రమించి అంతకుముందు యే వుద్దేశమున్ను లేకుండానున్ను అట్టి సంరక్షణ చేసుకోవడముకొరకు జరూరుగా వుండే

టంతకంటె యెక్కువ హాని చేయ్యవలెననే యత్నము లేకుండానున్న నేరస్థుడు అట్టి సంరక్షణయొక్క హక్కు తాను చెలాయించే మనిషికి మరణము కలగచేసినపక్షమునకు అది ఖూనీ కానేరదు.

## దృష్టాంతము.

Z అనేమనిషి, A అనేమనిషికి బలమయిన ఘాత కలిగేటట్టు కాకుండా అతణ్ని చవుకుతో కొట్టడమునకు యత్నిస్తున్నాడు. A అనేమనిషి, ఒక పిస్తోలు తీసి కనపరుస్తున్నాడు. అప్పటికిన్ని Z అనేమనిషి ఆ దొమ్మి జరిగిస్తూనే వుంటున్నాడు. A అనేమనిషి, తనను చవుకుతో కొట్టకుండా సాధనాంతరమువల్ల ఆపడమునకు వల్లలేదని కృత్రిమములేకుండా నమ్మి Z అనే మనిషిని కాల్చి చంపుతున్నాడు. ఇందులో A అనేమనిషి, ఖూనీ చెయ్యలేదుగాని నేరముగల నరహత్యమాత్రము చేసినవాడు అవుతున్నాడు.

మినహాయింపు.—(3) నేరముగల నరహత్య అనేది, నేరస్థుడు పబ్లిక్ వుద్యోగస్థుడుగాగాని జనుల న్యాయవృద్ధికొరకు పనిచేస్తూవుండే ఒక పబ్లిక్ వుద్యోగస్థునికి సహాయముచేసిన మనిషిగాగాని వుండి న్యాయశాస్త్రమువల్ల తనకు కలగచెయ్యబడ్డ అధికారములను అతిక్రమించి తన వుద్యోగధర్మమునుపట్టి తన వుద్యోగకార్యములు క్రమముగా జరిపించడముకొరకు మరణము కలగచెయ్యబడ్డ మనిషినిగురించి పగలేకుండా న్యాయమనిన్ని జరూరు అనిన్ని కృత్రిమములేకుండా తాను నమ్మే ఒక కార్యము జరిగించడమువల్ల మరణము కలగచేసినపక్షమునకు అది ఖూనీ కానేరదు.

మినహాయింపు.—(4) నేరముగల నరహత్య అనేది, అకస్మాత్తుగా సంభవించిన కలహముమీద కోపావేశమందు అకస్మాత్తుగా సంభవించిన పోట్లాటలో అంతకుముందు వుద్దేశములేకుండానున్ను నేరస్థుడు అక్రమమయిన సమయము కనుక్కోకుండా, లేక క్రూరముగానున్ను అసాధారణముగానున్ను నడుచుకోకుండానున్ను జరిగించినపక్షమునకు అది ఖూనీ కానేరదు.

వివరణము.—ఇట్టి సంగతులలో ఆగ్రహకారణము కలగచేసిన, లేక మొకట ద్రొమ్మిచేసిన మనిషి యెవరుగావుండినా బాధకములేదు.

మినహాయింపు.—(5) నేరముగల నరహత్య అనేది, యెవరికి మరణము సంభవింపచెయ్యబడ్డదో అట్టి మనిషి, పద్ధెనిమిది సంవత్సరములకు యెక్కువ యీడుగలవాడై వుండి తన సమ్మతిమీద మరణము పొందినప్పుడుగాని చావుకు సాహసించి వొప్పినప్పుడుగాని ఖూనీకానేరదు.

దృష్టాంతము.

**A** అనేమనిషి, పద్ధెనిమిదిసంవత్సరముల యీడుకు లోపుగావుండే **Z** అనే మనిషి ఆత్మహత్య చెసుకొనేలాగున దుర్బోధనవల్ల స్వేఛగా చేస్తున్నాడు. ఇంతలో **Z** అనేమనిషి, బాల్యదశవల్ల తన మరణమునుగురించి ఒప్పుదమునకు అసమర్థుడుగా వుంటున్నాడు; గనుక **A** అనేమనిషి ఖూనికి కుమ్మకుచేసినవాడు అవుతున్నాడు.

301. ఒకమనిషి, తాను మరణము కలగచెయ్యవలెనని వుద్దేశించిన లేక మరణము కలగచెయ్యతగ్గదని తాను యెరిగివుండే యేకార్యమైనా చెయ్యడమువల్ల మరణము కలగచెయ్యవలెనని తాను వుద్దేశించని లేక మరణము కలగవచ్చునని యెరగని యే యితర మనిషికి అయినా మరణము సంభవింపచెయ్యడమువల్ల నేరముగల నరహత్య చేసినపక్షమునకు నేరస్థునివల్ల జరిగించబడ్డ నేరముగల అట్టి నరహత్య, మరణము సంభవింపచేసేలాగున వుద్దేశించబడ్డ లేక మరణము సంభవించవచ్చునని యెరిగివుండే ఒక మనిషికి మరణము సంభవింపచేసినపక్షమునకు యేతరహాదారీకలది అవునో అదే తరహాదారీకలదిగా వుంటున్నది.

తాను మరణము కలగచెయ్యవలెననియత్నించిన మనిషికిగాక మరి ఒక మనిషికి మరణము కలగ చెయ్యడమువల్ల జరిగించబడ్డ నేరముగల నరహత్య.

302. ఖూనీ జరిగించే యేమనిషి అయినా, మరణమువల్లగాని యావజ్జీవము ద్వీపాంతరవాసమువల్లగాని శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడు కావలసినది.

ఖూనీనిగురించి శిక్ష.

యావజ్జీవము ద్వీపాంతర వాసమునకు తీర్పుపొందివుండే నేరస్థునివల్ల జరిగించబడ్డఖూనినిగురించిశిక్ష.

303. యావజ్జీవము ద్వీపాంతరవాసమునకు తీర్పు విధించబడివుండి ఖూనీ జరిగించే యే మనిషి అయినా మరణమువల్ల శిక్షించబడవలసినది.

ఖూనీ నేరము కాకుండావుండే నేరముగల నరహత్యను గురించి శిక్ష.

304. ఖూనీ కాకుండావుండే నేరముగల నరహత్యచేసే యే మనిషి అయినా, మరణము కలగచేసిన కార్యము మరణము కలగచెయ్యవలెననే లేక మరణము కలగచెయ్యగూడిన శరీరహాని కలగచెయ్యవలెననే యత్నముతోటి జరిగించబడ్డయెడల యావజ్జీవము ద్వీపాంతరవాసమువల్లగాని పదిసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడు కావలసినది;

లేక ఆ కార్యము మరణము కలగచెయ్యగూడినది అని యెరిగివుండిన్ని మరణము కలగచెయ్యవలెననే, లేక మరణము కలగచెయ్యతగ్గ శరీరహాని కలగచెయ్యవలెననే యత్నములేకుండా జరిగించబడ్డయెడల పదిసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

304-A. ఏమనిషి అయినా, నేరముగల నరహత్య కాకుండావుండే ఆతురమైన లేక అశ్రద్ధమైన యే కార్యము

అశ్రద్ధవల్ల మరణము కలగచేయడము.

నైనా చేయడమువల్ల యేమనిషికైనా మరణము కలగచేసినపక్షమునకు రెండుసంవత్సరములకు మించని కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదుతోటిగాని జుల్మానాతోటిగాని యీ రెంటితోటిగాని శిక్షింపబడవలసినది.

ఒకపిల్లగాని వెర్రియెత్తిన మనిషిగాని ఆత్మహత్య చేసుకోవడమునకు కుమ్మకు.

305. పద్దెనిమిదిసంవత్సరముల యీడుకు లోపుగావుండే మనిషిగాని వెర్రియెత్తిన మనిషిగాని తబ్బిబ్బులుగల మనిషిగాని పుట్టు వెర్రిమనిషిగాని మత్తుగల స్థితిలో వుండే మనిషిగాని ఆత్మహత్య చేసుకొనేయెడల అట్టి ఆత్మహత్య చేసుకోవడమునకు కుమ్మకుచేసే యేమనిషి అయినా, మరణమువల్లగాని యావజ్జీవము ద్వీపాంతరవాసమువల్లగాని పదిసంవత్సరములకు మించని కాలమువరకు ఖయిదువల్లగాని శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడు కావలసినది.

ఆత్మహత్యకు కుమ్మకు.

306. ఎవరైనా ఆత్మహత్య చేసుకొన్నయెడల అట్టి ఆత్మహత్య చేసుకోవడమునకు కుమ్మకుచేసే యేమనిషి అయినా, పదిసంవత్సరములకు వ్యాపించకూడని కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్ల శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడు కావలసినది.

ఖూని చెయ్యవలెనని యత్నించడము.

307. మరణము సంభవించినపక్షమునకు ఖూనీ అనే నేరమును యేర్పాటుచెయ్యతగ్గ యత్నముతోటి, లేక యెరుకతోటి, లేక సంగతులమీద యేదైనా కార్యము జరిగించే యేమనిషి అయినా పదిసంవత్సరములకు వ్యాపించకూడని కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్ల శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడు కావలసినది; పైగా అట్టి కార్యమువల్ల యేమనిషికి అయినా ఘాత సంభవించినయెడల నేర

ష్టము, యావజ్జీవము ద్వీపాంతరవాసమునకుగాని యిందులో యింతకూ ముందు చెప్పబడ్డ శిక్షకుగాని పాత్రుడు కావలసినది.

యావజ్జీవమువరకు శిక్ష పొందివుండే ఖయిదీలుచేసే ప్రయత్నములు.

ఈ సెక్షనుకు విరోధముగా జరిగించే యేమనిషి అయినా యావజ్జీవమువరకు ద్వీపాంతరవాసపు తీర్పు పొందివున్నప్పుడు ఘాత కలగచేయబడినయెడల వాడు మరణమువల్ల శిక్షించబడవచ్చును.

దృష్టాంతములు.

(a) Z అనే మనిషికి మరణము సంభవించినపక్షమునకు A అనేమనిషి, ఖూనీనిగురించి నేరస్తుడు అవుతాడనే సంగతులమీద అతణ్ని చంపవలెననే వుద్దేశముతో అతనిమీద తుపాకి కాలుస్తున్నాడు. A అనేమనిషి, యీ సెక్షనునుపట్టి శిక్షకు పాత్రుడు అవుతున్నాడు.

(b) A అనేమనిషి, లేక యీడుగల ఒక పిల్లకు మరణము కలగచెయ్యవలెననే యత్నముతో ఆ పిల్లను నిర్మానుష్యమైన ఒక స్థలమందు వదిలిపెట్టుతున్నాడు. A అనేమనిషి, ఆ పిల్లయొక్క మరణము సంభవింపచెయ్యకపోయినప్పటికిన్ని యీ సెక్షనులో నిర్ధారణచెయ్యబడ్డ నేరము జరిగించినవాడు అవుతున్నాడు.

(c) A అనేమనిషి, Z అనే మనిషిని ఖూనీచెయ్యవలెనని యత్నించి ఒక తుపాకీ కొనుక్కొని బారుచేస్తున్నాడు. A అనేమనిషి, యిందువల్లమాత్రము నేరము జరిగించలేదు. A అనేమనిషి, Z అనే మనిషిమీద ఆ తుపాకి కాలుస్తున్నాడు. అతడు యీ సెక్షనులో నిర్ధారణచెయ్యబడ్డ నేరము జరిగించినవాడు అవుతున్నాడు; అప్రకారము కాల్చడమువల్ల ఆతను Z అనే మనిషికి గాయము కలగచేసినపక్షమునకు అతడు యీ సెక్షనుయొక్క మొదటిపారాగ్రాఫు ఆఖరుభాగమువల్ల నిర్ణయించబడ్డ శిక్షకు పాత్రుడు అవుతున్నాడు.

(d) A అనేమనిషి, Z అనే మనిషిని విషముపెట్టి చంపవలెనని యత్నించి విషము ఖరీదుచేసి తనవద్ద వుంటూవున్న అన్నములో అది కలుపుతున్నాడు; A అనే మనిషి, యిందువల్లమాత్రము యీ సెక్షనులో నిర్ధారణచెయ్యబడ్డ నేరము జరిగించలేదు. ఆ తర్వాత A అనేమనిషి, Z అనే మనిషియొక్క బల్లమీద ఆ అన్నము వుంచుతున్నాడు, లేక Z అనే మనిషియొక్క మేజామీద వుంచవలసినది అని Z అనే

మనిషియొక్క నవుకరువద్ద అప్పగింతచేస్తున్నాడు. A అనేమనిషి, యీ సెక్షనులో నిర్ధారణచెయ్యబడ్డ నేరము జరిగించినవాడు అవుతున్నాడు.

నేరముగల నరహత్య జరిగించవలెనని యత్నించడము.

308. మరణము సంభవించినపక్షమునకు ఖూనీ కాకుండా వుండే నేరముగల నరహత్యను యేర్పాటుచెయ్యాలిగ్గ యత్నముతోటి, లేక యెరుకతోటి, లేక సంగతుల మీాద యేదైనాకార్యము జరిగించే యేమనిషి అయినా, మూడుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది; పైగా అట్టి కార్యమువల్ల యేమనిషికి అయినా ఘాత సంభవించినయెడల యేడుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

దృష్టాంతము.

A అనేమనిషి, అకస్మాత్తుగా కలగచెయ్యబడ్డ గొప్ప ఆగ్రహకారణముమీాద తాను మరణము కలగచేసినయెడల ఖూనీ కాకుండావుండే నేరముగల నరహత్యను గురించి తాను నేరస్థుణ్ని అవుతాననే సంగతులమీాద Z అనే మనిషిని ఒక తుపాకీతో కాలుస్తున్నాడు. A అనేమనిషి, యీ సెక్షనులో నిర్ధారణచెయ్యబడ్డ నేరము జరిగించినవాడు అవుతున్నాడు.

ఆత్మహత్య చేసుకోవలెనని యత్నించడము.

309. ఆత్మహత్య చేసుకోవలెనని వుద్దేశించి అట్టి నేరము జరిగించడమునుగురించిన యేదైనా కార్యముచేసే యేమనిషి అయినా, ఒకసంవత్సరమునకు వ్యాపించగూడిన కాలమువరకు సాధారణమైన ఖయిదువల్ల శిక్షించబడవలసినది, లేక జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

ఫాసీగరు.

310. ఈ శాసనము జారీ అయినతర్వాత యేకాలమందైనా ఖూనివల్లగాని ఖూనీతోకూడాగాని చోరీ జరిగించడమునకు, లేక పిల్లలను దొంగిలించడమునకుగాను ఒక యితరమనిషితోటి, లేక మనుష్యులతోటి వాడుకగా సహవాసపడే యేమనిషి అయినా ఒక ఫాసీగరుగా వుంటున్నాడు.

శిక్ష.

311. ఫాసీగరుగావుండే యేమనిషి అయినా, యావజ్జీవము ద్వీపాంతరవాసమువల్ల శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడు కావలసినది.

గర్భస్రావము కలగచెయ్యడము, పుట్టకముందు పిల్లలకు హానికలగచెయ్యడము, పిల్లలను యెక్కడనైనా వదిలిపెట్టిపోవడము, కాన్పులుదాచడము, వీటినిగురించి.

గర్భస్రావముకలగచెయ్యడము.

312. గర్భిణిగావుండే స్త్రీకి గర్భస్రావము స్వేచ్ఛగా కలగచేసే యేమనిషి అయినా, ఆ స్త్రీయొక్క ప్రాణసంరక్షణ చెయ్యడమునకుగాను కృత్రిమము లేకుండా అట్టి గర్భస్రావము కలగచెయ్యబడివుండనియెడల, మూడుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది, పైగా ఆ స్త్రీకి గర్భములో పిల్ల సజీవముగా వుండివున్నపక్షమునకు యేడుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్ల శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడు కావలసినది.

వివరణము.—తనకు తానే గర్భస్రావము కలగచేసుకొనే స్త్రీ ఈ సెక్షన్ తాలూకు అర్థపు వ్యాప్తిలోకి వస్తున్నది.

313. ఒక స్త్రీకి గర్భములో పిల్ల సజీవముగావున్నా సరే, లేక పోయినా సరే, ఆ స్త్రీయొక్క సమాధానము లేకుండా యింతకుముందు అవ్యవధానముగావుండే సెక్షన్‌లో నిర్దేశించబడ్డ నేరము జరిగించే యేమనిషి అయినా, యావజ్జీవము ద్వీపాంతరవాసమువల్లగాని పదిసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడు కావలసినది.

స్త్రీయొక్క సమాధానము లేకుండా గర్భస్రావము కలగ చెయ్యడము.

314. గర్భిణిగావుండే స్త్రీకి గర్భస్రావము కలగచెయ్యవలెననే యత్నములో పుట్టి స్త్రీయొక్క మరణము సంభవింపచేసే యేదైనా కార్యము జరిగించే యేమనిషి అయినా, పదిసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్ల శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడు కావలసినది;

గర్భస్రావము కలగచెయ్యవలెననే యత్నములో జరిగించబడ్డ కార్యమువల్ల మరణము సంభవించిన విషయములో.

పైగా ఆ కార్యము ఆ స్త్రీయొక్క సమాధానము లేకుండా జరిగించబడ్డయెడల యావజ్జీవము ద్వీపాంతరవాసమువల్లగాని పైన నమూదుచెయ్యబడ్డ శిక్షవల్లగాని శిక్షించబడవలసినది.

ఆ కార్యము స్త్రీయొక్క సమాధానము లేకుండా జరిగించబడ్డయెడల.

**వివరణము.**—మరణము సంభవించవచ్చునని నేరస్థుడు యెరిగివుండడమనేది, నేరమునకు ముఖ్యముకాదు.

315. పిల్ల సజీవముగా పుట్టకుండా చెయ్యవలెననే, లేక పుట్టిన తర్వాత చచ్చేలాగున చెయ్యవలెననే యత్నముతోటి యేపిల్ల అయినా పుట్టకముందు యేదైనా

పిల్ల సజీవముగా పుట్టకుండా చెయ్య

వలెననే, లేక పుట్టిన తర్వాత చచ్చేలాగున చెయ్యవలెననే యత్నముతో జరిగించబడ్డ కార్యము

కార్యము జరిగించి అట్టి కార్యమువల్ల ఆపిల్ల సజీవముగా పుట్టకుండాచేసే, లేక పుట్టినతర్వాత చచ్చేలాగునచేసే యేమనిషి అయినా, ఆపిల్ల తల్లియొక్క ప్రాణసంరక్షణ చెయ్యడమునకుగాను కృత్రిమము లేకుండా అట్టి కార్యము జరిగించబడివుండనియెడల పదిసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని ఈ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

గర్భములో సజీవముగావుండి పుట్టకుండావుండే పిల్లకు నేరముగల నరహత్య కాగూడిన ఒక కార్యమువల్ల మరణము కలగ చెయ్యడము.

316. మరణము సంభవింపచేసినపక్షమునకు నేరముగల నరహత్య అయ్యే సంగతులమీద యేదైనా కార్యము జరిగించి అట్టి కార్యమువల్ల గర్భములో సజీవముగా వుండి పుట్టకుండావుండే పిల్లయొక్క మరణము సంభవింపచేసే యేమనిషి అయినా, పదిసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్ల శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడు కావలసినది.

దృష్టాంతము.

ఎ అనేమనిషి, ఒక గర్భిణి స్త్రీయొక్క మరణము తాను కలగ చెయ్యవచ్చునని యెరిగివుండి ఆ స్త్రీకి మరణము సంభవింప చెయ్యబడ్డయెడల నేరముగల నరహత్య కాగూడిన ఒక కార్యము జరిగిస్తున్నాడు. ఆ స్త్రీ దేహమునకు యేదో ఒక హాని సంభవించువదేగాని ఆమె చనిపోలేదు; అయితే ఆమె గర్భమందు సజీవముగావుండి పుట్టకుండావుండే పిల్లకు అందువల్ల మరణము సంభవించునది. ఎ అనేమనిషి, ఈ సెక్షనులో నిర్ధారణ చెయ్యబడ్డ నేరమునుగురించి నేరస్థుడుగా వుంటున్నాడు.

317. పన్నెండు సంవత్సరములకు లోపుగావుండే ఒక పిల్లయొక్క తలితండ్రులలో ఒకరుగావుండి, లేక అట్టి

తల్లిదండ్రులలో యెవరయినా గాని, లేక ఆపిల్లను తనపరముగా వుంచుకొనివుండే మనిషిగానిపన్నెండు సంవత్సరములకు లోపుగావుండే పిల్లను ఎక్కడనైనా వదిలిపెట్టిపోవడము.

పిల్లను తనపరముగా వుంచుకొనివుండి బొత్తుగా వదిలిపెట్టవలెననే యత్నముతో దాన్ని యే స్థలమందయినా వదిలిపెట్టిపొయ్యే యేమనిషి అయినా, యేడుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలము వరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని ఈ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

వివరణము.—ఎక్కడనయినా వదిలిపెట్టిపోవడమువల్ల ఆ పిల్ల చనిపోయినయెడల ఆ యీసంగతులకు తగ్గట్టు ఖూనీనిగురించిగాని నేరముగల నరహత్యనుగురించిగాని నేరస్థుణ్ని విచారణచెయ్యకుండా ఆటంకపెట్టేలాగున యీ సెక్షనువల్ల వుద్దేశించబడలేదు.

318. పిల్ల పుట్టకమునకు ముందుగాని వెనకగాని లేక పుట్టుతూవుండే కాలమందుగాని యెప్పుడు చచ్చినాసరే పిల్లయొక్క కళేబరము పాతపెట్టకమువల్ల, లేక మరి ఒకతరహాగా రహస్యముగా నివర్తిచేసుకోవడమువల్ల అట్టి పిల్ల జననమయిన సంగతి ప్రయత్నపూర్వకముగాదాచే, లేక దాచడమునకు ప్రయత్నపడే యేమనిషి అయినా, రెండుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

కళేబరమునురహస్యముగా నివర్తిచెయ్యడమువల్ల కాన్పు దాచడము.

ఘాతనుగురించి.

319. ఏమనిషికయినా దేహశ్రమ, రోగము, లేక అశక్తత కలగచేసే యేమనిషి అయినా, ఘాత కలగచేసినట్టు చెప్పబడుతున్నాడు.

ఘాత.

బలమైన ఘాత.

320. ఈ కింద నమూదుచెయ్యబడే ఘాతలు, "బలమయిన ఘాతలు" అని చెప్పబడుతున్నవి:-

మొదటిది.—పుంస్త్వవిహీనత కలగచెయ్యడము.

రెండోది.—కండ్లలో యేకంటియొక్క అయినా దృష్టి యెప్పటికిన్ని లేకుండాచెయ్యడము.

మూడోది.—చెవులలో యేదయినా యెప్పటికిన్ని వినరాకుండాచెయ్యడము.

నాలుగోది.—ఏదయినా అవయవము, లేక కీలు పోయ్యేటట్టు చెయ్యడము.

అయిదోది.—ఏదయినా అవయవముగాని కీలుగాని నష్టపరచడము, లేక యెప్పటికిన్ని క్షీణింపచెయ్యడము.

ఆరోది.—ఎప్పటికిన్ని శిరస్సుకుగాని ముఖమునకుగాని వికృతరూపము కలగచెయ్యడము.

ఏడోది.—ఒక యెముకగాని పల్లుగాని విరగకొట్టడము, లేక తొలగతియ్యడము.

ఎనిమిదోది.—ప్రాణమునకు అపాయముకలగచేసే, లేక ఘాత పొందిన మనిషి యిరువైరోజులవరకు బలమైన దేహశ్రమతోటిగాని తన సాధారణమైన పనులు జరిగించడమునకు శక్తిలేకుండాగాని వుండేలాగునచేసే ఘాత.

స్వేచ్ఛగా ఘాత కలగచెయ్యడము.

321. ఏమనిషికైనా ఘాత కలగచెయ్యవలెననే యత్నముతోటి, లేక ఘాత కలగవచ్చుననే యెరుకతోటి యేదైనా కార్యము జరిగించి ఆ కార్యమువల్ల యె

వరికైనా ఘాత కలగచేసే యేమనిషి అయినా, "స్వేచ్ఛగా ఘాత కలగ చేసేటట్టు" చెప్పబడుతున్నాడు.

322. స్వేచ్ఛగా ఘాతకలగచేసే యేమనిషి అయినా, కలగ చెయ్యవలెనని తాను యత్నించే, లేక కలగచెయ్య వచ్చునని తాను యెరిగివుండే ఘాత బలమైన ఘాత గావున్నపక్షమునకున్ను అతను కలగచేసే ఘాత బలమైన ఘాతగావున్నపక్షమునకున్ను "స్వేచ్ఛగా బలమైన ఘాత కలగచేసి నట్టు" చెప్పబడుతున్నాడు.

స్వేచ్ఛగా బలమయిన ఘాతచెయ్యడము.

వివరణము.—ఒకమనిషి, బలమైన ఘాత చెయ్యడమేగాకుండా బలమయినఘాత కలగచెయ్యవలెనని యత్నించి, లేక కలగచెయ్యవచ్చునని యెరిగివుంటేనేతప్ప, స్వేచ్ఛగా బలమయిన ఘాత కలగచేసినట్టు చెప్పబడనేరదు. అయితే ఒకతరహా బలమయిన ఘాత కలగచెయ్యవలెనని యత్నించి, లేక కలగచెయ్యవచ్చునని యెరిగివుండి మరి ఒకతరహా బలమయిన ఘాత నిశ్చయముగా కలగచేసినపక్షమునకు స్వేచ్ఛగా బలమయినఘాత చేసినట్టు చెప్పబడుతున్నాడు.

## దృష్టాంతము.

A అనేమనిషి, Z అనే మనిషియొక్క ముఖము యెప్పటికిన్ని వికృతరూపము కలదిగా చెయ్యవలెనని యత్నించి, లేక అట్లా కావచ్చునని యెరిగివుండి ఒకదెబ్బ కొట్టుతున్నాడు. ఆదెబ్బ Z ఆనే మనిషియొక్క ముఖము యెప్పటికిన్ని వికృతరూపముగలదిగా వుండేటట్టు చెయ్యలేదుగాని అది, Z అనేమనిషి యిరువై రోజులకాలమువరకు బలమయిన దేహశ్రమ పొందేలాగున చేస్తున్నది. ఇందులో A అనేమనిషి, స్వేచ్ఛగా బలమయిన ఘాత కలగచేసినవాడు అవుతున్నాడు.

323. 334-వ సెక్షన్‌లో నమూదుచెయ్యబడ్డ సంగతిలోతప్ప, స్వేచ్ఛగా ఘాత కలగచేసే యేమనిషి అయినా, ఒకసంవత్సరమునకు వ్యాపించగూడిన కాలమువరకు

స్వేచ్ఛగా ఘాత చేసినందుకు శిక్ష.

రెండుతెరహాలలో ఒకతరహా ఖయిదునల్లగాని వెయ్యిరూపాయలకు వ్యాపించగూడిన జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

324. 334-వ సెక్షనులో నమూదుచెయ్యబడ్డ సంగతిలోతప్ప, గుండుగాని బాణముగాని వెయ్యడమునకు, పొడవడమునకు, లేక కొయ్యడమునకు. లేక నరకడమునకు వుపయోగించే యేదయినా ఆయుధమువల్లగాని ఆయుధముగా వాడబడ్డపక్షమునకు మరణము కలగచెయ్యగూడిన దేనివల్లనయినాగాని అగ్నివల్లగాని కాచబడ్డ, లేక కాల్పబడ్డ, లేక కరగబడ్డ యేదయినా వస్తువవల్లగాని యేదయినా విషమువల్లగాని క్షయింపచేసే వస్తువవల్లగాని ధమిాలున నేటుశబ్దముకలిగే వస్తువవల్లగాని లోపలికి శ్వాసముగాపోవడము, మింగడము, లేక రక్తములోకి వెళ్లడము, వీటివల్ల మానవశరీరమునకు వికారముకలగచేసే యేదయినా వస్తువవల్లగాని యేదయినా జంతువవల్లగాని స్వేచ్ఛగా ఘాత కలగచేసే యేమనిషి అయినా, మూడుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమునరకు రెండుతెరహాలలో ఒకతరహా ఖయిదునల్లగాని జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

అపాయకరమైన ఆయుధములవల్ల, లేక సాధనములవల్ల స్వేచ్ఛగా ఘాత చెయ్యడము.

325. 335-వ సెక్షనువల్ల నిబంధన యేర్పాటుచెయ్యబడ్డ సంగతిలోతప్ప, స్వేచ్ఛగా బలమయిన ఘాత కలగచేసే యేమనిషి అయినా, యేడుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతెరహాలలో ఒకతరహా ఖయిదువల్ల శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడుకావలసినది.

స్వేచ్ఛగా బలమయిన ఘాత కలగచేసినపక్షమునకు శిక్ష.

326. 335-వ సెక్షనులో నమూదుచెయ్యబడ్డ సంగతిలోతప్ప, గుండుగాని బాణముగాని వెయ్యడమునకు, పొడ

అపాయకరమైన ఆయుధములవల్ల, లేక సాధనములవల్ల స్వేచ్ఛగా బలమైనఘాత చెయ్యడము.

వడమునకు, లేక కొయ్యడమునకు, లేక నరకడము నకు వుపయోగించే యేదయినా ఆయుధమువల్ల గాని ఆయుధముగా వాడబడ్డపక్షమునకు మరణము కలగచెయ్యగూడిన దేనివల్లనయినాగాని అగ్నివల్ల గాని కాచబడ్డ, లేక కాల్పబడ్డ, లేక కరగబడ్డ యేదయినా వస్తువల్ల గాని యేదయినా విషమువల్లగాని క్షయింపచేసే వస్తువవల్లగాని ధమీూలున వేటుశబ్దముకలిగే వస్తువవల్లగాని లోపలికి శ్వాసముగా పోవడము, మింగడము, లేక రక్తములోకి వెళ్లడము, వీటివల్ల మానవశరీరమునకు వికారముకలగచేసే యేదయినా వస్తువవల్లగాని యేదయినా జంతువవల్ల గాని స్వేచ్ఛగా బలమయినఘాత కలగచేసే యేమనిషి అయినా, యావజ్జీవము ద్వీపాంతరవాసమువల్లగాని పదిసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడుకావలసినది.

సొమ్ము బలవంతముగా పుచ్చుకోవడమునకు, లేక న్యాయశాస్త్రవిరోధమయిన ఒక కార్యముచేసేలాగున నిర్బంధించడమునకు స్వేచ్ఛగా ఘాత చెయ్యడము.

327. ఘాతపొందివుండే మనిషివద్దగాని అతనితో యిలాకాగల యేమనిషివద్దనయినాగాని బలవంతముగా సొమ్ము, లేక విలువగలసాధనము పుచ్చుకోవడమునకు, లేక ఘాతపొందిన మనిషి, లేక అతనితో యిలాకాగల మనిషి న్యాయశాస్త్రవిరోధముగావుండే, లేక ఒక నేరము జరిగించడమును సులభపరచగలిగిన యేదయినాకార్యము జరిగించేలాగున నిర్బంధించడమునకు స్వేచ్ఛగా ఘాతచేసే యేమనిషి అయినా పది సంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్ల శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడు కావలసినది.

328. ఒకమనిషికి ఘాత కలగచెయ్యవలెననే యత్నముతో, లేక ఒక నేరము చెయ్యవలెననే, లేక ఆ నేరము చెయ్యడమును సులభపరచవలెననే యత్నముతో, లేక అందువల్ల తాను ఘాత చెయ్యవచ్చుననే యెరుకతో యేమనిషికి అయినా విషముగాని మత్తు, లాహిరి, లేక అనారోగ్యముకలగచేసే ఔషధముగాని యితరవస్తువగాని పెట్టే, లేక పుచ్చుకొనేలాగునచేసే యేమనిషి అయినా, పదిసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్ల శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడు కావలసినది.

నేరము జరిగించవలెననే యత్నముతో విషము వగయిరాలవల్ల ఘాత కలగచెయ్యడము.

329. ఘాత పొందివుండే మనిషివద్దగాని అతనితో యిలాకాగల యేమనిషివద్దనయినాగాని బలవంతముమీద సొమ్ము, లేక విలువగలసాధనము పుచ్చుకోవడమునకు, లేక ఘాతపొందినమనిషి, లేక అతనితోయిలాకాగలమనిషి న్యాయశాస్త్రవిరోధముగావుండే, లేక ఒక నేరము జరిగించడమును సులభపరచగలిగిన యేదయినా కార్యము జరిగించేలాగున నిర్బంధించడమునకు స్వేచ్ఛగా బలమయిన ఘాత చేసే యేమనిషి అయినా, యావజ్జీవము ద్వీపాంతరవాసమువల్లగాని పదిసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడు కావలసినది.

సొమ్ముబలవంతముమీద పుచ్చుకోవడమునకు, లేక న్యాయశాస్త్రవిరోధమైన ఒక కార్యముచేసేలాగున నిర్బంధించడమునకు స్వేచ్ఛగా బలమైన ఘాత చెయ్యడము.

330. ఘాత పొందివుండేమనిషి, లేక అతనితో యిలాకాగల మనిషి, ఒక నేరము, లేక దుర్నడత వెల్లడి అయ్యే

ఎకరారు పడేలాగున బలవంతము జరిగించడమునకుగాని సొమ్ము తిరిగియిచ్చివేసేలాగున నిర్బంధించడమునకుగాని స్వేచ్ఛగా ఘాతచెయ్యడము.

ట్టుచేసే యెకరారు పడేలాగునగాని సమాచారము తెలియచేసేలాగునగాని బలవంతము జరిగించడమునకు, లేక ఘాత పొందివుండేమనిషి, లేక అతనితో యిలాకాగల మనిషి యేదయినా సొమ్ముగాని విలువగల సాధనముగాని తిరిగీ యిచ్చివెయ్యడమునుగురించి, లేక తిరిగీ యిచ్చివేసేలాగున చెయ్యడమునుగురించి, లేక యేదయినా దావాకు సమాధానపరచడమునుగురించి, లేక యేదైనా సొమ్ముగాని విలువగల సాధనముగాని తిరిగీ పొందడమునకు అనుకూలించే సమాచారము తెలియచేసేలాగున నిర్బంధించడమునకు స్వేచ్ఛగా ఘాత కలగచేసే యేమనిషి అయినా, ఏడుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్ల శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడు కావలసినది.

## దృష్టాంతములు.

(a) పోలీస్ ఆఫీసరు అయిన A అనేమనిషి, నేరము జరిగించినట్టు Z అనే మనిషి యెకరారుపడేలాగున చెయ్యడమునకు Z అనే మనిషిని హింసిస్తున్నాడు. A అనేమనిషి, యీ సెక్షనుప్రకారము నేరస్థుడు అవుతున్నాడు.

(b) పోలీస్ ఆఫీసరు అయిన A అనేమనిషి, చోరిసొమ్ము పాతవుంచబడివుండే స్థలము కనపరచేలాగున చెయ్యగలందులకయి B అనేమనిషిని హింసిస్తున్నాడు. A అనేమనిషి, ఈ సెక్షనుప్రకారము నేరస్థుడు అవుతున్నాడు.

(c) రివిన్యూ వుద్యోగస్థుడయిన A అనేమనిషి, Z అనేమనిషి చెల్లించవలసివుండే ఒకానొక బకాయ బాకీ చెల్లించేలాగున బలవంతపెట్టడమునకు Z అనే మనిషిని హింసిస్తున్నాడు. A అనేమనిషి, ఈ సెక్షనుప్రకారము నేరస్థుడు అవుతున్నాడు.

(d) జమీందారుడయిన A అనేమనిషి, శిస్తు చెల్లించేలాగున బలవంతపెట్టడమునకు ఒక రయితును హింసిస్తున్నాడు. A అనేమనిషి, యీ సెక్షన్ ప్రకారము ఒక నేరస్థుడు అవుతున్నాడు.

331. ఘాత పొందివుండే మనిషి, లేక అతనితో యిలాకాగల మనిషి, ఒకనేరము, లేక దుర్నడత వెల్లడి అయ్యేటట్టు యెకరారు పడేలాగునగాని సమాచారము తెలియచేసేలాగునగాని బలవంతము జరిగించడమునకు, లేక ఘాత పొందివుండేమనిషి, లేక అతనితో యిలాకాగలమనిషి, యేదయినా సొమ్ముగాని విలువగల సాధనముగాని తిరిగీ యిచ్చివెయ్యడమును గురించి, లేక తిరిగీ యిచ్చివేసేలాగున చెయ్యడముసుగురించి, లేక యేదయినా దావాకు సమాధానపరచడమును గురించి, లేక యేదయినా సొమ్ముగాని విలువగల సాధనముగాని తిరిగీ పొందడమునకు అనుకూలించే సమాచారము తెలియచేసేలాగున నిర్బంధించడమునకు స్వేచ్ఛగా బలమయిన ఘాత కలగచేసే యేమనిషి అయినా, పదిసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్ల శిక్షించబడడమేగాకుండా జుల్మానాకు కూడా పాత్రుడు కావలసినది.

ఎకరారు పడేలాగున బలవంత పెట్టడమునకుగాని సొమ్ము తిరిగీ యిచ్చివేసేలాగున బలవంతపెట్టడమునకుగాని స్వేచ్ఛగా బలమయిన ఘాత కలగచెయ్యడము.

332. పబ్లిక్ వుద్యోగస్థుడయిన యేమనిషికి అయినా అతడు తన వుద్యోగధర్మమునుపట్టి పని జరిగిస్తూవుండగాగాని అతడు, లేక యితర పబ్లిక్ వుద్యోగస్థుడు తన వుద్యోగ ధర్మమునుపట్టి తనపని జరిగించకుండా చెయ్యవలెననే యత్నముతోగాని అతడు ఆ వుద్యోగధర్మమునుపట్టి తనపని న్యాయశాస్త్రసమ్మతముగా జరిగించడములో అతనివల్ల జరిగించబడ్డ లేక జరిగించబడేలాగున యత్నించబడ్డ యేదయినా కార్యమునుగురించిగాని స్వేచ్ఛగా యేదయినా ఘాతచేసే యేమనిషి అయినా, మూడుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలము

పబ్లిక్ వుద్యోగస్థుడు తనపని జరిగించకుండా పొయ్యేలాగున స్వేచ్ఛగా ఘాత కలగచెయ్యడము.

వరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

333. పబ్లిక్ వుద్యోగస్థుడైన యేమనిషికి అయినా అతడు తన వుద్యోగధర్మమునుపట్టి పని జరిగిస్తూవుండగాగాని అతడు, లేక యితర పబ్లిక్ వుద్యోగస్థుడు తన వుద్యోగధర్మమునుపట్టి తనపని జరిగించకుండా చెయ్యవలెననే యత్నముతోగాని అతడు ఆ వుద్యోగధర్మమునుపట్టి తనపని న్యాయశాస్త్రసమ్మతముగా జరిగించడములో అతనివల్ల జరిగించబడ్డ, లేక జరిగించబడేలాగున యత్నించబడ్డ యేదైనా కార్యమునుగురించిగాని స్వేచ్ఛగా గాయమైనా బలమైన ఘాత చేసే యేమనిషి అయినా, పదిసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్ల శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడుకావలసినది.

పబ్లిక్ వుద్యోగస్థుడు తనపని జరిగించకుండాపొయ్యేలాగున స్వేచ్ఛగా బలమైన ఘాత కలగచెయ్యడము.

334. అకస్మాత్తుగా సంభవించిన గొప్ప ఆగ్రహకారణముమీద స్వేచ్ఛగా ఘాత కలగచేసే యేమనిషి అయినా, ఆగ్రహము కలగచేసిన మనిషిగాక మరి యే యితరమనిషికి అయినా ఘాత కలగచెయ్యవలెనని అతడు వుద్దేశించకపోయినపక్షమునకు, లేక అట్టి ఘాత కలగవచ్చునని యెరిగివుండనిపక్షమునకు ఒకమాసమునకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని అయిదువందల రూపాయీలకు వ్యాపించగూడిన జుల్మానావల్లగాని ఈ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

ఆగ్రహకారణముమీద స్వేచ్ఛగాఘాత కలగచెయ్యడము.

335. అకస్మాత్తుగా సంభవించిన గొప్ప ఆగ్రహకారణముమీద స్వేచ్ఛగా బలమైన ఘాత కలగచేసే యే

ఆగ్రహకారణము మీద స్వేచ్ఛగా బలమయిన ఘాత కలగ చెయ్యడము.

మనిషి అయినా, ఆగ్రహము కలగచేసిన మనిషి గాక మరి యే యితరమనిషికి అయినా బలమైన ఘాత కలగచెయ్యవలెనని అతడు వుద్దేశించకపోయినపక్షమునకు, లేక అట్టి ఘాత కలగవచ్చునని యెరిగివుండనిపక్షమునకు, నాలుగుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని రెండువేల రూపాయీలకు వ్యాపించగూడిన జుల్మానావల్లగాని ఈ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

వివరణము.—ఇంతకుముందటి రెండు సెక్షన్లున్ను, 300-వ సెక్షన్ తాలూకు 1-టి మినహాయింపు లోబడివుండే నిబంధనలకే లోబడి వుంటున్నవి.

ప్రాణమునకుగాని యితరుల శరీరసౌఖ్యమునకుగాని అపాయము కలగచేసే కార్యము.

336. మనుష్య ప్రాణమునకుగాని యితరుల శరీరసౌఖ్యమునకుగాని అపాయము కలిగేలాగున అంత వేగముగా, లేక అశ్రద్ధగా యేదైనా కార్యము జరిగించే యే మనిషి అయినా, మూడుమాసములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని రెండువందల యాభై రూపాయలకు వ్యాపించగూడిన జుల్మానావల్లగాని ఈ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

ప్రాణమునకుగాని యితరుల శరీరసౌఖ్యమునకుగాని అపాయము కలగచేసే కార్యమువల్ల ఘాత కలగ చెయ్యడము.

337. మనుష్య ప్రాణమునకుగాని యితరుల శరీరసౌఖ్యమునకుగాని అపాయము కలిగేలాగున అంత వేగముగా, లేక అశ్రద్ధగా యేదైనా కార్యము జరిగించడమువల్ల యెవరికి అయినా ఘాత కలగచేసే యే మనిషి అయినా, ఆరుమాసములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా

ఖయిదువల్లగాని అయిదువందల రూపాయీలకు వ్యాపించగూడిన జుల్మానావల్లగాని ఈ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

ప్రాణమునకుగాని యితరుల శరీరసౌఖ్యమునకుగాని అపాయము కలగచేసే కార్యము వల్ల బలమయిన ఘాత కలగచెయ్యడము.

338. మనుష్య ప్రాణమునకుగాని యితరుల శరీర సౌఖ్యమునకుగాని అపాయము కలిగేలాగున అంత వేగముగా, లేక అశ్రద్ధగా యేదైనా కార్యము జరిగించడమువల్ల యెవరికి అయినా బలమయిన ఘాత కలగచేసే యేమనిషి అయినా, రెండుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని వెయ్యిరూపాయీలకు వ్యాపించగూడిన జుల్మానావల్లగాని ఈ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

అక్రమముగా అడ్డగించడమున్ను అక్రమముగా ఖయిదుచెయ్యడమున్ను.

అక్రమముగా అడ్డగించడము.

339. ఒకమనిషి తాను వెళ్లడమునకు హక్కుగల యేదిక్కుకయినా వెళ్లకుండా అతణ్ని స్వేచ్ఛగా అడ్డగించే యేమనిషి అయినా, ఆ మనిషిని అక్రమముగా అడ్డగించినట్టు చెప్పబడుతున్నాడు.

మినహాయింపు.—ఏమనిషి అయినా తాను అడ్డగించడమునకు న్యాయశాస్త్రసమ్మతమైన హక్కు కలిగివున్నట్టు కృత్రిమములేకుండా నమ్మి మెట్టనుగాని నీళ్లమీదగాని ఒక ఖానిగీదారిని అడ్డగించినపక్షమునకు ఆ అడ్డగించడము అనేది, ఈ సెక్షను తాలూకు అర్థమందు ఒక నేరముగా వుండనేరదు.

దృష్టాంతము.

**A** అనేమనిషి, **Z** అనేమనిషి వెళ్లడమునకు హక్కుగల ఒకదారి అడ్డగిస్తున్నాడు, గాని తనకు అడ్డగించే హక్కువున్నట్టు కృత్రిమములేకుండా నమ్మలేదు. ఇందువల్ల

Z అనేమనిషి వెళ్లకుండా అడ్డగించబడ్డాడు. ఇందులో A అనేమనిషి, అక్రమముగా Z అనే మనిషిని అడ్డగించినవాడు అవుతున్నాడు.

అక్రమముగా ఖయిదు చెయ్యడము.

340, కొన్ని హద్దులకు వెలపలికి ఒకమనిషి వెళ్లకుండా చేసే లాగున అతణ్ని యేతరహాగానైనా అక్రమముగా నిర్బంధించే యేమనిషి అయినా, ఆ మనిషిని "అక్రమముగా ఖయిదులోవుంచినట్టు" చెప్పబడుతున్నాడు.

దృష్టాంతములు.

(a) A అనేమనిషి, చుట్టూ ఆవరణపు గోడ కట్టబడివుండే స్థలములోకి Z అనేమనిషి వెళ్లేలాగున చేసి అతణ్ని లోపలవుంచి తలుపు తాళము వేస్తున్నాడు. ఇందువల్ల Z అనేమనిషి, ఆ ఆవరణపు గోడకు వెలపల యేదిక్కుకున్ను పోకుండా అడ్డగించబడ్డాడు. A అనేమనిషి, అక్రమముగా Z అనేమనిషిని ఖయిదుచేసినవాడు అవుతున్నాడు.

(b) A అనేమనిషి, ఒక గృహములోనుంచి వెలపలికి పొయ్యే దార్లలో తుపాకీలతో మనుష్యులను వుంచి లోపలవుండే Z అనేమనిషి ఆ గృహము వెలపటికి వచ్చేపక్షమునకు కాలుస్తారని అతనితో చెప్పుతున్నాడు. ఇందులో A అనేమనిషి, Z అనే మనిషిని అక్రమముగా ఖయిదుచేసినవాడు అవుతున్నాడు.

అక్రమముగా అడ్డగించినపక్షమునకు శిక్ష.

341. ఎవరిని అయినా అక్రమముగా అడ్డగించే యేమనిషి అయినా, ఒకమాసమునకు వ్యాపించగూడిన కాలమువరకు సాధారణమైన ఖయిదువల్లగాని ఐదువందల రూపాయీలకు వ్యాపించగూడిన జుల్మానావల్లగాని ఈ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

అక్రమముగా ఖైదు చేసినపక్షమునకు శిక్ష.

342. ఎవరిని అయినా అక్రమముగా ఖయిదుచేసే యేమనిషి అయినా, ఒకసంవత్సరమునకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని వెయ్యిరూపాయీలకు వ్యాపించగూడిన జుల్మానావల్లగాని ఈ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

343. ఎవరిని అయినా మూడురోజులవరకు, లేక అంతకంటె యెక్కువకాలమువరకు అక్రమముగా ఖయిదుచేసే యేమనిషి అయినా, రెండుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్ల శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడు కావలసినది.

మూడు రోజులవరకు, లేక అంతకంటె యెక్కువకాలమువరకు అక్రమముగా ఖైదుచెయ్యడము.

344. ఎవరిని అయినా పదిరోజులవరకు, లేక అంతకంటె యెక్కువకాలమువరకు అక్రమముగా ఖయిదుచేసే యేమనిషి అయినా, మూడుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్ల శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడుకావలసినది.

పదిరోజులవరకు, లేక అంతకంటె యెక్కువ కాలమువరకు అక్రమముగా ఖయిదు చెయ్యడము.

345. ఒకమనిషిని విడదలచెయ్యగలందులకై హుకుము సాదరు చెయ్యబడ్డది అని యెరిగివుండి అతనిని విడదల చెయ్యకుండా అక్రమముగా ఖయిదులో నిలిపివుంచుకొనివుండే యేమనిషి అయినా, ఈ అధ్యాయము తాలూకు మరి యే యితర సెక్షనునుపట్టి అయినా అతను పాత్రుడు అయ్యే ఖయిదు కాలముగాక రెండుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్ల శిక్షించబడవలసినది.

విడదల చెయ్యడమునుగురించి హుకుము సాదరుచెయ్యబడి వుండే మనిషిని విడదలచెయ్యకుండా అక్రమముగా ఖయిదులోనే నిలిపివుంచడము.

346. ఖయిదుచెయ్యబడ్డ మనిషితో యిలాకాగల యేమనిషికైనా, లేక యెవరు అయినా పబ్లిక్ వుద్యోగస్థు

అక్రమముగా రహస్యముగ నస్థలమందు ఖయిదు చెయ్యడము.

నికి అట్టి మనిషి ఖయిదుచెయ్యబడ్డసంగతి, లేక అతడు ఖయిదుచెయ్యబడ్డ స్థలము అట్టి మనిషికి, లేక వుద్యోగస్తునికి తెలియకుండాగాని వారు కనుకోకుండాగాని వుండవలెననే యత్నము సూచించే యేదయినా తరహాను యెవరిని అయినా అక్రమముగా ఖయిదుచేసే యేమనిషి అయినా, అట్లా అక్రమముగా ఖయిదుచేసినందుకుగాను అతను పాత్రుడయ్యే యితర శిక్షగాక రెండుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్ల శిక్షించబడవలసినది.

ఆస్తి బలవంతముగా పుచ్చుకొనేలాగున చెయ్యడమునకు, లేక అక్రమమయిన కార్యముచేసేలాగున నిర్బంధించడమునకు అక్రమముగా ఖయిదు చెయ్యడము.

347. ఖయిదు చెయ్యబడ్డ మనిషివద్దగాని ఖయిదు చెయ్యబడ్డ మనిషితోటి యిలాకాగల మరి యేమనిషివద్దనైనాగాని యేదైనా ఆస్తి, లేక విలువగల సాధనము బలవంతముగా పుచ్చుకోవడమునకు, లేక ఖయిదుచెయ్యబడ్డ మనిషిగాని అట్టి ఖయిదు చెయ్యబడ్డ మనిషితోటి యిలాకాగల మరి యేమనిషి అయినాగాని న్యాయశాస్త్రసమ్మతముకాని యే కార్యమైనా చేసేలాగున, లేక ఒక నేరము జరిగించడమును సులభపరచగూడిన యేదైనా సమాచారము తెలియచేసేలాగున నిర్బంధించడమునకు యెవరినైనా అక్రమముగా ఖయిదుచేసే యేమనిషి అయినా, మూడుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్ల శిక్షించబడడమే గాకుండా జుల్మానాకుకూడా పాత్రుడు కావలసినది.

348. ఖైదుచెయ్యబడ్డ మనిషిగాని అతనితోటి యిలాకాగల మరి యేమనిషి అయినాగాని ఒక నేరము, లేక

ఎకరారు పడేలాగున బలవంతపెట్టడమునకుగాని ఆస్తితిరిగీయిచ్చివేసేలాగున చెయ్యడమునకుగాని అక్రమముగా ఖయిదు చెయ్యడము.

దుర్నడత వెల్లడికాగూడిన యెకరారు పడేలాగునగాని సమాచారము తెలియచేసేలాగునగాని, లేక ఖైదుచెయ్యబడ్డ మనిషి, లేక అతనితోటి ఖులాకాగల మరి యేమనిషి అయినా యేదైనా సొమ్ముగాని విలువగల సాధనముగాని తిరిగీయిచ్చివేసేలాగున, లేక తిరిగీ యిప్పించేలాగున, లేక యేదైనా దావాకు సమాధానము చేసుకొనేలాగున, లేక యేదైనా సొమ్ముగాని విలువగల సాధనముగాని తిరిగీ యిచ్చివెయ్యడమునకు అనుకూలించే సమాచారము చెప్పేలాగున జరిగించడమునకు యెవరినైనా అక్రమముగా ఖైదుచేసే యేమనిషి అయినా, మూడుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖైదువల్ల శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడు కావలసినది.

అక్రమమైన బలవంతము, దౌర్జన్యము, వీటినిగురించి.

బలవంతము.

349. ఒక మనిషి, మరి ఒక మనిషికి చలనము, చలనభేదము, లేక చలననివృత్తి కలగచేసిన పక్షమునకుగాని అతడు అట్టి మనిషియొక్క శరీరము తాలూకు యేభాగముతోటి అయినా, లేక అట్టి మనిషి ధరించుకొనివుండే, లేక పట్టుకొని వెళ్లుతూవుండే దేనితోటి అయినా, లేక ఆ మనిషియొక్క స్పర్శేంద్రియమునకు తాకే దేనితోటి అయినా యేదైనా వస్తువ తగిలేటట్టు అట్టి వస్తువకు చలనము, చలనభేదము, లేక చలననివృత్తి కలగచేసిన పక్షమునకుగాని ఆ మనిషిని బలవంతపెట్టినట్టు చెప్పబడుతున్నాడు: అయితే అట్టి చలనము, చలనభేదము, లేక చలననివృత్తి యిందులో యికముందు చెప్పబడే మూడుతరహాలలో ఒకతరహాను జరిగించబడివుండవలసినది, అవి యేవంటే:

మొదటిది.—ఆ మనిషియొక్క స్వకీయమైన శరీరబలమువల్ల.

రెండోది.—ఆ మనిషివల్లగాని యితర మనిషివల్లగాని మరి యే కార్యమున్ను జరిగించబడకుండా చలనము, చలనభేదము, లేక చలన నివృత్తి సంభవించేలాగున, యేదైనా వస్తువ వుంచడమువల్ల.

మూడోది.—ఏదైనా జంతువ చలించేలాగున, చలనభేదము జరిగించేలాగున, లేక చలననివృత్తి చేసేలాగున చెయ్యడమువల్ల.

350. ఏదైనా నేరము జరిగించగలందులకు యేమనిషియొక్క అయినా సమ్మతిలేకుండా అతణ్ని మనఃపూర్వకముగా బలవంతపెట్టే, లేక అట్లా బలవంతపెట్టడమువల్ల బలవంతపెట్టబడ్డ ఆ మనిషికి కీడు, భయము, లేక వుపద్రవము కలగవలెనని యత్నించి, లేక అట్టి బలవంతమువల్ల కీడు, భయము, లేక వుపద్రవము కలగవచ్చునని యెరిగివుండి అట్టి యితరమనిషికి బలవంతము కలగచేసే యేమనిషి అయినా, ఆ యితరమనిషికి నేరముగల బలవంతము జరిగించినట్టు చెప్పబడివున్నాడు.

నేరముగల బలవంతము.

దృష్టాంతములు.

(a) D అనేమనిషి, ఒక నదియందు లంగరువెయ్యబడ్డ పడవలో కూర్చుండి వుంటున్నాడు. A అనేమనిషి, ఆ లంగరుతాళ్లు వదిలించి అందువల్ల ప్రయత్నపూర్వకముగా ఆ పడవ ప్రవాహపు నీళ్లలో కొట్టుకొనిపొయ్యేటట్టు చేస్తున్నాడు. ఇందులో A అనేమనిషి D అనే మనిషికి చలనము కలిగేటట్టు చేసినాడు. పయిగా అతడు తనవల్లగాని యేమనిషివల్లనయినాగాని యే యితర కార్యమున్ను జరిగించబడకుండానే ఆ చలనము కలిగేలాగున వస్తువులు వుంచడమువల్ల యీ చలనము కలగచేస్తున్నాడు. కనుక A అనేమనిషి, D అనే మనిషికి ప్రయత్నపూర్వకముగా బలవంతము జరిగించినవాడు అవుతున్నాడు; మరిన్ని యేదయినా నేరము జరిగించడమునకు, D అనే మనిషియొక్క సమ్మతిలేకుండా ఆలాగున జరిగించినపక్షమందు, లేక ఈ బలవంతమువల్ల కీడు, భయము, లేక వుపద్రవము సంభవించవలెనని యత్నించి, లేక సంభవించ

వచ్చునని యెరిగివుండి ఈ బలవంతము జరిగించివున్న పక్షమునకు A అనేమనిషి, D అనే మనిషికి నేరముగల బలవంతము జరిగించినవాడు అవుతున్నాడు.

(b) D అనేమనిషి, ఒక బండిమీద సవారీచేస్తున్నాడు. A అనేమనిషి, D అనే మనిషియొక్క గుర్రములను చవుకుతో కొట్టి అందువల్ల అవి మునుపటికంటె వడిగా వెళ్లేటట్టు చేస్తున్నాడు. ఇందులో ఆ జంతువుల చలనమునకు భేదము కలిగే లాగున చెయ్యడమువల్ల D అనే మనిషికి చలనభేదము కలగచేసినాడు గనుక A అనే మనిషి D అనే మనిషిని బలవంతపెట్టినవాడు అవుతున్నాడు; మరిన్ని A అనేమనిషి, అందువల్ల D అనే మనిషికి కీడు, భయము, లేక వుపద్రవము కలగిచెయ్యవలెనని యత్నించి, లేక కలగవచ్చునని యెరిగివుండి, D అనే మనిషియొక్క సమ్మతిలేకుండా ఈ చలనభేదము కలగచేసివున్నయెడల A అనేమనిషి, D అనే మనిషికి నేరముగల బలవంతము జరిగించినవాడు అవుతున్నాడు.

(c) D అనేమనిషి పల్లకీలో సవారీచేస్తున్నాడు. A అనేమనిషి, D అనే మనిషిని దోచుకోవలెనని యత్నించి దండెపట్టుకొని పల్లకీ ఆపుతున్నాడు. ఇందులో A అనేమనిషి, D అనే మనిషికి చలన నివృత్తి తన శరీరబలమువల్ల కలగచేసినాడు గనుక A అనేమనిషి, D అనే మనిషిని బలవంతముచేసినవాడు అవుతున్నాడు; మరిన్ని A అనేమనిషి, ఒక నేరము జరిగించడముకొరకు D అనే మనిషియొక్క సమ్మతిలేకుండా ప్రయత్నపూర్వకముగా ఈ ప్రకారము జరిగించినాడు. కాబట్టి A అనేమనిషి, D అనేమనిషికి నేరముగల బలవంతము జరిగించినవాడు అవుతున్నాడు.

(d) D అనేమనిషి వీధెని వెళ్లుచూవుండగా A అనేమనిషి ప్రయత్నపూర్వకముగా అతన్ని యెరుసుకొనిపోతున్నాడు. ఇందులో A అనేమనిషి, తన స్వకీయమైన శరీరబలమువల్ల D అనే మనిషికి తగిలేటట్టు తన స్వకీయమయిన శరీరమునకు చలనము కలగచేసినాడు. గనుక అతడు ప్రయత్నపూర్వకముగా D అనే మనిషికి బలవంతము జరిగించినవాడు అవుతున్నాడు. మరిన్ని అందువల్ల D అనే మనిషికి కీడు, భయము, లేక వుపద్రవము కలగచెయ్యవలెనని యత్నించి, లేక కలగవచ్చునని యెరిగివుండి D అనే మనిషియొక్క సమ్మతిలేకుండా జరిగించివున్నపక్షమునకు అతడు, D అనే మనిషికి నేరముగల బలవంతము జరిగించినవాడు అవుతున్నాడు.

(e) A అనేమనిషి, ఒక రాయితీసి D అనే మనిషికి, లేక అతని బట్టలకు, లేక అతను పట్టుకొని వెళ్లుచూవుండే యేదోఒక వస్తువుకు తగలవలసినదని, లేక D నీళ్లమీద వెయ్యబడి ఆ నీళ్లు D అనే మనిషియొక్క బట్టలమీదగాని D అనేమనిషి

పట్టుకొని వెళ్లుతూవుండే యేదో ఒక వస్తువమీద గాని యెగరవలెనని యత్నించి, లేక యెరిగివుండి ఆరాయి వేస్తున్నాడు. ఇందులో రాయివెయ్యడమువల్ల D అనే మనిషికి గాని D అనే మనిషియొక్క బట్టలకుగాని యేదయినా వస్తువ తగిలేటట్టు సంభవించినపక్షమునకు A అనేమనిషి, D అనేమనిషికి బలవంతముచేసినవాడు అవుతున్నాడు; మరిన్ని అందువల్ల D అనే మనిషికి కీడు, భయము, లేక వుపద్రవము కలగచెయ్యవలెనని యత్నించి అతను ఆప్రకారము చేసినపక్షమునకు D అనే మనిషికి నేరముగల బలవంతము జరిగించినవాడు అవుతున్నాడు.

(f) A అనేమనిషి, ఒక స్త్రీయొక్క ముసుకు ప్రయత్నపూర్వకముగా లాగివేస్తున్నాడు. ఇందులో A అనేమనిషి, ఆమెకు ప్రయత్నపూర్వకముగా బలవంతము జరిగించినవాడు అవుతున్నాడు; మరిన్ని అతడు, అందువల్ల ఆమెకు కీడు, భయము, లేక వుపద్రవము కలగచెయ్యవలెనని యత్నించి, లేక యెరిగివుండి ఆమె సమ్మతిలేకుండా ఆప్రకారము జరిగించినపక్షమునకు అతను ఆమెకు నేరముగల బలవంతము జరిగించినవాడు అవుతున్నాడు.

(g) D అనేమనిషి స్నానముచేస్తూవున్నాడు. A అనేమనిషి, పొంగ కాగుతూవున్నట్టు తాను యెరిగివుండే వుదకము స్నానముచేసే తొట్టిలో పోస్తున్నాడు. ఇందులో A అనేమనిషి, తన స్వకీయమయిన శరీరబలమువల్ల ప్రయత్నపూర్వకముగా ఆ వుదకము D అనే మనిషియొక్క దేహమునకుగాని D అనేమనిషియొక్క స్పర్శేంద్రియమునకు హాని కలగచెయ్యతగ్గ యితర వుదకమునకుగాని తగిలేటట్టు పొంగ కాగుతూవుండే వుదకమునకు చలనము కలగచేస్తున్నాడు. గనుక A అనేమనిషి, D అనే మనిషికి ప్రయత్నపూర్వకముగా బలవంతము జరిగిస్తున్నాడు; మరిన్ని అతడు, అందువల్ల తాను D అనే మనిషికి కీడు, భయము, లేక వుపద్రవము జరిగించవలెనని వుద్దేశించి, లేక యెరిగివుండి D అనే మనిషియొక్క సమ్మతిలేకుండా యీ కార్యము చేసివున్నపక్షమునకు A అనేమనిషి, నేరముగల బలవంతము జరిగించినవాడు అవుతున్నాడు.

(h) A అనేమనిషి, D అనే మనిషియొక్క సమ్మతిలేకుండా D అనే మనిషిమీదికి యెగిరేటట్టు ఒక కుక్కను యెగకొలుపుతున్నాడు. ఇందులో A అనేమనిషి, D అనే మనిషికి కీడు, భయము, లేక వుపద్రవము జరిగించవలెనని యత్నించినపక్షమునకు అతడు D అనేమనిషికి నేరముగల బలవంతము జరిగించినవాడు అవుతున్నాడు.

351. హాజరుగావుండే యేమనిషి అయినా తనకు నేరముగల బలవంతము జరిగించబడుతున్నది అని యెంచుకోవలెననే యత్నముతో, లేక యెంచుకొంటాడని యెరిగివుండి యేదైనా సయిగ, లేక సన్నాహముచేసే యేమనిషి అయినా, దౌమ్మ్నాచేసినట్టు చెప్పబడుతున్నాడు.

దౌమ్మ్కి.

వివరణము.—వట్టిమాటలు దౌమ్మ్నా కానేరవు. అయితే ఒక మనిషి చెప్పేమాటలు, తన సయిగలు, లేక సన్నాహములు దౌమ్మ్నాకి వ్యాపించేభాగము సూచింపచెయ్యవచ్చును.

దృష్టాంతములు.

(a) A అనేమనిషి, తాను Z అనే మనిషిని కొట్టబోతున్నానని యెంచుకొనేలాగున చెయ్యవలెనని యత్నించి, లేక యెరిగివుండి Z అనే మనిషిమీదికి తన పిడికిలి కనపరుస్తున్నాడు. A అనేమనిషి, దౌమ్మ్కి జరిగించినవాడు అవుతున్నాడు.

(b) A అనేమనిషి, ఒక కుక్క Z అనే మనిషిమీద పడేటట్టు తాను చెయ్యబోతున్నానని Z అనేమనిషి యెంచుకొనేలాగున చెయ్యవలెనని యత్నించి, లేక యెంచుకోవచ్చునని యెరిగివుండి క్రూరమయిన ఒక కుక్కయొక్క మూతిచిక్కము వదిలించడమునకు ఆరంభిస్తున్నాడు. A అనేమనిషి, Z అనే మనిషిమీద దౌమ్మ్కి జరిగించినవాడు అవుతున్నాడు.

(c) A అనేమనిషి, Z అనే మనిషితోటి "నిన్ను కొట్టుతాను" అని చెప్పి ఒక కర్ర పుచ్చుకొంటున్నాడు. ఇందులో A అనేమనిషి చెప్పిన యీ వట్టిమాటలు యెంతమాత్రము దౌమ్మ్కికి వ్యాపించలేక పోయినప్పటికిన్ని ఆ కర్ర పుచ్చుకోవడమువల్ల కలిగినసయిగ దౌమ్మ్కికి వ్యాపించకపోయినప్పటికిన్ని ఆ మాటలవల్ల ఆ సయిగ దౌమ్మ్కి కావచ్చును.

352. అకస్మాత్తుగా సంభవించిన గొప్ప ఆగ్రహకారణము కలగచేసిన మనిషిమీద నయితేనేతప్ప, యే మనిషిమీదనైనా దౌమ్మ్నాచేసే, లేక అతనికి నేరముగల

గొప్ప ఆగ్రహకారణముమీద నయితేనే

తప్పు, దొమ్మీ లేక నేరముగల బలవంత మునుగురించి శిక్ష.

బలవంతము జరిగించే యేమనిషి అయినా, మూడు మాసములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని అయిదు వందల రూపాయీలకు వ్యాపించగూడిన జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షింపబడవలసినది.

వివరణము.—అకస్మాత్తుగా సంభవించే గొప్ప ఆగ్రహకారణము, యీ సెక్షనునుపట్టి ఒక నేరమునకు విధించబడ్డ శిక్షను మితపరచనేరదు, ఆసంగతులు యేవంటే—

ఆ ఆగ్రహకారణము అనేది, నేరము జరిగించడమునకు నిమిత్తముగా నేరస్థునివల్ల స్వేచ్ఛగా యేర్పాటుచెయ్యబడ్డపక్షమునకు, లేక కలగచెయ్యబడ్డపక్షమునకు, లేక

ఆ ఆగ్రహకారణము అనేది, న్యాయశాస్త్రమును అనుసరించిగాని పబ్లిక్ వుద్యోగస్థునియొక్క అధికారములు న్యాయశాస్త్రరీత్యా చెలాయించడమందు అట్టి పబ్లిక్ వుద్యోగస్థునివల్లగాని జరిగించబడ్డ దేనివల్లనయినా కలగచెయ్యబడ్డపక్షమునకు, లేక

ఆ ఆగ్రహకారణము అనేది, ఆత్మసంరక్షణనుగురించిన హక్కు న్యాయశాస్త్ర సమ్మతముగా చెలాయించడములో జరిగించబడ్డ దేనివల్లనయినా కలగచెయ్యబడ్డపక్షమునకు,

ఆ ఆగ్రహకారణము అనేది, నేరమును మితపరచడమునకు చాలినంత గొప్పదిగానున్ను అకస్మాత్తుగా సంభవించినదిగానున్ను వున్నదా లేదా అని నిర్ణయించడము సంగతియొక్క అంశముగా వుంటున్నది.

353. పబ్లిక్ వుద్యోగస్థుడయిన యేమనిషిమీదనయినా, అతడు తన వుద్యోగధర్మమునుపట్టి పని జరిపిస్తూవుండగా

పబ్లిక్ వుద్యోగస్థుడు తనపని జరిగించకుండానట్లు చేయుటకుగాను దొమ్మి లేక నేరముగల బలవంతము.

గాని అతడు తనవుద్యోగధర్మమునుపట్టి తనపని జరిగించకుండా ఆపవలెననే, లేక భయపరచవలెననే యత్నముతోగాని అతడు వుద్యోగధర్మమునుపట్టి తనపని న్యాయశాస్త్రసమ్మతముగా జరిగించడములో అతనివల్ల జరిగించబడ్డ, లేక జరిగించేలాగున యత్నించబడ్డ యేదయినా కార్యమునుగురించిగాని దొమ్మీచేసే, లేక నేరముగల బలవంతము జరిగించే యేమనిషి అయినా రెండుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

సిగ్గుచెరచవలెననే యత్నముతో స్త్రీమీద దొమ్మి చెయ్యడము, లేక నేరముగల బలవంతముజరిగించడము

354. సిగ్గుచెరచవలెనని యత్నించి, లేక చెరచవచ్చునని యెరిగివుండి యే స్త్రీమీదనైనా దొమ్మీచేసే, లేక నేరముగల బలవంతము జరిగించే యేమనిషి అయినా, రెండుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

గొప్ప ఆగ్రహకారణముమీద కాకుండా మనిషిక అమానుషము జరిగించవలెననే యత్నముతో దొమ్మి చెయ్యడము, లేక నేరముగల బలవంతము జరిగించడము.

355. అకస్మాత్తుగా ఒకమనిషివల్ల కలగచెయ్యబడ్డ గొప్ప ఆగ్రహకారణముమీదకాకుండాఅమానుషము జరిగించవలెనని యత్నించి యేమనిషిమీదనయినా దొమ్మీచేసే, లేక నేరముగల బలవంతముచేసే యేమనిషి అయినా, రెండుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

356. ఒకమనిషి ధరించుకొనివుండే, లేక తీసుకొని వెళ్లుతూ వుండే యేదయినా సొమ్ము దోచుకొనిపోవలెనని యత్నించడములో ఆ మనిషిమీద దొమ్మీ చేసే, లేక నేరముగల బలవంతముజరిగించే యేమనిషి అయినా, రెండుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

ఒకమనిషి తీసుకొని పోతూవుండే సొమ్ము దోచుకొనిపోవలెనని యత్నించడములో దొమ్మి చెయ్యడము, లేక నేరముగల బలవంతముజరిగించడము

357. ఒకమనిషిని అక్రమముగా ఖయిదుచెయ్యవలెనని యత్నించడములో ఆ మనిషిమీద దొమ్మీ చేసే, లేక నేరముగల బలవంతము జరిగించే యేమనిషి అయినా, ఒక సంవత్సరమునకు వ్యాపించగూడిన కాలము వరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని వెయ్యిరూపాయీలకు వ్యాపించగూడిన జుల్మానా వల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

ఒకమనిషిని అక్రమముగా ఖయిదు చెయ్యవలెనని యత్నించడములో దొమ్మి చెయ్యడము, లేక నేరముగల బలవంతము జరిగించడము.

358. ఒక మనిషివల్ల అకస్మాత్తుగా కలగచెయ్యబడ్డ గొప్ప ఆగ్రహకారణముమీద ఆమనిషిపయిని దొమ్మీచేసే, లేక నేరముగల బలవంతము జరిగించే యేమనిషి అయినా, ఒకమాసమునకు వ్యాపించగూడిన కాలము వరకు సాధారణపయిన ఖయిదువల్లగాని రెండువందల రూపాయీలకు వ్యాపించగూడిన జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

గొప్ప ఆగ్రహకారణముమీద దొమ్మి లేక నేరముగల బలవంతము.

వివరణము.—ఇంతకుముందటి సెక్షను, 352-వ సెక్షను లోబడివుండే వివరణమునకు లోబడివుంటున్నది.

మనుష్యులను దొంగిలుకొనిపోవడము, మనుష్యులను బలవంతముగా, లేక పుసలాయించి తీసుకొనిపోవడము, దాస్యము చేయించుకోవడము, లేక బలాత్కారముగా పనిచేయించడము, వీటినిగురించి.

మనుష్యులను దొంగిలుకొని పోవడము.

359. మనుష్యులను దొంగిలుకొనిపోవడము అనే నేరము, రెండు తరహాలుగా వుంటున్నది; మొదటిది, బ్రిటిష్ ఇండియాలోనుంచి మనుష్యులను దొంగిలుకొనిపోవడము, రెండోది, న్యాయశాస్త్రసమ్మతిమైన సంరక్షణలోనుంచి మనుష్యులను దొంగిలుకొనిపోవడము.

బ్రిటిష్ ఇండియాలోనుంచి మనుష్యులను దొంగిలుకొనిపోవడము.

360. ఒక మనిషియొక్క సమ్మతిలేకుండా, లేక అతనితరఫున సమ్మతించడమునకు న్యాయశాస్త్రమువల్ల అధికారము కలిగివుండేవారియొక్క సమ్మతిలేకుండా బ్రిటిష్ ఇండియా తాలూకు సరిహద్దులవెలపలికి యెవరినైనా తీసుకొనిపొయ్యే యేమనిషి అయినా, బ్రిటిష్ ఇండియాలోనుంచి ఆ మనిషిని దొంగిలించుకొనిపోయినట్టు చెప్పబడివున్నాడు.

న్యాయశాస్త్రసమ్మతమయిన సంరక్షణలోనుంచి మనుష్యులను దొంగిలుకొనిపోవడము.

361. మొగమనిషి అయినపక్షమునకు పధ్నాలుగుసంవత్సరముల గ్రాడుకు లోపుగావుండే, లేక ఆడమనిషి అయినపక్షమునకు పదహారు సంవత్సరముల గ్రాడుకు లోపుగావుండే యేమనిషి అయినా మనోదార్ఢ్యము లేని యేమనిషిని అయినా, అట్టి గ్రాడు తక్కువ మనిషియొక్క, లేక మనోదార్ఢ్యములేని మనిషియొక్క న్యాయశాస్త్రసమ్మతమయిన సంరక్షకుల సంరక్షణలోనుంచి వారిసమ్మతిలేకుండా తీసుకొనివెళ్లే, లేక ఆశపెట్టి తీసుకొనివెళ్లే యేమనిషి అయినా, న్యాయశాస్త్రసమ్మతమయిన సంరక్షణలోనుంచి అట్టిగ్రాడు తక్కువమనిషిని, లేక మనోదార్ఢ్యములేని మనిషిని దొంగిలుకొనిపోయినట్టు చెప్పబడివున్నాడు.

వివరణము.—ఈ సెక్షనులో "న్యాయశాస్త్ర సమ్మతమయిన సంరక్షకులు" అనే మాటలు, అట్టి యీడుతక్కువమనిషిని, లేక యితరమనిషిని తమపరముగా, లేక స్వాధీనమందు వుంచుకొనేలాగున న్యాయశాస్త్రమువల్ల అధికారము కలగచెయ్యబడ్డ యే మనుష్యులనయినా కలుపుకొంటున్నవి.

మినహాయింపు.—ఈ సెక్షను, దుర్నీతికరమయిన, లేక న్యాయశాస్త్రవిరోధమయిన వుద్దేశముతో జరిగించబడివుంటేనియెడల, అనౌరసమయిన పిల్లయొక్క తండ్రిగావుండేటట్టు కృత్రిమములేకుండా నమ్మే, లేక అట్టి పిల్లను న్యాయశాస్త్రసమ్మతముగా తనస్వాధీనమందు వుంచుకొనే హక్కు తనకు కలిగివున్నట్టు కృత్రిమములేకుండా నమ్మే యే మనిషి అయినా జరిగించేకార్యములకు వ్యాపించనేరదు.

362. ఏమనిషినయినా బలవంత పెట్టి, లేక యేవయినా మాయపద్ధతులు పన్నడమువల్ల యే స్థలములోనుంచి అయినా వెళ్లేలాగున ప్రేరేపించే యే మనిషి అయినా, ఆమనిషిని బలవంతముగా, లేక పుసలాయించి తీసుకొనిపోయినట్టు చెప్పబడివున్నాడు.

మనుష్యులను బలవంతముగా, లేక పుసలాయించి తీసుకొని పోవడము.

363. బ్రిటిష్ ఇండియాలోనుంచిగాని న్యాయశాస్త్రసమ్మతమయిన సంరక్షణలోనుంచిగాని యెవరినైనా దొంగిలుకొనివెళ్లే యేమనిషి అయినా, యేడుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్ల శిక్షించబడడమేగాకుండా జుల్మానాకు కూడా పాత్రుడు కావలసినది.

మనుష్యులను దొంగిలుకొని పోయినపత్తుమునకు శిక్ష.

364. ఒక మనిషి ఖూనీచెయ్యబడడమునకుగాను, లేక ఖూనీ చెయ్యబడడమును గురించిన అపాయమునకు లో

ఖూనీ చెయ్యడము నకుగాను మనుష్యులను దొంగిలుకొని పోవడము, లేక బలవంతముగా, లేక పుసలాయించి తీసుకొని పోవడము.

బరచబడడమునకుగాను యెవరినైనా దొంగిలుకొని పొయ్యే, లేక బలవంతముగా, లేక పుసలాయించి తీసుకొనిపొయ్యే యేమనిషి అయినా, యావజ్జీవము ద్వీపాంతర వాసమువల్లగాని పది సంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు కఠినమైన ఖైదువల్లగాని శిక్షించబడడమే గాకుండా జుల్మానాకు కూడా పాత్రుడు కావలసినది.

## దృష్టాంతములు.

(a) **A** అనేమనిషి, ఒక విగ్రహమునకు **Z** అనేమనిషి బలియివ్వబడవలెనని వుద్దేశించి, లేక బలియివ్వబడవచ్చునని యెరిగివుండి ఆ **Z** అనే మనిషిని బ్రిటిష్ ఇండియాలోనుంచి దొంగిలుకొనిపోతున్నాడు. **A** అనేమనిషి, ఈ సెక్షనులో నిర్ధారణ చెయ్యబడ్డ నేరము జరిగించినవాడు అవుతున్నాడు.

(b) **A** అనేమనిషి, **B** అనేమనిషి ఖూనీచెయ్యబడగలందులకయి ఆ **B** అనే మనిషిని అతని యింట్లోనుంచి బలవంతముగా తీసుకొని వెళ్లుతున్నాడు, లేక ఆశపెట్టి తీసుకొని వెళ్లుతున్నాడు. **A** అనేమనిషి, ఈ సెక్షనులో నిర్ధారణ చెయ్యబడ్డ నేరము జరిగించినవాడు అవుతున్నాడు.

మనిషిని రహస్యముగానున్ను అక్రమముగానున్ను ఖయిదు చెయ్యవలెననే యత్నముతో దొంగిలుకొని పోవడము, లేక బలవంతముగా లేక పుసలాయించి తీసుకొని పోవడము.

365. ఒక మనిషిని రహస్యముగానున్ను అక్రమముగానున్ను ఖయిదుచేయించవలెననే యత్నముతో ఆ మనిషిని దొంగిలుకొనిపొయ్యే, లేక బలవంతముగా, లేక పుసలాయించి తీసుకొనిపొయ్యే యేమనిషి అయినా, ఏడుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒక తరహా ఖయిదువల్ల శిక్షించబడడమే గాకుండా జుల్మానాకుకూడా పాత్రుడు కావలసినది.

వివాహము చేసుకోనేలాగున చెయ్యడము వగైరాలకోరకు ఒక స్త్రీని దొంగిలుకొని పోవడము, లేక బలవంతముగా, లేక పుసలాయించి తీసుకొని పోవడము.

366. ఒక స్త్రీయొక్క యిష్టమునకు విరోధముగా ఆమె వివాహము చేసుకొనేలాగున బలవంతిపెట్టబడవలెననే యత్నముతో, లేక బలవంతపెట్టబడవచ్చునని యెరిగివుండి, లేక శాస్త్రవిరుద్ధమైన సంభోగముకొరకు ఆమెను బలవంతపెట్టగలందులకు, లేక అందుకుగాను ఆమె ప్రేరేపించబడడమునకు, లేక అట్లా ఆమె బలవంతపెట్టబడవచ్చునని, లేక ప్రేరేపించబడవచ్చునని యెరిగివుండి యే స్త్రీని అయినా దొంగిలుకొనిపోయే, లేక బలవంతముగా లేక పుసలాయించి తీసుకొనిపొయ్యే యేమనిషి అయినా, పదిసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్ల శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడు కావలసినది.

బలమయినఘాత, లేక దాస్యవగైరాలకు ఒకమనిషిని లోపరచగలందులకై దొంగిలుకొనిపోవడము, లేక బలవంతముగా లేక పుసలాయించి తీసుకొనిపోవడము.

367. బలమైనఘాతకు, దాస్యమునకు, లేక యే మనిషియొక్క అయినా స్వభావసిద్ధముకాని కామమునకు లోబరచబడగలందులకు, లేక అట్లా లోబరచబడే అపాయము కలుగుతున్నది అని, లేక ఆప్రకారము లోబరచబడవచ్చునని యెరిగివుండి యేమనిషి అయినా దొంగిలుకొనిపొయ్యే, లేక బలవంతముగా లేక పుసలాయించి తీసుకొనిపొయ్యే యేమనిషి అయినా, పదిసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్ల శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడు కావలసినది.

368. ఏమనిషి అయినా, దొంగిలుకొనిపోబడ్డాడు, లేక బలవంతముగా లేక పుసలాయించి తీసుకొనిపోబడ్డాడు

దొంగిలుకొని పోబడ్డ లేక బలవంతముగా లేక పుసలాయించి తీసికొనిపోబడ్డ మనిషిని అక్రమముగా దాచడము, లేక ఖైదున వుంచడము.

అని యెరిగివుండి అతణ్ని అక్రమముగా దాచే, లేక ఖయిదునవుంచే యేమనిషి అయినా, అట్టి మనిషిని తాను దాచే, లేక ఖయిదునవుంచే యత్నముతోటి, యెరుకతోటి, లేక అభిప్రాయముతోటి తాను దొంగిలుకొనిపోయివున్న పక్షమునకు, లేక బలవంతముగా లేక పుసలాయించి తీసుకొనిపోయివున్న పక్షమునకు యేలాగో ఆలాగే శిక్షించబడవలసినది.

పదిసంవత్సరముల యీడుకు లోపుగా వుండే పిల్లయొక్క ఒంటి ఉన్న వానిని దొంగిలుకొని పోవలెననే యత్నముతోటి ఆ పిల్లను దొంగిలుకొనిపోవడము, లేక బలవంతముగా లేక పుసలాయించి తీసుకొనిపోవడము.

369. ఒంటను వుండే చరమైన సొమ్ము అయోగ్యముగా పుచ్చుకోవలెననే యత్నముతోటి పదిసంవత్సరముల యీడుకు తక్కువగావుండే యే పిల్లనైనా దొంగిలుకొనిపొయ్యే లేక బలవంతముగా లేక పుసలాయించి తీసుకొనిపొయ్యే యేమనిషి అయినా, యేడుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్ల శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడు కావలసినది.

ఏమనిషినిఅయినా, గులాముగా కొనుక్కోవడము, లేక యిచ్చివెయ్యడము.

370. ఏమనిషిని అయినా గులాముగా దిగుమతీచేసే, యెగుమతీచేసే, తీసుకొనిపొయ్యే, ఖరీదుచేసే, విక్రయించే లేక యిచ్చివేసే, లేక యేమనిషిని అయినా అతని సమ్మతికి విరోధముగా గులాముగా అంగీకరించే, పుచ్చుకొనే, లేక నిలిపివుంచుకొనే యేమనిషి అయినా, ఏడుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్ల శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడు కావలసినది.

371. వాడుకగా గులాములను దిగుమతీచేసే, ఎగుమతీచేసే, తీసుకొనిపొయ్యే, ఖరీదుచేసే, విక్రయించే, వర్తకముచేసే, లేక వ్యాపారముచేసే ఏమనిషిఅయినా, యావజ్జీవము ద్వీపాంతరవాసమువల్లగాని పదిసంవత్సరములకు మించని కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడు కావలసినది.

వాడుకగా గులాముల వ్యాపారము చెయ్యడము.

372. పదహారు సంవత్సరముల యీడుకు తక్కువగావుండే మనిషి లంజరికముకొరకుగాని న్యాయశాస్త్రవిరోధముగానున్న దుర్నీతికరముగానున్న వుండే యేదైనా కార్యముకొరకుగాని నిర్ణయించబడవలెననే, లేక వుపయోగపరచబడవలెననే యత్నముతోటి, లేక ఏదైనా అట్టి కార్యమందు నిర్ణయించబడవచ్చునని, లేక వుపయోగపరచబడవచ్చునని యెరిగివుండి అట్టి యీడుతక్కువ మనిషిని విక్రయించే, అద్దెకుయిచ్చే, లేక మరి ఒకతరహాగా యిచ్చివేసే యేమనిషి అయినా, పదిసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖైదువల్ల శిక్షించబడడమేగాకుండా జుల్మానాకు కూడా పాత్రుడు కావలసినది.

లంజరికము వగైరా కార్యములకొరకు యీడుతక్కువ మనిషివిక్రయించడము.

373. పదహారు సంవత్సరముల యీడుకు తక్కువగావుండే మనిషి లంజరికముకొరకుగాని న్యాయశాస్త్రవిరోధముగానున్న దుర్నీతికరముగానున్న వుండే ఏదైనా కార్యముకొరకుగాని నిర్ణయించబడవలెననే, లేక వుపయోగపరచబడవలెననే యత్నముతోటి, లేక అట్టి ఏకార్యమందైనా ఆ యీడుతక్కువ మనిషి నిర్ణయించబడవచ్చునని, లేక

లంజరికము వగైరా కార్యములకొరకు యీడుతక్కువ మనిషినిఖరీదుచెయ్యడము

వుపయోగపరచబడవచ్చునని యెరిగివుండి అట్టి యీడుతక్కువ మనిషిని ఖరీదుచేసే, అద్దెకుపుచ్చుకొనే, లేక మరిఒకతరహాను స్వాధీనము పొందే ఏమనిషి అయినా, పదిసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్ల శిక్షించబడడమే గాకుండా జుల్మానాకుకూడా పాత్రుడు కావలసినది.

న్యాయశాస్త్రవిరోధమైన బలాత్కారముమీద పనిచేయించడము.

374. ఒకమనిషి, అతనిసమ్మతికి విరోధముగా పనిచేసేలాగున అతణ్ని న్యాయశాస్త్రవిరోధముగా బలవంతిపెట్టే ఏమనిషి అయినా, ఒకసంవత్సరమునకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖైదువల్లగాని జుల్మానావల్లగాని ఈరెంటివల్లగాని శిక్షించబడవలసినది.

## స్త్రీని చెరపడమునుగురించి.

స్త్రీని చెరపడము.

375. ఇందులో యికముందు మినహాయించబడే సంగతిలో తప్ప, యీకింద సమూనాచెయ్యబడే ఐదుతరహాలలో ఏ తరహాగానైనా ఒక స్త్రీతోటి సంభోగము చేసే ఒకమనిషి, ,,స్త్రీని చెరిపినట్టు'' చెప్పబడివున్నాడు, అవి యేవంటే:—

మొదటిది.—ఆమె యిష్టమునకు విరోధముగా.

రెండవది.—ఆమె అంగీకారములేకుండా.

మూడవది.—మరణభయము, లేక ఘాత కలిగేలాగున జడుపు పుట్టించడమువల్ల ఆమె అంగీకారముపొంది అట్టి అంగీకారముమీద.

నాలుగోది.—తాను ఆమె పెనిమిటిని కాను అనిన్ని న్యాయశాస్త్రసమ్మతముగా వివాహముచెయ్యబడివుండే, లేక చెయ్యబడ్డట్టు ఆమె నమ్మే మరి ఒకపురుషుడు తాను అయినట్టు ఆమె నమ్మడము

వల్ల ఆమె అంగీకారబడ్డది అనిన్ని తాను యెరిగివున్నపక్షమునకు అట్టి అంగీకారముమీద.

అయిదోది.—ఆమె పన్నెండుసంవత్సరముల యీడుకు లోపుగా వుండేటప్పుడు ఆమె అంగీకారముమీద, లేక అంగీకారములేకుండా.

వివరణము.—స్త్రీని చెరపడము అనే నేరమునకు జరూరుగా వుండే సంభోగము యేర్పాటుచెయ్యడమునకు ప్రజాపతి అంతఃప్రవేశము చాలివుంటున్నది.

మినహాయింపు.—తనభార్య పన్నెండు సంవత్సరముల యీడుకు లోపుగావుండనియెడల ఆమెతో సంభోగము చెయ్యడమువల్ల స్త్రీని చెరపడము అనే నేరము కానేరదు.

స్త్రీని చెరపడము అనే నేరమునకుశిక్ష.

376. స్త్రీని చెరపడము అనే నేరము జరిగించే యేమనిషి అయినా, యావజ్జీవము ద్వీపాంతరవాసమువల్ల గాని పదిసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడు కావలసినది.

## స్వభావసిద్ధములుకాని నేరములనుగురించి.

స్వభావసిద్ధములు కాని నేరములు.

377. స్వభావసిద్ధమైన క్రమమునకు విరోధముగా పురుషుని తోటి, స్త్రీతోటి, లేక మృగముతోటి స్వేచ్ఛగా సంభోగముచేసే ఏమనిషి అయినా, యావజ్జీవము ద్వీపాంతరవాసమువల్లగాని పదిసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడు కావలసినది.

వివరణము.—ఈ సెక్షనులో వివరించబడివుండే నేరమునకు జరూరుగావుండే సంభోగము ఏర్పాటుచెయ్యడమునకు ప్రజాపతి అంతఃప్రవేశము చాలివుంటున్నది.

---

## 17-వ అధ్యాయము.

### ఆస్తివిషయములో జరిగించబడే నేరములనుగురించి.

### చోరీనిగురించి.

చోరీ.

378. ఏమనిషియొక్క అయినా చరాస్తి ఆ మనిషియొక్క అనుమతిలేకుండా అతని స్వాధీనములోనుంచి అయోగ్యముగా పుచ్చుకోవలెనని యత్నించి ఆ ఆస్తి ఆప్రకారము పుచ్చుకోవడమునకుగాను దానికి చలనము కలగ చేసే యేమనిషి అయినా, చోరీ జరిగించినట్టు చెప్పబడివున్నాడు.

వివరణము.—(1) ఒకవస్తువ భూమితో అంటివుండేవరకు చరాస్తికానందున చోరీ జరిగించడమునకు తగివుండనేరదు; అయితే అది భూమితో సంబంధములేకుండా విడతియ్యబడగానే చోరీ జరిగించడమునకు తగివుంటున్నది.

వివరణము.—(2) భూమితో సంబంధములేకుండా చెయ్యడమునకుగాను యేకార్యము జరిగించబడుతున్నదో అదేకార్యమువల్ల జరిగించబడ్డ చలనము, చోరీ కావచ్చును.

వివరణము.—(3) ఒకమనిషి, ఒకవస్తువకు చలనము కలగ చెయ్యడమువల్ల మాత్రమేగాకుండా దానికి చలనము కలగచెయ్యడమునకు ఆటంకముగావుండే దేన్ని అయినా తీసివెయ్యడమువల్లగాని దాన్ని మరి ఒకవస్తువతోటి సంబంధములేకుండా పొయ్యేలాగున విడతియ్యడమువల్లగాని ఆ వస్తువకు చలనము కలగచేసినట్టు చెప్పబడివున్నాడు.

వివరణము.—(4) ఏ సాధనములవల్లనైనా ఒక మృగమునకు చలనము కలిగేలాగున చేసే యేమనిషి అయినా, ఆ మృగమునకు

చలనము కలగచేసినట్టున్ను ఆప్రకారము కలగచెయ్యబడ్డ చలనమును పట్టి ఆ మృగమువల్ల చలనము కలగచెయ్యబడ్డ ప్రతివస్తువకు చలనము కలగచేసినట్టున్ను చెప్పబడివున్నాడు.

వివరణము.—(5). ఈ పైనిర్ధారణలో నమూదుచెయ్యబడ్డ అనుమతి అనేది, స్పష్టముగాగాని భావద్యోతకముగాగాని వుండడమే కాకుండా అట్టివస్తువ స్వాధీనమందు వుంచుకొనివుండే మనిషివల్లనైనా అనుమతియివ్వడమునకు స్పష్టముగాగాని భావద్యోతకముగాగాని అధికారము కలిగివుండే మనిషివల్లనైనా యివ్వబడవచ్చును.

## దృష్టాంతములు.

(a) **A** అనేమనిషి, **D** అనే మనిషియొక్క అనుమతిలేకుండా అతని స్వాధీనములోనుంచి అయోగ్యముగా తీసుకొనిపోవలెననే యత్నములో **D** అనే మనిషియొక్క భూమిలోవుండే ఒకచెట్టు కొట్టుతున్నాడు. ఇందులో **A** అనేమనిషి, ఆప్రకారము తీసుకొని పోగలందులకయి ఆ చెట్టు బడతియ్యగానే అతడు, చోరీ జరిగించినవాడు అవుతున్నాడు.

(b) **A** అనేమనిషి, తనజేబులో యెర వుంచుకొని **D** అనే మనిషియొక్క కుక్క తనతోకూడా వచ్చేటట్టు చేస్తున్నాడు. అంతలో **A** అనేమనిషి, **D** అనే మనిషియొక్క అనుమతిలేకుండా అతని స్వాధీనములోనుంచి ఆతని కుక్కను అయోగ్యముగా తీసుకొనిపోవలెనని యత్నించినపక్షమునకు **D** అనే మనిషియొక్క కుక్క **A** అనే మనిషితోకూడా వెంబడించి వెళ్లడమునకు ఆరంభించగానే **A** అనేమనిషి, చోరీ అనే నేరము చేసినవాడు అవుతున్నాడు.

(c) **A** అనే మనిషికి ఖజానాపెట్టె మోసుకొనిపొయ్యే ఒకయెద్దు యెదురుపడుతున్నది. అతడు అయోగ్యముగా ఆ ఖజానాపెట్టె పుచ్చుకొనేకొరకు ఆ యెద్దును ఒకదిక్కుకు తోలుతున్నాడు. ఎద్దు నడవడమునకు ఆరంభించగానే **A** అనేమనిషి, ఖజానాపెట్టె చోరీ చెయ్యడము అనే నేరము జరిగించినవాడు అవుతున్నాడు.

(d) **D** అనే మనిషియొక్క నవుకరుగావుండి **D** అనే మనిషివల్ల అతనితాలూకు వెండిపాత్రసామాను అప్పగింత చెయ్యబడ్డ **A** అనేమనిషి, **D** అనేమనిషియొక్క

అనుమతిలేకుండా ఆ పాత్రసామాను అయోగ్యముగా యెత్తుకొని పారిపోతున్నాడు. A అనేమనిషి, చోరీ జరిగించినవాడు అవుతున్నాడు.

(e) D అనేమనిషి ప్రయాణము వెళ్లబోయ్యేటప్పుడు సరుకులకొట్టు వుంచుకొనివుండే A అనేమనిషి పరముగా తాను తిరిగీవచ్చేవరకు దాచివుంచగలందులకు తన వెండిపాత్రసామాను అప్పగింతచేస్తున్నాడు. A అనేమనిషి, ఒక కంసాలవానివద్దికి ఆ పాత్రసామాను పట్టుకొనివెళ్లి విక్రయిస్తున్నాడు. ఇందులో పాత్రసామాను D అనే మనిషి స్వాధీనమందు లేనుగనుక అతని స్వాధీనములోనుంచి అది పుచ్చుకోవడమువకు వల్లలేదు. ఇందులో A అనేమనిషి, నేరముగల విశ్వాసఘాతకము జరిగించినాడేగాని చోరీ జరిగించలేదు.

(f) D అనేమనిషి వాసముచేస్తూవుండే యింట్లో ఒక మేజామీద D అనే మనిషి గాలూకు ఒక వుంగరము A అనే మనిషికి దొరికినది. ఆ వుంగరము D అనే మనిషి స్వాధీనములో వున్నది. A అనేమనిషి అయోగ్యముగా దాన్ని యెత్తుకొని పోయినపక్షమునకు అతడు, చోరీ అనే నేరము చేసినవాడు అవుతున్నాడు.

(g) A అనే మనిషికి యెవరిస్వాధీనములోనున్ను వుండకుండా రాజభాటను పడివుండే ఒక వుంగరము దొరుకుతున్నది. A అనేమనిషి, ఆ వుంగరము తీసుకొని పోవడమువల్ల ఒకవేళ నేరముగల అపహరణము జరిగించినవాడు అవుతున్నాడేగాని చోరీ జరిగించినవాడు కానేరడు.

(h) D అనే మనిషియింటిలో ఒక మేజాబల్లమీదవుండే D అనేమనిషి తాలూకు ఒక వుంగరము A అనే మనిషికి కనబడుతున్నది. అది అప్పుడే తీసుకొనిపోతే వెతుకుదురేమో అనేటటువంటిన్ని వెల్లడికావచ్చును అనేటటువంటిన్ని భయమువల్ల తక్షణమే ఆ వుంగరము తీసుకొనిపోకుండా అది యెప్పటికిన్ని కనపడగూడని స్థలమందు దాచి అది పోయినసంగతి మరుపువచ్చినతర్వాత తీసుకొనిపోయి విక్రయించుకోవలెనని యత్నిస్తున్నాడు. ఇందులో A అనేమనిషి, మొదట తాను ఆ వుంగరమునకు చలనము కలగచేసినకాలమందు చోరీ జరిగించినవాడు అవుతున్నాడు.

(i) A అనేమనిషి, ఆభరణములుచేసే D అనేమనిషివద్ద బాగుచెయ్యగలందులకయి తనగడియారము యిస్తున్నాడు. D అనేమనిషి దాన్ని తనదుకాణమునకు పట్టుకొని వెళ్లుతున్నాడు. A అనేమనిషి, ఆ D అనేమనిషి తాకట్టుకింద ఆ గడియారము న్యాయశాస్త్రసమ్మతముగా వుంచుకోతగ్గ బాకీ యేమిన్ని లేకుండావుండగా

బహిరంగముగా దుకానములోకి ప్రవేశించి D అనేమనిషి చేతిలోనుంచి తన గడియారము బలవంతముగా పుచ్చుకొని వెళ్లుతున్నాడు. ఇందులో A అనేమనిషి, నేరముగల ప్రవేశమున్ను దొమ్మిన్ని జరిగించివుండవచ్చునుగాని చోరీ జరిగించినవాడు కాలేదు. ఎందువల్లనంటే, అతను ఆ గడియారము అయోగ్యముగా తీసుకొనిపోలేదు.

(j) A అనేమనిషి, గడియారము బాగుచేసినందుకుగాను D అనే మనిషికి బాకీవుండి ఆ బాకీకింద తాకట్టుగా D అనేమనిషి ఆ గడియారము న్యాయశాస్త్ర సమ్మతముగా వుంచుకొనివుండగా A అనేమనిషి తన బాకీకి తాకట్టుగా ఆ వస్తువ D అనేమనిషి వుంచుకోకుండా చెయ్యవలెననే యత్నముతో D అనే మనిషివద్దనుంచి ఆ గడియారము తీసుకొనిపోయినయెడల చోరీ జరిగించినవాడు అవుతున్నాడు. ఎందువల్లనంటే, అతను అయోగ్యముగా దాన్ని తీసుకొనిపోయినవాడు అవుతున్నాడు.

(k) A అనేమనిషి, తన గడియారము D అనే మనిషివద్ద తాకట్టువుంచి ఆ గడియారముమీద తాను పుచ్చుకొన్న ఋణము చెల్లించకుండానున్ను D అనే మనిషి యొక్క అనుమతిలేకుండానున్ను D అనే మనిషివద్దనుంచి దాన్ని తీసుకొనిపోతున్నాడు. ఇందులో ఆ గడియారము తనసొమ్ముగావున్నప్పటికిన్ని అతను చోరీ జరిగించినవాడు అవుతున్నాడు. ఎందువల్లనంటే, అతను అయోగ్యముగా దాన్ని పుచ్చుకొన్నవాడు అవుతున్నాడు.

(l) A అనేమనిషి, D అనేమనిషి స్వాధీనములోవుండే ఒకవస్తువ అది తిరిగీ యిచ్చివెయ్యడమునుగురించి బహుమానముగా D అనే మనిషివద్ద తాను కొంత పయికము పుచ్చుకోవలెననే యత్నముతో అతని అనుమతిలేకుండా తీసుకొనిపోతున్నాడు. ఇందులో A అనేమనిషి, ఆ వస్తువ అయోగ్యముగా పుచ్చుకొంటున్నాడు గనుక చోరీ జరిగించినవాడు అవుతున్నాడు.

(m) A అనేమనిషి, D అనే మనిషితో స్నేహముగావుండి అతను లేనప్పుడు అతని పుస్తకములువుండే గదిలోకివెళ్ల తిరిగీ యిచ్చివెయ్యవలెననే వుద్దేశముతో చదవడమునకుగాను ఒక పుస్తకము అతని అనుమతి స్పష్టముగా పొందకుండా పుచ్చుకొంటున్నాడు. ఇందులో A అనేమనిషి D అనే మనిషియొక్క పుస్తకము చదివే లాగున భావద్యోతకమయిన అనుమతిపొందినట్టు యెంచుకొనివుండవచ్చును. A అనే మనిషి యిట్లా నమ్మివున్నయెడల అతను చోరీ జరిగించినవాడు కానేరడు.

(n) A అనేమనిషి, D అనేమనిషి భార్యను ముష్టి అడుగుతున్నాడు. ఆమె D అనే తన పెనిమిటివి అయినట్టు A అనేమనిషి యెరిగివుండే పయికము, అన్నము,

బట్టలు, యిస్తున్నది. ఇందులో ముష్టి పెట్టడమునకు D అనే మనిషియొక్క భార్యకు అధికారము యివ్వబడివున్నట్టు A అనేమనిషి యెంచుకొని వుండవచ్చును. ఇట్లా A అనేమనిషి నమ్మివున్నయెడల అతను, చోరీ జరిగించినవాడు కానేరడు.

(o) A అనేమనిషి, D అనే మనిషియొక్క భార్యకు జారపురుషుడుగా నున్నాడు. ఆమె పెనిమిటి అయిన D అనే మనిషివి అయినట్టున్ను ఆమె యివ్వడమునకు D అనే మనిషివల్ల అధికారము పొందనివి అయినట్టున్ను A అనేమనిషి యెరిగి వుండే విలువగల వస్తువులు ఆమె A అనే మనిషికి యిస్తున్నది. A అనేమనిషి ఆవస్తువులు అయోగ్యముగా పుచ్చుకొన్నపక్షమునకు అతను, చోరీ జరిగించినవాడు అవుతున్నాడు.

(p) A అనేమనిషి, D అనే మనిషి తాలూకు యేదయినా వస్తువ తనది అని కృత్రిమములేకుండా నమ్మి B అనే మనిషివద్దనుంచి ఆవస్తువ పట్టుకొని వెళ్లుతున్నాడు. ఇందులో A అనేమనిషి, ఆ వస్తువ అయోగ్యముగా పట్టుకొని వెళ్లినందున అతడు చోరీ జరిగించినవాడు కానేరడు.

చోరీని గురించి శిక్ష.

379. చోరీ జరిగించే యేమనిషి అయినా, మూడుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

వాసముచేసే యిల్లు వగైరాలలో చోరీ జరిగించడము.

380. మానవసంబంధమయిన వాసస్థలముగాగాని ఆస్తివుంచడముకొరకుగాని వాడబడే యేదయినా గృహము, డేరా, లేక నావ, వీటిలో చోరీ జరిగించే యేమనిషి అయినా, ఏడుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్ల శిక్షించబడడమే గాకుండా జుల్మానాకుకూడా పాత్రుడు కావలసినది.

తన ఖావందుయొక్క స్వాధీనమందు

381. క్లార్కుగాగాని నవుకరుగాగాని వుండి, లేక అట్టి వుద్యోగపుపనులు చేస్తూవుండి తన యజమానియొక్క లేక ఖావందుయొక్క స్వాధీనమందువుండే యేదైనా

వుండే సొమ్మును క్లార్కు, లేక నవుకరు చోరీ జరిగించడము.

సొమ్ము చోరీ జరిగించే యేమనిషి అయినా, ఏడు సంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్ల శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడు కావలసినది.

చోరీ జరిగించడమునుగురించి మరణము, ఘాత, లేక నిర్బంధము చెయ్యడముకొరకు సిద్ధముచేసినతర్వాత చోరీ జరిగించడము.

382. చోరీ జరిగించడముకొరకుగాని అట్టి చోరీ జరిగించిన తర్వాత తప్పించుకొని పారిపోవడముకొరకుగాని అట్టి చోరీవల్ల పొందబడ్డసొమ్ము వుంచుకోగలందులకుగాని ఏమనిషికి అయినా మరణము, ఘాత లేక నిర్బంధము చెయ్యడముకొరకు, లేక మరణము, ఘాత, లేక నిర్బంధము సంభవిస్తున్నది అని జడిపించడముకొరకు సిద్ధముచేసి చోరీ జరిగించే ఏమనిషి అయినా, పదిసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు కఠినమయిన ఖైదువల్ల శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడు కావలసినది.

## దృష్టాంతములు.

(a) A అనేమనిషి, Z అనేమనిషి స్వాధీనములో వుండేసొమ్ము చోరీ జరిగిస్తున్నాడు; పయిగా ఆ చోరీ జరిగించేకాలమందు బారుచెయ్యబడ్డ ఒక పిస్తోలు తాను వేసుకొన్న దుస్తులలో దాచి వుంచుకొంటున్నాడు. ఈ పిస్తోలు Z అనేమనిషి యెదిరించినపక్షమునను అతణ్ని ఘాత చెయ్యగలందులకుగాను వుద్దేశించి వుంచుతున్నాడు. A అనేమనిషి ఈ సెక్షనులో నిర్ధారణచెయ్యబడ్డ నేరము జరిగించినవాడు అవుతున్నాడు.

(b) A అనేమనిషి, జరుగుతూవుండే సంగతి కనుక్కొని Z అనేమనిషి యెదిరించినా, లేక A అనేమనిషిని పట్టుకోవలెనని యత్నించినా అతణ్ని అడ్డగలందులకయి అతనివద్ద తన తాలూకు కొందరు సహవాసగాండ్లను వుంచి Z అనే మనిషియొక్క జేబులోవుండే వస్తువులు దొంగిలిస్తున్నాడు. A అనేమనిషి, యీ సెక్షనులో నిర్ధారణచెయ్యబడ్డ నేరము జరించినవాడు అవుతున్నాడు.

## బలవంతముగా పుచ్చుకోవడమునుగురించి.

383. ఏమనిషికి అయినా అతనికిగాని మరి యే యితరమనిషికి అయినాగాని హాని కలుగుతున్నది అనే జడుపు ప్రయత్నపూర్వకముగా పుట్టించి అందువల్ల ఆప్రకారము జడుపు కలగచెయ్యబడ్డ మనిషి యేదయినా ఆస్తిగాని విలువగల సాధనముగాని విలువగల సాధనముగా చెయ్యబడగూడిన దస్కతు చెయ్యబడ్డ లేక మొహరుచెయ్యబడ్డ యేదయినా సాధనముగానీ యెవరికి అయినా అప్పగింతపెట్టేలాగున అయోగ్యముగా చేసే యేమనిషి అయినా, బలవంతముగా పుచ్చుకోవడము అనే నేరము జరిగించినవాడు అవుతున్నాడు.

బలవంతముగా పుచ్చుకోవడము.

### దృష్టాంతములు.

(a) A అనేమనిషి, Z అనే మనిషికి పయికము యివ్వనియెడల ఆ Z అనే మనిషినిగురించి అపఖ్యాతికరమయిన దూషణపత్రిక ప్రసిద్ధపరుస్తున్నానని జడిపిస్తున్నాడు. ఇందువల్ల అతడు Z అనేమనిషి తనకు పయికము యిచ్చేలాగున చేస్తున్నాడు. ఇందులో A అనేమనిషి, బలవంతముగా పుచ్చుకోవడము అనే నేరము జరిగించిన వాడు అవుతున్నాడు.

(b) A అనేమనిషి, తనకు Z అనేమనిషి, కొంత పయికము యిచ్చేలాగున ఒక పత్రముమీద దస్కతుచేసి యివ్వనియెడల Z అనే మనిషియొక్క పిల్లను అక్రమమయిన ఖయిదున వుంచుతున్నానని Z అనే మనిషిని జడిపిస్తున్నాడు. Z అనేమనిషి దస్కతుచేసి ఆ పత్రము అప్పగింతచేస్తున్నాడు. A అనేమనిషి బలవంతముగా పుచ్చుకోవడము అనే నేరము జరిగించినవాడు అవుతున్నాడు.

(c) A అనేమనిషి, B అనే మనిషికి కొంత పంట అప్పగింతపెట్టేలాగున బద్ధుడయ్యేటట్టు B అనేమనిషిపేరట ఒక పత్రము వ్రాసి దస్కతుచేసి అది వద్ద Z అనేమనిషి అప్పగించనియెడల Z అనేమనిషి తాలూకు (వ్యవసాయముచెయ్యబడ్డ) పొలము దున్నించివెయ్యడమునకు తన మనుష్యులను లాటీకఱ్ఱలతో పంపిస్తానని జడిపించి అందువల్ల Z అనేమనిషి ఆ పత్రముమీద దస్కతుచేసి అప్పగింతచేసేలాగున

చేస్తున్నాడు. A అనేమనిషి, బలవంతముగా పుచ్చుకోవడము అనే నేరము జరిగించిన వాడు అవుతున్నాడు.

(d) A అనేమనిషి, బలమయిన ఘాత కలగచేసేటట్టు Z అనే మనిషిని జడిపించి ఒక పట్టికాకితముమీద దస్కతుచేసి లేక మొహరుచేసి దాన్ని తనకు Z అనే మనిషి అప్పగింతపెట్టేలాగున అయోగ్యముగా చేస్తున్నాడు. Z అనేమనిషి, ఆ కాకితముమీద దస్కతు చేసి దాన్ని A అనే మనిషికి అప్పగింతచేస్తున్నాడు. ఇందులో ఆ ప్రకారము దస్కతుచెయ్యబడ్డ కాకితము విలువగల సాధనముగా చెయ్యబడవచ్చును గనుక A అనేమనిషి, బలవంతముగా పుచ్చుకోవడము అనే నేరము జరిగించినవాడు అవుతున్నాడు.

బలవంతముగా పుచ్చుకోవడము అనే నేరమును గురించి శిక్ష.

384. బలవంతముగా పుచ్చుకోవడము అనే నేరము జరిగించే ఏమనిషి అయినా, మూడుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని యీరెంటివల్లగాని శిక్షించబడవలసినది.

బలవంతముగా పుచ్చుకోవడము అనే నేరము జరిగించగలందులకు హానికలగచేసేటట్టు ఒక మనిషిని జడిపించడము.

385. బలవంతముగా పుచ్చుకోవడము అనే నేరము జరిగించగలందులకు హాని కలగచేసేటట్టు ఒకమనిషిని జడిపించే, లేక జడిపించడమునకు యత్నించే ఏమనిషి అయినా, రెండుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని యీరెంటివల్లగాని శిక్షించబడవలసినది.

మరణము, లేక బలమయినఘాత కలగజేసేటట్టు ఒక మని

386. ఏమనిషికి అయినా అతనికిగాని మరి యే యితర మనిషికి అయినాగాని మరణము లేక బలమయిన ఘాత కలగచేసేటట్టు జడుపుపుట్టించి, బలవంతముగాపుచ్చుకోవడము అనే నేరము జరిగించే ఏమనిషి అయినా,

షినిజడిపించడమువల్ల బలవంతముగాపుచ్చుకోవడము.

పదిసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదున్ను శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడు కావలసినది.

బలవంతముగా పుచ్చుకోవడము అనే నేరము జరిగించగలందులకయి మరణము, లేక బలమైన ఘాత కలగచేసేటట్టు ఒక మనిషిని జడిపించడము.

387. బలవంతముగా పుచ్చుకోవడము అనే నేరము జరిగించగలందులకయి యే మనిషికి అయినా అతనికిగాని యే యితరమనిషికి అయినాగాని మరణము, లేక బలమయినఘాత కలగచేసేటట్టు జడుపు పుట్టించే, లేక జడిపించవలెనని యత్నించే ఏమనిషి అయినా, ఏడుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలము వరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదున్ను శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడు కావలసినది.

మరణము, లేక ద్వీపాంతరవాసము వగైరాలువల్ల శిక్షించబడతగ్గ నేరము మోపేటట్టు జడిపించడమువల్ల బలవంతముగా పుచ్చుకోవడము.

388. మరణమువల్లగాని యావజ్జీవము ద్వీపాంతరవాసమువల్లగాని పదిసంవత్సరములకు వ్యాపించగూడిన ఖైదువల్లగాని శిక్షించబడతగ్గ ఏదయినా నేరము జరిగించినట్టు, లేక జరిగించవలెనని యత్నముచేసినట్టు, లేక అట్టి నేరము జరిగించేలాగున ఏమనిషిని అయినా ప్రేరేపించడమునకు యత్నముచేసినట్టు యేమనిషిమీదనయినా మరి యే యితర మనిషిమీదనయినా నేరము మోపబడుతున్నది అనే భయము పుట్టించి అతనివద్ద బలవంతముగా పుచ్చుకోవడము అనే నేరము జరిగించే యేమనిషి అయినా, పదిసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదున్ను శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా

పాత్రుడు కావలసినది; పయిగా అట్లా మోపబడుతున్నది అని జడిపించ బడ్డ నేరము ఈ స్మృతియొక్క 377-వ సెక్షనునుపట్టి శిక్షించబడతగ్గది అయివున్నపక్షమునకు యావజ్జీవము ద్వీపాంతరవాసమువల్ల శిక్షించబడ వచ్చును.

బలవంతముగా పుచ్చుకోవడము అనే నేరము జరిగించగలందులకై ఒక నేరము మోపేట్టు ఒకమనిషిని జడిపించడము.

389. బలవంతముగా పుచ్చుకోవడము అనే నేరము జరిగించ గలందులకై మరణమువల్లగాని యావజ్జీవము ద్వీపాంతరవాసమువల్లగాని పదిసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు ఖయిదువల్లగాని శిక్షించ బడతగ్గ ఒక నేరము జరిగించినట్టు, లేక జరిగించ వలెనని యత్నముచేసినట్టు యేమనిషిమీదనైనా మరి యే యితరమనిషిమీదనైనా నేరము మోపబడుతున్నది అనే జడుపు పుట్టించే లేక జడుపు పుట్టించవలెనని యత్నించే యేమనిషి అయినా పదిసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండు తరహాలలో ఒకతరహా ఖయిదువల్ల శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడు కావలసినది; పయిగా అట్లా మోపబడుతున్నది అని జడిపించబడ్డ నేరము ఈ స్మృతియొక్క 377-వ సెక్షనునుపట్టి శిక్షించబడతగ్గది అయినపక్షమునకు యావజ్జీవము ద్వీపాంతరవాసము వల్ల శిక్షించబడవచ్చును.

## దోపిడినిగురించిన్ని బందిపోటునుగురించిన్ని.

దోపిడి.

390. దోపిడి అనే నేరములో యెల్లప్పుడున్ను చోరీ, లేక బలవంతముగా పుచ్చుకోవడము అనే నేరము కలిసివుంటున్నది.

చోరీ జరిగించడముకొరకుగాని చోరీ జరిగించడమందుగాని చోరీవల్ల పొందబడ్డ సొమ్ము తీసుకొనిపోవడమందు, లేక

*చోరీ అనేది యెప్పుడు దోపిడి అవుతున్నది.*

తీసుకొనిపోవడమునకు యత్నించడమందుగాని నేరస్థుడు ఆకార్యములకొరకు యే మనిషికి అయినా మరణము, ఘాత, లేక అక్రమమయిన నిర్బంధము గాని మరణము, ఘాత, లేక అక్రమమైన నిర్బంధము తత్క్షణము కలుగుతున్నది అనే జడుపుగాని స్వేచ్ఛగా కలగచేసినపక్షమునకు, లేక కలగ చెయ్యవలెనని యత్నించిన పక్షమునకు అట్టి చోరీ, „దోపిడి" అవుతున్నది.

బలవంతముగా పుచ్చుకోవడము అనే నేరము జరిగించేమనిషి,

*బలవంతముగాపుచ్చుకోవడము అనే నేరము యెప్పుడు దోపిడి అవుతున్నది.*

ఆ నేరము జరిగించేకాలమందు జడిపించబడ్డ మనిషి యెదట హాజరుగావుండి ఆ మనిషికి, లేక యితర మనిషికి మరణము, ఘాత, లేక అక్రమమైన నిర్బంధము తత్క్షణము కలుగుతున్నది అనే జడుపు పుట్టించడమువల్ల బలవంతముగా పుచ్చుకోవడము అనే అట్టి నేరము జరిగించి ఆప్రకారము జడుపు పుట్టించడమువల్ల అట్లా జడిపించబడ్డమనిషి అప్పుడే ఆదేస్థలమందు బలవంతముగా పుచ్చుకోబడ్డ వస్తువ అప్పగింతపెట్టేలాగున చేసినపక్షమునకు బలవంతముగా పుచ్చుకోవడము అనే ఆ నేరము, „దోపిడి" అవుతున్నది.

వివరణము.—నేరస్థుడు, మరణము, ఘాత, లేక అక్రమమైన నిర్బంధము, తత్క్షణము కలుగుతున్నది అని ఆ మనిషికి జడుపు పుట్టించడమునకు చాలినంతమాత్రము సమీపమందు వున్నయెడల అతడు హాజరుగావున్నట్టు చెప్పబడుతున్నాడు.

## దృష్టాంతములు.

(a) **A** అనేమనిషి, **D** అనేమనిషి లేవకుండా పట్టుకొని **D** అనేమనిషియొక్క సమ్మతిలేకుండా అతని వస్త్రములలోవున్న పయికమున్ను నగలున్ను దగాగా పుచ్చు

కొంటున్నాడు. ఇందులో A అనేమనిషి, చోరీ జరిగించినవాడు అవుతున్నాడు. పయిగా ఆ చోరీ జరిగించడముకొరకు స్వేచ్ఛగా D అనే మనిషికి అక్రమమయిన నిర్బంధము కలగచేసినాడుగనుక A అనేమనిషి, దోపిడి చేసినవాడు అవుతున్నాడు.

(b) A అనేమనిషి, రాజభాటను D అనేమనిషికి యెదురుపడి ఒక పిస్తోలు కనపరచి D అనే మనిషివద్దవుండే పయికపుసంచి యివ్వవలసినది అని అడుగుతున్నాడు. అందువల్ల D అనేమనిషి, తన పయికపుసంచి యిచ్చివేస్తున్నాడు. ఇందులో A అనేమనిషి, తత్క్షణము ఘాతచేసేలాగున జడిపించడమువల్ల D అనే మనిషివద్ద పయికపుసంచి బలవంతముగా పుచ్చుకొన్నవాడు అవుతున్నాడు. మరిన్ని ఆ కాలమందు అతనియెదట హాజరుగా వున్నాడు గనుక A అనేమనిషి దోపిడి చేసినవాడు అవుతున్నాడు.

(c) A అనేమనిషి రాజభాటను D అనే మనిషికిన్ని D అనే మనిషియొక్క పిల్లకున్ను యెదురుపడుతున్నాడు. A అనేమనిషి, ఆ పిల్లను తీసుకొని D అనేమనిషి తన పయికపుసంచి యిచ్చివెయ్యనియెడల ఆ పిల్లను కొండచరియలో పడవేస్తానని జడిపిస్తున్నాడు. అందువల్ల D అనేమనిషి తన పయికపుసంచి యిచ్చివేస్తున్నాడు. ఇందులో A అనేమనిషి, అక్కడ హాజరుగావుండే పిల్లను తత్క్షణము ఘాత చేస్తానని D అనే మనిషిని జడిపించడమువల్ల అతనివద్దనుంచి పయికపుసంచి బలవంతముగా పుచ్చుకొన్నవాడు అవుతున్నాడు గనుక D అనేమనిషిని A అనేమనిషి దోపిడిచేసినవాడు అవుతున్నాడు.

(d) A అనేమనిషి, D అనేమనిషినిచూచి "నీపిల్ల మాదొంగలగుంపుయొక్క స్వాధీనమందు వున్నది; నీవు మాకు పదివేలరూపాయీలు యివ్వనియెడల దాన్ని చంపివేస్తాము" అనిచెప్పి అతనివద్ద సొమ్ము పుచ్చుకొంటున్నాడు. ఇది బలవంతముగా పుచ్చుకోవడము అనే నేరము గనుక, ఆ ప్రకారము శిక్షకు అర్హము అవుతున్నది; అయితే D అనేమనిషి, అతనిపిల్లకు తత్క్షణము మరణము కలుగుతున్నది అని జడిపించివుంటేనేతప్ప, అది దోపిడి కానేరదు.

బందిపోటు.

391. ఐదుమందు, లేక యెక్కువమంది మనుష్యులు కలిసి ఒక దోపిడి జరిగించే, లేక జరిగించవలెననే యత్నము చేసేటప్పుడున్ను దోపిడి కలిసి జరిగించే లేక జరిగించవలెనని యత్నముచేసే దరోబస్తుమంది మనుష్యులుయేమి

ఆ కాలమందు హాజరుగావుండి అట్లా జరిగించడమునకు, లేక యత్నము చెయ్యడమునకు కుమ్మకుచేసే మనుష్యులు యేమి కూడి అయిదుగురు లేక యెక్కువమంది అయినప్పుడున్ను అట్లా జరిగించే, యత్నముచేసే, లేక కుమ్మకుచేసే ప్రతిమనిషిన్ని, „బందిపోటు" జరిగించినట్టు చెప్ప బడివున్నాడు.

దోపిడిని గురించి శిక్ష.

392. దోపిడి జరిగించే యేమనిషి అయినా, పదిసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు కఠినమైన ఖయిదువల్ల శిక్షించబడడమేగాకుండా జుల్మానాకు కూడా పాత్రుడు కావలసినది; మరిన్ని ఆ దోపిడి సూర్యాస్తమయమునకు తర్వాత సూర్యోదయమునకులోపుగా రాజభాటను జరిగించబడ్డయెడల ఆ ఖయిదు పధ్నాలుగు సంవత్సరములకు వ్యాపింపచెయ్య బడవచ్చును.

దోపిడి జరిగించవలెనని ప్రయత్నము చెయ్యడము.

393. దోపిడి జరిగించవలెనని ప్రయత్నముచేసే యేమనిషి అయినా, ఏడుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు కఠినమైన ఖయిదువల్ల శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడు కావలసినది.

దోపిడి జరిగించడములో స్వేచ్ఛగా ఘాత కలగ చెయ్యడము.

394. ఒక దోపిడి జరిగించడమందు, లేక జరిగించవలెనని ప్రయత్నము చెయ్యడమందు యేమనిషి అయినా స్వేచ్ఛగా ఘాత కలగచేసిన పక్షమునకు అట్టిమనిషిన్ని అట్టి దోపిడి జరిగించడమందు, లేక జరిగించవలెనని ప్రయత్నము చెయ్యడమందు కలిసివుండే యితరమనిషిన్ని, యావజ్జీవము ద్వీపాంతరవాసమువల్లగాని పదిసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు కఠినమైన ఖయిదువల్లగాని శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడు కావలసినది.

395. బందిపోటు జరిగించే యేమనిషి అయినా, యావజ్జీవము ద్వీపాంతరవాసమువల్లగాని పది సంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు కఠినమైన ఖయిదువల్లగాని శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడు కావలసినది.

బందిపోటును గురించి శిక్ష.

396. బందిపోటు కలిసి జరిగించే ఐదుగురిలో, లేక ఎక్కువ మందిలో యేమనిషి అయినా ఆ ప్రకారము బందిపోటు జరిగించడములో ఖూనీ జరిగించినపక్షమునకు వారిలో ప్రతిమనిషిన్ని, మరణమువల్లగాని యావజ్జీవము ద్వీపాంతరవాసమువల్లగాని పదిసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు కఠినమైన ఖయిదువల్లగాని శిక్షించబడడమేగాకుండా జుల్మానాకు కూడా పాత్రుడు కావలసినది.

ఖూనీ సహితమైన బందిపోటు.

397. దోపిడిగాని బందిపోటుగాని జరిగించే కాలమందు నేరస్థుడు యేదైనా మరణకరమైన ఆయుధము వుపయోగపరచినా యేమనిషికి అయినా బలమైనఘాత కలగచేసినా యేమనిషికి అయినా మరణముగాని బలమైన ఘాతగాని కలగచెయ్యవలెనని యత్నించినా అట్టి నేరస్థునికి శిక్షవిధించవలసిన ఖయిదు, యేడుసంవత్సరములకన్నా తక్కువగా వుండకూడదు.

మరణము, లేక బలమైనఘాత జరిగించవలెననే యత్నముతోటి దోపిడి, లేక బందిపోటు జరిగించడము.

398. దోపిడిగాని బందిపోటుగాని జరిగించవలెనని ప్రయత్నము చేసేకాలమందు నేరస్థుడు యేదైనా మరణకరమైన ఆయుధము ధరించుకొని వున్నపక్షమునకు అట్టి నేరస్థునికి శిక్ష విధించవలసిన ఖయిదు, యేడుసంవత్సరములకన్నా తక్కువగా వుండకూడదు.

మరణకరమైన ఆయుధముధరించుకొని వుండి దోపిడి, లేక బందిపోటు జరిగించవలెనని ప్రయత్నము చెయ్యడము.

బందిపోటు జరిగించవలెనని సన్నాహము చెయ్యడము.

399. బందిపోటు జరిగించవలెనని యేదైనా సన్నాహము చేసే యేమనిషి అయినా పదిసంవత్సరములకు వ్యాపించ గూడిన కాలమువరకు కఠినమయిన ఖయిదువల్ల శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడుకావలసినది.

బందిపోటు వాండ్ల సమూహముతోకలిసి వున్న పక్షమునకుశిక్ష.

400. ఈ శాసనము అమలులోకి వచ్చినతర్వాత యే కాలమందైనా వాడుకగా బందిపోటు జరిగించడమును గురించి పోగయ్యే బందిపోటువాండ్ల సమూహముతోటి కలిసివుండే యేమనిషి అయినా, యావజ్జీవము ద్వీపాంతరవాసమువల్లగాని పదిసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు కఠినమైన ఖయిదువల్లగాని శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడు కావలసినది.

దొంగలసమూహముతో కలిసివున్నపక్షమునకు శిక్ష.

401. ఈ శాసనము అమలులోకి వచ్చినతర్వాత యేకాలమందైనా ఫాసీగర్లయొక్కగాని బందిపోటువాండ్లయొక్కగాని సమూహము కాకుండా చోరీ, లేక దోపిడి వాడుకగా జరిగించగలందులకై పోగయి సంచరించే లేక యితరమైన యేదైనా మూకతో కలిసివుండే యేమనిషి అయినా, యేడుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు కఠినమైన ఖయిదువల్ల శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడు కావలసినది.

బందిపోటు జరిగించగలందులకై పోగుకావడము.

402. ఈ శాసనము అమలులోకి వచ్చినతర్వాత యేకాలమందైనా బందిపోటు జరిగించగలందులకై పోగయిన ఐదుగురిలో లేక యెక్కువమందిలో ఒకడుగావుండే యేమనిషి అయినా, యేడుసంవత్సరములకు వ్యా

పించగూడిన కాలమువరకు కఠినమైన ఖయిదువల్ల శిక్షించబడడమే గాకుండా జుల్మానాకుకూడా పాత్రుడు కావలసినది.

సొమ్ము నేరముగల అపహరణము చెయ్యడమునుగురించి.

సొమ్ము అయోగ్యముగా అపహరణము చెయ్యడము.

403. ఏదైనా చరాస్తిగావుండే సొమ్ము అయోగ్యముగా అపహరించే, లేక తన స్వంతవుపయోగముకిందికి తెచ్చుకొనే యేమనిషి అయినా, రెండుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని ఈ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

దృష్టాంతములు.

(a) A అనేమనిషి, తాను పుచ్చుకొనేటప్పుడు ఆ ఆస్తి తనది అని కృత్రిమములేకుండా నమ్మి Z అనే మనిషివద్దవుండే అతని తాలూకు ఆస్తి పుచ్చుకొంటున్నాడు. A అనేమనిషి, చోరీనిగురించి నేరస్థుడు కానేరడు; అయితే A అనేమనిషి, తనపొరబాటు కనుక్కొన్నమీదట ఆ ఆస్తి తన స్వంత వుపయోగమునకుగాను అయోగ్యముగా అపహరించిన పక్షమునకు యీ సెక్షనులో చెప్పబడివుండే నేరము జరిగించినవాడు అవుతున్నాడు.

(b) A అనేమనిషి, Z అనే మనిషితో స్నేహముగావుండి Z అనేమనిషి యింటిలోలేనప్పుడు Z అనే మనిషియొక్క పుస్తకములువుండే గదిలోకివెళ్లి Z అనే మనిషియొక్క స్పష్టమయిన అనుమతిలేకుండా ఒక పుస్తకము తీసుకొని వెళ్లుతున్నాడు. ఇందులో A అనేమనిషి చదువుకోవడమునకుగాను ఆ పుస్తకము పట్టుకొని వెళ్లేలాగున భావమయ్యే Z అనే మనిషియొక్క అనుమతిని పొందినట్టు యెంచుకొనివున్న పక్షమునకు A అనేమనిషి, చోరీ జరిగించినవాడు కానేరడు. అయితే A అనేమనిషి, తన స్వంత వుపయోగమునకుగాను ఆ పుస్తకము అమ్ముకొన్నపక్షమునకు యీ సెక్షనులో చెప్పబడివుండే నేరము జరిగించినవాడు అవుతున్నాడు.

(c) ఒక గుర్రమునకు A అనేమనిషిన్ని B అనేమనిషిన్ని వుమ్మడిగా ఖావందులయియుండగా వుపయోగపరచుకోవలెననే యత్నముతోటి B అనేమనిషి, స్వా

ధీనములోనుంచి ఆ గుఱ్ఱమును A అనేమనిషి తీసుకొని వెళ్లుతున్నాడు. ఇంతలో A అనేమనిషి, ఆ గుఱ్ఱమును వుపయోగపరుచుకొనే హక్కు కలిగివున్నందున అతెడు అయోగ్యముగా దాన్ని అపహరించలేడు. అయితే A అనేమనిషి, ఆ గుఱ్ఱమును అమ్ముకొని అందువల్ల వచ్చిన దరోబస్తు పయికమున్ను తన స్వంత వుపయోగముకింధికి తెచ్చుకొన్న పక్షమునకు యీ సెక్షనులో చెప్పబడివుండే నేరము జరిగించినవాడు అవుతున్నాడు.

వివరణము.—(1) కొంతకాలమువరకు మాత్రము జరిగించబడ్డ అయోగ్యమయిన అపహరణము యీ సెక్షనులో వివరించబడ్డ అపహారణముగా వుంటున్నది.

దృష్టాంతము.

A అనేమనిషికి, పీకిని మరి యేమిన్ని వ్రాయకుండా దస్కతువెయ్యబడ్డ Z అనేమనిషి తాలూకు ఒక గవర్నమెంటుపత్రము దొరుకుతున్నది. A అనేమనిషి, ఆ పత్రము Z అనే మనిషిది అని యెరిగివుండి ముందు యెప్పుడో దాన్ని Z అనే మనిషికి యివ్వవలెనని యత్నించి తన ఋణమునకు తాకట్టుగాను ఒక సాహుకారువద్ద కొంతకాలమువరకు వుంచుతున్నాడు. A అనేమనిషి, యీ సెక్షనుప్రకారము ఒక నేరము జరిగించినవాడు అవుతున్నాడు.

వివరణము.—(2) ఏ యితరమనిషియొక్క అయినా స్వాధీనమందువుండని ఆస్తి కనుక్కొని అందులఖావందుకొరకు ఆ ఆస్తి సంరక్షించడమునకు, లేక అతనికి యిచ్చివెయ్యడమునకు పుచ్చుకొనే యేమనిషి అయినా దాన్ని అయోగ్యముగా పుచ్చుకోనూలేదు, అపహరించనూలేదు, గనుక నేరము జరిగించినవాడు కానేరడు; అయితే అందుల ఖావందును యెరిగివుండి, లేక ఆ ఖావందును కనుక్కొతగ్గ సాధనము కలిగివుండి, లేక ఆ ఖావందును కనుక్కొని ఆ సంగతి అతనికి తెలియచెయ్యగలందులకు న్యాయమయిన సాధనము వుపయోగపరచకుండానున్ను ఆ ఖావందు దావాచెయ్యడమునకు జరూరుగా వుండే న్యాయమయిన కాలమువరకు ఆ ఆస్తి వుంచకుండానున్ను

దాన్ని తనస్వంత ప్రయోజనముకొరకు వినియోగపరచినపక్షమునకు యీపైన నిర్ధారణచెయ్యబడ్డ నేరమునుగురించి అతను నేరస్థుడు అవుతున్నాడు.

న్యాయమయిన సాధనములు యేవి అయినదిన్ని న్యాయమైన కాలము ఏది ఐనదిన్ని ఆ యీసంగతులనుపట్టి పరిష్కరించవలసినది.

ఆ ఆస్తి కనుక్కొన్నమనిషి, అందుల ఖావందు యెవరు ఐనదిన్ని యెవరైనా ఒకానొకమనిషి అందుల ఖావందుగా వున్నాడా అనిన్ని యెరిగివుండవలసిన జరూరులేదు: దాన్ని వుపయోగపరుచుకొనేకాలమందు అది తన ఆస్తి అని నమ్మకపోవడముగాని అందుల వాస్తవమైన ఖావందు కనపడడు అని కృత్రిమములేకుండా నమ్మకపోవడముగాని చాలును.

## దృష్టాంతములు.

(a) A అనేమనిషికి అది యెవరిసొమ్ము అయినదిన్ని తెలియకుండా రాజభాటను ఒక రూపాయీ దొరుకుతున్నది. A అనేమనిషి, ఆ రూపాయీ యెత్తుకొంటున్నాడు. ఇందులో A అనేమనిషి, యీ సెక్షనులో వివరించబడ్డ నేరము జరిగించలేదు.

(b) ఒక బాంకినోటు మల్పావుచేసివుండే ఒక వుత్తరము A అనే మనిషికి రాజభాటను దొరుకుతున్నది. వుత్తరపు చిరునామావల్లనున్ను లోపలి సంగతివల్లనున్ను అది యెవరినోటు అయినదిన్ని తెలుసుకొని ఆనోటు తన స్వంతమునకు వినియోగపరుచుకొంటున్నాడు. అతడు యీ సెక్షనుప్రకారము నేరము జరిగించినవాడు అవుతున్నాడు.

(c) పట్టుకొనివచ్చేమనిషికి పయికము చెల్లించవలసిన ఒక హుండి A అనే మనిషికి దొరుకుతున్నది. ఆ హుండీ పోగొట్టుకొన్నమనిషి ఫలానివాడని యెంతమాత్రమూ తెలియదు. అయితే ఆ హుండీ వ్రాసిన మనిషియొక్క పేరు కనపడుతున్నది. ఆ మనిషి, యెవరికొరకు ఆ హుండీ వ్రాయబడ్డదో అట్టి మనిషిని తెలియచెయ్యగలడని A అనేమనిషి యెరుగును. A అనే మనిషి ఖావందును కనుక్కొవడమునకు

ప్రయత్నము చెయ్యకుండా ఆ హుండీ తాను స్వంతమునకు వినియోగపరుచుకొంటున్నాడు. అతడు, యీ సెక్షనుప్రకారము నేరము జరిగించినవాడు అవుతున్నాడు.

(d) పయికము వేసివుండే ఒక సంచి Z అనే మనిషివద్దనుంచి జారి పడిపోతూవుండగా A అనేమనిషి చూచినాడు. A అనేమనిషి, Z అనే మనిషికి తిరిగీ యిచ్చివెయ్యవలెననే యత్నముతోటీ దాన్ని పుచ్చుకొంటున్నాడుగాని ఆదరింవిలాను తన స్వంత వాడుకకొరకు వుపయోగపరుచుకొంటున్నాడు. A అనేమనిషి, యీ సెక్షనుప్రకారము నేరము జరిగించినవాడు అవుతున్నాడు.

(e) A అనేమనిషికి, అది యెవరిది అయినదిన్ని తెలియకుండా పయికము వుండే ఒక సంచి దొరుకుతున్నది; ఆదరింవిలాను అది Z అనేమనిషిది అని కనుక్కొని తన స్వంత వాడుకకొరకు వుపయోగపరుచుకొంటున్నాడు. A అనేమనిషి, యీ సెక్షనుప్రకారము నేరము జరిగించినవాడు అవుతున్నాడు.

(f) ఎవరిది అయినదిన్ని తెలియకుండావుండే విశేష కిమ్మతుగల ఒక వుంగరము, A అనేమనిషికి దొరుకుతున్నది. A అనేమనిషి, అంగుల భావంచు యెవరైనదిన్ని తెలుసుకోవలెనని ప్రయత్నము చెయ్యకుండా తత్క్షణమే విక్రయిస్తున్నాడు. A అనేమనిషి, యీ సెక్షనుప్రకారము నేరము జరిగించినవాడు అవుతున్నాడు.

చనిపోయిన మనిషివద్ద మరణకాలము దువుంటూవచ్చినఆస్తి అయోగ్యముగా అపహరించడము

404. ఒకమనిషి చనిపొయ్యేకాలమందు చనిపోయిన ఆమనిషి యొక్క స్వాధీనములో అతని ఆస్తి వుంటూవచ్చినది అనిన్ని ఆ తర్వాత స్వాధీనపరుచుకోవడమునకు న్యాయశాస్త్రసమ్మతముగా హక్కు కలిగివుండే యేమనిషియొక్క అయినా స్వాధీనములోకి రాలేదు అనిన్ని యెరిగివుండి అట్టి ఆస్తి అయోగ్యముగా అపహరించే, లేక తన స్వంత వుపయోగముకిందికి తెచ్చుకొనే యేమనిషి అయినా, మూడుసంవత్సరములకు వ్యాపించకూడిన కాలమునకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్ల శిక్షించబడవలసినదిగాకుండా జుల్మానాకు కూడా పాత్రుడు కావలసినది; నేరస్థుడు అట్టి మనిషియొక్క మరణకాలమందు అతనివద్ద గుమాస్తాగాగాని నవుకరుగాగాని వుంటూవచ్చిన యెడల ఆ ఖయిదు యేడుసంవత్సరములకు వ్యాపించవచ్చును.

### దృష్టాంతము.

Z అనేమనిషి, సామానున్ను పయికమున్ను కలిగివుండి చనిపోతున్నాడు. అతని నవుకరు అయిన A అనేమనిషి ఆ పయికము స్వాధీనపరచుకోవడము హక్కుగల యే మనిషియొక్క స్వాధీనములోకిన్ని ఆ పయికము రాకముందు అయోగ్యముగా అపహరిస్తున్నాడు. A అనేమనిషి, యీ సెక్షనులో నిర్ధారణ చెయ్యబడ్డ నేరము జరిగించినవాడు అవుతున్నాడు.

### నేరముగల విశ్వాసఘాతుకమునుగురించి.

405. ఏతరహాగానయినా ఆస్తిగాని ఆస్తిమీద అధికారముగాని తనపరము చెయ్యబడివుండి ఆ ఆస్తి అయోగ్యముగా అపహరించే, లేక తన స్వంత వుపయోగములోకి తెచ్చుకొనే, లేక తనపరము చెయ్యబడ్డ ఆ ఆస్తి వినియోగపరచవలసిన పద్ధతి యేర్పాటుచేసే న్యాయశాస్త్ర సంబంధమయిన నిబంధనలకుగాని తనపరము చెయ్యబడ్డ ఆ ఆస్తి వినియోగపరచడమును గురించి స్పష్టముగానయినా భావద్యోతకముగానయినా తాను చేసుకొన్న న్యాయశాస్త్ర సమ్మతమయిన ఖరారుకుగాని భంగము కలిగేటట్టు ఆ ఆస్తి అయోగ్యముగా వాడుకొనే, లేక వినియోగపరచే, లేక ఆప్రకారము యే యితరమనిషి అయినా జరిగించేలాగున బుద్ధిపూర్వకముగా ఒప్పే యేమనిషి అయినా, "నేరముగల విశ్వాసఘాతుకము" జరిగించినవాడు అవుతున్నాడు.

నేరముగల విశ్వాసఘాతుకము.

### దృష్టాంతములు.

(a) చనిపోయిన మనిషియొక్క మరణశాసనమునకు ఎగ్జిక్యూటరుగావుండే A అనేమనిషి, చనిపోయిన మనిషియొక్క ఆస్తి మరణశాసనప్రకారము పంచియిచ్చేలాగున తనకు నిర్ణయముకలగచేసే న్యాయశాస్త్రమును అయోగ్యముగా వుల్లంఘనచేసి అది తన స్వంత వుపయోగముకొరకు అపహరిస్తున్నాడు. ఇందులో A అనే మనిషి, నేరముగల విశ్వాసఘాతుకము జరిగించినవాడు అవుతున్నాడు.

(b) A అనేమనిషి, ఒక సరకులకొట్టు వుంచుకొనివుండేవాడు. D అనే మనిషి, ప్రయాణము వెళ్లుచూ A అనే మనిషియొక్క సరుకులకొట్టులో తనసామాను వుంచి అందుకుగాను ఒక నిర్ణయమైన మొబల్లగుగల అద్దె చెల్లించినతర్వాత తన సామాను వాపసుచెయ్యవలసినది అనే ఖరారుమీద ఆ సామాను A అనే మనిషిపరము చేస్తున్నాడు. A అనేమనిషి అయోగ్యముగా ఆ సామాను విక్రయిస్తున్నాడు. ఇందులో A అనేమనిషి, నేరముగల విశ్వాసఘాతుకము జరిగించినవాడు అవుతున్నాడు.

(c) కలకత్తాలో వాసముచేసే A అనేమనిషి, ఢిల్లీలో వాసముచేసే D అనే మనిషికి గుమాస్తాగా వున్నాడు. D అనే మనిషివల్ల A అనే మనిషివద్దికి పంపించబడ్డ దరోబస్తు పైకమున్ను D అనే మనిషియొక్క హుకుములప్రకారము A అనే మనిషివల్ల వినియోగపరచబడవలసినది అని A అనే మనిషికిన్ని D అనే మనిషికిన్ని స్పష్టమైన, లేక భావద్యోతకమయిన ఒక ఖరారువున్నది. D అనేమనిషి, కంపెనీ పత్రములు ఖరీదుచెయ్యవలసినది అని A అనే మనిషివద్దికి లక్షరూపాయీలు పంపుతున్నాడు. A అనేమనిషి ఆ నిర్ణయములు అయోగ్యముగా వుల్లంఘనచేసి తనస్వంత పనికిగాను ఆ పైకము వుపయోగపరుచుకొంటున్నాడు. A అనేమనిషి, నేరముగల విశ్వాసఘాతుకము జరిగించినవాడు అవుతున్నాడు.

(d) అయితే యింతకుముందటి దృష్టాంతములోవుండే A అనేమనిషి, అయోగ్యముగా కాకుండా బంగాళా బాంకీలో పాళ్లుకొనడమువల్ల D అనేమనిషికి అంతకంటె విశేషమయిన ఫాయిదా కలుగుతున్నది అని కృత్రిమములేకుండా నమ్మి D అనే మనిషియొక్క నిర్ణయములప్రకారము కంపెనీపత్రములు ఖరీదుచెయ్యకుండా D అనే మనిషికొరకు బంగాళా బాంకిలో పాళ్లు ఖరీదుచేసినపక్షమున యిందులో D అనే మనిషికి నష్టమువచ్చినప్పటికిన్ని ఆ నష్టమునుగురించి A అనే మనిషిమీద సివిల్ న్యాయ్యము తెచ్చే హక్కు కలిగివున్నప్పటికిన్ని A అనేమనిషి, అయోగ్యముగా ప్రవర్తించినందున నేరముగల విశ్వాసఘాతుకము జరిగించినవాడు కానేరడు.

(e) రివిన్యూ ఆఫీసరు అయిన A అనేమనిషి, సర్కారుపైకము తనపరముగా వుంచబడి తనవద్దవుండే అట్టి దరోబస్తు పైకమున్ను, న్యాయశాస్త్రమువల్ల విధించబడ్డ ప్రకారముగాని స్పష్టముగా, లేక భావద్యోతకముగా గవర్న్మెంటువారితోటి చేసుకోబడ్డ ఖరారువల్లగాని ఒకానొక ఖజానాలో చెల్లించడమునకు బద్ధుడయి వున్నాడు. A అనేమనిషి ఆ పైకము అయోగ్యముగా అపహరిస్తున్నాడు. ఇందులో A అనేమనిషి, నేరముగల విశ్వాసఘాతుకము జరిగించినవాడు అవుతున్నాడు.

(f) సామానులు పట్టించుకొని వెళ్లేవాడయిన A అనే మనిషివద్ద మెట్టను గాని నీటిమీదగాని తీసుకొనిపోబడేలాగున D అనేమనిషి తన ఆస్తి అప్పగింతచేసినాడు. A అనేమనిషి ఆ ఆస్తి అయోగ్యముగా దుర్వినియోగపరుస్తున్నాడు. ఇందులో A అనేమనిషి, నేరముగల విశ్వాసఘాతుకము జరిగించినవాడు అవుతున్నాడు.

నేరముగల విశ్వాసఘాతుకమునుగురించి శిక్ష.

406. నేరముగల విశ్వాసఘాతుకము జరిగించే యేమనిషి అయినా, మూడుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

సామానులు పట్టించుకొనివెళ్లే మనిషి వగైరాలవల్ల జరిగించబడ్డ నేరముగల విశ్వాస ఘాతుకము.

407. సామానులు పట్టించుకొనివెళ్లే మనిషిగాగాని సామానుల కొట్లు, లేక రేవులోకొట్లు వుంచుకొనివుండే మనిషిగాగాని ఆస్తి స్వాధీనపరచబడి అట్టి ఆస్తినిగురించి నేరముగల విశ్వాసఘాతుకముచేసే యేమనిషి అయినా, ఏడుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్ల శిక్షించబడడమే గాకుండా జుల్మానాకుకూడా పాత్రుడు కావలసినది.

క్లార్కువల్ల, లేక నవుకరువల్ల జరిగించబడ్డ నేరముగలవిశ్వాస ఘాతుకము.

408. క్లార్కుగాగాని నవుకరుగాగాని వుండి, లేక క్లార్కుగాగాని నవుకరుగాగాని నిర్ణయించబడి అట్టి వుద్యోగధర్మమునుపట్టి ఆస్తి, లేక ఆస్తిమీద అధికారము యే తరహాగానయినా తనపరము చెయ్యబడివుండి ఆ ఆస్తినిగురించి నేరముగల విశ్వాసఘాతుకము జరిగించే యేమనిషి అయినా, ఏడుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్ల శిక్షించబడడమేగాకుండా జుల్మానాకు కూడా పాత్రుడు కావలసినది.

పబ్లిక్ వుద్యోగస్థుడు, బాంకరు, వర్తకుడు, లేక ఏజెంటు, వీరివల్ల జరిగించబడ్డ నేరముగల విశ్వాస ఘాతుకము.

409. పబ్లిక్ వుద్యోగస్థుడుగాగాని బాంకరుగా, వర్తకుడుగా, ఫాక్టరు అనగా కొఠీ గుమాస్తాగా, తరగరిగా, వక్కీలుగా, లేక ఏజెంటుగాగాని యే తరహాగానయినా ఆస్తి, లేక ఆ స్తిమీాది అధికారము తనపరము చెయ్యబడివుండి ఆ ఆస్తినిగురించి నేరముగా విశ్వాస ఘాతుకము జరిగించే యేమనిషి అయినా, యావజ్జీవము ద్వీపాంతరవాసమువల్లగాని పదిసంవత్సరములకు వ్యాపించగూడినకాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడు కావలసినది.

దొంగిలించబడ్డ ఆస్తి పుచ్చుకోవడమునుగురించి.

దొంగిలించబడ్డ ఆస్తి.

410. చోరీవల్లగాని బలవంతముగా పుచ్చుకోవడమువల్లగాని దోపిడివల్లగాని ఒకరి స్వాధీనములోనుంచి మరియొకరి స్వాధీనములోకి వచ్చిన ఆస్తిన్ని నేరముగా అపహరణ చెయ్యబడ్డ ఆస్తిన్ని దేనివిషయములో నేరముగా విశ్వాసఘాతుకము జరిగించబడ్డదో ఆ ఆస్తిన్ని బ్రిటిష్ ఇండియాకు లోపుగానైనాసరే వెలపలనయినాసరే అట్లా మరియొకరి స్వాధీనముచెయ్యబడినా అపహరణగాని విశ్వాస ఘాతుకముగాని జరిగించబడినా "దొంగిలించిన ఆస్తి" అని చెప్పబడుతున్నవి. అయితే అట్టి ఆస్తి అంమం స్వాధీనమునకు న్యాయశాస్త్రసమ్మతమయిన హక్కుగల మనిషియొక్క స్వాధీనములోకి ఆవరింవిలాను వచ్చినసమయమునకు అది అప్పుడు దొంగిలించబడ్డ ఆస్తి అని యెంచబడనేరదు.

దొంగిలించబడ్డ ఆస్తి అయోగ్యముగా

411. దొంగిలించబడ్డ ఆస్తి అని తెలిసివుండి, లేక నమ్మడమునకు కారణము కలిగివుండి దొంగిలించబడ్డ యేదయినా ఆస్తి అయోగ్యముగా పుచ్చుకొనే, లేక

పుచ్చుకోవడము. వుంచుకొనే యేమనిషి అయినా, మూడుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

412. బందిపోటు జరిగించడమువల్ల పొందబడ్డట్టు యెరిగివుండే, లేక నమ్మడమునకు కారణము కలిగివుండే దొంగిలించబడ్డ ఆస్తి అయోగ్యముగా పుచ్చుకొనే, లేక వుంచుకొనే, లేక దొంగిలించబడ్డట్టు తాను యెరిగివుండే, లేక నమ్మడమునకు కారణము కలిగివుండే ఆస్తి బందిపోటుగుంపుతోటి యిలాకాకలిగివున్నట్టు, లేక అంతకుపూర్వము యిలాకా కలిగివుంటూవుండినట్టు తాను యెరిగివుండే, లేక నమ్మడమునకు కారణముకలిగివుండే ఒక మనిషివద్దినుంచి అయోగ్యముగా పుచ్చుకొనే యేమనిషి అయినా, యావజ్జీవము ద్వీపాంతరవాసమువల్లగాని పదిసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు కఠినమయిన ఖయిదువల్లగాని శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడు కావలసినది.

బందిపోటుజరిగించడములో దొంగిలించబడ్డ ఆస్తి అయోగ్యముగా పుచ్చుకోవడము.

413. దొంగిలించబడ్డది అని తాను యెరిగివుండే, లేక నమ్మడమునకు కారణము కలిగివుండే ఆస్తి వాడుకగా పుచ్చుకొనే, లేక వ్యాపారముజరిగించే యేమనిషి అయినా, యావజ్జీవము ద్వీపాంతరవాసమువల్లగాని పదిసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడు కావలసినది.

దొంగిలించబడ్డఆస్తితోటి వాడుకగా వ్యాపారము చెయ్యడము.

414. దొంగిలించబడ్డట్టు తాను యెరిగివుండే, లేక నమ్మడమునకు కారణము కలిగివుండే యేదయినా ఆస్తి దా

దొంగిలించబడ్డఆస్తి దాచడములో కుమ్మకు చెయ్యడము.

చడమునకుగాని విక్రయించడమునకుగాని వినియోగపరచడమునకుగాని స్వేచ్ఛగా కుమ్మకుచేసే ఏమనిషి అయినా, మూడుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమునరకు రెండుతెరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

## దగానుగురించి.

దగా చెయ్యడము.

115. ఏమనిషి అయినా వంచించడమువల్ల ఆ ప్రకారము వంచించబడ్డమనిషి యేదైనా ఆస్తి యేమనిషికి అయినా అప్పగింతచేసేలాగునగాని యేదయినా ఆస్తి యేమనిషి అయినా వుంచుకొనేటట్టు ఒప్పేలాగునగాని దగాగా, లేక అయోగ్యముగాచేసే, లేక ఆప్రకారము వంచించబడ్డ మనిషి అట్లా వంచించబడి వుండనియెడల జరిగించకపొయ్యే, లేక జరిగించేటటువంటిన్ని ఆ మనిషియొక్క శరీరమునకుగాని మనస్సుకుగాని ప్రఖ్యాతికిగాని ఆస్తికిగాని నష్టము, లేక హాని కలుగచేసేటటువంటిన్ని కలుగచేస్యకూడినటువంటిన్ని యేదయినా కార్యము, లేక లోపము జరిగించేలాగున, లేక జరిగించక పొయ్యేలాగున ప్రయత్నపూర్వకముగాచేసే యేమనిషి యినా, "దగా" చేసినట్టు చెప్పబడివున్నాడు.

వివరణము.—జరిగించబడ్డ సంగతులను అయోగ్యముగా దాచడము అనేది యీ సెక్షనుయొక్క అర్థమందు దగాగా వుండియున్నది.

## దృష్టాంతములు.

(a) **A** అనేమనిషి, సివిల్ సర్వీసులోవున్నట్టు అవాస్తవముగా చెప్పి బుద్ధిపూర్వకముగా **D** అనేమనిషిని వంచించి అందువల్ల తాను పయికము చెల్లించకుండా పోవలెననుకొన్న సరుకులు అరువుగా తనకు **D** అనేమనిషి యిచ్చేటట్లు అయోగ్యముగా చేస్తున్నాడు. ఇందులో **A** అనేమనిషి, దగాచేసినవాడు అవుతున్నాడు.

(b) A అనేమనిషి, ఒకవస్తువమీద తప్పుముద్రవేసి ప్రసిద్ధుఁడయిన ఒకానొక మనిషివల్ల ఆ వస్తువ చెయ్యఁబడ్డది అని D అనేమనిషి నమ్మేటట్టు బుద్ధిపూర్వకముగా వంచించి అందువల్ల ఆ వస్తువ D అనేమనిషి ఖరీదుచేసేలాగుననున్ను పయికము చెల్లించేలాగుననున్ను అయోగ్యముగా చేస్తున్నాడు. ఇందులో A అనేమనిషి, దగా చేసినవాఁడు అవుతున్నాడు.

(c) A అనేమనిషి, ఒక వస్తువకు దగా నమూనా D అనేమనిషికి కనపరచి ఆ వస్తువ నమూనాతోటి సమానముగావున్నట్టు D అనేమనిషి నమ్మేలాగున బుద్ధిపూర్వకముగా వంచించడమువల్ల ఆ వస్తువ D అనేమనిషి ఖరీదుచేసి పయికము చెల్లించేలాగున అయోగ్యముగా చేస్తున్నాడు. ఇందులో A అనేమనిషి, దగాచేసినవాఁడు అవుతున్నాడు.

(d) A అనేమనిషి, ఒక వస్తువకు తనశాలూకు పైకములేకుండా వుండేటటువంటిన్ని హుండీ తిప్పేసెయ్యఁబడుతున్నది అని తాను యెరిగివుండేటటువంటిన్ని ఒక సాహుకారుమీద హుండీయివ్వడమువల్ల D అనేమనిషిని బుద్ధిపూర్వకముగా వంచించి అందువల్ల ఆ వస్తువకు పయికము యివ్వకుండా యెగకొట్టవలెనని యత్నించి D అనేమనిషి ఆ వస్తువ అప్పగింతచేసేలాగున అయోగ్యముగా చేస్తున్నాడు. ఇందులో A అనేమనిషి, దగాచేసినవాఁడు అవుతున్నాడు.

(e) A అనేమనిషి, వజ్రములుకావు అని తాను యెరిగివుండేవాటిని వజ్రములు అని తాకట్టు వుంచడమువల్ల బుద్ధిపూర్వకముగా D అనేమనిషిని వంచించి అందువల్ల D అనేమనిషి పయికము బదులు యిచ్చేలాగున అయోగ్యముగా చేస్తున్నాడు. ఇందులో A అనేమనిషి, దగాచేసినవాఁడు అవుతున్నాడు.

(f) A అనేమనిషి, తనకు D అనేమనిషి బదులుయిచ్చే పయికము తిరిగి చెల్లించవలెనని తనకు తాత్పర్యమువున్నట్టు D అనేమనిషి నమ్మేలాగున బుద్ధిపూర్వకముగా వంచించి అందువల్ల D అనేమనిషి తనకు పయికము ఋణము యిచ్చేలాగున అయోగ్యముగా చేస్తున్నాడు. A అనేమనిషి అది మళ్లీ చెల్లించవలెననే యత్నము కలిగి వుండలేదు. ఇందులో A అనేమనిషి, దగాచేసినవాఁడు అవుతున్నాడు.

(g) A అనేమనిషి, తాను అప్పగించచెయ్యవలెననే తాత్పర్యము లేకుండా వుండే కొంత నీలికొట్టు D అనేమనిషికి అప్పగింతచెయ్యవలెననే తాత్పర్యము తనకు కలిగివున్నట్టు D అనేమనిషి నమ్మేలాగున బుద్ధిపూర్వకముగా వంచించి అందువల్ల ఆ ప్రకారము అప్పగింతపెట్టుతాఁడు అనే నమ్మకముమీద D అనేమనిషి పయికము

బయానా యిచ్చేలాగున అయోగ్యముగా చేస్తున్నాడు. A అనేమనిషి, దగాచేసిన వాడు అవుతున్నాడు; అయితే A అనేమనిషి, పయికము పుచ్చుకోనేకాలమందు నీలి రొట్టు అప్పగింతచెయ్యవలెనని యత్నించి ఆ తర్వాత జడ్జికి భంగముకలగచేసి అప్ప గింతచెయ్యకపోయినయెడల అతడు దగా చెయ్యలేదుగాని జడ్జికి భంగము కలగ చెయ్యడమునుగురించి ఒక సివిల్ వ్యాజ్యమునకు మాత్రము పాత్రుడు అవుతున్నాడు.

(h) A అనేమనిషి, D అనే మనిషితోటి తాను చేసుకొన్నటువంటిన్ని తాను పూర్తిచెయ్యకుండా వుండేటటువంటిన్ని జడ్జీ తాలూకు తనభాగము తాను పూర్తిచేసినట్టు D అనేమనిషి నమ్మేలాగున బుద్ధిపూర్వకముగా వంచించి అందువల్ల D అనేమనిషి పయికము చెల్లించేలాగున అయోగ్యముగా చేస్తున్నాడు. A అనే మనిషి, దగాచేసినవాడు అవుతున్నాడు.

(i) A అనేమనిషి, ఒక భూస్తితి B అనేమనిషికి విక్రయించి దాన్ని అతని పరము చేస్తున్నాడు. A అనేమనిషి ఆట్టి విక్రయమువల్ల ఆ భూస్థితినిగురించి తనకు హక్కులేదు అని యెరిగివుండి అంతకుముందు B అనేమనిషికి తాను విక్రయించి స్వా ధీనపరచిన సంగతి తెలియచెయ్యకుండా దాన్ని D అనేమనిషికి విక్రయించిగాని తా కట్టువుంచిగాని D అనేమనిషివద్దినుంచి విక్రయముయొక్కగాని తాకట్టుయొక్కగాని పయికము పుచ్చుకొంటున్నాడు. A అనేమనిషి, దగాచేసినవాడు అవుతున్నాడు.

416. ఒకమనిషి, తాను మరియొకమనిషిగా వున్నట్టు మిష పెట్టడమువల్లగాని యెరిగివుండి ఒకమనిషికి బదలాగా మరియొకమనిషిని ప్రత్యామ్నాయపరచడము వల్లగాని తాను, లేక మరియొకమనిషి వాస్తవముగా వున్నంతకంటె యితరమనిషిగావున్నట్టు చెప్పడమువల్లగాని "మిషపెట్ట డమువల్ల దగాచేసినవాడు అయినట్టు" చెప్పబడివున్నాడు.

మరియొకమనిషిగా వున్నట్టు మిషపెట్టడమువల్ల దగాచెయ్యడము.

వివరణము.—తాను యెవరుగావున్నట్టు మిషపెట్టినాడో ఆ మనిషి వాస్తవమయిన మనిషిగావున్నాసరే వుండకపోయినాసరే అందువల్ల బాధకము లేదు.

దృష్టాంతములు.

(a) A అనేమనిషి, అదేపేరుగల ఒకానొక భాగ్యవంతుడైన సాహుకారుగా

వుండేటట్టు మిష పెట్టడమువల్ల దగాచేస్తున్నాడు. ఇందులో A అనేమనిషి మిష పెట్టడమువల్ల దగాచేసినవాడు అవుతున్నాడు.

(b) A అనేమనిషి, చనిపోయిన B అనేమనిషిగా తాను వున్నట్టు మిష పెట్టడమువల్ల దగాచేస్తున్నాడు. యిందులో A అనేమనిషి, మిష పెట్టడమువల్ల దగాచేసినవాడు అవుతున్నాడు.

దగా చేసినపక్షమునకు శిక్ష.

417. దగాచేసే యేమనిషి అయినా, ఒకసంవత్సరమునకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

ఎవరియొక్క హక్కు సంరక్షించడమునకు నేరస్థుడు బద్ధుడయి వుంటున్నాడో అటువంటి మనిషికి అక్రమమైననష్టముసంభవిస్తున్నది అని యెరిగివుండి దగాచెయ్యడము.

418. ఏకార్యమునుగురించి దగాజరిగించబడ్డదో ఆ కార్యములో న్యాయశాస్త్రమువల్లగాని న్యాయశాస్త్రసమ్మతమయిన జడ్జీవల్లగాని హక్కును సంరక్షించడమునకు తాను బద్ధుడయివుండే ఒకమనిషికి అక్రమమయిన నష్టము సంభవిస్తున్నది అని యెరిగివుండి దగాచేసే యేమనిషి అయినా, మూడుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

మరియొకమనిషిగా వున్నట్టు మిష పెట్టడమువల్ల దగాచేసినపక్షమునకు శిక్ష.

419. మరియొకమనిషిగావున్నట్టు మిష పెట్టడమువల్ల దగాచేసే ఏమనిషి అయినా, మూడుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

420. వంచించబడ్డమనిషి మరి ఏమనిషికి అయినా యేదయినా ఆస్తి అప్పగింతచేసేలాగునగాని ఒక విలువగల సాధ

దగాచేసి ఆస్తి అప్పగింత పెట్టేలాగున అయోగ్యముగా చెయ్యడము.

నము, లేక దస్కతుచెయ్యబడ్డ, లేక మొహరుచెయ్యబడ్డ విలువగలసాధనముగా చెయ్యడమునకు తగివుండే యేదయినా వస్తువ పూరాగా, లేక కొంత భాగము ప్రవాసేలాగున, సవరించేలాగున, లేక నశింపచేసేలాగునగాని దగావల్ల అయోగ్యముగాచేసే ఏమనిషి అయినా, ఏడుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్ల శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడు కావలసినది.

ఆస్తివిషయములో దగా సాధనములనుగురించిన్ని ఆస్తి దగాగా వినియోగపరచడమును గురించిన్ని.

ఋణము యిచ్చిన వారికి పంచిపెట్టకుండా చెయ్యగలందులకయి ఆస్తి అయోగ్యముగా, లేక దగాగా తీసికొనిపోవడము, లేక దాచడము.

421. తనకు ఋణము యిచ్చినవారికిగాని మరి యే యితరమనిషికి అయినా ఋణము యిచ్చినవారికిగాని న్యాయశాస్త్రప్రకారము ఆస్తిపంచిపెట్టబడకుండా చెయ్యవలెనని యత్నించి, లేక అందువల్ల తాను అట్లా చెయ్యవచ్చునని యెరిగివుండి ఏదయినా ఆస్తి తగిన ప్రతిఫద్ధా చేకుండా అయోగ్యముగా, లేక దగాగా తీసుకొనిపొయ్యే, దాచే, లేక ఏమనిషికయినా అప్పగించే, లేక ఏమనిషిపరమయినాచేసే లేక పరముచేయించే ఏమనిషి అయినా, రెండుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

ఋణము ఋణప్రదాతలకు చెందకుండే

422. తనకు, లేక యితరమనిషికి బాకీవుండే ఏదయినా ఋణము, లేక దావా తన ఋణముకింద గాని అట్టి యితరమనిషియొక్క ఋణముకిందగాని చెల్లుగా న్యాయ

లాగున అయోగ్యము గా లేక దగాగా అప్పుచేయడము.

శాస్త్రప్రకారము చెందకుండా అయోగ్యముగా, లేక దగాగాచేసే ఏమనిషి అయినా, రెండుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

ప్రతిపద్దానుగురించి తప్పుసంగతి నమూదు చెయ్యబడివుండే మరియొకరిపరము చెయ్యడమునుగురించిన సాధనము అయోగ్యముగా, లేక దగాగా వ్రాసియివ్వడము.

423. ఏదయినా ఆస్తి, లేక అందులోహక్కు మరియొకరిపరము చేసేలాగున, లేక ఏదయినా ఖర్చుకు లోబరచేలాగున అర్థమయ్యేటటువంటిన్ని అట్లా మరియొకరిపరము చెయ్యడమునకుగాను, లేక ఖర్చుకుగాను ప్రతిపద్దాను గురించిగాని యెవరియొక్క వాడుకకోరకు, లేక ప్రయోజనముకొరకు అనుకూలించేలాగున అది యత్నించబడ్డదో అట్టి మనిషిని, లేక మనుష్యులనుగురించిగాని ఏదయినా తప్పుసంగతి నమూదుచెయ్యబడ్డటువంటిన్ని యేదయినా సాధనము, లేక దస్తావేజు అయోగ్యముగాగాని దగాగాగాని దస్కతుచేసే, వ్రాసియిచ్చే, లేక షరీఖు అయ్యే ఏమనిషి అయినా, రెండుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

ఆస్తి అయోగ్యముగా, లేక దగాగా తీసుకొనిపోవడము, లేక దాచడము.

424. తనయొక్కగాని యే యితరమనిషియొక్క అయినాగాని ఏదయినా ఆస్తి అయోగ్యముగా, లేక దగాగా దాచే, లేక తీసుకొనిపొయ్యే, లేక అది దాచడమందుగాని తీసుకొనిపోవడమందుగాని అయోగ్యముగా, లేక దగాగా కుమ్మకుచేసే, లేక అతను బాధ్యత కలిగివుండే ఏదయినా దావా లేక హక్కు

అయోగ్యముగా విడదలచేసే ఏమనిషి అయినా, రెండుసంవత్సరము లకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడ వలసినది.

## కీడునుగురించి.

425. లోకులకుగాని యేమనిషికి అయినాగాని అక్రమమయిన నష్టము, లేక లోటు కలగచెయ్యవలెననే యత్నము తోటి, లేక తాను కలగచెయ్యవచ్చునని యెరిగివుండి ఏదయినా ఆస్తిని నశింపుగాని ఏదయినా ఆస్తిలో, లేక అందుల స్థితిలో దానికిమ్నతుగాని వుపయోగముగాని నశింపచేసేలాగున, లేక తక్కువచేసేలాగున, లేక దానికి హానికలిగేటట్లుచేసేలాగున ఏదయినా మార్పుగాని కలగచేసే ఏమనిషి అయినా, "కీడు" చేసినవాడు అవుతున్నాడు.

కీడు.

వివరణము.—(1) నేరస్థుడు, హానికలగచెయ్యబడ్డ లేక నశింప చెయ్యబడ్డ ఆస్తియొక్క ఖావందుకు, నష్టము, లేక లోటు కలగచెయ్య వలెనని వుద్దేశించడము కీడునుగురించిన నేరమునకు ముఖ్యముకాదు. అది ఆమనిషిదిగావున్నాసరే వుండకపోయినాసరే, యే ఆస్తికి అయినా హాని కలగచెయ్యడమువల్ల ఏమనిషికి అయినా నష్టము కలగచెయ్య వలెనని యత్నించినపక్షమునకు, లేక కలగవచ్చునని యెరిగివున్నపక్షము నకు అదే చాలును.

వివరణము.—(2) ఒకకార్యము జరిగించే మనిషికిగాని ఆమనిషి కిన్ని యితరులకున్ను సమష్టిగాగాని సంబంధించే యేదయినా ఆస్తికి హానికలగచేసేకార్యమువల్ల కీడుచెయ్యబడవచ్చును.

## దృష్టాంతములు.

(a) A అనేమనిషి, D అనేమనిషికి అక్రమమయిన నష్టము కలగచెయ్యవలెనని యత్నించి D అనేమనిషి తాలూకు విలువగల ఒకపత్రము స్వేచ్ఛగా తగలబెట్టుతున్నాడు. A అనేమనిషి, కీడుచేసినవాడు అవుతున్నాడు.

(b) A అనేమనిషి, D అనేమనిషికి అక్రమమయిన నష్టము కలగచెయ్యవలెనని యత్నించి D అనేమనిషి తాలూకు మంచుగడ్డలు వుంచివుండే యింటిలోకి నీరు వచ్చేటట్టుచేసి అందువల్ల ఆ మంచుగడ్డలు కరిగిపొయ్యేటట్టు చేస్తున్నాడు. A అనేమనిషి, కీడుచేసినవాడు అవుతున్నాడు.

(c) A అనేమనిషి, D అనేమనిషికి నష్టము కలగచెయ్యవలెనని యత్నించి D అనేమనిషి తాలూకు ఒకవుంగరము స్వేచ్ఛగా నదిలో పారవేస్తున్నాడు. A అనేమనిషి, కీడుచేసినవాడు అవుతున్నాడు.

(d) A అనేమనిషి, D అనేమనిషికి తాను బాకీవుండే ఋణమునకు చెల్లుగా తన ఆస్తి జప్తుచెయ్యబడుతున్నది అని తెలుసుకొని అందువల్ల D అనే మనిషియొక్క ఋణమునకు చెల్లుకాకుండా చెయ్యవలెనన్ని D అనేమనిషికి నష్టము కలగచెయ్యవలెనన్ని యత్నించి ఆ ఆస్తి నశింపచేస్తున్నాడు. A అనేమనిషి, కీడుచేసినవాడు అవుతున్నాడు.

(e) A అనేమనిషి, ఒకవాడకు ఇన్‌ష్యూరెన్స్ చేయించుకొని ఆ ఇన్‌ష్యూరెన్స్ చేసినవారికి నష్టము కలగచెయ్యవలెననే యత్నముతో ఆ వాడ మెరకపెట్టేలాగున స్వేచ్ఛగా చేస్తున్నాడు. A అనేమనిషి, కీడుచేసినవాడు అవుతున్నాడు.

(f) A అనేమనిషి, వాడ శాకట్టువుంచుకొని ఆ వాడమీద పయికము బదులుయిచ్చిన A అనేమనిషికి నష్టము కలగచెయ్యవలెనని యత్నించి ఆవాడ మెరకపెట్టేలాగున చేస్తున్నాడు. A అనేమనిషి, కీడుచేసినవాడు అవుతున్నాడు.

(g) A అనేమనిషి, D అనే మనిషితో ఒక గుఱ్ఱమును వుమ్మడిగా వుంచుకొనివుండి D అనేమనిషికి అక్రమమయిన నష్టము కలగచెయ్యవలెనని యత్నించి ఆ గుఱ్ఱమును కాల్చివేస్తున్నాడు. A అనేమనిషి, కీడుచేసినవాడు అవుతున్నాడు.

(h) A అనేమనిషి, D అనే మనిషియొక్క పంటకు నష్టము కలగచెయ్యవలెనని యత్నించిన్ని కలగవచ్చునని యెరిగివుండిన్ని D, అనేమనిషి తాలూకు పొలము

లోకి పశువులు ప్రవేశించేలాగున చేస్తున్నాడు. A అనేమనిషి, కీడుచేసినవాడు అవుతున్నాడు.

కీడుకు శిక్ష.

426. కీడుచేసే యేమనిషి అయినా, మూడుమాసములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

50 రూపాయీల మొబల్లగుగల నష్టము కలగచేసే కీడు.

427. కీడు కలగచేసి అందువల్ల యాభై రూపాయీల, లేక అంతకంటె యెక్కువ మొబల్లగుగల నష్టము కలగచేసే యేమనిషి అయినా, రెండుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

10 రూపాయీల కిమ్మతుగల జంతువును చంపడమువల్ల లేక అంగహీనపరచడము వల్ల కలుగచేసే కీడు.

428. పదిరూపాయీల కిమ్మతుగల, లేక అంతకంటె యెక్కువ కిమ్మతుగల యేదయినా జంతువునుగాని జంతువులనుగాని చంపడమువల్ల, విషము పెట్టడమువల్ల, అంగహీనపరచడమువల్ల, లేక అనుపయుక్తముగా చెయ్యడమువల్ల కీడు కలగచేసే యేమనిషి అయినా, రెండుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

ఎంత కిమ్మతుగలవైనాసరే పశువులు వగయిరాలను, లేక

429. ఎంత కిమ్మతుగలది అయినాసరే యేదయినా యేనుగను, లొట్టిపిట్టను, గుర్రమును, వేసడమును, దున్నపోతును, లేక యెనుమును, వృషభమును, ఆవును, లేక యెద్దునుగాని యాభయిరూపాయీల కిమ్మతుగల

50 రూపాయీల కి మ్మతుగల యేదైనా జంతువును, చంపడ మువల్ల లేక అంగహీన పరచడమువల్ల కలుగ చేసే కీడు.

లేక అంతకంటె యెక్కువ కిమ్మతుగల యేదయినా యితర జంతువునుగాని చంపడమువల్ల, విషము పెట్ట డమువల్ల, అంగహీనపరచడమువల్ల, లేక అనుప యుక్తముగా చెయ్యడమువల్ల కీడుకలగచేసే యే మనిషి అయినా, అయిదుసంవత్సరములకు వ్యాపిం చగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

పయిర్లకు నీరుతె చ్చే కాలువలు వగై రా కట్టుపనులకు చె రుపుకలగచెయ్యడము వల్లగాని అక్రమము గా నీరు తిప్పివెయ్య డమువల్లగాని కలుగ జేసే కీడు.

430. వ్యవసాయపు పనులకుగాని మనుష్యులకు, లేక ఆస్తిగా వుండే జంతువులకు ఆహారముకొరకుగాని పానము కొరకుగాని పరిశుభ్రపరచడమును గురించిన పనుల కొరకుగాని యేదయినా కార్ఖానాపని జరిగించడము కొరకుగాని వుపయోగించే నీళ్లలో తక్కువ సంభ వించేలాగునచేసే, లేక తక్కువపడవచ్చునని తాను యెరిగివుండే యేదయినాకార్యము జరిగించడము వల్ల కీడు కలగచేసే యేమనిషి అయినా, అయిదు సంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒక తరహా ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించ బడవలసినది.

సర్వజనోపయోగ కరమయిన మార్గము నకు, వంతెనకు, నదికి లేక కాలువకు చెరుపు కలగ చెయ్యడమువల్ల కలగచేసే కీడు.

431. ఏదయినా సర్వజనోపయోగకరమయిన మార్గముగాని వంతెనగాని వాడలు వగయిరాలు సబురుచెయ్యతగ్గ నదిగాని స్వభావముగా కలిగినది అయినాసరే తవ్వ బడ్డది అయినాసరే వాడలు వగయిరాలు సబురుచె య్యతగ్గ కాలవగాని వెళ్లడమునకు తగనిదిగా, లేక ప్రయాణమునకుగాని ఆస్తి పట్టుకొని వెళ్లడమునకు

గాని తక్కువ భద్రముకలదిగాచేసే, లేక చెయ్యవచ్చునని యెరిగివుండే యేదైనా కార్యము జరిగించడమువల్ల కీడు కలగచేసే ఏమనిషి అయినా, అయిదుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

నష్టము కలగచేసే ప్రవాహము వచ్చేలాగునగాని సర్వజనోపయోగకరపుయిన కాలవకు నష్టముకలగచేసేలాగున అడ్డుగాని సంభవింప చెయ్యడమువల్ల కలగచేసే కీడు.

432. నష్టము కలగచేసే ప్రవాహము వచ్చేలాగునగాని సర్వజనోపయోగకరమైన కాలవకు చెరుపు, లేక నష్టము కలగచేసేలాగున అడ్డుగాని సంభవింపచేసే, లేక సంభవింపచెయ్యవచ్చునని యెరిగివుండే ఒక కార్యము చెయ్యడమువల్ల కీడుకలగచేసే ఏమనిషి అయినా, అయిదుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని ఈ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

-. వాడలకొరకు దీపమువుంచే లైట్ హౌస్ అనే యిల్లుగాని సముద్రపుగుర్తుగాని నశింప చెయ్యడమువల్ల, తీసి వెయ్యడమువల్ల, లేక తక్కువగా వుపయోగించేలాగున చెయ్యడమువల్ల కలగచేసే కీడు.

433. ఏదైనా లైట్‌హౌస్‌గాని సముద్రపు గుర్తుగా వుపయోగించబడే ఏదైనా యితర దీపముగాని నావికులకు దారి కనపడడముకొరకు గుర్తుగావుంచబడ్డ యేదైనా యితర సముద్రపు గుర్తుగాని బోయాకట్టెగాని యితరవస్తువగాని నశింపచెయ్యడమువల్ల, లేక తీసి వెయ్యడమువల్ల, లేక పైనచెప్పబడ్డ యేదైనా అట్టి లైట్‌హౌస్‌గాని సముద్రపు గుర్తుగాని బోయాకట్టెగాని యితరవస్తువగాని నావికులకు దారి కనపరచడముకొరకు తక్కువగా వుపయోగింపచేసే యేదైనా కార్యమువల్లకీడు కలగచేసే యేమనిషి అయినా,

ఏడుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాల లో ఒకతరహా ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని ఈ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

పబ్లిక్ వుద్యోగస్థులవల్ల వుంచబడ్డ భూమిహద్దులు కనపరచేగుర్తు నశింపచెయ్యడము, తీసివెయ్యడము, వగైరాలవల్ల కలగచేసే కీడు.

434. ఒక పబ్లిక్ వుద్యోగస్థునియొక్క అధికారమువల్ల వుంచబడ్డ భూమిహద్దులు కనపరచే యేదైనా గుర్తు నశింపచెయ్యడమువల్ల, లేక తీసివెయ్యడమువల్లగాని అట్టి భూమి హద్దులగుర్తు తక్కువగా వుపయోగించేలాగునచేసే యేదైనా కార్యమువల్లగాని కీడుకలగచేసే యేమనిషి అయినా, ఒకసంవత్సరమునకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని ఈ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

100 రూపాయీల లేక (వ్యవసాయపు పంట విషయములో) 10 రూపాయీల మొబల్లగుగల నష్టము కలగచెయ్యవలెననే యత్నముతో అగ్నివల్లగాని ధమీలున వేటుపుట్టే వస్తువవల్లగాని కలగచేసే కీడు.

435. ఏ ఆస్తికి అయినా వందరూపాయీల, లేక అంతకంటె యెక్కువ మొబల్లగుగల లేక (ఆ ఆస్తి వ్యవసాయసంబంధమైన పైరుగా వుండేయెడల) పదిరూపాయీల, లేక అంతకంటె యెక్కువ మొబల్లగుగల నష్టము కలగచెయ్యవలెనని యత్నించి, లేక నష్టము కలగవచ్చునని యెరిగివుండి అగ్నివల్లగాని ధమీలున వేటుపుట్టే వస్తువవల్లగాని కీడుకలగచేసే యేమనిషి అయినా, యేడుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్ల శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడు కావలసినది.

436. సాధారణముగా పూజాస్థలముగాగాని మనుష్యుల వాసస్థలముగాగాని ఆస్తివుంచే స్థలముగాగాని వాడబడే

ఇల్లు వగైరాలు నశింపచెయ్యవలెననే యత్నముతోటి అగ్నివల్లగాని ధమిలునవేటుపుట్టే వస్తువవల్లగాని కలగచేసేకీడు.

యేదైనా లోగిలి నశింపచెయ్యవలెనని యత్నించి, లేక నశించవచ్చునని యెరిగివుండి అగ్నివల్లగాని ధమీలున వేటుపుట్టే వస్తువవల్లగాని కీడు కలగ చేసే యేమనిషి అయినా, యావజ్జీవము ద్వీపాంతరవాసమువల్లగాని పదిసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడు కావలసినది.

తట్టు కలిగివుండే వాడనుగాని 20టన్నుల భారము మోసేదానినిగాని నశింపచెయ్యవలెననే, లేక భద్రములేకుండా చెయ్యవలెననే యత్నముతోటి కలగచెయ్యడము.

437. తండ, లేక తట్టు కలిగివుండే వాడగాని ఇరవైటన్నుల, లేక అంతకంటె యెక్కువ భారము మోసే వాడగాని నశింపచెయ్యవలెనని, లేక భద్రములేకుండా చెయ్యవలెనని యత్నించి, లేక ఆ వాడను అందువల్ల తాను నశింపచెయ్యవచ్చునని, లేక భద్రములేకుండా చెయ్యవచ్చునని యెరిగివుండి అట్టివాడకు కీడుకలగచేసే యేమనిషి అయినా పదిసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్ల శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడు కావలసినది.

అగ్నివల్లగాని ధమీలున వేటుపుట్టేవస్తువల్లగాని 437వ సెక్షనులో వివరించబడ్డ కేడు కలగచేసిన యెడల శిక్ష.

438. ఇంతకుముందు అవ్యవహితముగావుండే సెక్షనులో నమూదుచెయ్యబడ్డ కీడు అగ్నివల్లగాని ధమీలున వేటుపుట్టే వస్తువవల్లగాని కలగచేసే, లేక కలగ చెయ్యవలెనని యత్నించే యేమనిషి అయినా, యావజ్జీవము ద్వీపాంతరవాసమువల్లగాని పదిసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడు కావలసినది.

439. ఏదైనా వాడలోవుండే ఆస్తి చోరీ జరిగించవలెననిగాని అట్టి ఆస్తి అయోగ్యముగా అపహరించవలెనని గాని యత్నించి, లేక అట్టి ఆస్తి చోరీ జరిగించ బడవచ్చుననే, లేక అపహరించబడవచ్చుననే యత్నముతోటి ఆ వాడ మెరకతట్టేలాగునగాని దరి తట్టేలాగునగాని బుద్ధిపూర్వకముగాచేసే ఏమనిషి అయినా, పదిసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదు వల్ల శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడుకావలసినది.

చోరీ వగైరాలు జరిగించవలెననే యత్నముతో బుద్ధిపూర్వకముగా వాడ మెరకతట్టేలాగునగాని దరి తట్టేలాగునగాని చేసినయెడల శిక్ష.

440. ఏమనిషికి అయినా మరణము, ఘాత, లేక అక్రమమైన నిర్బంధముగాని మరణము, ఘాత, లేక అక్రమమైన నిర్బంధము సంభవిస్తున్నది అనే భయముగాని కలగచెయ్యడమునకుగాను సిద్ధముచేసి కీడు కలగచేసే యేమనిషి అయినా, అయిదుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్ల శిక్షించబడడమేగాకుండా జుల్మానాకు కూడా పాత్రుడు కావలసినది.

మరణముగాని ఘాతిగాని సంభవించడమునకు సిద్ధముచేసిన తర్వాత కీడు కలగచెయ్యడము.

## నేరముగల ప్రవేశమును గురించి.

441. మరియొక మనిషియొక్క స్వాధీనమందువుండే స్థితిలోకి నేరము జరిగించవలెననే యత్నముతో, లేక ఆ స్థితి స్వాధీనమందు వుంచుకొనివుండే మనిషిని జడిపించవలెననే, పరిభవపరచవలెననే, లేక ఆయాసపెట్టవలెననే యత్నముతో ప్రవేశించే,

నేరముగల ప్రవేశము.

లేక అట్టి స్థితిలోకి క్రమముగా ప్రవేశించి అట్టి మనిషిని జడిపించవలెననే, పరిభవపరచవలెననే, లేక ఆయాసపెట్టవలెననే యత్నముతో, లేక యేదైనా నేరము జరిగించవలెననే యత్నముతో అక్కడనే న్యాయశాస్త్రవిరోధముగా నిలిచివుండే యేమనిషి అయినా, నేరముగల ప్రవేశము జరిగించినట్టు చెప్పబడివున్నాడు.

ఇంటిలోకి అతిక్రమముగా ప్రవేశము చెయ్యడము.

442. మనుష్యుల వాసస్థలముగా వాడబడే యేదైనా లోగిలి, డేరా, లేక వాడ. వీటిలోకిగాని పూజాస్థలముగా, లేక ఆస్తి వుంచడమునుగురించినస్థలముగా వాడబడే యేదైనా గృహములోకిగాని ప్రవేశించడమువల్ల, లేక అక్కడనే నిలిచివుండడమువల్ల నేరముగల ప్రవేశము జరిగించే యేమనిషి అయినా, ఇంట్లోకి అతిక్రమముగా ప్రవేశము జరిగించినట్టు చెప్పబడివున్నాడు.

వివరణము.—నేరముగల ప్రవేశము జరిగించేమనిషియొక్క దేహము తాలూకు యేదైనాభాగమును ప్రవేశపెట్టడము అనేది, ఇంట్లోకి అతిక్రమముగా ప్రవేశము అనేనేరమును యేర్పాటుచెయ్యడమునకు చాలిన ప్రవేశముగా వుంటున్నది.

రహస్యముగా యింట్లోకి అతిక్రమముగా ప్రవేశము జరిగించడము.

443. అతిక్రమముగా ప్రవేశించివుండే మనిషిని ప్రవేశము జరిగించబడ్డ లోగిట్లోనుంచి, డేరాలోనుంచి, లేక వాడలోనుంచి వెలపలికి పంపడమునకు, లేక వెళ్లగొట్టడమునకు హక్కుగలమనిషికి తెలియకుండా అట్లా యింట్లోకి అతిక్రమముగా జరిగించబడ్డ ప్రవేశమును దాచడమునకు జాగ్రతకలగచేసుకొని ఇంట్లోకి అతిక్రమముగా ప్రవేశము జరిగించే యేమనిషి అయినా రహస్యముగా యింట్లోకి అతిక్రమముగా ప్రవేశము జరిగించినట్టు చెప్పబడివున్నాడు.

రాత్రివేళ రహస్యముగా ఇంటిలోకిఅతిక్రమముగా ప్రవేశము జరిగించడము.

444. సూర్యాస్తమయమునకు తర్వాతనున్న సూర్యోదయమునకు ముందున్న రహస్యముగా ఇంట్లోకి అతిక్రమముగా ప్రవేశము జరిగించే యేమనిషి అయినా, ,,రాత్రివేళ రహస్యముగా ఇంట్లోకి అతిక్రమముగా ప్రవేశము'' జరిగించినట్టు చెప్పబడుతున్నాడు.

తలుపులు వగైరాలు బద్దలుకొట్టి యింట్లోకి జొరబడడము.

445. ఇంట్లోకి ప్రవేశము జరిగించే యేమనిషి అయినా, యిందులో యికముందు నమూదుచెయ్యబడివుండే ఆరు తరహాలలో ఒకతరహాను యింటిలోకి, లేక యింటిలో యేదైనా భాగములోకి ప్రవేశించినపక్షమునకు, లేక ఒక నేరము జరిగించడముకొరకు ఆ యింటిలో, లేక అందులో యేదైనా భాగమందువుండి, లేక అందులో ఒక నేరము జరిగించి అట్టి ఆరుతరహాలలో యేతరహాగానైనా ఆ యిల్లుగాని అందులో యేదైనా భాగముగాని వదిలిపెట్టి వెలపలికి వెళ్లిపోయినపక్షమునకు తలుపులు వగైరాలు బద్దలుకొట్టి యింటిలో జొరబడడము అనే నేరము జరిగించినట్టు చెప్పబడుతున్నాడు; అవి యేవంటే:—

మొదటిది.—ఇంటిలోకి అతిక్రమముగా ప్రవేశము జరిగించడముకొరకు తనవల్లగాని యింటిలో ప్రవేశించడమునకు కుమ్మక్కుచేసే మనిషివల్లగాని కలగచెయ్యబడ్డ దారిగుండా ప్రవేశించినపక్షమునకు, లేక వెలపలికి వెళ్లిపోయినపక్షమునకు.

రెండవది.—తనకంటె, లేక నేరమునకు కుమ్మక్కుచేసే మనిషికంటె యితరుడైన మనిషివల్ల మనుష్యులు ప్రవేశించడముకొరకు వుద్దేశించబడని దారిగుండాగాని, గోడమీదుగా, లేక యింటిమీదుగా యెక్కడమువల్ల తానువచ్చిన యేదైనా దారిగుండాగాని లోపలికి ప్రవేశించినపక్షమునకు, లేక వెలపలికి వెళ్లిపోయినపక్షమునకు.

మూడవది.—ఇంటిలో వాసముచేసే మనిషివల్ల దారితియ్య బడేలాగున వుద్దేశించబడకుండావుండే యే సాధనమువల్లనైనా ఇంటి లోకి అతిక్రమముగా ప్రవేశము జరిగించగలందులకై తానుగాని ఆ నేరమునకు కుమ్మకుచేసిన మనిషిగాని కలగచేసిన అట్టిదారికుండా లోపలికి ప్రవేశించినపక్షమునకు, లేక వెలపలికి వెళ్లిపోయినపక్షమునకు.

నాలగవది.—ఇంటిలోకి అతిక్రమముగా ప్రవేశము జరిగించ గలందులకుగాని అట్లా ప్రవేశము జరిగించినతర్వాత యింటిలోనుంచి వెలపలికి వెళ్లిపోగలందులకుగాని యేదైనా తాళము తియ్యడమువల్ల లోపలికి ప్రవేశించినపక్షమునకు, లేక వెలపలికి వెళ్లిపోయినపక్షము నకు.

అయిదవది.—నేరముగల బలవంతము జరిగించడమువల్లగాని దొమ్మీ జరిగించడమువల్లగాని దొమ్మీ జరిగించబడేలాగున యేమని షిని అయినా జడిపించడమువల్లగాని తాను లోపలికి ప్రవేశించిన పక్షమునకు, లేక వెలపలికి వెళ్లిపోయినపక్షమునకు.

ఆరవది.—అట్లా లోపలికి ప్రవేశించడము, లేక వెలపలికి వెళ్లిపోవడము జరగకుండా బిగించబడ్డట్టున్న తనవల్ల, లేక ఇంటిలోకి అతిక్రమముగా ప్రవేశము జరిగించడమునకు కుమ్మకుచేసే మనిషివల్ల తియ్యబడ్డట్టున్న తాను యెరిగివుండే యేదైనా దారిని లోపలికి ప్రవే శించినపక్షమునకు, లేక వెలపలికి వెళ్లిపోయినపక్షమునకు.

వివరణము.—ఇంటితోకూడావుండి ఆ యింటికిన్ని దానికిన్ని మధ్యను లోపలిదారి కలిగివుండే యేదైనా బయిటిగదిగాని కట్టడము గాని యీ సెక్షనుయొక్క అర్థమందు యింటితాలూకు ఒకభాగముగా వుంటున్నది.

## దృష్టాంతములు.

(a) **A** అనేమనిషి, **D** అనేమనిషి యింటిగోడకు ఒక బొత్తచేసి ఆ బొత్త గుండా తనచెయ్యి లోపలికి పోనివ్వడమువల్ల ఇంటిలోకి అతిక్రమముగా ప్రవేశము జరిగించినవాడు అవుతున్నాడు. ఇది, తలుపులు వగయిరాలు బద్దలుకొట్టి ఇంటిలో జొరబడడము అవుతున్నది.

(b) **A** అనేమనిషి, తట్టుకూ తండకూ మధ్యనువుండే గవాక్షిగుండా వాడలోకి పాకి దూరడమువల్ల యింటిలోకి అతిక్రమముగా ప్రవేశము జరిగిస్తున్నాడు. ఇది, తలుపులు వగయిరాలు బద్దలుకొట్టి యింటిలో జొరబడడము అవుతున్నది.

(c) **A** అనేమనిషి, ఒక గవాక్షిగుండా **D** అనే మనిషియొక్క యింటిలోకి ప్రవేశించడమువల్ల యింటిలోకి అతిక్రమముగా ప్రవేశము జరిగిస్తున్నాడు. ఇది, తలుపులు వగయిరాలు బద్దలుకొట్టి యింటిలో జొరబడడము అవుతున్నది.

(d) **A** అనేమనిషి, బిగించివుండే తలుపుతీసి ఒక గుమ్మముగుండా **D** అనే మనిషియొక్క యింటిలోకి ప్రవేశించడమువల్ల యింటిలోకి అతిక్రమముగా ప్రవేశము జరిగిస్తున్నాడు. ఇది, తలుపులు వగయిరాలు బద్దలుకొట్టి యింటిలో జొరబడడము అవుతున్నది.

(e) **A** అనేమనిషి, తలుపునవుండే బెజ్జముగుండా ఒక తంతివేసి లోపలి గడియతీసి ఆ గుమ్మముగుండా **D** అనేమనిషియొక్క యింటిలోకి ప్రవేశించడమువల్ల యింటిలోకి అతిక్రమముగా ప్రవేశము జరిగిస్తున్నాడు. ఇది, తలుపులు వగయిరాలు బద్దలుకొట్టి యింటిలో జొరబడడము అవుతున్నది.

(f) **D** అనేమనిషి పోగొట్టుకొన్న అతని తాలూకు యింటితలుపు తాళపుచెవి **A** అనేమనిషికి దొరుకుతున్నది. అంతట **A** అనేమనిషి, ఆ తాళపు చెవితోటి తలుపుతీసి **D** అనే మనిషియొక్క యింటిలోకి ప్రవేశించడమువల్ల ఇంటిలోకి అతిక్రమముగా ప్రవేశము జరిగిస్తున్నాడు. ఇది, తలుపులు వగయిరాలు బద్దలుకొట్టి యింటిలో జొరబడడము అవుతున్నది.

(g) **D** అనేమనిషి, తలవాకిటితలుపువద్ద నిలుచుండి వుంటున్నాడు. **A** అనే మనిషి, **D** అనేమనిషిని పడగొట్టి దారిచేసుకొని దూరి ఆ యింటిలోకి ప్రవేశించడమువల్ల ఇంటిలోకి అతిక్రమముగా ప్రవేశము జరిగిస్తున్నాడు. ఇది, తలుపులు వగయిరాలు బద్దలుకొట్టి యింటిలో జొరబడడము అవుతున్నది.

(h) Y అనే మనిషియొక్క ద్వారపాలకుడయిన D అనేమనిషి, Y అనే మనిషియొక్క ద్వారబంధమువద్ద నిలుచుండివుంటున్నాడు. A అనేమనిషి కొట్టుతానని చెప్పి D అనేమనిషి యెదిరించకుండా పారిపోయేలాగున జడిపించి ఆ యింటిలోకి ప్రవేశించడమువల్ల ఇంటిలోకి అతిక్రమముగా ప్రవేశము జరిగిస్తున్నాడు. ఇది, తలుపులు వగయిరాలు బద్దలుకొట్టి యింటిలో జొరబడడము అవుతున్నది.

రాత్రివేళ తలుపులు వగైరాలు బద్దలుకొట్టి ఇంటిలో జొరబడడము.

446. సూర్యాస్తమయమునకు తర్వాతనున్ను సూర్యోదయమునకు ముందున్ను తలుపులు వగయిరాలు బద్దలుకొట్టి యింట్లో జొరబడే యేమనిషి అయినా, రాత్రివేళ తలుపులు వగయిరాలు బద్దలుకొట్టి యింటిలో జొరబడడము జరిగించినట్టు చెప్పబడుతున్నాడు.

నేరముగల ప్రవేశమునకు శిక్ష.

447. నేరముగల ప్రవేశము జరిగించే యేమనిషి అయినా, మూడుమాసములకు వ్యాపించగూడిన కాలము వరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని అయిదువందల రూపాయీలకు వ్యాపించగూడిన జుల్మానావల్లగాని ఈ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

ఇంటిలోకి అతిక్రమముగా ప్రవేశము జరిగించిన పక్షమునకు శిక్ష.

448. ఇంటిలోకి అతిక్రమముగా ప్రవేశము జరిగించే ఏమనిషి అయినా, ఒక సంవత్సరమునకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని వెయ్యిరూపాయీలకు వ్యాపించగూడిన జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

మరణమువల్ల శిక్షించబడతగ్గ నేరము జరి

449. మరణమువల్ల శిక్షించబడతగ్గ యేదయినా నేరము జరిగించగలందులకయి ఇంటిలోకి అతిక్రమముగా ప్రవేశము జరిగించే యేమనిషి అయినా, యావజ్జీవము

గించగలందులకై ఇంటిలోకి అతిక్రమముగా ప్రవేశము జరిగించడము.

ద్వీపాంతరవాసమువల్లగాని పదిసంవత్సరములకు మించనికాలమువరకు కఠినమయిన ఖయిదువల్లగాని శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడు కావలసినది.

యావజ్జీవము ద్వీపాంతర వాసమువల్ల శిక్షించబడతగ్గ నేరము జరిగించగలందులకై ఇంటిలోకి అతిక్రమముగా ప్రవేశము జరిగించడము.

450. యావజ్జీవము ద్వీపాంతరవాసమువల్ల శిక్షించబడతగ్గ యేదయినా నేరము జరిగించగలందులకయి యింట్లోకి అతిక్రమముగా ప్రవేశము జరిగించే యేమనిషి అయినా, పదిసంవత్సరములకు మించని కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్ల శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడు కావలసినది.

ఖయిదువల్ల శిక్షించబడతగ్గ నేరము జరిగించగలందులకై ఇంటిలోకి అతిక్రమముగా ప్రవేశము జరిగించడము.

451. ఖయిదువల్ల శిక్షించబడతగ్గ యేదయినా నేరము జరిగించగలందులకయి యింటిలోకి అతిక్రమముగా ప్రవేశము జరిగించే యేమనిషి అయినా రెండుసంవత్సరములకు వ్యాపించగూడని కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్ల శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడు కావలసినది; మరిన్ని జరిగించవలెనని యత్నించబడ్డ నేరము చోరీగా వున్నపక్షమునకు ఖయిదుయొక్క కాలము యేడుసంవత్సరములకు వ్యాపింపచెయ్యబడవచ్చును.

ఘాతకు, దొమ్మికి, లేక అక్రమ నిర్బంధమునకు సన్నాహము

452. ఏమనిషికి అయినా ఘాత చెయ్యడముకొరకుగాని యేమనిషిమీదనయినా దొమ్మి జరిగించడముకొరకుగాని యేమనిషిని అయినా అక్రమముగా నిర్బంధపెట్టడముకొరకుగాని ఘాత, దొమ్మి, లేక అక్రమ

చేసి ఇంటిలోకి అతిక్రమముగా ప్రవేశము జరిగించడము.

మయిన నిర్బంధము చేసేలాగున జడిపించడము కొరకుగాని సన్నాహముచేసి యింటిలోకి అతిక్రమముగా ప్రవేశము జరిగించే యేమనిషి అయినా, ఏడుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్ల శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడు కావలసినది.

రహస్యముగా ఇంటిలోకి అతిక్రమముగా ప్రవేశము జరిగించనపక్షమున్ను, లేక తలుపులు వగైరాలు బద్దలుకొట్టి ఇంటిలో జొరబడినపక్షమునకు శిక్ష.

453. రహస్యముగా యింటిలోకి అతిక్రమముగా ప్రవేశముగాని తలుపులు వగయిరాలు బద్దలుకొట్టి యింటిలో జొరబడడముగాని జరిగించే యేమనిషి అయినా, రెండు సంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్ల శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడు కావలసినది.

ఖయిదువల్ల శిక్షించబడతగ్గ నేరముజరిగించగలందులకైరహస్యముగా ఇంటిలోకి అతిక్రమముగా ప్రవేశము, లేక తలుపులు వగైరాలుబద్దలుకొట్టి ఇంటిలో జొరబడడము జరిగించడము.

454. ఖయిదువల్ల శిక్షించబడతగ్గ యేదయినా నేరము జరిగించగలందులకయి రహస్యముగా యింటిలోకి అతిక్రమముగా ప్రవేశముగాని తలుపులు వగయిరాలు బద్దలుకొట్టి జొరబడడముగాని జరిగించే ఏమనిషి అయినా, మూడుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్ల శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడు కావలసినది; మరిన్ని జరిగించవలెనని యత్నించబడ్డ నేరము చోరీగావున్నపక్షమునకు ఖయిదు తాలూకు కాలము పది సంవత్సరములవరకు వ్యాపింపచెయ్యబడవచ్చును.

ఘాతకు, దొమ్మికి, లేక అక్రమ నిర్బంధమునకు సన్నాహము చేసి రహస్యముగా ఇంటిలోకి అతిక్రమముగా ప్రవేశము, లేక తలుపులు వగయిరాలు బద్దలుకొట్టి ఇంటిలో జొరబడడము.

455. ఏమనిషికి అయినా ఘాతచెయ్యడముకొరకుగాని ఏమనిషి మీదనయినా దొమ్మీ జరిగించడముకొరకుగాని ఏమనిషిని అయినా అక్రమముగా నిర్బంధపెట్టడముకొరకుగాని ఘాత, దొమ్మీ, లేక అక్రమమైన నిర్బంధము చేసేలాగున జడిపించడముకొరకుగాని సన్నాహముచేసి రహస్యముగా యింటిలోకి అతిక్రమముగా ప్రవేశము, లేక తలుపులు వగయిరాలు బద్దలుకొట్టి యింటిలో జొరబడడము జరిగించే యేమనిషి అయినా, పదిసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్ల శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడు కావలసినది.

రాత్రివేళ రహస్యముగా ఇంటిలోకి అతిక్రమముగా ప్రవేశము, లేక రాత్రివేళ తలుపులు వగైరాలు బద్దలుకొట్టి ఇంటిలో జొరబడడము జరిగించినఘతుమునకు, శిక్ష.

456. రాత్రివేళ రహస్యముగా యింటిలోకి అతిక్రమముగా ప్రవేశముగాని రాత్రివేళ తలుపులు వగయిరాలు బద్దలుకొట్టి యింటిలో జొరబడడముగాని జరిగించే యేమనిషి అయినా, మూడుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్ల శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడు కావలసినది.

ఖయిదువల్ల శిక్షించబడతగ్గ నేరముజరిగించగలందులకై రాత్రివేళ రహస్యముగా ఇంటిలోకి అతిక్రమముగా ప్రవేశము, లేక

457. ఖయిదువల్ల శిక్షించబడతగ్గ ఏదయినా నేరము జరిగించగలందులకయి రాత్రివేళ రహస్యముగా యింటిలోకి అతిక్రమముగా ప్రవేశము, లేక రాత్రివేళ తలుపులు వగయిరాలు బద్దలుకొట్టి యింటిలో జొరబడడము జరిగించే ఏమనిషి అయినా, అయిదుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండు

రాత్రివేళ తలుపులు వగయిరాలు బద్దలు కొట్టి ఇంటిలో జొరబడడము జరిగించడము.

తరహాలలో ఒకతరహా ఖయిదున్ను శిక్షించబడడమే గాకుండా జుల్మానాకుకూడా పాత్రుడు కావలసినది; మరిన్ని జరిగించవలెనని యత్నించబడ్డనేరము చోరీ గావున్నపక్షమునకు ఖయిదుయొక్క-కాలము, పద్నాలుగుసంవత్సరములకు వ్యాపింపచెయ్యబడవచ్చును.

458. ఏమనిషికి అయినా ఘాతచెయ్యడముకొరకుగాని యేమనిషిమీదనయినా దొమ్మి జరిగించడముకొరకుగాని యేమనిషి అయినా అక్రమముగా నిర్బంధపెట్టడముకొరకుగాని ఘాత, దొమ్మి, లేక అక్రమమయిన నిర్బంధము చేసేలాగున జతపించడముకొరకుగాని సన్నాహముచేసి రాత్రివేళ రహస్యముగ యింటిలోకి అతిక్రమముగా ప్రవేశము, లేక రాత్రివేళ తలుపులు వగయిరాలు బద్దలుకొట్టి యింటిలో జొరబడడము జరిగించే యేమనిషి అయినా పద్నాలుగు సంవత్సరములకు వ్యాపించగూడిన కాలము వరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదునల్ల శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడు కావలసినది.

ఘాతకు, దొమ్మికి, లేక అక్రమ నిర్బంధమునకు సన్నాహము చేసి రాత్రివేళ రహస్యముగా ఇంటిలోకి అతిక్రమముగా ప్రవేశము, లేక రాత్రివేళ తలుపులు వగైరాలు బద్దలుకొట్టి ఇంటిలో జొరబడడము జరిగించడము.

459. రహస్యముగా యింటిలోకి అతిక్రమముగా ప్రవేశము, లేక తలుపులు వగయిరాలు బద్దలుకొట్టి యింటిలో జొరబడడము జరిగించేటప్పుడు యేమనిషికి అయినా బలమయిన ఘాతచేసే, లేక యేమనిషికి అయినా మరణముగాని బలమయిన ఘాతగాని చెయ్యడమునకు ప్రయత్నముచేసే యేమనిషి అయినా, యావజ్జీవము ద్వీపాంతరవాసమువల్లగాని పదిసంవత్సరము

రహస్యముగా ఇంటిలోకి అతిక్రమముగా ప్రవేశము, లేక తలుపులు వగైరాలు బద్దలుకొట్టి ఇంటిలో జొరబడడము జరిగించేటప్పుడు చెయ్యబడ్డ బలమైన ఘాత.

లకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖైదు వల్లగాని శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడు కావలసినది.

రాత్రివేళ రహస్యముగా ఇంటిలోకి అతిక్రమముగా ప్రవేశము లేక తలుపులు వగైరాలు బద్దలుకొట్టి ఇంటిలో జొరబడడము వీనిలో సమష్టిగా షరీఖు అయివుండే మనుష్యులలో ఒకరు మరణము లేక బలమయిన ఘాత జరిగించునయెడల, వారందరు శిక్షింపబడతగి వుందురు.

460. రాత్రివేళ రహస్యముగా యింటిలోకి అతిక్రమముగా ప్రవేశము, లేక రాత్రివేళ తలుపులు వగయిరాలు బద్దలుకొట్టి యింటిలో జొరబడడము జరిగించేకాలమందు అట్టి నేరమునుగురించి నేరస్థుడు అయిన ఏ మనిషి అయినా యెవరికి అయినా మరణముగాని బలమయినఘాతగాని స్వేచ్ఛగా కలగచేసినపక్షమునకు, లేక స్వేచ్ఛగా కలగచెయ్యవలెనని ప్రయత్నముచేసినపక్షమునకు, లేక అట్లా రాత్రివేళ రహస్యముగా యింటిలోకి అతిక్రమముగా ప్రవేశముగాని రాత్రివేళ తలుపులు వగైరాలు బద్దలుకొట్టి యింటిలో జొరబడడముగాని జరిగించడములో సమష్టిగా షరీఖు అయ్యే ప్రతిమనిషిన్ని, యావజ్జీవము ద్వీపాంతరవాసమువల్లగాని పదిసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడు కావలసినది.

ఆస్తివుంచబడి వుండేకోశము అయోగ్యముగా తియ్యడము.

461. ఆస్తివుంచబడివుండే, లేక వుంచబడ్డట్టు తాను నమ్మే బిగించబడివుండే, ఏదయినా కోశము అయోగ్యముగా, లేక కీడు జరిగించవలెననే యత్నముతో తీసే, లేక వదిలించే ఏమనిషి అయినా, రెండుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

462. నమ్మకముమీద తనపరము చెయ్యబడివుండి ఆ స్తి వుంచబడివుండే, లేక వుంచబడ్డట్టు తాను నమ్మి బిగించబడివుండే యేదయినా కోశము తీసే అధికారము తనకు లేకుండావుండగా అయోగ్యముగా, లేక కీడు జరిగించవలెననే యత్నముతో తీసే, లేక వదిలించే యేమనిషి అయినా, మూడుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలము వరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదున్నాగాని జుల్మానాన్నాగాని లేదా రెంటిన్నిగాని శిక్షించబడవలసినది.

నమ్మకముమీద తనపరముగా వుంచబడ్డ మనిషివల్ల ఆ నేరము జరిగించబడ్డపక్షమునకు శిక్ష.

---

## 18-వ అధ్యాయము.

దస్తావేజులతోటిన్ని వర్తకంవాడే గుర్తులతోటిన్ని, వస్తువుల భావంయిలు వేసకో- గుర్తులతోటిన్ని యిలాకాగల నేరముల గురించి.

463. లోకులకు, లేక యేమనిషికి అయినా నష్టము, లేక చెరుపు జరిగించవలెననే, లేక యేదయినా దావాకు, లేక హక్కుకు ఆధారము కలగచెయ్యవలెననే, లేక యేమనిషి అయినా ఆ స్తి వదలిపెట్టేటట్టు చెయ్యవలెననే, లేక స్పష్టముగగాని భావద్యోతకముగాగాని జట్టీలో ప్రవేశించేలాగున చెయ్యవలెననే యత్నముతోటిగాని దగా జరిగించవలెననే, లేక దగా జరిగించవచ్చునని యత్నముతోటిగాని ఒక తప్పుదస్తావేజు, లేక దస్తావేజులో యేదయినా భాగము సృష్టించే యేమనిషి అయినా, తప్పుసృష్టి చేసినవాడు అవుతున్నాడు.

తప్పుసృష్టి.

464. ఈ క్రిందచెప్పబడే మనుష్యులు తప్పు దస్తావేజు సృష్టించినట్టు చెప్పబడుతున్నారు వారు యెవరంటే—

తప్పు దస్తావేజు సృష్టించడము.

మొదటిది.—ఒక దస్తావేజుగాని దస్తావేజు తాలూకు భాగముగాని యెవరివల్ల, లేక యెవరియొక్క అధికారముమీద వ్రాయబడలేదు, దస్కతుచెయ్యబడలేదు, మొహరుచెయ్యబడలేదు, లేక వ్రాసియివ్వబడలేదు అని తాను యెరిగివున్నాడో అట్టి ఒక మనిషివల్ల, లేక అతని అధికారముమీదగాని అది వ్రాయబడలేదు, దస్కతుచెయ్యబడలేదు, మొహరుచెయ్యబడలేదు, లేక వ్రాసియివ్వబడలేదు అని తాను యెరిగివుండే కాలమందుగాని అట్టి దస్తావేజు, లేక దస్తావేజు తాలూకు భాగము వ్రాయబడ్డది, దస్కతుచెయ్యబడ్డది, మొహరుచెయ్యబడ్డది, లేక వ్రాసియివ్వబడ్డది అని నమ్మేలాగున చెయ్యవలెననే వుద్దేశముతో ఒక దస్తావేజు, లేక దస్తావేజు తాలూకు భాగము అయోగ్యముగా, లేక దగాగా వ్రాసే, దస్కతుచేసే, మొహరుచేసే, లేక వ్రాసియిచ్చే, లేక ఒక దస్తావేజు వ్రాసియివ్వబడ్డట్టు సూచించే యేదయినా గుర్తు కలగచేసేమనిషి; లేక

రెండోది.—ఒక దస్తావేజు, తనవల్లగాని మరియొకమనిషివల్లగాని వ్రాయబడ్డతర్వాత, లేక వ్రాసియివ్వబడ్డతర్వాత దిద్దేకాలమందు ఆ మరియొకమనిషి జీవించివున్నాసరే చనిపోయివున్నాసరే న్యాయశాస్త్రసమ్మతమయిన అధికారము లేకుండా అయోగ్యముగా, లేక దగామీద రద్దుచెయ్యడమువల్లగాని మరియొక తరహాగాగాని ఆ దస్తావేజుయొక్క ముఖ్యమయిన ఒక అంశములో దిద్దేమనిషి; లేక

మూడోది.—చిత్తభ్రమ, లేక మత్తు, వీటివల్లగాని ఏదయినా దగావల్లగాని దస్తావేజులో వ్రాయబడివుండే సంగతులు, లేక దిద్దుబాటు యిటువంటివి అని యెరగని మనిషిగావున్నట్టు తెలిసివుండి అయోగ్యముగా, లేక దగాగా ఆ దస్తావేజుమీద అతడు దస్కతుచేసేలాగున, మొహరుచేసేలాగున, దాన్ని వ్రాసియిచ్చేలాగున, లేక దిద్దేలాగున చేసేమనిషి.

## దృష్టాంతములు.

(a) **A** అనే మనిషివద్ద, **B** అనే మనిషిమీదికి 10,000 రూపాయీలకు **D** అనే మనిషివల్ల వ్రాయబడ్డ ఒక హుండి వున్నది. **A** అనేమనిషి, 10,000 రూపాయీలు అనే అంకెలకు ఒక సున్న యెక్కువచేసి ఆ హుండీ **D** అనేమనిషి అట్లా వ్రాసినట్టు **B** అనేమనిషిని నమ్మించవలెనని యత్నించి ఆ మొబల్లగు 1,00,000 రూపాయీలు వేస్తున్నాడు. ఇందులో **A** అనేమనిషి, తప్పుసృష్టి చేసినవాడు అవుతున్నాడు.

(b) **A** అనేమనిషి, **D** అనేమనిషి గాలూకు భూస్థితి **B** అనేమనిషికి విక్రయించి అందువల్ల ఆ విక్రయపు పయికము **B** అనేమనిషివద్ద పుచ్చుకోవలెననే యత్నముతో **D** అనేమనిషివల్ల తనకు ఆ స్థితి యిచ్చివెయ్యబడ్డట్టు అర్థమయ్యే ఒక దస్తావేజుకు **D** అనేమనిషియొక్క మొహరు అతని అధికారములేకుండా వేస్తున్నాడు. ఇందులో **A** అనేమనిషి, తప్పుసృష్టి చేసినవాడు అవుతున్నాడు.

(c) పట్టుకొనివచ్చే మనిషికి పయికము చెల్లించవలసినటువంటిన్ని **B** అనే మనిషివల్ల దస్కతు చెయ్యబడ్డటువంటిన్ని ఒక హుండి **A** అనేమనిషికి దొరుకుతున్నది. ఆ హుండీలో యే మొబల్లగున్ను నమూదు చెయ్యబడివుండలేదు. అందులో **A** అనే మనిషి, పదివేలరూపాయీల మొబల్లగు వ్రాసి అందువల్ల దగాగా ఆ హుండీలో అంకెలు భర్తీ చేస్తున్నాడు. ఇందులో **A** అనేమనిషి, తప్పుసృష్టి చేసినవాడు అవుతున్నాడు.

(d) **A** అనేమనిషి, చెల్లించబడవలసిన మొబల్లగు వ్రాయకుండా తనవల్ల దస్కతు చెయ్యబడ్డ ఒక హుండీ తన గుమాస్తా అయిన **B** అనేమనిషివద్ద యిచ్చి కొంతమందికి పయికము యివ్వగలందులకయి పదివేలరూపాయీలకు మించని మొబల్లగు అందులో వ్రాసి ఆ హుండి భర్తీచేసేలాగున **B** అనేమనిషికి అధికారము కలగచేస్తున్నాడు. **B** అనేమనిషి, ఇరువైవేల రూపాయీల మొబల్లగు దగాగా వ్రాస్తున్నాడు. ఇందులో **B** అనేమనిషి, తప్పుసృష్టి చేసినవాడు అవుతున్నాడు.

(e) **A** అనేమనిషి హుండీ వాయిదాకాలము వచ్చినప్పుడు అందుల మొబల్లగు చెల్లించవెయ్యవలెనని సాహుకారునదికి తీసుకొనివెళ్లి తోపుడుయిచ్చి మంచి హుండీకింద పైకము పుచ్చుకోవలెననిన్ని ఉద్దేశించి **B** అనే మనిషియొక్క అధికారములేకుండా తనపేరట అతిడు వ్రాసినట్టు ఒక హుండి వ్రాస్తున్నాడు. ఇందులో

B అనే మనిషియొక్క జామీను తనకు వుండివున్నట్టు ఆ సాహుకారును నమ్మించి ఆ పైకము దగాచేసి పుచ్చుకోవలెననే యత్నముతో ఆ హుండీ వ్రాసినందున A అనే మనిషి, తప్పుసృష్టి చేసినవాడు అవుతున్నాడు.

(f) D అనే మనిషియొక్క మరణశాసనములో "శేషించివుండే నా వరో బస్తు ఆస్తి A అనేమనిషికిన్ని B అనేమనిషికిన్ని C అనేమనిషికిన్ని సమానముగా పంచిపెట్టబడవలసినది అని నేను నిర్ణయించినాను," అనేమాటలు వున్నవి. A అనే మనిషి, యావదాస్తి తనకున్ను C అనేమనిషికిన్ని వుంచబడ్డట్టు నమ్మించవలెనని యత్నించి B అనే మనిషియొక్కపేరు అయోగ్యముగా గీచివేస్తున్నాడు. ఇందులో A అనేమనిషి, తప్పుసృష్టి చేసినవాడు అవుతున్నాడు.

(g) A అనేమనిషి, ఒక గవర్నమెంటు పత్రముమీద "D అనే మనిషికిగాని అతని సెలవు పొందినవారికిగాని చెల్లించవలసినది" అనేమాటలు వ్రాసి ఆ ఎండార్సుమెంటుమీద దస్కతు చెయ్యడమువల్ల D అనేమనిషికిగాని అతని సెలవు పొందినవారికిగాని చెల్లించబడేలాగున చేస్తున్నాడు. B అనేమనిషి, "D అనే మనిషికిగాని అతని సెలవుపొందినవారికిగాని చెల్లించవలసినది" అనేమాటలు అయోగ్యముగా గీచివేసి అందువల్ల విశేషమైన ఎండార్సుమెంటును వట్టి ఎండార్సుమెంటుగా చేస్తున్నాడు. ఇందులో B అనేమనిషి, తప్పుసృష్టి చేసినవాడు అవుతున్నాడు.

(h) A అనేమనిషి D అనేమనిషికి ఒక భూస్థితి విక్రయించి అందుకు ఒక విక్రయపత్రము వ్రాసియిస్తున్నాడు. A అనేమనిషి, ఆవరింపలాను ఆస్తి D అనే మనిషికి లేకుండా చెయ్యగలందులకై అంతకుముందు అది B అనేమనిషికి విక్రయించబడివున్నట్టు నమ్మించవలెనని యత్నించి D అనేమనిషికి తాను సాధనము వ్రాసియిచ్చిన తారీఖుకంటే ఆరుమాసములకుముందు తారీఖువేసి B అనేమనిషికి ఆదేస్థితిని గురించి ఒకసాధనము వ్రాసియిస్తున్నాడు. ఇందులో A అనేమనిషి, తప్పుసృష్టి చేసినవాడు అవుతున్నాడు.

(i) D అనేమనిషి, తన మరణశాసనము A అనేమనిషిచేత చెప్పి వ్రాయిస్తున్నాడు. A అనేమనిషి, D అనే మనిషివల్ల చెప్పబడ్డ ఆస్తి పొందవలసిన మనిషికి బదలాగా ఆ ఆస్తి పొందేలాగున మరి ఒక మనిషియొక్కపేరు మనఃపూర్వకముగా అందులోవ్రాసి D అనే మనిషియొక్క హుకుముప్రకారము ఆ మరణశాసనము తాను తయారుచేసినట్టు అతనితో చెప్పి ఆ D అనేమనిషి ఆ మరణశాసనముమీద దస్కతు చేసేలాగున చేస్తున్నాడు. ఇందులో A అనేమనిషి తప్పుసృష్టి చేసినవాడవుతున్నాడు.

(j) A అనేమనిషి, D అనే మనిషివద్దనున్ను యితర మనుష్యులవద్దనున్ను బిక్షను గోత్తుకోవలెనని యత్నించి "A అనేమనిషి యోగ్యుడనిన్ని గ్రహచారవశాత్తూ సంభవించిన శ్రమకరమైన స్థితిలో వున్నాడనిన్ని" యూఫీగా తెలియచేసే ఒక వుత్తరము వ్రాసి B అనే మనిషియొక్క సెలవులేకుండా దానిమీద B అనేమనిషి పేరున సంతకము చేస్తున్నాడు. ఇందులో A అనేమనిషి, D అనేమనిషి తనసొమ్ము యిచ్చేటట్టు చెయ్యాడముకొరకు తప్పుదస్తావేజు కలగచేసినందున A అనేమనిషి, తప్పుసృష్టి చేసినవాడు అవుతున్నాడు.

(k) A అనేమనిషి, D అనే మనిషివద్ద వుద్యోగము పొందవలెనని యత్నించి "A అనే మనిషియొక్క యోగ్యత మంచిది" అని తెలియచేసే ఒక వుత్తరము వ్రాసి B అనే మనిషియొక్క సెలవులేకుండా దానిమీద ఆ B అనే మనిషియొక్క పేరున దస్కతు చేస్తున్నాడు. ఇందులో తప్పుసృష్టి చెయ్యాబడ్డ యోగ్యతాపత్రిక ద్వారా D అనే మనిషిని దగా చెయ్యవలెననిన్ని అందువల్ల స్పష్టముగా తెలియచెయ్యబడ్డ, లేక భావద్యోతకమయ్యే వుద్యోగమును గురించిన ఖరారు D అనేమనిషి కుదుర్చుకొనేలాగున చెయ్యవలెననిన్ని యత్నించినందున A అనేమనిషి, తప్పుసృష్టి చేసినవాడు అవుతున్నాడు.

వివరణము.—(1) ఒకమనిషి, తనపేరున దస్కతుచెయ్యడము కొన్ని సంగతులలో తప్పుసృష్టి అనే నేరము కావచ్చును.

దృష్టాంతములు.

(a) A అనేమనిషి, అదేపేరుగల మరి ఒక మనిషివల్ల వ్రాయబడ్డటు నమ్మబడవలెనని యత్నించి బిల్ ఆఫ్ ఎక్స్‌చేంజ్ అనే ఒక పత్రముమీద తనపేరున దస్కతు చేస్తున్నాడు. ఇందులో A అనేమనిషి, తప్పుసృష్టి చేసినవాడు అవుతున్నాడు.

(b) A అనేమనిషి, ఒక వట్టికాకితముమీద "సహీ చెయ్యబడ్డది" అనే మాటలువ్రాసి D అనేమనిషి పేరున దస్కతు చేస్తున్నాడు. ఈ దస్కతుచెయ్యడములో అతని వుద్దేశము, ఆ కాకితముపైని D అనే మనిషిమీద B అనేమనిషి వ్రాసినట్టు ఒక బిల్ ఆఫ్ ఎక్స్‌చేంజ్ అనే పత్రమువ్రాసి అది D అనే మనిషివల్ల సహీ చెయ్యబడ్డట్టు చెలాయించవలెనని వుంటూవచ్చినది. ఇందులో A అనేమనిషి, తప్పుసృష్టిని గురించి నేరస్థుడుగా వుంటున్నాడు; మరిన్ని B అనేమనిషి, యీసంగతులు యెరిగి వుండి A అనేమనిషియొక్క యత్నమును అనుసరించి ఆ కాకితముమీద హుండీవ్రాసిన పక్షమునకు B అనేమనిషికూడా తప్పుసృష్టి చేసినవాడు అవుతున్నాడు.

(c) A అనేమనిషికి, అదేపేరుగల మరియొకమనిషియొక్క వుత్తరువుకు చెల్లించబడవలసిన ఒక బిల్ ఆఫ్ ఎక్స్ చేంజ్ అనే పత్రము దొరుకుతున్నది. A అనే మనిషి, యెవరి వుత్తరువుకు అయితే అది చెల్లించబడవలసినదో ఆ మనిషివల్ల అది ఎండార్సుచెయ్యాబడ్డట్టు నమ్మించవలెనని యత్నించి తనపేరున ఆ బిల్లుమీద ఎండార్సు చేసుకొంటున్నాడు. ఇందులో A అనేమనిషి, తప్పుసృష్టి చేసినవాడు అవుతున్నాడు.

(d) A అనేమనిషి, B అనే మనిషిమీద తీర్పు అమలులోకి తేవడమందు విక్రయించబడ్డ ఒక భూస్థితి ఖరీదుచేస్తున్నాడు. B అనేమనిషి, ఆ భూస్థితి జప్తు చెయ్యాబడ్డతర్వాత D అనే మనిషితోటి కుట్రచెయ్యడమునకు కలిశి నామకార్థము మాత్రము నిర్ణయించబడ్డ కొద్ది అద్దెకు చాలాకాలమువరకు ఆ భూస్థితినిగురించి ఒక కవులువ్రాసి A అనేమనిషిని దగాచెయ్యవలెనన్నిన్ని జప్తుకుముందే ఆ కవులు యివ్వబడ్డట్టు నమ్మించవలెనన్నిన్ని వుద్దేశించి జప్తుకు ఆరుమాసములకు ముందుతారీఖు ఆ కవులులో వ్రాస్తున్నాడు. ఇందులో B అనేమనిషి, ఆ కవులులో తాను దస్కతుచేసినప్పటికిన్ని అందులో ముందుతారీఖు వేసినందున తప్పుసృష్టి చేసినవాడవుతున్నాడు.

(e) వర్తకుడైన A అనేమనిషి, దివాలాతియ్యడమునకుముందు తనప్రయోజనముకొరకు B అనేమనిషివద్ద తన తాలూకు ఆస్తి కొంతదాచి తనకు ఋణము యిచ్చివుండేవారిని దగాచెయ్యవలెననే వుద్దేశముతోటిన్ని ఆ సంగతిలో మాన్యా జరిగించవలెనన్నిన్ని ఋణముగా పుచ్చుకోబడ్డ ఒక మొబల్లగు B అనేమనిషికి చెల్లించేలాగున తాను బద్ధుడయినట్టు ఒక పత్రమువ్రాసి తాను దివాలాతియ్యడమునకుముందు అది వ్రాసియివ్వబడ్డట్టు నమ్మించవలెనని వుద్దేశించి ఆ పత్రములో అంతకుముందు తారీఖు నమూదుచేస్తున్నాడు. A అనేమనిషి, పయినచెప్పబడ్డ నిర్ధారణలో మొదటిపద్ధతిని పట్టి తప్పుసృష్టి చేసినవాడు అవుతున్నాడు.

వివరణము —(2) వాస్తవమైన ఒక మనిషివల్ల వ్రాయబడ్డట్టు నమ్మబడవలెననే వుద్దేశముతో కల్పితుడైన ఒక మనిషి పేరట వ్రాసిగాని ఒకమనిషి జీవించివుండగా అతనివల్ల వ్రాయబడ్డట్టు నమ్మబడవలెననే వుద్దేశముతో చనిపోయిన ఒక మనిషి పేరట వ్రాసిగాని ఒక తప్పుదస్తావేజు పుట్టించడము అనేది తప్పుసృష్టికిందికి రావచ్చును.

దృష్టాంతము.

A అనేమనిషి, కల్పితుడయిన ఒక మనిషిపేరట బిల్ ఆఫ్ ఎక్స్ చేంజ్ అనే ఒక పత్రమువ్రాసి అది చెల్లాయించవలెననే వుద్దేశముతోటి కల్పితుడయిన అట్టి

మనిషి సహీచేసినట్టు ఆ బిల్లు సహీచేస్తున్నాడు. అందులో A అనేమనిషి, తప్పుసృష్టి చేసినవాడు అవుతున్నాడు.

తప్పుసృష్టి చేసిన పక్షమునకు శిక్ష.

465. తప్పుసృష్టిచేసే యేమనిషి అయినా, రెండుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

కోర్టురికార్డు, లేక పబ్లిక్ రిజిస్టరు, వగైరాలను తప్పుసృష్టి చెయ్యడము.

466. ఒక కోర్టు ఆఫ్ జస్టీసుతాలూకు, లేక ఆ కోర్టులోవుండే రికార్డుగాగాని చర్యగాగాని, లేక జననము, బాప్టిజం. వివాహము, లేక ప్రేతభూస్థాపనము. వీటిని గురించిన రిజిస్టరుగాగాని వుద్యోగధర్మమునుపట్టి పబ్లిక్ వుద్యోగస్థునివల్ల వుంచబడ్డ రిజిస్టరుగాగాని వుద్యోగధర్మమునుపట్టి ఒక పబ్లిక్ వుద్యోగస్థునివల్ల వ్రాయబడ్డట్టు అర్థమయ్యే ఒక సర్టిఫికెట్టుగా, లేక దస్తావేజుగా గాని ఒక వ్యాజ్యము దాఖలుచెయ్యడమునకు, కాపుచెయ్యడమునకు, అందులో యేదైనా చర్యలు జరిగించడమునకు, లేక ఫయిసలుకు ఒప్పుకోవడమునకు ఒక అధికారపత్రికగాగాని వకాలతునామాగాగాని అర్థమయ్యే ఒక సాధనము తప్పుసృష్టిచేసే యేమనిషి అయినా, ఏడుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్ల శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడు కావలసినది.

విలువగల సాధనము, మరణశాసనము, వగైరాలను తప్పుసృష్టి చెయ్యడము.

467. విలువగల సాధనముగా, మరణశాసనముగా. లేక ఒక కొమారుణ్ని దత్తుపుచ్చుకోవడమునకు అధికారపత్రికగా వుండేటట్టు అర్థమయ్యే, లేక యేదైనా విలువగల సాధనము వ్రాసేలాగున, మరి ఒకరిపేర

చేసేలాగున, లేక అందుమీద అసలు, ఫాయిదా, లేక లాభము పుచ్చుకొనేలాగున, లేక యేదైనా పైకము, చరాస్తి, లేక విలువగల సాధనము పుచ్చుకొనేలాగున, లేక అప్పగింతచేసేలాగున యేమనిషికి అయినా అధికారము కలగచేసేటట్టు అర్థమయ్యే యేదైనా దస్తావేజు గాని పైకము చెల్లించినట్టు యివ్వబడే చెల్లుచీటీగా, లేక రసీదుగా వుండేటట్టు, లేక యేదైనా చరాస్తిగాని విలువగల సాధనముగాని అప్పగింత చెయ్యడమునుగురించిన చీటీగా, లేక రసీదుగా వుండేటట్టు అర్థమయ్యే ఏదైనా దస్తావేజుగాని తప్పుసృష్టిచేసే ఏమనిషి అయినా, యావజ్జీవము ద్వీపాంతరవాసమువల్లగాని పదిసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడు కావలసినది.

468. తప్పుసృష్టి చెయ్యబడ్డ దస్తావేజు దగాచెయ్యడముకొరకు వుపయోగించవలెనని వుద్దేశించి (అట్టి) తప్పుసృష్టి చేసే యేమనిషి అయినా, ఏడుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్ల శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడు కావలసినది.

దగా చెయ్యగలందులకయి తప్పుసృష్టి చెయ్యడము.

469. తప్పుసృష్టి చెయ్యబడ్డ దస్తావేజు యేమనిషియొక్క అయినా పేరుకు హానికలగచెయ్యవలెనని వుద్దేశించి, లేక అందుకుగాను అది వాడబడవచ్చునని యెరిగివుండి (అట్టి) తప్పుసృష్టిచేసే ఏమనిషి అయినా, మూడుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖైదువల్ల శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడు కావలసినది.

పేరుకు హాని కలగచెయ్యడముకొరకు తప్పుసృష్టి చెయ్యడము

తప్పుసృష్టి చెయ్యబడ్డ దస్తావేజు.

470. పూరాగాగాని కొంతగాని తప్పుసృష్టి వల్ల యేర్పాటుచెయ్యబడ్డ ఒక తప్పుదస్తావేజు, ,,తప్పుసృష్టిచెయ్యబడ్డ దస్తావేజు'' అని చెప్పబడివున్నది.

తప్పుసృష్టి చెయ్యబడ్డ ఒక దస్తావేజును మంచి దస్తావేజుకింద వుపయోగపరచడము

471. తప్పుసృష్టిచెయ్యబడ్డ దస్తావేజు అని తాను యెరిగివుండే, లేక నమ్మడమునకు కారణముకలిగివుండే ఏదైనా దస్తావేజు దగాగా, లేక అయోగ్యముగా మంచి దస్తావేజుకింద వుపయోగపరచే ఏమనిషి అయినా, అట్టి దస్తావేజు అతను తప్పుసృష్టిచేసివుంటే యేలాగో ఆలాగే శిక్షించబడవలసినది.

467-వ సెక్షనుప్రకారము శిక్షించబడతగ్గ తప్పుసృష్టి చెయ్యవలెననే వుద్దేశముతో తప్పు మొహరు వగైరాలు చెయ్యడములేక వుంచుకొనవుండడము

472. ఈ స్మృతియొక్క 467-వ సెక్షనుప్రకారము శిక్షించబడతగ్గది అయ్యే యేదైనా తప్పుసృష్టి చెయ్యగలందులకై వుపయోగపరచవలెనని ప్రద్దేశించి ముద్రవెయ్యడముకొరకు యేదైనా మొహరు, అచ్చు, లేక యితర ఆయుధముచేసే, లేక సృష్టించే, లేక వుద్దేశముతోటి తప్పుసృష్టి అని యెరిగివుండే యేదైనా అట్టి మొహరు, అచ్చు, లేక యితర ఆయుధము తనవద్ద వుంచుకొనివుండే యేమనిషి అయినా, యావజ్జీవము ద్వీపాంతరవాసమువల్లగాని ఏడుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడు కావలసినది.

మరియొక తరహాగా శిక్షించబడతగ్గ తప్పుసృష్టి చెయ్యవలె

473. 467-వ సెక్షనుగాక యీ అధ్యాయము తాలూకు మరి యే సెక్షనుప్రకారముగానైనా శిక్షించబడతగ్గది అయ్యే యేదైనా తప్పుసృష్టి చెయ్యగలందులకై వుపయోగపరచవలెనని వుద్దేశించి ముద్రవెయ్య

నే ప్రద్దేశముతోటి తప్పుమొహరు, వగైరాలు చెయ్యడము లేక వుంచుకొనవుండడము.

డముకొరకు యేదైనా మొహరు, అచ్చు, లేక యితర ఆయుధము చేసే, లేక సృష్టించే, లేక అట్టి వుద్దేశముతోటి తప్పుసృష్టి అని యెరిగివుండి యేదైనా అట్టి మొహరు, అచ్చు, లేక యితర ఆయుధము తనవద్ద వుంచుకొనివుండే ఏమనిషి అయినా, ఏడుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్ల శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడు కావలసినది.

వాస్తవమైనదిగా వుపయోగపరచవలెననే యత్నముతోటి గన్ని తప్పుసృష్టి చెయ్యబడ్డట్టు యెరిగివుండిన్ని 466 లేక 467-వ సెక్షనులో వివరించబడ్డ దస్తావేజునువుంచుకొనివుండడము.

474. తప్పుసృష్టి చెయ్యబడ్డట్టు యెరిగివుండిన్ని అది వగైరాగా, లేక అయోగ్యముగా మంచి దస్తావేజుకింద వాడబడవలసినది అని వుద్దేశించిన్ని యేదైనా దస్తావేజు తనవద్ద వుంచుకొనివుండే ఏమనిషి అయినా, అది ఈ స్మృతియొక్క 466-వ సెక్షనులో నమూదుచెయ్యబడివుండే తరహా దారీగల దస్తావేజు అయినయెడల, ఏడుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్ల శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడు కావలసినది; అది 467-వ సెక్షనులో చెప్పబడివుండే తరహాదారీగల దస్తావేజు అయినయెడల, యావజ్జీవము ద్వీపాంతరవాసమువల్లగాని ఏడుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడు కావలసినది.

475. ఏదైనా వస్తువమీద, లేక వస్తువలో ఈ స్మృతియొక్క 467-వ సెక్షనులో నమూదుచెయ్యబడ్డ యేదైనా

467-వ సెక్షనులో నమూదు చెయ్యబడి వుండే దస్తావేజులు యథార్థపరచడముకొరకు వుపయోగపరచబడ్డ ఆనవాలు, లేక గుర్తు తప్పుగా సృష్టించడము, లేక తప్పుగా గుర్తువెయ్యబడ్డ వస్తువులువుంచుకోవడము.

దస్తావేజు యథార్థపరచడముకొరకు వాడబడే యేదయినా ఆనవాలు, లేక గుర్తు తప్పుగాసృష్టించి అట్టి వస్తువమీాద ఆ సమయమందు తప్పుగా సృష్టించబడ్డ, లేక ఆ దరింవిలాను సృష్టించబడబోయ్యే యేదయినా దస్తావేజుకు అది యథార్థపరచబడ్డదిగా వున్నట్టు కనపడే రూపము కలగచెయ్యడముకొరకు యేదయినా అట్టి ఆనవాలు, లేక గుర్తు వాడవలెనని వుద్దేశించే, లేక అట్టి వుద్దేశముతోటి దేనిమీాద, లేక దేంట్లో అట్టి ఆనవాలు, లేక గుర్తు తప్పుగా సృష్టించబడ్డదో యేదయినా అట్టివస్తువ తనవద్ద వుంచుకొనివుండే యేమనిషి అయినా, యావజ్జీవము ద్వీపాంతరవాసమువల్లగాని ఏడుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలముదరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడుకావలసినది.

467-వ సెక్షనులో నమూదు చెయ్యబడి వుండేవిగాక యితర దస్తావేజులు యథార్థపరచడముకొరకువుపయోగపరచబడ్డ ఆనవాలు, లేక గుర్తుతప్పుగాసృష్టించడము, లేక తప్పుగా గుర్తువెయ్యబడ్డ వస్తువులువుంచుకోవడము.

476. ఏదయినా వస్తువమీాద, లేక వస్తువలో ఈ స్మృతియొక్క 467-వ సెక్షనులో నమూదుచెయ్యబడ్డ దస్తావేజులుగాక యేదైనా యితరదస్తావేజు యథార్థపరచడముకు వాడబడే ఏదయినా ఆనవాలు, లేక గుర్తు తప్పుగాసృష్టించి అట్టి వస్తువమీాద ఆ సమయమందు తప్పుగా సృష్టించబడ్డ, లేక ఆ దరింవిలాను సృష్టించబడబోయ్యే ఏదయినా దస్తావేజుకు అది యథార్థపరచబడ్డదిగా వున్నట్టు కనపడే రూపము కలగచెయ్యడముకొరకు ఏదయినా అట్టి ఆనవాలు, లేక గుర్తు వాడవలెనని వుద్దేశించే, లేక అట్టి వుద్దేశముతోటి దేనిమీాద, లేక దేంట్లో అట్టి ఆనవాలు, లేక గుర్తు తప్పుగా

సృష్టించబడ్డదో ఏదయినా అట్టి వస్తువ తనవద్ద వుంచుకొనివుండే యే మనిషి అయినా, ఏడుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్ల శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడు కావలసినది.

మరణశాసనమును, పెంచుకొనుటకు అధికారపత్రమును, లేక విలువగలసాధనమును దగాగా రద్దుచెయ్యడము, నశింపచెయ్యడము, వగయిరాలు.

477. దగామీద, లేక అయోగ్యముగా, లేక లోకులకుగాని యేమనిషికి అయినాగాని నష్టము, లేక చెరుపుకలగచెయ్యవలెననే వుద్దేశముతోటి మరణశాసనముగా, లేక ఒక కొమారుణ్ని దత్తుపుచ్చుకోవడమునకు అధికారపత్రికగా, లేక విలువగల సాధనముగావుండే, లేక వున్నట్టు అర్థమయ్యే ఏదయినా దస్తావేజు రద్దుచేసే, నశింపచేసే, లేక చెడగొట్టే, లేక రద్దుచెయ్యవలెనని, నశింపచెయ్యవలెనని, లేక చెడగొట్టవలెనని యత్నముచేసే, లేక దాచే, లేక దాచవలెనని యత్నముచేసే, లేక అట్టి దస్తావేజు విషయములో కీడు కలగచేసే, ఏమనిషి అయినా, యావజ్జీవము ద్వీపాంతరవాసమువల్లగాని ఏడుసంవత్సరములకు వ్యాపించకూడినకాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడు కావలసినది.

లెక్కలను తప్పుగా నుండునట్లు చేయుట.

477-A. గుమాస్తాగా, ఆఫీసరుగా, లేక నవుకరుగా ఉన్నట్టి, లేక గుమాస్తాయొక్క, ఆఫీసరుయొక్క, లేక నవుకరుయొక్క, హోదాలో నియమింపబడియున్నట్టి లేక ప్రవర్తించుచున్నట్టి ఎవడయినను, తన యజమానునిదిగా నుండునట్టి, లేక అతని స్వాధీనమందుండునట్టి, లేక తనయజమానుని కొఱకయినను అతని తరఫునయినను తాను పుచ్చుకొనినట్టి, ఏపుస్తకమునయినను కాగితమునయినను లేఖనమునయినను విలువగల పత్రమునయినను లెక్క

నయినను బుద్ధిపూర్వకముగాను మోసముచేయవలెనను వుద్దేశముతోను నాశముచేయునెడల, మార్చునెడల, భిన్నముచేయునెడల, లేక తప్పుగా నుండునట్లు చేయునెడల, లేదా అట్టి ఏపుస్తకములోనయినను, కాగితములోనయినను, లేఖనములోనయినను, విలువగల పత్రములోనయినను లేక లెక్కలోనయినను బుద్ధిపూర్వకముగాను మోసముచేయవలెనను ఉద్దేశముతోను తప్పుదాఖలాను దేనినయిన వ్రాయునెడల, లేక వ్రాయుటకు సాహాయ్యము చేయునెడల, లేక ఏ ముఖ్యాంశమునయిన దానిలోనుండి వదలివేయునెడల, లేక దానిలో మార్చునెడల, లేక అట్లు వదలివేయుటకుఁగాని మార్చుటకుఁగాని సాహాయ్యము చేయునెడల, ఏడు సంవత్సరములదాఁక యెంతకాలమునకయిన రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లఁగాని, జుల్మానావల్లఁగాని, ఈ రెంటివల్లఁగాని, శిక్షింపఁబడవలయును.

వివరణము.—ఈ సెక్షను ననుసరించి తేఁబడిన ఏ ఫిర్యాదులో నయిన, ఎవనిని మోసముచేయవలెనని ఉద్దేశింపఁబడినదో అట్టి మనుష్యుఁడు ఫలానివాఁడని చెప్పకయేగాని, దగాచేయ నుద్దేశించిన సరుకు మొత్తము ఫలానిదని వివరించకయేగాని, నేరము జరిగింపఁబడిన దినము ఫలానిదని వివరించకయేగాని, మోసముచేయుటకు సామాన్యముగానుండిన ఉద్దేశమును చెప్పుటయే చాలినదిగా నుండవలయును.

వర్తకపు గుర్తులనుగురించిన్ని స్వామిత్వము తెలియచెయ్యడముకొరకు వేసుకొబడే గుర్తులనుగురించిన్ని ఇతరగుర్తులనుగురించిన్ని.

478. సరుకులు ఒకానొక విశేషమైన మనిషివల్ల చేయబడ్డవని గాని ఆతని వర్తకసరుకులనిగాని కనపరచడమునకు గాను వెయ్యబడ్డగుర్తు, వర్తకపుగుర్తు అని చెప్పబడుతున్నది,

వర్తకపు గుర్తు.

మరిన్ని యీ కోడుయొక్క కార్యములకుగాను, "వర్తకపుగుర్తు" అనుమాట పేటెంట్లనున్ను మోస్తర్లనున్ను వర్తకపుగుర్తులనున్ను గురించిన 1883-వ సంవత్సరపు ఆక్టు ననుసరించి వుంచబడివుండే వర్తకపు గుర్తుల రిజిస్టరులో రిజిస్టరు చేయబడివుండే యేదైనా వర్తకపుగుర్తునున్ను, పేటెంట్లనున్ను మోస్తర్లనున్ను వర్తకపు గుర్తులనున్ను గురించిన 1883-వ సంవత్సరపు ఆక్టు తాలూకు నూటమూడవ సెక్షనులోని నిబంధనలు కౌన్సిలువారియొక్క ఉత్తరువు ననుసరించి తత్కాలమందు యెందుకు సంబంధపడుతున్నవో అట్టి ఏదైనా బ్రిటిష్‌రాజ్యములోగాని పరాయీ సంస్థానములోగాని రిజిస్టరుచేయబడి అయినాసరే రిజిస్టరు చేయబడక అయినాసరే చట్టమువల్ల కాపాడబడివుండే ఏదైనా వర్తకపుగుర్తునున్ను కలుపుకొంటున్నది.

*స్వామిత్వమును తెలియచేయ్యడముకొరకు వేసుకొనే గుర్తు.*

479. చరమయిన ఆస్తి ఒకానొక విశేషమయిన మనిషిది అని తెలియచెయ్యడమునకు వాడబడేగుర్తు, స్వామిత్వము తెలియచేసే గుర్తు అని చెప్పబడుతున్నది.

*కృత్రిమమైన వర్తకపుగుర్తు వుపయోగపరచడము.*

480. ఏవయినా సరుకులుగాని పెట్టె, మూట, లేక యితరకోశములో వుండే సరుకులుగాని ఒకరివల్ల చెయ్యబడి, లేక ఒకరి వర్తకసరుకులుగా వుండగా మరి ఒకరివల్ల చెయ్యబడ్డవి, లేక మరి ఒకరి వర్తక సరుకులుగా వున్నవి అని యితరులు నమ్మేటట్టు చేయుటకు న్యాయముగా తగివుండే తరహాగా ఏమనిషి అయినా, అట్టి సరుకులమీదగాని సరుకులు వుంచబడివుండే అట్టి పెట్టె, మూట, లేక యితరకోశము, వీటిమీదగాని గుర్తువేసినా, లేక ఏదైనా గుర్తువెయ్యబడివుండే పెట్టె, మూట, లేక యితరకోశము వుపయోగపరచినా అతను కృత్రిమమయిన వర్తకపు గుర్తు వుపయోగపరచినాడని చెప్పబడుతున్నాడు.

481. ఏదైనా చరాస్తి, సరుకులుగాని పెట్టె, మూట, లేక యితర కోశములోవుండే చరాస్తి, లేక సరుకులుగాని ఒకరియొక్క ఆస్తిగా, లేక సరుకులుగా వుండగా మరిఒకరిని అని నమ్మేటట్టు చేయుటకు న్యాయముగా తగివుండే తరహాగా యేమనిషి అయినా అట్టి చరాస్తిమీదగాని సరుకులమీదగాని చరాస్తి, లేక సరుకులు వుంచబడివుండే అట్టి పెట్టె, మూట, లేక యితరకోశము, వీటిమీదగాని గుర్తువేసినా, లేక యేదయినా గుర్తువెయ్యబడివుండే పెట్టె, మూట, లేక యితరకోశము, వీటిని వుపయోగపరచినా అతను స్వామిత్వమును తెలియచెయ్యడముకొరకు వాడుకొనే కృత్రిమమయిన గుర్తు వుపయోగపరచినాడని చెప్పబడతున్నాడు.

స్వామిత్వము తెలియచెయ్యడముకొరకు వాడుకొనే కృత్రిమమయిన గుర్తు వుపయోగపరచడము.

482. వర్తకులు, లేక ఖావందులు చేసుకొనే గుర్తువలె తప్పుగుర్తు వుపయోగపరచే యేమనిషి అయినా, అతను మోసముచెయ్యవలెననే వుద్దేశము లేకుండా అట్లా చేసినట్టు రుజువుపరచేపక్షమందు తప్ప, ఒక సంవత్సరమునకు వ్యాపించకూడని కాలమువరకు రెండు తరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని ఆ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

వర్తకసంబంధమైన, లేక స్వామిత్వమును తెలియచేసే గుర్తువలె తప్పుగుర్తు వాడినయెడల శిక్ష.

483. ఏ యితరమనిషివల్లనయినా వాడబడ్డ వర్తకపుగుర్తు, లేక స్వామిత్వమును తెలియచేసేగుర్తు తప్పుగా సృష్టిచేసే యేమనిషి అయినా, రెండుసంవత్సరములకు వ్యాపించకూడని కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని ఆ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

మరిఒక మనిషివల్ల వాడబడ్డ వర్తకపుగుర్తు, లేక స్వామిత్వమును తెలియచేసేగుర్తు తప్పుగా సృష్టించడము.

పబ్లిక్ వుద్యోగస్థునివల్ల వుపయోగపరచబడ్డ గుర్తును తప్పుగా సృష్టించడము.

484. ఒక పబ్లిక్ వుద్యోగస్థునివల్ల వుపయోగపరచబడ్డ స్వామిత్వమును తెలియచేసె గుర్తుగాని యేదయినా వస్తువ ఒకానొకమనిషివల్ల, లేక ఒకానొక కాలమందు, లేక స్థలమందు చెయ్యబడ్డది అనిగాని ఆ వస్తువ ఒకానొకతరహా దారీకలది అనిగాని ఒకానొక ఆఫీసులోనుంచి దాటిపోయినది అనిగాని అది యేదయినా మినహాయింపుకు తగినదిగా వున్నది అనిగాని తెలియచెయ్యడమునకు ఒక పబ్లిక్ వుద్యోగస్థునివల్ల వుపయోగపరచబడ్డ యేదయినా గుర్తుగాని తప్పుసృష్టిచేసే, లేక అట్టి గుర్తు తప్పుసృష్టి చెయ్యబడ్డట్టు యెరిగివుండి మంచిగుర్తుగా వుపయోగపరచే యేమనిషి అయినా, మూడుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్ల శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడై కావలసినది.

వర్తకపు గుర్తుగాని స్వామిత్వమును తెలియచేసేగురుగాని తప్పుసృష్టి చేయడముకొరకు యేదైనా ఆయుధమును చెయ్యడము, లేక వుంచుకొని వుండడము.

485. వర్తకపు గుర్తుగాని స్వామిత్వమును తెలియచేసే గుర్తుగాని తప్పుసృష్టి చెయ్యడముకొరకు యేదయినా ముద్ర, అచ్చు, లేక యితర ఆయుధముచేసే, లేక తనవద్ద వుంచుకొనివుండే, లేక ఒకరివల్ల చెయ్యబడ్డ, లేక ఒకరి వర్తకసరుకులుగావుండే యేవైనా సరుకులు మరి ఒకరివల్ల చెయ్యబడ్డవి, లేక మరి ఒకరి వర్తకసరుకులుగావున్నవి అని లేక అవి యెవరివి కావో అట్టిమనిషివి అయినట్టు కనపరచడముకొరకు వర్తకసంబంధమైనగుర్తు, లేక స్వామిత్వమును తెలియచేసేగుర్తు తనవద్ద వుంచుకొనివుండే యేమనిషి అయినా, మూడుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

వర్తకసంబంధమైన గుర్తువలె లేక స్వామిత్వమును తెలియచేసే గుర్తువలెవుండే తప్పుగుర్తులు వెయ్యబడ్డ సరుకులు విక్రయించడము.

486. వర్తకసంబంధమైన గుర్తువంటి, లేక స్వామిత్వమును తెలియచేసే గుర్తువంటి తప్పుగుర్తును యేవయినా సరుకులకుగాని వస్తువులకుగాని అట్టి సరుకులు వుంచబడివుండే పెట్టె, మూట, లేక యితరకోశమునకుగాని వేసి లేక అంటించివుండి అట్టి సరుకులను, లేక వస్తువులను విక్రయించే, లేక విక్రయమునకుగాని వ్యాపారమునకు సంబంధించిన లేక చేతిపనికి సంబంధించిన యేదయినా కార్యమునకుగాని చూపే, లేక స్వాధీనమందు వుంచుకొనివుండే యేమనిషి అయినా, అతను—

(a) ఈ సెక్షనుకు విరోధముగా నేరము జరిగించకుండా వుండడమునకు న్యాయమైన యావత్తు ముందుజాగ్రత పుచ్చుకొనిన్ని, తాను చేసినట్టు చెప్పబడివుండే నేరము జరిగించినకాలమందు ఆ గుర్తు యథార్థమైనదికాదని తాను సందేహించుటకు యే విధమైన హేతువు తనకు కనపడలేదనిన్ని, మరిన్ని

(b) ప్రాసిక్యూటరువల్లగాని అతని తరఫునగాని సంగతి అడగబడినప్పుడు అట్టి సరుకులను లేక వస్తువులను తాను యెవరివద్దనుంచి పొందినాడో ఆ మనుష్యులను గురించి తనకు తెలిసిన యావత్తు సమాచారము తాను చెప్పినాడనిన్ని, లేక

(c) నేరేవిధముగా తాను నిర్దోషిగా నడుచుకొన్నాడనిన్ని,

ఋజువుపరచితేనేతప్ప లేనిపక్షమందు ఒకసంవత్సరమునకు వ్యాపించగలిగిన కాలమునకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

487. ఒక కోశములోవుండే సరుకులకంటె యితరమయిన సరుకులు వున్నట్టుగాని అందులోవుండే సరుకులు లోపల

సరుకులువుండే ఏదైనా కోశముమీద తప్పుగుర్తు వెయ్యడము.

లేనట్టుగాని అట్టి కోశములోవుండే సరుకులు వాటి తాలూకు వాస్తవమైన స్వభావము, లేక తరహాదారీకంటే యితరమయిన స్వభావము, లేక తరహాదారీకలిగివున్నట్టుగాని యెవరైనా పబ్లిక్ వుద్యోగస్థుడు, లేక యితరమనిషి నమ్మేటట్టు చేయుటకు న్యాయముగా తగివుండే తరహాగా ఏదయినా ఒక పెట్టెమీద, మూటమీద, లేక వేరే కోశముమీద యేదయినా తప్పుగుర్తువేసే యేమనిషి అయినా, అతను మోసము చెయ్యవలెననే వుద్దేశము లేకుండా అట్లాచేసినట్టు రుజువుపరచే పక్షమందుతప్ప, మూడుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

ఏదయినా అట్టి తప్పుగుర్తు వుపయోగపరచిన పక్షమునకు శిక్ష.

488. ఇంతకుముందు అవ్యవహితముగా చెప్పివుండే సెక్షనువల్ల నిషేధించబడివుండే యేతరహాగానయినా యేదైనా అట్టి తప్పుగుర్తు వుపయోగపరచే యేమనిషి అయినా, అతను మోసముచెయ్యవలెననే వుద్దేశము లేకుండా అట్లాచేసినట్టు రుజువుపరచే పక్షమందు తప్ప, ఆ సెక్షనుకు విరోధముగా నేరము జరిగించివుంటె యెటువలెనో అటువలెనే శిక్షించబడవలసినది.

నష్టము కలగచెయ్యవలెననే వుద్దేశముతో స్వామిత్వమును తెలియచేసే గుర్తు జోలికి పోవడము.

489. ఏమనిషికయినా నష్టము కలగచెయ్యవలెననే వుద్దేశముతోటిగాని అందువల్ల నష్టముకలగవచ్చునని యెరిగివుండిగాని స్వామిత్వమును తెలియచేసే ఏదయినా గుర్తు తీసివేసే, నశింపచేసే, చెరిపివేసే, లేక అందుతోటి మరిఒకటిచేర్చే యేమనిషి అయినా, ఒక సంవత్సరమునకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో

ఒకతరహా ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని యీ రెంటివల్ల గాని శిక్షించబడవలసినది.

కరెన్సీ నోట్లను గుఱించియును, బాంకి నోట్లను గుఱించియును.

కరెన్సీనోట్లనుగాని బాంకినోట్లనుగాని తప్పుగా కల్పించుట.

489-A. ఎవరైనను ఏ కరెన్సీ నోటునుగాని బాంకినోటునుగాని (కౌంటర్ఫిట్) తప్పుగా కల్పించినను, లేక తెలిసియుండి తప్పుగా కల్పించుపద్ధతిలో నేపనినైన చేసినను, యావజ్జీవ ద్వీపాంతరవాస శిక్షతోడఁగాని పదిసంవత్సరములవఱకు ఎంతకాలమునకైన రెండువిధములైన ఖైదులలో దేనివలననైనఁగాని శిక్షింపఁబడును, మఱి జుల్మానాకుకూడ పాత్రుఁడగును.

వివరణము.—ఈ సెక్షనుయొక్క కార్యములకొఱకును, 489-B, 489-C, 489-D సెక్షనుల కార్యములకొఱకును ,,బాంకినోటు'' అను మాట లోకమునందే భాగమునకైన బాంకి వ్యాపారము చేయుచున్న ఏ మనుజునివలనఁగాని, ఏ ప్రభుత్వమువారి యధికారమువలనఁగాని, రాజ్యాధిపత్యముగలవారి యధికారమువలనఁగాని, వారి యధికారము ననుసరించిగాని పుట్టింపఁబడినట్టియు, పైకమునకు సరిసమానమైనదా లేక పైకమునకు బదులైనదిగా నుపయోగపడుట కుద్దేశింపఁబడినట్టియు, ప్రామిసరినోటు అని లేక అది చేతఁగలవానికి అడిగినమాత్రమున పైకము చెల్లించునట్టి యొడంబడిక యని అర్థము అగును

(ఫోర్జ్) తప్పుసృష్టి చేయఁబడినట్టి లేక (కౌంటర్ఫీట్) తప్పుగా కల్పింపఁబడినట్టి

489-B. (ఫోర్జ్) తప్పుసృష్టి చేయఁబడినట్టి లేక (కౌంటర్ఫిట్) తప్పుగా కల్పింపఁబడినట్టి కరెన్సీనోటును లేక బాంకినోటును, అది అట్లు తప్పుసృష్టి చేయఁబడినదని లేక తప్పుగా కల్పింపఁబడినదని యెఱిఁగిగాని నమ్ముటకు హేతువు కలిగిగాని యున్నటువంటి ఏ

*కరెన్సీనోట్లను లేక బాంకునోట్లను సరియైనవిగా నుపయోగించుట.*

మనుష్యుఁడైనను మఱి వేఱె యే మనుష్యునకైన సరియైనదని అమ్మినను, వానియొద్దనుండి పుచ్చుకొనినను, మఱియొకవిధముగ దానితో వ్యాపారముచేసినను లేక దానిని ఉపయోగించినను, యావజ్జీవ ద్వీపాంతరవాస శిక్షవలనఁగాని పదిసంవత్సరములవరకు ఎంతకాలమునకైన రెండువిధములైన ఖయిదులలో దేనివల్లనైనఁగాని శిక్షింపఁబడును, మఱి జుల్మానాకుకూడ పాత్రుఁడగును.

*తప్పుసృష్టి చేయఁబడినట్టిగాని, తప్పుగా కల్పింపఁబడినట్టిగాని కరెన్సీనోట్లను లేక బాంకి నోట్లను కలిగి యుండుట.*

489-C. తప్పుసృష్టి చేయఁబడినట్టి లేక తప్పుగా కల్పింపఁబడినట్టి యే కరెన్సీనోటునుగాని బాంకినోటునుగాని, అది అట్లు తప్పుసృష్టి చేయఁబడినదని లేక తప్పుగా కల్పింపఁబడినదని యెఱిఁగి లేక నమ్ముటకు హేతువుకలిగియును, దానిని సరియైనదిగా నుపయోగించుటకు లేక ఉపయోగింపవచ్చునని ఉద్దేశించియును, తన స్వాధీనమునందు కలిగియున్న యే మనుష్యుఁడైనను ఏడు సంవత్సరములవఱకు ఎంతకాలమునకైన రెండువిధములైన ఖయిదులలో దేనివలననైనఁగాని జుల్మానావలనఁగాని రెంటివలనఁగాని శిక్షింపఁబడును.

*కరెన్సీనోట్లనైనను బాంకి నోట్లనైనను తప్పుసృష్టి చేయుటకుఁగాని తప్పుగా కల్పించుటకుఁగాని పనిముట్లను లేక సామగ్రులను చేయుట లేక స్వాధీనమందు కలిగి యుండుట.*

489-D. ఏ కరెన్సీనోటునైనను బాంకినోటునైనను తప్పుసృష్టి చేయుటకుఁగాని తప్పుగా కల్పించుటకుఁగాని ఉపయోగించుటకొఱకైనను లేక అట్లు తప్పుసృష్టి చేయుటకుఁగాని తప్పుగా కల్పించుటకుఁగాని ఉపయోగించుటకై అది యుద్దేశింపఁబడినదని యెఱిఁగి లేక నమ్ముటకు హేతువు కలిగియైనను, ఏ యంత్రమునుగాని, పనిముట్టునుగాని, సామగ్రినిగాని, చేయునట్టి, లేక చేయుపద్ధతిలో ఏపనినైన చేయునట్టి

లేక కొనునట్టి, లేక అమ్మునట్టి, లేక పరిష్కరించి వేయునట్టి లేక తన స్వాధీనమునందు కలిగియుండునట్టి యే మనుష్యుడైనను యావజ్జీవ ద్వీపాంతర వాస శిక్షతోగాని పదిసంవత్సరములవఱకు ఎంతకాలమున కైన రెండువిధములైన ఖయిదులలో దేనివలనగాని శిక్షింపబడును, మఱి జుల్మానాకుకూడ పాత్రుడగును.

---

## 19-వ అధ్యాయము.

నవుకరీనిగురించిన ఖరార్లకు నేరముగల భంగము కలగచెయ్యడమునుగురించి.

490. ఏమనిషిని అయినా, లేక ఆస్తిని అయినా ఒక స్థలము నుంచి మరి ఒక స్థలమునకు తీసుకొనిపోవడమందు, లేక పట్టించుకొని వెళ్లడమందు తాను ఖద్దున నవుకరీచేసేలాగునగాని ఒక సబురులో, లేక ప్రయాణమందు యేమనిషికి అయినా నవుకరుగా పనిచేసేలాగునగాని ఒక సబురులో, లేక ప్రయాణమందు మనిషిని, లేక ఆస్తిని కాపుదారీచేసేలాగునగాని న్యాయశాస్త్రసమ్మతమైన ఖరారువల్ల బద్ధుడయివుండి, కాయిలాగావుండడము, లేక ఆతనివిషయములో అన్యాయముగా జరిపించబడడము, యీ సంగతులలోతప్ప, స్వేచ్ఛగా తన ఖరారుప్రకారము జరిగించకుండాపొయ్యే యే మనిషి అయినా, ఒక మాసమునకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని వందరూపాయీలకు వ్యాపించగూడిన జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

నవుకరీనిగురించిన ఖరారును సబురులోగాని ప్రయాణమందుగాని భంగము కలగచెయ్యడము.

### దృష్టాంతములు.

(a) పాలకీబోయీ అయిన A అనేమనిషి, Z అనేమనిషిని ఒకస్థలమునుంచి మరిఒక స్థలమునకు తీసుకొనివెళ్లగలందులకయి న్యాయశాస్త్రసమ్మతమయిన ఖరారు

వల్ల బద్ధుడయివుండి ప్రయాణపు మధ్యమందు పారిపోతున్నాడు. A అనేమనిషి, ఈ సెక్షనులో నిర్ధారణ చెయ్యబడ్డ నేరము జరిగించినవాడు అవుతున్నాడు.

(b) కూలివాడయిన A అనేమనిషి, Z అనే మనిషియొక్క సామాను ఒక స్థలమునుంచి మరిఒక స్థలమునకు తీసుకొనివెళ్లగలందులకయి న్యాయశాస్త్ర సమ్మత మయిన ఖరారువల్ల బద్ధుడయివుండి బుద్ధిపూర్వకముగా ఆసామాను పారవేస్తున్నాడు. A అనేమనిషి, యీ సెక్షనులో నిర్ధారణచెయ్యబడ్డ నేరము జరిగించినవాడు అవుతున్నాడు.

(c) ఎడ్లబండివాడు అయిన A అనేమనిషి, ఒక స్థలమునుంచి మరియొకస్థలమునకు తన యెడ్లమీద సరుకులు తీసుకొనిపొయ్యేలాగున న్యాయశాస్త్రసమ్మతమయిన ఖరారువల్ల బద్ధుడయివుండి న్యాయశాస్త్రవిరోధముగా ఆలాగున జరిగించకపోతున్నాడు. A అనేమనిషి, యీ సెక్షనులో నిర్ధారణ చెయ్యబడ్డనేరము జరిగించినవాడు అవుతున్నాడు.

(d) A అనేమనిషి, తనసామాను మోసుకొనిపొయ్యేలాగున కూలివాడయిన B అనేమనిషిని న్యాయశాస్త్రవిరోధముగా బలవంతపెట్టుతున్నాడు. B అనేమనిషి, ప్రయాణమధ్యమందు ఆ సామాను పడవేసి పారిపోతున్నాడు. ఇందులో B అనే మనిషి, సామాను తీసుకొనిపోవడమునకు న్యాయశాస్త్రసమ్మతముగా బద్ధుడుకానందున అతడు యే నేరమున్ను జరిగించినవాడు కానేరడు.

వివరణము.—ఏ మనిషివద్ద నవుకరీ చెయ్యవలసినదో ఆ మనిషితోటే ఖరారుచేసుకోవలెను అనడము యీ నేరమునకు ఆవశ్యకము కాదు. నవుకరీచెయ్యవలసిన మనిషివల్ల స్పష్టముగాగాని భావద్యోతకముగాగాని యే మనిషితోటి అయినా న్యాయశాస్త్ర సమ్మతముగా ఖరారు చేసుకోబడ్డపక్షమునకు అదే చాలివుంటున్నది.

దృష్టాంతము.

A అనేమనిషి, ఒకమాసమువరకు బండితోలేలాగున డాక్ కంపెనీవారితో ఖరారుచేసుకొంటున్నాడు. B అనే ఒకమనిషి, ఆ డాక్ కంపెనీవారు తనను ఒక ప్రయాణము తీసుకొనిపొయ్యేలాగున నిర్ణయించుకొంటున్నాడు. ఆ మాసములో ఆ కంపెనీవారు, A అనేమనిషి తోలేబండి B అనేమనిషికి యిస్తున్నారు. A అనేమనిషి,

ప్రయాణమధ్యమందు స్వేచ్ఛగా బండి వదిలిపెట్టి వెళ్లుచున్నాడు. ఇందులో A అనే మనిషి B అనే మనిషితో ఖరారు చేసుకోకపోయినా అతడు, ఈ సెక్షనుప్రకారము ఒక నేరము జరిగించినవాడు అవుచున్నాడు.

491. బాల్యమువల్ల, మనోదార్ఢ్యము లేకపోవడమువల్ల, రోగమువల్ల, లేక దేహాశక్తమువల్ల స్వసంరక్షణ చేసుకోలేని, లేక తనకు క్షేమము కలగచేసుకోవడమునకుగాని తనకు కావలసినవి తెచ్చుకోవడమునకుగాని అసమర్థుడైన ఒక మనిషివద్ద కాపరిగా కనిపెట్టి వుండడమునకున్ను కావలసినవి యివ్వడమునకున్ను న్యాయశాస్త్రసమ్మతిమైన ఖరారువల్ల బద్ధుడై వుండి ఆ ప్రకారము జరిగించకుండా స్వేచ్ఛగా మానే యే మనిషి అయినా, మూడుమాసములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతెరహాలలో ఒకతెరహా ఖయిదువల్లగాని రెండువందల రూపాయీలకు వ్యాపించగూడిన జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

స్వసంరక్షణ చేసుకోలేని మనుష్యునికని పెట్టి వుండడమునకున్ను వానికి కావలసినవి యివ్వడమునకున్ను చేసుకొన్న ఖరారుకు భంగము కలగచెయ్యడము.

492. ఖరారుయొక్క బలమునుపట్టి మరి ఒక మనిషియొక్క ఖర్చుమీద తీసుకొనిపోబడ్డ, లేక తీసుకొనిపోబడే బ్రిటిష్ ఇండియూకు లోపుగావుండే యే స్థలమందైనా మూడుసంవత్సరములకు మించని కాలమువరకు శిల్పిగా, పనివాడుగా, లేక కూలీవాడుగా, అట్టి యితరమనిషికి పనిచేసేలాగున వ్రాసి యివ్వబడ్డ న్యాయశాస్త్రసమ్మతమైన ఖరారువల్ల బద్ధుడై అయివుండి తన ఖరారుకాలము జరుగుతూవుండగా అట్టి యితరమనిషియొక్క నవుకరీ స్వేచ్ఛగా వదిలిపెట్టే, లేక తాను ఖరారుచేసుకొన్న నవుకరీ న్యాయమైనదిగానున్ను యుక్తమైనదిగ

ఒక నవుకరు, ఖావందుయొక్క ఖర్చుమీద తీసుకొనిపోబడ్డ దూరప్రస్థలమందు నవుకరీ చెయ్యడమునకుగాను చేసుకొన్న ఖరారుకు భంగము కలగచెయ్యడము.

నున్ను వుండి సహేతుకమైన కారణములేకుండా ఆ నవుకరీ చెయ్యక తిరగబాటుచేసే యే మనిషి అయినా, ఒక మాసమునకు వ్యాపించ గూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని అట్టి ఖర్చు తాలూకు మొబల్గుకు రెండింతలకన్నా మించని జుల్మానా వల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది; అయితే నవుకరీకి కుదుర్చుకొన్నమనిషి ఆ నవుకరుయెడల దురాగతము జరిగించిగాని తన ఖరారుప్రకారము జరిగించక అశ్రద్ధచేసిగాని వున్నపక్షమునకు ఆ నవుకరు అట్లా శిక్షించబడ నేరదు.

---

## 20-వ అధ్యాయము.

### వివాహముతో యిలాకాగల నేరములనుగురించి.

న్యాయశాస్త్రసమ్మతమైనవివాహము జరిగినదనే నమ్మకము దగామీద కలగజేసే ఒక మనిషివల్ల జరిగించబడ్డ సంభోగము.

493. న్యాయశాస్త్రసమ్మతముగా తనకు వివాహముకాని ఒక స్త్రీ తనకు న్యాయశాస్త్రసమ్మతముగా వివాహము చెయ్యబడ్డట్టు నమ్మేటట్టున్ను అదే నమ్మకము మీాద తనతోటి సంభోగము కలగచేసుకొనేటట్టున్ను దగామీాద జరిగించే ప్రతిమనిషిన్ని, పదిసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్ల శిక్షించబడడమేగాకుండా జుల్మానాకున్నూ పాత్రుడు కావలసినది.

భర్తగాని భార్యగాని జీవించివుండగా పునర్వివాహము చేసుకోవడము.

494. భర్తగాని భార్యగాని జీవించివుండేకాలమందు మరి ఒక వివాహము చేసుకొనేయెడల వారు సజీవులుగా వున్నారనే కారణమునుపట్టి ఆ వివాహము వ్యర్థముగాపోగూడిన సంగతులలో అట్లా మరి ఒక వివాహముచేసుకొనే యేమనిషి అయినా, యేడు సంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు

రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్ల శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడు కావలసినది.

మినహాయింపు.—యుక్తమైన అధికారముగల కోర్టువారివల్ల అట్టి భర్తనుగాని భార్యనుగాని యేమనిషి అయినా చేసుకొన్న వివాహము రద్దుచెయ్యబడ్డపక్షమునకు అట్టి మనిషికిగాని, భర్తగాని భార్యగాని జీవించివున్నప్పటికిన్ని అట్టిభర్తగాని భార్యగాని ఏడుసంవత్సరముల కాలమువరకు పూరా గయిరు హాజరుగావుండి ఆ కాలమునకు లోపుగా జీవించివున్నట్టు యే సమాచారమున్ను తెలియకుండావున్నయెడల అట్టి భర్తగాని భార్యగాని జీవించివుండగా మరివొక వివాహము చేసుకొనే మనిషికిగాని, యీ సెక్షను వ్యాపించనేరదు; అయితే అట్లా మరిఒక వివాహము చేసుకొనేమనిషి, ఆ వివాహము జరగకముందు అట్టి వివాహము చేసుకొనేమనిషితోటి తనకు తెలిసివుండేవరకు అందునుగురించిన సంగతులన్నీ వాస్తవముగా తెలియచెయ్యవలసినది.

495. మరి ఒక వివాహముచేసుకొనే మనిషితోటి పూర్వపు వివాహమునుగురించిన సంగతి చెప్పక దాచి యింతకుముందు అవ్యవహితముగావుండే సెక్షనులో నిర్దేశించబడ్డ నేరము జరిగించే యేమనిషి అయినా, పదిసంవత్సరములకు వ్యాపించగూడని కాలము వరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్ల శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడు కావలసినది.

మరిఒక వివాహము చేసుకొనే మనిషితోటి అంతకు పూర్వము వివాహము జరిగివున్న సంగతి దాచి 494-వ సెక్షనులో నమూదుచెయ్యబడ్డ నేరము జరిగించడము.

496. అయోగ్యముగా, లేక దగాచెయ్యవలెననే వుద్దేశముతోటి వివాహములో జరిగించవలసిన కృత్యములు జరిగించుకొని అందువల్ల తాను న్యాయశాస్త్ర

న్యాయశాస్త్రసమ్మతమయిన వివాహ

ము జరిగించకుండా దగాగా వివాహకృత్యములు జరిగించుకోవడము.

సమ్మతముగా వివాహము చేసుకోలేదని యెరిగివుండే యేమనిషి అయినా, ఏడుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్ల శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడు కావలసినది.

వ్యభిచారము.

497. మరివొక మనిషియొక్క భార్యగావుండే, మరివొకమనిషియొక్క భార్యగావున్నట్టు తాను యెరిగివుండే, లేక నమ్మడమునకు కారణముకలిగివుండే ఒక స్త్రీతోటి ఆమె పెనిమిటియొక్క సమ్మతి, లేక వుపేక్ష లేకుండానున్న స్త్రీని చెరపడము అనే నేరముకాని సంగతులలోనున్న సంభోగముజరిగించే యే మనిషి అయినా, వ్యభిచారము అనే నేరము జరిగించినవాడు అవుతున్నాడు; గనుక అయిదు సంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని ఈ రెంటివల్లగాని శిక్షించబడవలసినది. ఇట్టి సంగతిలో ఆ భార్య కుమ్మకుచేసినమనిషిగా శిక్షించబడకూడదు.

వివాహమైనస్త్రీని నేరముగల వుద్దేశముతోటి ఆశపెట్టి ఆమెను తీసుకొనివెళ్లడము, లేక నిలిపివుంచుకోవడము.

498. మరివొక మనిషియొక్క భార్యగావుండే, మరివొక మనిషియొక్క భార్య అయినట్టు తాను యెరిగివుండే, లేక నమ్మడమునకు కారణముకలిగివుండే ఒక స్త్రీని యేమనిషితోటి అయినా న్యాయశాస్త్ర విరుద్ధమైన సంభోగము జరిగించేలాగున చెయ్యవలెననే వుద్దేశముతోటి ఆమె పెనిమిటివద్దనుంచిగాని అతనితరఫున ఆమెను సంరక్షణలో వుంచుకొనివుండే యేమనిషి వద్దినుంచి అయినాగాని తీసుకొనిపొయ్యే, లేక ఆశపెట్టి తీసుకొనిపొయ్యే, లేక అట్టి యేస్త్రీని అయినా అట్టి వుద్దేశముతోటి దాచే,

లేక నిలిపివుంచుకొనే యేమనిషి అయినా, రెండుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమునరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

---

## 21-వ అధ్యాయము.

### అప్రతిష్ఠ కలగచెయ్యడమునుగురించి.

అప్రతిష్ఠ కలగచెయ్యడము.

499. ఒక మనిషియొక్క పేరుకు హానికలగవలెనని వుద్దేశించి, లేక కలగవచ్చునని యెరిగివుండి, లేక కలగవచ్చునని నమ్మడమునకు కారణముకలిగివుండి చెప్పబడ్డ, లేక చదవవలెనని వుద్దేశించబడ్డ మాటలవల్లగాని సూచనలవల్లగాని కనపడే రూపములవల్లగాని అట్టి యేమనిషినిగురించి అయినా ఆరోపణ చేసే, లేక ప్రసిద్ధపరచే యేమనిషి అయినా, యిందులో యికముందు మినహాయించబడే సంగతులలోతప్ప, ఆ మనిషికి అప్రతిష్ఠ కలగచేసి నట్టు చెప్పబడుతున్నాడు.

వివరణము.—(1) చనిపోయిన మనిషిమీద యేదయినా ఆరోపణ చెయ్యడమువల్ల ఆ మనిషి బ్రతికివున్నపక్షమునకు అది అతని పేరుకు హానికలగచేసేదిగానున్న అతని కుటుంబముయొక్కగాని యితర సమీప బంధువులయొక్కగాని మనస్సుకు ఆయాసము కలగచెయ్యవలెనని వుద్దేశించబడ్డదిగానున్న వున్నయెడల అప్రతిష్ఠ కలగచెయ్యడము అనే నేరము కావచ్చును.

వివరణము.—(2) ఒకసభ, సమాజము, లేక సమూహము, వీటినిగురించి యేదయినా ఆరోపణచెయ్యడము, అప్రతిష్ఠ కలగచెయ్యడము అనే నేరము కావచ్చును.

వివరణము.—(3) అర్థాంతర ద్యోతకముగాగాని ఘుత్సా [illegible] కగా

గాని, చెయ్యబడ్డ ఆరోపణ, అప్రతిష్ఠ కలగచెయ్యడము అనే నేరము కానచ్చును.

వివరణము.—(4) ప్రత్యక్షముగాగాని పరోక్షముగాగాని యితరుల గారన తాత్పర్యమందు ఒక మనిషియొక్క మంచినడతకు, లేక సామర్థ్యమునకు లోపము కలగచెయ్యడము, అతని వర్ణమునుగురించి, లేక వుద్యోగమునుగురించి, అతనియొక్క యోగ్యతకు లోపము కలగచెయ్యడము, లేక ఆమనిషియొక్క ఘురానాకు లోపము కలగచెయ్యడము, లేక ఆమనిషియొక్క శరీరము అసహ్యాకరమయిన స్థితిలోగాని సాధారణముగా అవమానకరమని యెంచబడ్డ స్థితిలోగానివున్నట్టు నమ్మేలాగున చెయ్యడము, యివికాకుండా చేసే ఆరోపణ, ఒక మనిషియొక్క ప్రతిష్ఠకు హానికలగచెయ్యడము అని చెప్పబడివుండలేదు.

## దృష్టాంతములు.

(a) **A** అనేమనిషి, **B** అనే మనిషియొక్క గడియారము **Z** అనేమనిషి దొంగిలించినట్టు నమ్మించవలెనని వుద్దేశించి "**Z** అనేమనిషి, యోగ్యుడు; **B** అనే మనిషియొక్క గడియారము దొంగిలలేదు" అని చెప్పుతున్నాడు. ఈ సంగతి, మినహాయింపులలో దేనికిందికయినా గానియెడల అప్రతిష్ఠ కలగచెయ్యడము అనే నేరముగా వుంటున్నది.

(b) ఎవరో ఒకరు **B** అనే మనిషియొక్క గడియారము యెవరు దొంగిలినారని **A** అనేమనిషిని అడిగినారు. **A** అనేమనిషి, **B** అనే మనిషియొక్క గడియారము **Z** అనేమనిషి దొంగిలించినట్టు నమ్మించవలెనని వుద్దేశించి **Z** అనే మనిషిని కనపరుస్తున్నాడు. ఈ సంగతి, మినహాయింపులలో దేనికిందికయినా రానియెడల అప్రతిష్ఠ కలగచెయ్యడము అనే నేరముగా వుంటున్నది.

(c) **A** అనేమనిషి, **B** అనే మనిషియొక్క గడియారము **Z** అనేమనిషి దొంగిలించినట్టు నమ్మించవలెనని వుద్దేశించి **B** అనే మనిషియొక్క గడియారము **Z** అనేమనిషి యెత్తుకొని పారిపోతూవున్నట్టు **Z** అనే మనిషియొక్క తస్వీరు ఒకటి వ్రాస్తున్నాడు. ఈ సంగతి, మినహాయింపులలో దేనికిందికి అయినా రానియెడల అప్రతిష్ఠ కలగచెయ్యడము అనే నేరముగా వుంటున్నది.

మొదటిమినహాయింపు.—జనుల మేలుకొరకు ఒక వాస్తవమైన సంగతి ఆరోపణచెయ్యడము, లేక ప్రసిద్ధపరచడము జరూరయినయెడల యే మనిషినిగురించి అయినా అట్లా వాస్తవముగావుండే యేదయినా సంగతిని ఆరోపించడము, అప్రతిష్ఠ కలగచెయ్యడము అనే నేరము కానేరదు. అది, జనుల మేలుకొరకు అవునా కాదా అని ఆ సంగతులనుపట్టి పరిష్కరించవలసినది.

జనులమేలుకొరకు చెయ్యవలసిన లేక ప్రసిద్ధపరచవలసిన వాస్తవమైన సంగతిని ఆరోపించుట.

రెండోమినహాయింపు.—ఒక పబ్లిక్ వుద్యోగస్థుడు తన పబ్లిక్ పనులు జరిగించడమందు అతనియొక్క నడతనుగురించిన్ని అట్టి నడతవల్ల కనపడేవరకు అతని యోగ్యతనుగురించిన్ని కృత్రిమము లేకుండా ఏదయినా అభిప్రాయము తెలియచెయ్యడము, అప్రతిష్ఠ కలగచెయ్యడము అనే నేరము కానేరదు.

పబ్లిక్ వుద్యోగస్థునియొక్క పబ్లిక్ నడత.

మూడోమినహాయింపు.—జనోపయోగమయిన ఒక సంగతిలో ఒక మనిషియొక్క నడతనుగురించిన్ని అట్టి నడతవల్ల కనపడేవరకు అతని యోగ్యతనుగురించిన్ని కృత్రిమము లేకుండా యేదయినా అభిప్రాయము తెలియచెయ్యడము, అప్రతిష్ఠ కలగచెయ్యడము అనే నేరము కానేరదు.

జనోపయోగమైన యేదయినా సంగతిని గురించి ఏమనిషియొక్క అయినా నడత.

## దృష్టాంతము.

జనోపయోగమైన ఒక సంగతినిగురించి గవర్నమెంటుకు అర్జీయివ్వడమందు, జనోపయోగమైన ఒక సంగతినిగురించి జనులు కూడేలాగున అడుక్కోబడ్డ పత్రికలో సంతకము చెయ్యడమందు, అట్టి సభలో అధ్యక్షుడుగా వుండడమందు, లేక అందులో ఒకడుగా తాను వుండడమందు, జనులసహాయముకోరే యేదయినా సమాజము యేర్పాటుచెయ్యడమందు, లేక అందులో తాను ఒకడుగా వుండడమందు యే వుద్యోగము గాని పనులు బాగా జరిగించడము జనులకు ముఖ్యమో అట్టి వుద్యోగము పొందే

లాగున ఒకానొక మనిషికొరకు అభిప్రాయము చెప్పడమందు, లేక అతనిపక్షముగా మాట్లాడడమందు Z అనే మనిషియొక్క నడతనుగురించి A అనేమనిషి కృత్రిమము లేకుండా యేదయినా అభిప్రాయము తెలియచేసినయెడల అది అప్రతిష్ఠ కలగచెయ్యడము అనే నేరము కానేరదు.

కోర్ట్లు చర్యలయొక్క రిపోర్ట్లు ప్రసిద్ధపరచడము.

నాలుగోమినహాయింపు.—ఒక కోర్టు ఆఫ్ జస్టీసుయొక్క చర్యలనుగురించిన, లేక అట్టి చర్యలయొక్క ఫలితార్థమునుగురించిన ముఖ్యాంశములలో వాస్తవముగా వుండే రిపోర్టు ప్రసిద్ధపరచడము, అప్రతిష్ఠ కలగ చెయ్యడము అనే నేరము కానేరదు.

వివరణము.—ఒక కోర్టు ఆఫ్ జస్టీసులో విచారణకుముందు వెల్లడిగావుండే కోర్టులో విచారణజరిగించే జస్టిస్ అఫ్‌ది పీస్‌గారుగాని యితర ఆఫీసరుగారుగాని యీపై సెక్షనుయొక్క అర్థమందు ఒక కోర్టుగా వున్నట్టు యెంచబడవలసినది.

కోర్టులో తీర్పుచెయ్యబడ్డ వ్యాజ్యపుసారాంశములు, లేక అందులో సంబంధము కలిగివుండే సాక్షులయొక్కయు యితరులయొక్కయు నడత.

అయిదోమినహాయింపు.—సివిల్ యిలాకాగలది అయినాసరే క్రిమినల్ యిలాకాగలది అయినాసరే కోర్టు ఆఫ్ జస్టీసువారివల్ల తీర్పుచెయ్యబడ్డ యేదయినా వ్యాజ్యపు సారాంశములనుగురించిగాని అట్టి యే వ్యాజ్యములోనయినా కక్షిదారుడుగా, సాక్షిగా, లేక వక్కీలుగావుండే ఏమనిషియొక్క అయినా నడతను గురించిగాని ఆ నడతవల్ల కనపడేవరకు ఆ మనిషియొక్క అట్టి యోగ్యతనుగురించిగాని అంతమట్టుకు మాత్రము కృత్రిమములేకుండా యేదయినా అభిప్రాయము చెప్పడము అప్రతిష్ఠ కలగ చెయ్యడము అనే నేరము కానేరదు.

దృష్టాంతములు.

(a) A అనేమనిషి, "ఆ విచారణలో D అనే మనిషియొక్క సాక్ష్యము చాలా పరస్పరవిరోధముగా వున్నందున అతను మందమతిగాగాని అయోగ్యుడుగా

గాని వుండవలసినదని నాకు తోస్తున్నది" అని చెప్పుతున్నాడు. A అనేమనిషి, యీ మాట కృత్రిమములేకుండా చెప్పినపక్షమునకు మినహాయింపులోకి వస్తున్నాడు. ఎందు వల్లనంటే,—A అనేమనిషి D అనే మనిషియొక్క నడతనుగురించి చెప్పిన అభిప్రాయము, D అనేమనిషి సాక్ష్యము చెప్పడమందు అతని నడతవల్ల కనపడేటంతవరకు మాత్రము అతనియోగ్యతను గురించినదిగానున్న అంతకంటె యెక్కువకాకుండా నున్న వుంటున్నది.

(b) అయితే A అనేమనిషి, "D అనేమనిషి, యాథార్థము లేనిమనిషి అని నేను యెరుగుదును గనుక ఆ విచారణలో అతడు చెప్పినమాట నేను నమ్మను" అని చెప్పినయెడల A అనేమనిషి యీ మినహాయింపులోకి రానేరడు. ఎందువల్లనంటే— D అనే మనిషియొక్క యోగ్యతనుగురించి A అనేమనిషి చెప్పిన అభిప్రాయము, సాక్ష్యములో D అనే మనిషియొక్క నడతనుచూచి యేర్పాటుచెయ్యబడ్డది కాదు.

జనుల అంగీకారముకొరకు జరిగించబడ్డ సంగతియొక్క యోగ్యతలు.

ఆరోమినహాయింపు.—జనుల అంగీకారముకొరకు చెయ్యబడ్డ దేనియొక్క అయినా యోగ్యతలను గురించిగాని అందులో కనపడేవరకు దాన్ని చేసిన మనిషియొక్క యోగ్యతలనుగురించిగాని కృత్రిమములేకుండా యేదయినా అభిప్రాయము చెప్పడము, అప్రతిష్ఠ కలగ చెయ్యడము అనే నేరము కానేరదు.

వివరణము.—ఒకమనిషి, తాను చేసినదాన్ని జనుల అభిప్రాయమునకు లోబరచినట్టు స్పష్టముగాగాని జనుల అభిప్రాయమునకు లోబరచినట్టు గ్రంథకర్త కనపరచిన కార్యములవల్ల భావద్యోతకముగా గాని నూపించవచ్చును.

## దృష్టాంతములు.

(a) ఒక పుస్తకము ప్రసిద్ధపరచే ఒకమనిషి, జనుల అభిప్రాయమునకు ఆ పుస్తకము లోబరుస్తున్నాడు.

(b) జనులయెదుట ప్రసంగముచేసే ఒకమనిషి, జనుల అభిప్రాయమునకు ఆ ప్రసంగము లోబరుస్తున్నాడు.

(c) సర్వజన సాధారణమయిన రంగస్థలమందు నటించిన నటుడు, లేక పాడే పాటకుడు తన నటనము, లేక పాట సర్వజనుల అభిప్రాయమునకు లోబరుస్తున్నాడు.

(d) A అనేమనిషి, D అనే మనిషివల్ల ప్రసిద్ధపరచబడ్డ ఒక పుస్తకమును గురించి "D అనే మనిషియొక్క పుస్తకము పిచ్చిపిచ్చిగావున్నది. D అనే మనిషి అసమర్థుడుగా వుండవలెను. D అనే మనిషియొక్క పుస్తకము పోకిరీ పుస్తకముగా వున్నది. D అనేమనిషి భ్రష్టమయిన మనస్సుగలవాడుగా వుండవలసినది" అని చెప్పుచున్నాడు. కృత్రిమములేకుండా A అనేమనిషి యీమాట చెప్పినపక్షమునకు అతడు యీ మినహాయింపులోకి వస్తున్నాడు ఎందువల్లనంటే,—D అనే మనిషి యొక్క యోగ్యతనుగురించి అతను చెప్పిన అభిప్రాయము, D అనే మనిషియొక్క పుస్తకమువల్ల కనపడేవరకు మాత్రము అతని యోగ్యతనుగురించినదిగా వుంటున్నది.

(e) అయితే A అనేమనిషి, "D అనేమనిషి అసమర్థుడుగానున్ను పోకిరీగానున్ను వున్నందున అతను ప్రసిద్ధపరచిన పుస్తకము పిచ్చిపిచ్చిగానున్ను పోకిరీతనముగానున్ను వుండడమునుగురించి నాకు ఆశ్చర్యముగా వుండలేదు" అని చెప్పిన పక్షమునకు అతను యీ మినహాయింపులోకి కానేరడు - యెందువల్లనంటే—D అనే మనిషి యొక్క యోగ్యతనుగురించి తెలియచేసే అభిప్రాయము, D అనే మనిషియొక్క పుస్తకముమీద యేర్పాటు చెయ్యబడివుండలేదు.

మరిఒక మనిషిమీద న్యాయశాస్త్రసమ్మతమైన అధికారముగల ఒకమనిషి కృత్రిమము లేకుండా కూకలు వెయ్యడము.

ఏడో మినహాయింపు.—న్యాయశాస్త్రమునుపట్టి కలగచెయ్యబడ్డది అయినాసరే న్యాయశాస్త్రసమ్మతమయిన ఒడంబడికవల్ల సంభవించినది అయినాసరే ఒకమనిషి మీద అధికారముకలిగివుండే యేమనిషి అయినా, అట్టి న్యాయశాస్త్ర సమ్మతమయిన అధికారము తాకేటి యిలాకా కలిగివున్న సంగతులలో అట్టి యితరమనిషియొక్క నడతనుగురించి కృత్రిమములేకుండా కూకలువెయ్యడము, అప్రతిష్ఠ కలగచెయ్యడము అనే నేరము కానేరదు.

దృష్టాంతము.

ఒక సాక్షియొక్కగాని కోర్టుతాలూకు ఆఫీసరుయొక్కగాని నడతనుగురించి కృత్రిమములేకుండా కూకలువేసే ఒక జడ్జీగారు, తన అధికారముకింద వుండేవారిని

కృత్రిమములేకుండా కూకలువేసే ఒక డిపార్టుమెంటు తాలూకు అధికారి; యితర పిల్లలయెదట కృత్రిమములేకుండా ఒక పిల్లను కూకలువేసే తలితండ్రులు; తలితండ్రులవల్ల కలగచెయ్యబడ్డ అధికారమునుపట్టి యితర శిష్యులయెదట ఒక శిష్యుణ్ని కృత్రిమములేకుండా కూకలువేసే బడిపుపాధ్యాయులు; నవుకరీలో అజాగ్రతనుగురించి కృత్రిమములేకుండా ఒక నవుకరును కూకలువేసే ఖావందు; వుద్యోగధర్మమునుపట్టి ఖజాంజీయొక్క నడతనుగురించి కృత్రిమములేకుండా తన ఖజాంజీని కూకలువేసే సాహుకారు; వీరు యీ మినహాయింపులోకి వస్తున్నారు.

అధికారము పొందిన మనిషివద్ద కృత్రిమములేకుండా ఫిర్యాదుచెయ్యడము.

ఎనిమిదో మినహాయింపు.—ఫిర్యాదుకు ఆధారముగా వుండే సంగతినిగురించి ఒక మనిషిమీద న్యాయశాస్త్రసమ్మతమైన అధికారముగలవారిలో యెవరివద్దనైనా కృత్రిమములేకుండా ఆమనిషిమీద ఫిర్యాదుచెయ్యడము, అప్రతిష్ఠ కలగచెయ్యడము అనే నేరము కానేరదు.

దృష్టాంతము.

A అనేమనిషి ఒక మెజిస్ట్రేటుగారివద్ద D అనే మనిషిమీద కృత్రిమములేకుండా ఫిర్యాదుచేసినపక్షమునకు, A అనేమనిషి ఒక నవుకరు అయిన D అనేమనిషియొక్క నడతనుగురించి D అనే మనిషియొక్క ఖావందువద్ద కృత్రిమములేకుండా ఫిర్యాదుచేసినపక్షమునకు, A అనేమనిషి D అనేపిల్లయొక్క నడతనుగురించి D అనే పిల్లయొక్క తండ్రివద్ద కృత్రిమములేకుండా ఫిర్యాదుచేసినపక్షమునకు యీ దరోబస్తు సంగతులలో A అనేమనిషి యీ మినహాయింపులోకి వస్తున్నాడు.

తన లేక యితరుల హక్కుల సంరక్షణకొరకు కృత్రిమములేకుండా మనిషివల్లచెయ్యబడ్డ ఆరోపణం.

తొమ్మిదో మినహాయింపు.—మరియొక మనిషియొక్క యోగ్యతమీద ఆరోపణచెయ్యడము, ఆ ఆరోపణచేసే మనిషియొక్క, లేక యితరమనిషియొక్క హక్కులు సంరక్షణచెయ్యడముకొరకుగాని జనుల మేలుకొరకుగాని కృత్రిమములేకుండా చెయ్యబడ్డయెడల అప్రతిష్ఠ కలగచెయ్యడము అనే నేరము కానేరదు.

దృష్టాంతములు.

(a) ఒక దుకాణము వుంచుకొనివుండే A అనేమనిషి, తనపనులు చూస్తూ వుండే B అనే మనిషితోటి, "Z అనే మనిషియొక్క యోగ్యతనుగురించి తనకు మంచితాత్పర్యము లేనందున అతను నగదుగా పయికము చెల్లిస్తేనేతప్ప, అతనికి ఏమిన్ని విక్రయించవద్దు" అని చెప్పుతున్నాడు. A అనేమనిషి, తనహక్కులయొక్క సంరక్షణకొరకు కృత్రిమములేకుండా Z అనే మనిషిమీద యీ ఆరోపణచేసినపక్షమునకు మినహాయింపులోకి వస్తున్నాడు.

(b) ఒక మేజిస్ట్రేటుఅయిన A అనేమనిషి, తనపయి అధికారస్థునికి రిపోర్టు చెయ్యడములో Z అనే మనిషియొక్క యోగ్యతనుగురించి యేదయినా ఒక ఆరోపణచేస్తున్నాడు. ఇందులో ఆ ఆరోపణ అనేది, కృత్రిమములేకుండానున్ను జనుల మేలుకొరకున్ను చెయ్యబడివున్నపక్షమునకు A అనేమనిషి యీ మినహాయింపులోకి వస్తున్నాడు.

పదో మినహాయింపు.—ఒకమనిషికి మరియొకమనిషినిగురించి కృత్రిమములేకుండా హెచ్చరికచెయ్యడము, ఆ హెచ్చరికచెయ్యబడ్డ మనిషియొక్క, లేక అట్టి మనిషినిగురించి అక్కరకలిగివుండే ఏ యితరమనిషియొక్క అయినా మేలుకొరకుగాని జనుల మేలుకొరకుగాని అని వుద్దేశించబడివున్నపక్షమునకు, అప్రతిష్ఠ కలగచెయ్యడము, అనే నేరము కానేరదు.

*హెచ్చరిక చెయ్యబడ్డవానియొక్క లేక జనులయొక్క మేలుకొరకు ఉద్దేశింపబడ్డహెచ్చరిక.*

500. మరియొకమనిషికి అప్రతిష్ఠ కలగచేసే ఏమనిషి అయినా, రెండుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు సాధారణమయిన ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

*అప్రతిష్ఠ కలగచేసినపక్షమునకు శిక్ష.*

501. ఏమనిషికి అయినా అప్రతిష్ఠ కలగచేసేది అని యెరిగివుండే, లేక అటువంటిది అని నమ్మడమునకు కారణముకలిగివుండే ఏదయినా ఛాపావేసే లేక చెక్కే-

*అప్రతిష్ఠ కలగచేసేది అని తెలిసివుండే*

యేదయినా ఛాపా వెయ్యడము, లేక చెక్కడము.

యేమనిషి అయినా, రెండుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు సాధారణమయిన ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

అప్రతిష్ఠ కలగచేసే సంగతులు కలిగివుండే ఛాపావెయ్యబడ్డ, లేక చెక్కబడ్డ యేదయినా విక్రయించడము.

502. ఛాపావెయ్యబడ్డ, లేక చెక్కబడ్డ యేదయినా అప్రతిష్ఠ కలగచేసే సంగతులు కలిగివున్నట్టు యెరిగివుండి అట్టివస్తువ విక్రయించే, లేక అమ్మజూపే ఏమనిషి అయినా, రెండుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు సాధారణమయిన ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

---

## 22-వ అధ్యాయము.

### దౌర్జన్యముగా జడిపించడము, పరిభవపరచడము, బాధపెట్టడము, వీటినిగురించి.

దౌర్జన్యముగా జడిపించడము.

503. ఒకమనిషికి భయముకలగచెయ్యవలెననే వుద్దేశముతో, లేక భయపరచబడ్డ ఆ మనిషి తనను జడిపించినసంగతులను తప్పించుకోవలెననే తాత్పర్యముతో అతడు జరిగించడమునకు న్యాయశాస్త్రసమ్మతముగా బద్ధుడుకాకుండావుండే యేదయినా కార్యము జరిగించేలాగునగాని ఆమనిషి జరిగించడమునకు న్యాయశాస్త్రసమ్మతమయిన హక్కు కలిగివుండే యేదయినా కార్యము జరిగించకపొయ్యేలాగునగాని చెయ్యవలెననే వుద్దేశముతో అట్టి మనిషియొక్క శరీరమునకు, ప్రతిష్ఠకు, లేక ఆస్తికిగాని ఆమనిషి అక్కరకలిగివుండే యే యితరమనిషియొక్క అయినా శరీరమునకు, లేక ప్రతిష్ఠకుగాని యేదయినా చెరుపు కలగచేసేటట్టు జడిపించే ఏమనిషి అయినా, దౌర్జన్యముగా జడిపించడము అనేనేరము జరిగించినవాడు అవుతున్నాడు.

వివరణము.—జడిపించబడ్డమనిషి అక్కరకలిగివుండే చనిపోయిన యేమనిషియొక్క అయినా ప్రతిష్ఠకు చెరుపు కలగచేసేలాగున జడిపించడము, యీ సెక్షనుకిందికి వస్తున్నది.

దృష్టాంతము.

**A** అనేమనిషి, ఒక సివిల్ వ్యాజ్యము జరిగించకుండా **B** అనేమనిషి మానుకొనేలాగున చెయ్యడముకొరకు **B** అనే మనిషియొక్క యిల్లు తగలపెట్టుతానని జడిపిస్తున్నాడు. **A** అనేమనిషి, దౌర్జన్యముగా జడిపించడము అనే నేరమునుగురించి నేరస్థుడు అవుతున్నాడు.

అల్లర కలగచెయ్యావలెననే వుద్దేశముతోటి బుద్ధిపూర్వకముగా పరిభవపరచడము.

504. ఏమనిషిని అయినా పరిభవపరచడమునుపట్టి కలిగే ఆగ్రహకారణమువల్ల అట్టిమనిషి, అల్లర, లేక ఏదైనా యితరనేరము జరిగించేటట్టు చెయ్యావలెనని వుద్దేశించిగాని అతడు అట్లా జరిగించవచ్చునని యెరిగివుండిగాని అతణ్ని బుద్ధిపూర్వకముగా పరిభవపరచి ఆగ్రహకారణము కలగచేసే యేమనిషి అయినా, రెండుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

జనసామాన్యమునకు కీడును కలుగఁజేయనగు సంగతులు.

505. ఏమనుష్యుఁడైన,—

(a) శ్రీ రాణిగారి (ఆర్మి) సేనలోఁగాని (నేవి) నావికసేనలోఁగాని రాయల్ ఇండియన్ మెరీన్ ట్రూప్స్‌లోఁగాని ఇంపీరియల్ సర్వీస్ ట్రూప్స్‌లోఁగాని యెవరయిన ఆఫిసరు సోల్జరు లేక సెయిలరు తిరుగుబాటు చేయునట్లుగా లేక తనపనిని మఱియొకవిధముగా నిర్లక్ష్య పెట్టు

నట్లుగా లేక చేయకపోవునట్లుగా చేయవలయుననెడి యుద్దేశముతో, లేక బహుశః అట్లు చేయఁదగియున్న, లేక

(b) ఏ మనుష్యునికైన రాజ్యమునకు వ్యతిరేకమైనట్టిగాని జనుల నెమ్మదికి భంగకరమైనట్టిగాని యేదయిన నేరమును చేయుటకు పూన్చునట్టి భయమును లేక గాబరాను జనసామాన్యమునకుఁగాని జనసామాన్యములో ఏ భాగమువారికయినఁగాని కలుగఁజేయవలయుననెడి యుద్దేశముతో, లేక బహుశః అట్లు చేయఁదగియున్న, లేక

(c) ఏ తెగవారైన లేక తరగతివారైన మఱియొక తెగవారి మీఁద లేక తరగతివారిమీఁద ఏదైన నేరమును జరగించునట్లు ప్రోత్సాహము కలిగించవలయుననెడి యుద్దేశముతో లేక బహుశః కలిగింపఁదగియున్న,

ఏదయిన సంగతిని, వదంతిని లేక రిపోర్టును కావించినయెడల లేక ప్రకటించినయెడల లేక ప్రసరింపఁజేసినయెడల, అతఁడు రెండుసంవత్సరములమట్టుకు కయిదుతోఁగాని జుల్మానాతోఁగాని లేక రెంటితోఁగాని శిక్షింపఁబడవలయును.

మినహాయింపు.—అట్టి యేదయిన సంగతిని, వదంతిని లేక రిపోర్టును కావించెడి, ప్రకటించెడి లేక ప్రసరింపఁజేసెడి మనుష్యుఁడు, అట్టి సంగతి, వదంతి లేక రిపోర్టు వాస్తవమని నమ్ముటకు తగిన కారణములు కలిగియుండి, పైఁజెప్పఁబడిన అట్టి యే యుద్దేశము లేకుండ దానిని కావించినయెడల, ప్రకటించినయెడల లేక ప్రసరింపఁజేసినయెడల, అది ఈ సెక్షను తాత్పర్యప్రకారము నేరము కానేరదు.

దౌర్జన్యముగా జడిపించినపక్షమునకు శిక్ష.

506. దౌర్జన్యముగా జడిపించడము అనే నేరము జరిగించే యేమనిషి అయినా, రెండుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతెర

హాలలో ఒకతరహా ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని యీ రెంటివల్ల గాని శిక్షించబడవలసినది;

జడిపించడము అనేది మరణము, లేక బలమయినఘాత కలగచెయ్యడమునుగురించిఅయినపక్షమునకు.

మరిన్ని మరణముగాని బలమయిన ఘాతగాని అగ్నివల్ల ఏదైనా ఆస్తియొక్క నశింపుగాని మరణమువల్ల, లేక ద్వీపాంతరవాసమువల్ల, లేక ఏడుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు ఖయిదువల్ల శిక్షించబడతగ్గ ఒక నేరముగాని ఒక స్త్రీయందు జారత్వము ఆరోపించడముగాని సంభవించవలెనని జడిపించినయెడల ఏడుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతెరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

పేరులేని లిఖితముద్వారా దౌర్జన్యముగా జడిపించడము.

507. పేరులేకుండాగాని జడిపించిన మనిషియొక్కపేరు, లేక నాసస్థలము మభ్యపరచేలాగున జాగ్రతచేసిగాని యేదయినా లిఖితముద్వారా దౌర్జన్యముగా జడిపించడము అనే నేరము జరిగించే ఏమనిషి అయినా, ఆ నేరమునుగురించి యింతకుముందు అవ్యవహితముగావుండే సెక్షనువల్ల నిర్ణయించబడ్డ శిక్షగాక రెండుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్ల శిక్షించబడవలసినది.

దేవుని ఆగ్రహమునకు పాత్రుడు అవుతున్నాడు అని ఒక మనిషి నమ్మేటట్టు

508. ఒకమనిషి జరిగించేటట్టు చేసేలాగున నేరస్థుడుకోరే ఒక కార్యము అతను చెయ్యకపోయినపక్షమునకు, లేక అతను జరిగించకపొయ్యేలాగున చెయ్యవలెనని నేరస్థుడుకోరే ఒక కార్యము చేసినపక్షమునకు అతనుగాని అతను అక్కర కలిగివుండే మరి యేమనిషి

చేసి అతనివల్ల ఒక కార్యము జరిగించబడేటట్టు చెయ్యడము.

అయినాగాని దేవుని ఆగ్రహమునకు పాత్రుడు అవుతున్నాడు, లేక నేరస్థుడు జరిగించే ఒక కార్యమువల్ల అట్లా ఆగ్రహమునకు పాత్రుడు అయ్యేలాగున చెయ్యబడుతున్నాడు అని ఆమనిషిని నమ్మించడమువల్ల, లేక నమ్మించవలెనని ప్రయత్నము చెయ్యడమువల్ల,

ఆమనిషి తాను జరిగించడమునకు న్యాయశాస్త్రరీత్యా బద్ధుడు కాని యేదయినా కార్యము జరిగించేటట్టు, లేక అతను జరిగించడమునకు న్యాయశాస్త్రరీత్యా హక్కు కలిగివుండే యేదయినాకార్యము జరిగించకపొయ్యేటట్టు స్వేచ్ఛగాచేసే, లేక చెయ్యడమునకు యత్నించే యేమనిషి అయినా,

ఒకసంవత్సరమునకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

దృష్టాంతములు.

(a) A అనేమనిషి తాను అభోజనము కూర్చుండడమువల్ల Z అనేమనిషి దేవుని ఆగ్రహమునకు పాత్రుడు అవుతున్నాడు అని నమ్మించవలెననే ఉద్దేశముతోటి Z అనే మనిషియొక్క గుమ్మమువద్ద ఆప్రకారము కూర్చుంటున్నాడు. A అనే మనిషి, యీ సెక్షనులో నిర్దేశించబడ్డ నేరము జరిగించినవాడు అవుతున్నాడు.

(b) Z అనేమనిషి, ఒకానొకకార్యము జరిగించనియెడల అతను దేవుని ఆగ్రహమునకు పాత్రుడు అవుతున్నాడు అని నమ్మే సంగతులనుపట్టి A అనేమనిషి, తన స్వంతపల్లలలో ఒక పిల్లను తాను చంపుతానని జడిపిస్తున్నాడు. A అనేమనిషి, యీ సెక్షనులో నిర్ధారణచెయ్యబడ్డ నేరము జరిగించినవాడు అవుతున్నాడు.

స్త్రీయొక్క శిగ్గు చెరపవలెనని వుద్దేశం

509. ఏ స్త్రీయొక్క అయినా శిగ్గు చెరపవలెననే వుద్దేశముతో ఆమె వినవలెనని యేదయినామాటచేప్పే, లేక ధ్వని చేసే, లేక ఆమె చూడవలెనని యేదయినా కన

చబడ్డమాట, అంగ విక్షేపము, లేక కార్యము.

పరచే, లేక అంగవిక్షేపముచేసే, లేక అట్టి స్త్రీవుండే యేకాంతస్థలమందు అక్రమముగా ప్రవేశించే యే మనిషి అయినా, ఒకసంవత్సరమునకు వ్యాపించ గూడిన కాలమువరకు సాధారణమైన ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

తప్పతాగిన మనుష్యులవల్ల బహిరంగమైన స్థలమందు జరిగించబడే దుర్నడత.

510. తప్పతాగిన స్థితిలోవుండి యేదయినా బహిరంగమయిన స్థలమునకుగాని తాను అక్కడికి ప్రవేశించినయెడల అతిక్రమమైన ప్రవేశము అనే నేరము అయ్యే యే స్థలమునకు అయినాగాని. వెళ్లి అక్కడ యేమనిష్షికి అయినా బాధకలగతగ్గ తరహాను ప్రవర్తించే యే మనిషి అయినా, యిరవయినాలుగు గంటలకు వ్యాపించకూడిన కాలమువరకు సాధారణమయిన ఖయిదువల్లగాని పదిరూపాయిలకు వ్యాపించకూడిన జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

---

## 23-వ అధ్యాయము.

### నేరములు జరిగించవలెనని ప్రయత్నములు చెయ్యడమునుగురించి.

ద్వీపాంతర వాసమువల్ల, లేక ఖయిదువల్ల శిక్షించబడతగ్గ నేరము జరిగించవలెనని ప్రయత్నముచేసినపక్షమునకు శిక్ష.

511. ద్వీపాంతరవాసమువల్లగాని ఖయిదువల్లగాని యీ స్మృతిని పట్టి శిక్షించబడతగ్గ ఒక నేరము జరిగించవలెనని, లేక అట్టి నేరము జరిగేటట్టు చెయ్యవలెనని ప్రయత్నముచేసి అట్టి ప్రయత్నములో ఆ నేరము జరిగించడమునుగురించి యేమాత్రమయినా ఒక కార్యము చేసే యేమనిషి అయినా, అట్టి ప్రయత్నమునుగురించి శిక్షించడముకొరకు నిర్ణయముగా యీ స్మృతివల్ల నిబంధన కలగ

చెయ్యబడివుండని సంగతిలో అట్టి నేరమునకుగాను నిర్ణయించబడ్డ ద్వీపాంతరవాసము, తాలూకు లేక ఖయిదుతాలూకు అతి దీర్ఘమయిన కాలములో సగమునకు వ్యాపించకూడిన కాలమునరకు ద్వీపాంతరవాసమువల్లగాని, ఆ నేరమునకుగాను నిర్ణయించబడివుండే తరహాదారీగల ఖయిదువల్లగాని ఆ నేరమునకుగాను నిర్ణయించబడివుండే జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

## దృష్టాంతములు.

(a) A అనేమనిషి, ఒకపెట్టె బద్దలుకొట్టి అందులోవుండే కొన్ని ఆభరణములు దొంగిలవలెనని వుద్దేశముతో ఆప్రకారము పెట్టె తీసిన తర్వాత అందులో యేమిన్ని లేనట్టు కనుక్కొంటున్నాడు. అతను చోరీ జరిగించడముకొరకు ఒకకార్యము జరిగించినాడు, గనుక యీ సెక్షనునుపట్టి నేరస్థుడు అవుతున్నాడు.

(b) A అనేమనిషి, Z అనే మనిషియొక్క జేబులోకి చెయిదూర్చి జేబులో వుండే వస్తువులు దొంగిలవలెనని ప్రయత్నము చేస్తున్నాడు. Z అనే మనిషియొక్క జేబులో యేమిన్ని లేనందున A అనేమనిషియొక్క ప్రయత్నము వ్యర్థముగుపోతున్నది: అయినప్పటికిన్ని A అనేమనిషి, యీ సెక్షనునుపట్టి నేరము జరిగించినవాడు అవుతున్నాడు.

## 1921 వ సంవత్సరపు నె 16 రు ఆక్టు.

## ఇండి యా దేశపు పీనల్ కోడును (శిక్షాస్మృతిని) ఇంకను సవరించుటకైన ఆక్టు.

---

ఇండియన్ పీనల్ కోడును ఇంకను సవరించుట యుక్తముగానున్నందున ఇందుమూలముగా నీ క్రింది విధమున శాసించడమైనది :—

సంగ్రహ నామము

1. ఈ ఆక్టును 1921 వ సంవత్సరపు ఇండియన్ పీనల్ కోడు (సవరణ) ఆక్టు అని చెప్పవచ్చును.

ఇండియన్ పీనల్ కోడు, 121 వ, 122 వ సెక్షనుల యొక్క సవరణ.

2. (ఇటుతరువాత సదరు కోడు అని చెప్పబడు) ఇండియన్ పీనల్ కోడుయొక్క 121 వ, 122 వ సెక్షనులలో ఉన్న "అతని తాలూకు యావదాస్తిన్ని దండుగకింద పుచ్చుకోబడవలసినది" అను మాటలకు బదులు "జుల్మానాకున్ను పాత్రుడు కావలసినది." అను మాటలను ఉంచవలెను.

ఇండియన్ పీనల్ కోడు 121 A సెక్షనుయొక్క సవరణ.

3. సదరు కోడుయొక్క 121 a సెక్షను చివరను "మరియు జుల్మానాకుగూడ పాత్రుడుకావలసినది." అను మాటలను ఉంచవలెను.

ఇండియన్ పీనల్ కోడు 61, వ 62 వ సెక్షనులను రద్దు చేయుట.

4. సదరు కోడుయొక్క 61, 62 సెక్షనులు ఇందు మూలముగా రద్దుచేయబడుచున్నవి.

## 1923-వ సంవత్సరపు ని 20 వ అక్టు.

ఇండియా దేశపు పీనల్ కోడును ఇంకను సవరించుటకైన అక్టు.

స్త్రీ, శిశు సంబంధమైన వ్యాపారమును అణచివేయుటకుగాను అంతర్జాతీయ ఒడంబడికలోని కొన్ని నిబంధనల నమలులోనికి తెచ్చుటకైన అక్టు—

సంగ్రహనామమును, ప్రారంభమును.

1. (1) ఈ అక్టు 1923-వ సంవత్సరపు ఇండియను పీనలుకోడు (సవరణ)అక్టు అని చెప్పవచ్చును.

(2) ఇది ఆలోచన సభతో కూడిన గవర్నరు జనరలుగారు ఇండియా గెజెట్టులో ప్రకటనమూలముగా నియమించగలట్టి తేదిని అమలులోనికి రావలెను.

366-వ సెక్షనుయొక్క సవరణ.

2. సదరు కోడుయొక్క 366-వ సెక్షనుకు ఈ క్రింది పేరగ్రాఫును చేర్పవలెను, అది యేమనగా:—

"మరియు ఈ కోడులో నిర్వచింపబడిన ప్రకారము దౌర్జన్యముగా జడిపించుట మూలముగాగాని, అధికారమును దుర్వినియోగము చేయుటమూలముగాగాని లేదా యే యితర నిర్బంధసాధనము మూలముగాగాని ఏ స్త్రీనైన, ఆమె మరియొకమనిషితో శాస్త్రవిరుద్ధమైన సంభోగమునకు బలవంత పెట్టబడవచ్చును లేదా ప్రేరేపింపబడవచ్చును అను ఉద్దేశముతో లేదా అమె అట్లు బహుశః బలవంత పెట్టబడును లేదా ప్రేరేపింపబడును అని తెలిసియుండియు, ఏ స్థలమునుండియైన పోవుటకు ప్రోత్సాహము చేయు ఏ మనిషియైననుగూడ పైన చెప్పబడినట్లు శిక్షింపబడతగి యుండవలెను."

366A, 366B అను క్రొత్త సెక్షనుల నుంచుట.

**3** సదరు కోడుయొక్క 366-వ సెక్షను తరువాత, ఈ క్రింది సెక్షనులను ఉంచవలెను, అవి యేవనగా:—

**366-A.** పదునెనిమిది సంవత్సరముల వయస్సునకు లోపునుండు యుక్తవయస్సురాని ఏ బాలికనైనను, అట్టి బాలిక మరియొక మనుష్యునితో శాస్త్రవిరుద్ధమైన సంభోగమునకు బలవంతపెట్టబడవచ్చును లేదా ప్రేరేపింపబడవచ్చును అను ఉద్దేశముతో లేదా ఆమె అట్లు బహుశః బలవంతపెట్టబడును లేదా ప్రేరేపింపబడును అని తెలిసియుండియు ఏ స్థలమునుండియైనను పోవుటకు లేదా ఏపనినైనను చేయుటకు ప్రోత్సాహపెట్టు ఏమనిషియైనను పది సంవత్సరములవరకు వ్యాపించగల ఖయిదుతో శిక్షింపబడతగియుండవలెను మరియు జుల్మానాకూడ విధింపబడతగియుండవలెను.

**366-B.** ఇండియాకు వెలుపల ఏదేశమునుండియయిన ఇరువదియొక్క సంవత్సరముల వయస్సునకు లోపునుండు ఏ బాలికనైనను, ఆమె మరియొక మనుష్యునితో శాస్త్రవిరుద్ధమయిన సంభోగమునకు బలవంతపెట్టబడవచ్చును లేదా ప్రేరేపింపబడవచ్చును అను ఉద్దేశముతో, లేదా ఆమె అట్లు బహుశః బలవంతపెట్టబడును లేదా ప్రేరేపింపబడును అని తెలిసియుండియు, బ్రిటిషు ఇండియాలోనికి దిగుమతిచేయు ఏ మనిషియయినను,

మరియు అట్టి ఉద్దేశము లేదా జ్ఞానముతో ఇండియాదేశములోని ఏ సంస్థానమునుండియయిన అటువంటి ఉద్దేశము లేదా జ్ఞానముతో తనవలనగాని, మరియొక మనిషివలనగాని ఇండియాలోనికి దిగుమతి చేయబడిన అట్టియే బాలికనయిన బ్రిటిషు ఇండియాలోనికి దిగుమతి చేయు ఏ మనిషియయినను,

పది సంవత్సరములవరకు వ్యాపించగల ఖయిదుతో శిక్షింపబడతగియుండవలెను, మరియు జుల్మానాకూడ విధింపబడతగియుండవలెను.

# TELUGU LAW BOOKS

## తెనుగు చట్ట పుస్తకములు

---

### మధుకరవేణి విలాస బుక్ డిపో,

నెం. 42, గంగాధరేశ్వర అగ్రహారం,

వేపేరి పోస్టు, మదరాసు.

---

ఇందులో యుండిన పుస్తకములకు వీ. పీ. ఆర్డర్లు నిచ్చువారు తమ పేరు, గ్రామము, పోస్టాఫీసు, తాలూకా, జిల్లాను విశదముగా వ్రాయవలెను. ప్రస్తుతము తపాలు చార్జి అధికమయినందువలన ౧ అణాలకు తగ్గిన విలువగల పుస్తకములకు ఆర్డరు చేయువారలు పుస్తకక్రయమును తపాలు చార్జియున్ను ముందుగ తపాలు బిళ్లలు (స్టాంపులు) గా పంపిన యెడల కావలసిన పుస్తకములను బుక్ పోస్టు మూలముగా పంపబడును. ఇందులో కనిన వెలతో వీ. పీ. కర్చులు పుస్తకములను తీసుకొనువారే భరించుకొనవలయును.

తక్కినవారలకు వీ. పీ. మూలముగా పంపబడును.

---

### వ్యవహార చింతామణి, (అను దస్తావేజు లేఖిని.)

రూ. 2 8 0

ఇందులో (నవరణచేయబడిన) స్టాంపు ఆక్టు, రిజిస్ట్రేషను ఆక్టు, కాలనిర్ణయచట్టము, వచ్చుబడి పన్ను రేట్లును, కోర్టుఫీసుల గుసుములును

పత్రములయొక్క గురుతులున్ను, పత్రములు వ్రాయు విధములున్ను, దాని మరతులున్ను, దానికి అతకడమునకు యింత స్టాంపు కావలయు ననిన్ని, అప్పుపత్రము, కుదువపత్రము, బాడుగపత్రము, అనుభవము, ఒడంబడిక, జామీను, పారీకత్తు, పరిశీలన, స్వీకారము, స్వీకార అధికారము, ముచ్చిలికా, అధికారపత్రము, వకాలతు, పవర్ ఆఫ్ అటర్ని, విడుదలపత్రము, గుత్తపత్రము, పొలుపుగలపత్రము, విక్రయము మొదలయిన 50 విధముల పత్రములున్ను, ఒక్కొక పత్రమునకు, 3, 4 విధములుగా వ్రాసెడు పద్ధతులున్ను, ఆయా గ్రామములలో ఉపయోగించెడు భాషల ప్రకారముగానున్ను, ఇంకను ఉపయోగపడెడు సకలమైన ప్రతి వ్యవహారములున్ను అణగియున్నవి.

---

## చెన్నపురి రాజధాని జమీను

## రైతు భూముల చట్టము. రూ. 1 4 0

ఇది జమీను, మిట్టా, శ్రోత్రియము, ఇనాము గ్రామములలో యుండు రైతులకు గల బాధ్యతలు, భూమిని చక్కపరచి వృద్ధిచేయునపుడు జమీందారు అధిక శిస్తు విధించకూడదనడము, అక్రమముగా అధికశిస్తు విధించినప్పుడు, కలెక్టరు మొదలైన రివిన్యూ అధికారులకు అప్పీలుచేసి వజా చేసుకొనవచ్చుననడము, జమీనులోయుండు చెరువు కాలవ మొదలయిన జలాధారములను జమీందారు శుభ్రము చేయవలసినదనడము, పొలమును సర్వేచేసి తగినట్లు కిస్తి విధించడము, పట్టా యివ్వడము, ముచ్చిలిక తీయడమును, గుత్తన బాకినిగురించి జప్తి చేయడమును, వసూలు చేయుటమును, బీడు లేక పంట పండనప్పుడు కిస్తుని వజా చేయడము, ఇంత పన్నుమాత్రమే పొలముపైన విధించ

వచ్చుననడమయిన పలు విషయములున్ను, ఇందులో జమీందారు రైతులకుగల రైతు వ్యవసాయ శాధ్యాబాధ్యతలున్ను విశదముగా వ్రాయబడియున్నవి.

## క్రొత్త ఇన్కంటాక్సు (వచ్చుబడిపన్ను) చట్టము.

ఇందులో పన్ను విధించతగిన వరుమానము, పలాని పలాని విషయములను మొత్తవరుమానమునుండి తోసి చూపెట్టవచ్చు ననడము, పన్ను విధించడమునుగురించి విచారణ, వరుమానమునకు స్టేట్మెంటు పంపడము, పన్ను ఎప్పుడు చెల్లించవలసినదనడము, తప్పు లెక్క ఇచ్చినట్టులయితే దండుగ పన్ను విధించడము, ప్రాసిక్యూషను చేయుడము, పొదువైన ధర్మకార్యములయొక్క వరుమానమునకు ఇన్కంటాక్సు లేదనడము, ఇన్కంటాక్సు అప్పీలు, సూపర్టాక్సు పన్ను వసూలుచేయడము మొదలయిన విషయములు చెప్పబడియున్నవి. రూ. 1 0 0

## క్రొత్త గ్రామ పంచాయతి కోర్టు ఆక్టు.

రూ. 1 4 0

ఇది 1920-వ సంవత్సరపు 2-వ ఆక్టువలన సవరింపబడిన 1899-వ సంవత్సరపు ఆక్టు. దీనియందు పై ఆక్టు ఈ యిలాకా నేటిదినము వరకుగల క్రొత్త విధులతో చేర్చి ముద్రింపబడియున్నది. దీనియందు పంచాయతీ కోర్టులను స్థాపించుటయు, ఆ సంబంధమైన మెంబర్లను ఎన్నుకొను విధులను, ఈ కోర్టు ప్రెసిడెంటుయొక్క అధికారమున్ను, వ్యాజ్యముల తీర్పుకాబడి వివరము మొదలగు ముఖ్యాంశములతో నిండియున్నది. 1929-వ సం॥పు 15-వ ఆక్టుల సవరణలు చేర్చబడినది. ఎక్కువ యుపయోగకరమయినది.

# క్రొత్త గ్రామ మునసబు (మాన్యూల్) చట్టము

## ప్రథమభాగము రూ. 1 8

1920-వ సం॥పు 2-వ ఆక్టును, 1929- సం॥పు 15-వ ఆక్టుల యనుసరించి క్రొత్త సవరణలు చేర్పబడినది.

సివిల్ క్రిమినల్ అధికారములు హెచ్చింపబడియున్నది.

ఇందులో గ్రామ మునసబు పరీక్షకు చదివెడివారలు గ్రామ మునసబులు, కరణములు, గ్రామ పంచాయతీకోర్టువారలు, వీరలకు సంబంధపడిన సివిల్ క్రిమినలు విషయాదుల నూతనచట్టములున్ను చేర్చి యీ తారీఖువరకు సర్కారువారలచే సవరించబడిన ప్రకారము ముద్రించి వున్నారము. కొందరు గ్రామమునసబు పనికిగాను పరీక్షకు పోవుటకు ఏదైన సంగ్రహమైన పుస్తకమును చదివి, పిమ్మట గ్రామ మునసబు పనికి వచ్చినదే నడవడికలు నడిపించుటకు తెలియక మిణకరించి ముందు తీసిన పుస్తకము ప్రయోజనపడక నే మరల గ్రామ మునసబు మాన్యూలును తీయుటకు సందర్భించుచున్నది. పరీక్షకు పోవునపుడే ఈ పుస్తకమును తీసి చదివి ధైర్యముతో గ్రామమునసబు పనికివచ్చి పిదప వ్యవహార నడవడికలకు ఈ పుస్తక మెక్కుడు ప్రయోజనకరమైనదిగా యుండను. గ్రామ మునసబు కోర్టులోను, గ్రామ పంచాయతి కోర్టులోను రూ. 50 వరకు వాది స్వేచ్ఛగాను, రూ. 200 వరకు వాది, ప్రతివాది ఇరువురున్ను సమ్మతపడిన్ని దావా చేసెడి మిరాశీదారులు వ్యాపారులు కంట్రాక్టరులు మొదలయిన వారలున్ను ఈ పుస్తకమును ఉంచుకొనియుండవలసినది మిక్కిలి ఆవశ్యకము.

